


# సుందరకాండ

## తెనుగు

రాయప్రోలు సుబ్బారావు

# అనుక్రమణిక



శతపత్త్రాయిత శుక్లపీఠమును శింజన్మంజు మంజీర రం
జితపాదంబులు పాటలింపగ విపంచీ జీవతంత్రీ కల
శ్రుతులన్ తీర్చి, చతుర్ముఖావతరణ శ్లోకంబులం బాడు భా
రతి కంఠంబు ధ్వనించు కావ్య సుకుమారద్వార మీక్షించెదన్.

తెనుగున్ తొల్లిట, సర్వలక్షణ సముద్దీప్తంబుగా తీర్చి ది
ద్దిన దక్షుండు, సరస్వతీచయన ఋత్విఙ్మౌళి, రమ్యాక్షర
ధ్వని వాచారుచి లాలనాభణితి సంపన్నుండు, నన్నయ్య బ్ర
హ్మను ప్రార్థింతు మదీయ భావ కవితామార్గంబు రక్షింపగన్.
(1913)

మామిడి కొమ్మమీద కలమంత్రపరాయణుడైన కోకిల
స్వామికి మ్రొక్కి యీ యభినవధ్వని ధారణ కుద్యమించితిన్;
కోమల గోస్తనీరుచులకున్ కదళీఫలపాకసిద్ధికిన్
లేములు దీర్చు మా తెనుగు లేతముదుళ్లు వెలార్చువేడుకన్.

ఓం

కూజంతం రామరామేతి
మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖామ్
వందే వాల్మీకి కోకిలం.

సదారామరామేతి నామామృతం తే
సదారామ మానంద నిష్యందకందమ్,
పిబంతం, నమంతం, హసంతం, సుదంతం,
హనూమంత మంత ర్భజే తం నితాంతం.



'వాల్మీకి' పాత్రధారి గురుదేవులు
శ్రీ రవీంద్రనాథ్ ఠాకుర్

ఓం

# న మో వా క ము

ధ్యానింతును బ్రహ్మానందయతిని,
భావింతును గురుదేవు రవీంద్రుని,
స్మరియింతును శుచిమతి మా పిన్నిని,
త్రికరణశుద్ధికి దీక్షాసిద్ధికి.

మావికొమ్మపయి కోవెలవలె, కవి
తాశాఖను కందళితుడైన వా
ల్మీకికి మహాముని శోకశ్లోక స
రస్వతికి నమఃప్రాంజలి పట్టితి.

ధర్మార్థ నిరుక్తమయిన శబ్దము
నిష్టార్థ రసమయిని చేసిన ఋషి
వాచా గంగా వీచీమాలలకు
నడికట్లగు నా నుడికారములకు.

వాగర్థ ప్రియబంధమయిన కా
వ్యము 'రసాత్మకం'బయి, బ్రహ్మానం
దము నిచ్చును సహృదయులకు, రమ్యా
క్షర కావ్యోపాసకులు సత్కవులు.

కాళిదాసు శృంగారము, భవభూ
తి కరుణమును, జయదేవుని విరహము,
త్యాగరాజు నాద బ్రహ్మరతి, ర
స స్వరూప రోచనలని నమ్మెదు.

గురువులు పూర్వులకు నమించి, యవీ
యసులు నవీనుల నభినుతించి, వా
ల్మీకికి గోమతల్లికను పిలిచెదను;
తెనుగుతోట చల్లని పందిళ్లను.

నన్నయ పద సుందర మృదు బంధము,
తిక్కన వాక్కుల త్రిప్పులు తీర్పులు,
కవిరాజు పలుకు గరువపు పోకలు,
పెద్దన నుడువుల ముద్దుమురిపెములు.

తల్లిపాలవలె తనివో త్రావిన
రాయప్రోలు గిరాభ్రమరిని వల
పించె, ధేనువును వేణుగీతివలె,
భగవత్పాదుల 'భజగోవిందము'.

విన సొంపయి పాడను వాచవియగు
భణితి చరణ చారణ శింజితములు
అనురణింపగా తెనుగు వీణియను
శ్రుతిచేసితి నీ శుచిరుచిమత్కృతి.

ఆదికావ్యము పయస్సుల తేలిన
సుందరకాండము జున్నుముద్దలను,
తెచ్చి పెట్టితిని ముచ్చటగా నయ
గారి తెనుగు బంగారు పళ్లెముల.

కష్టనష్టములు, గండకత్తెరలు
ఆధివ్యాధులు, వ్యధలు, వేదనలు,
తీరును తప్పక దీనిని చదివిన
వారి కనుచు జనవాక్యము కల దిల.



# సుందరకాండ

## సర్గ ౧

1

అట్లు రావణుడు అపహరించి చని,
సీతను దాచిన సీమలు వెతకగ
తలపెట్టె నరిందముడు మహాకపి,
చారణులు తిరుగు దారి వెంబడిని.

2

అలవికాని అసహాయ దురాసద
కార్యమునకు సమకట్టిన మారుతి,
మోరయెత్తి, మెడ పొడవుసాచి, కన
నయ్యె ఆలలో ఆబోతుంబలె.

3

వైదూర్యమణుల వన్నెలతో సు
శ్యామలమయి, తడియాఱని పచ్చిక
బీళ్ళలో హనుమ విహరించెను, మం
దాలసగతి సుఖలాలసమతియై.

4

ఱొమ్ముతట్టి పడద్రోసెను చెట్లను,
పక్షుల నెడనెడ విక్షేపించెను,
హతమార్చెను పెక్కడవిమృగములను,
మదమెక్కిన సింహము చందంబున.

5

ఆ మహేంద్రగిరిధామము, సహజము
లగు మాంజిష్ఠ సితాసిత ధాతు
చ్ఛాయలు దీపించగ, నేత్రోత్సవ
శృంగారము చేసినయట్లుండెను.

6

కాపురముందురు ఆ పర్వతమ్మున
నాగ యక్ష కిన్నర గంధర్వులు,
ఇష్టరూపముల, నిచ్చవచ్చినటు
కూల మాల్యములు తాలిచి సుఖముగ.

7

భద్రగజములకు పాదుపట్టయిన
ఆ మహేంద్రగిరియందు మహాకపి,
కానవచ్చె లోతైన తటాకము
మధ్యనున్న మద మాతంగమువలె.

8

భావించెను, పావని మది నప్పుడు
ముందు సాగుటకు పూర్వము, మరుదా
దిత్య దేవతాదికమునకు నేఖో
వాకము సలుపగ ప్రాంజలిపట్టెను.

9

తూర్పు తిరిగి, చేతులు మోడిచి, తన
జనకు డనిల దేవునకు ప్రణతులిడి,
సవ్యముగా సాష్టాద్దక్షిణదిశ
కభిముఖుడై అంతంతలు పెరిగెను.

10

తోడి వానరులు చూడగ, రాఘవు
కార్యార్థము సాగరము దాటుటకు,
పెంచెను దేహము విస్తారముగా;
పున్నమ దినమువలె ప్రాంగు వార్ధివలె.

11
అంతులేని లవణాబ్ధి దాటుటకు,
మేను పెంచి మితి మిక్కటంబుగా,
త్రొక్కి కాళ్ళతో, గ్రుద్ది చేతులను,
మర్దించెను హనుమంతు డా గిరిని.

12
చలనం బెఱుగని కులశైలము కపి
యించుకంత తాడించగ వణకెను,
వృక్షంబులు కంపించెను కమ్మని
పూలు రాసులై రాల నంతటను,

13
పట్లువదలి యటు చెట్లనుండి జల
జల రాలిన పువ్వుల కుప్పలు గు
ప్పించె సువాసన పెల్లుగ నెల్లెడ;
పూలకొండయై క్రాలె మహేంద్రము.

14
కపి బలిష్ఠమగు కాళ్ళ త్రొక్కిడికి
ఇట్టటులయి, సెలయేళ్లు పొర్లి పి
క్కటిలె గిరిని, మావటి కశఘాతల
మదపుటేన్గు మెయి మధుధారలవలె.

15
హనుమ పాద పీడనలకు పగిలిన
గండశిలలపై కాటుక జీఱలు,
వెండిచాఱలు, పసిండిగీఱలును,
పూజెలు పెట్టినపోల్కి బయల్పడె.

16
రాపిళ్ళకు పర్వత మగలి, పగిలి
న మణిశిలల బండలు ఎగజిమ్మెను;
నడుమ మంటలు, కొనల జడి పొగలు,
త్రోయు వీతిహోత్రుని చందంబున.

17

ఆమూలాగ్రము నదవదయ్యె కుల
గిరి మారుతి త్రొక్కిళ్ళకు కీడ్వడ,
గుహల వసించిన బహు భూతంబులు,
వికృత స్వరముల విలవిల మూల్గెను.

18

కొండ దెబ్బతిని ఘూర్ణిల్లగ బె
గ్గిలిన జంతువుల మొలుగుల ఘోషము,
పూరించెను పదిమూలల పృథివిని,
నగరోద్యానవనంబులు మ్రోగెను.

19

ఆ చప్పుడు విని అజగరములు స్వ
స్తిక లాంఛన ఫణ శిఖలు విప్పి, వడి
లేచి, విషజ్వాలికలు క్రక్కుచున్,
పట్టికఱచె గిరి పాషాణములను.

20

గాఢాగ్రహమున కాకోదరములు
కాటువేయగా, కాళ విషాగ్నులు
తగిలి బ్రద్దలగ పగిలి, మండె, పెను
కొండరాళ్లు వెయి తుండెతుండెలుగ.

21

ఆ మహేంద్రగిరియందలి ఓషధు
లఖిల విపన్నములయ్యె, నపుడు చ
ల్లార్పగజాలక వ్యర్థములాయెను,
క్రూరాహిహత ఘోర విషాగ్నుల.

22

కపి బీభత్సముగా పడత్రొక్కిన గిరి
అతల కుతలమై అగలెను, బిలముల
పెనుబాములు రాపిళ్ల నలిగి, [illegible]
గొక్కను నిప్పులు క్రక్కుచు విసవిస,

? ?

కంపించిన గిరి గహన వృక్షముల
రాలె చిగుళ్లును పూలును జలజల,
నీలాంజన హరితాళ మణి శిలా
ధాతుద్యుతు లుత్కటముగ నెగసెను.

? ?

తామ్రరుచులు, గంధపు తెలివన్నెలు,
కానల గిరకొను నానా కాంతులు,
ధగధగ మెఱయగ నగముమీద, దీ
పావళి పండుగ కీవినితోచెను.

22

అపుడా శైలము అగలి పెకలెనని
తలచిరి మనసుల తాపసు లందఱు,
తరుణులతో విద్యాధరు లలసత
ఎగసిపోయి రెడనెడ వినువీధికి.

23

పానభూమిలోపల అమూల్యమగు
నానావిధ కాంచన భాండంబులు,
చూడ సొగసయిన పైడి కంచములు,
బంగారపు మధుపాన పాత్రికలు.

24

నంజుట కింపగు నవ లేహ్యంబులు,
పక్వ మాంసములు, భక్ష్య భోజ్యములు,
గొడ్డుతోలుతో కుట్టిన యొరలును,
బంగారు పిడుల వాలుకత్తులును.

25

ఎచటి వచటనె విడిచిపెట్టి చనిరి,
రక్తగంధ హారములను తాలిచి
త్రాగుచున్న విద్యాధరు, లెఱుపె
క్కగ తెలితామర కన్నులు కైపున.

26

కాళ్ళ నందియలు, కరముల కడెములు
ధరియించిన విద్యాధర కాంతలు
కాంతులతో ఆకసమున కెగసిరి,
చిఱునవ్వులు నచ్చెరువులు పెనగొన.

27

అంతలోన విద్యాధరులు, మహా
ర్షులు, తమ మహిమలు చూపగ, ఆకా
శమునందె నిలిచి, గుములుగూడి, వీ
క్షించుచుండిరి మహేంద్ర శైలమును.

28

ఆలకింపగానయ్యె వారపుడు,
చారణసిద్ధ మహా ఋషిగణములు
ఉప్పరవీధిని చెప్పికొనెడి అ
న్యోన్య సంగ్రహ యథాలాపంబులు.

29

అమిత వేగబలు, డచల సమానుడు,
అనిల తనూజుడు హనుమంతుం డిదె,
గండు మొసళ్ళకు కాపురమగు ము
న్నీటి నమాంతము దాట సిద్ధపడి.

30

రామార్థము, కపిరాజు నాజ్ఞ మెయి,
దుష్కరమగు ఉద్యోగము తలనిడి,
పొందగరాని సముద్రము వలపటి
గట్టెక్కగ కంకణమును కట్టెను.

31

అని భాషించు మహాత్ముల వచనము
లాలించుచు విద్యాధరు లందఱు,
అప్రమేయుడగు హరివృషభుని, కుల
పర్వత పీఠముపై దర్శించిరి.

32

తోక కుచ్చు లలవోక విదిర్చెను,
కొండవంటి మెయి కుదిపి కదిల్చెను;
ఉద్భట మేఘము ఉరిమిన తెఱగున
గర్జించెను లోకము లాకులపడ.

33

చుట్లుతిరిగి కుచ్చుల కురు లింపుగ
చాలువారు లాంగూలము నటునిటు;
జాడించె; ఖగేశ్వరు డెడాపెడల
మద పన్నగమును విదిలించినగతి.

34

సొంతము చాచిన ఆయత వాలము
వెన్ను వెనుక దిగ వ్రేలుకాడబడె,
పక్షీంద్రుని నెఱవాడి గోళ్ళలో
తగిలి వాలబడు త్రాచుపామువలె.

35

పరిఘకాండములవంటి బాహువులు
నిశ్చలంబుగా నిగిడి నిలువబడ,
కాళ్ళు రెండు బిగ్గరగ ముడిచి, కటి
యుగము మోపి, కూర్చుండెను దృఢముగ.

36

పిదప కరములను బిగియకట్టి, కుది
యించి కంఠము, యమించె సత్వతే
జోవీర్యంబులు స్సావేశింపగ;
సన్నద్ధుండయి సామీరి యపుడు.

37

దూర దూరమగు దారి నరయుచున్
చూపులు మీదికిమోపి, ప్రాణముల
నాగబట్టి హృదయంబున, మారుతి
ఆకాశము నటు లవలోకించెను.

38

ఊదిపట్టి పదయుగమును దృఢముగ,
గాలి చొరవిగతి కర్ణముల్ ముడిచి,
బిగియపట్టి యూపిరి యోగాదిగలు
ఉరవడించె నుప్పరమున కెగయుగ.

39–40

పలికెను అభిజన వర్గముతో నిటు
రామాస్త్రమువలె వ్రాలుదు లంకను,
కాననేని జనకజ నచ్చోట్లను
ధావింతును సురధామంబునకే.

41–43

జానకి అచటను కానరానిచో
ఆయాసమనక అతివేగంబున
తిరిగి పోయి దైతేయుని రావణు
కట్టి తెచ్చెద [illegible] నిచటికి.

*

సీత నెట్లయిన దో తెచ్చెద, చరి
తార్థుడనయ్యెద, అట్లుకానిచో
పెరిగొని లంకను పెళ్ళగించి రా
వణునితోడ సత్వరమె తెంచెద.

44

ఇట్లు తోడికపు లెల్లుగబల్కి, వే
గోద్వేగ బలసముత్కటుమతియై,
సాగెనె పూర్వముగ, ఖగపతి కైవడి,
వ్యోమ విహార మహోత్సవాభిరతి.

45

హనుమంతుడు [illegible]
ఎగిరిపోవగా నగములన్ నెల్లెడ
పెకలిన తరువులు వేర్లతోడ క్రొ
మ్మలతో ఊత వెంబడి పై కెగసెను.

46

పులుగులతో పువ్వులతో నిండిన
శాఖలు వీడని సాల వృక్షములు
ఊరు వేగమున ఊగుచుండగా,
విహరించెను వినువీధి మహాకపి.

47

హనుమదయోద్ధతి కగలిన తరువులు
కూడ నరిగె నొక కొంత; దూరమున,
కరిగెడి యాప్తుల అంపకాలకై
పంపగపోయెడి బంధుజనమువలె.

48

తొడల వడికి పొదులు పెకలిన మఱి
కొన్ని వృక్షములు కూడనె పోయెను;
ప్రభువువెంట భయభక్తులతో చను
సైన్య నివహముల చందము తోపగ.

49

కుసుమించిన లేగొమ్మల నొప్పెడి
వివిధ వృక్షముల వీధులు చుట్టిన
పర్వతంబుపై పవనతనూజుడు,
అగపడె చూపఱు లచ్చెరు వందగ.

50

భారములైన మహీరుహ శాఖలు
పట్లు వదలి పడె వారిధి నడుమను,
దేవేంద్రుని భీతికి పర్వతములు
తోయధిలోపల త్రుళ్ళిపడ్డగతి.

51

దేహమునంటి విదిల్చిన వదలని
పలువన్నెల మొగ్గల పూవులతో
ఒప్పారెనుహరి ఉప్పరమందున;
మెఱుపులు పొదివిన మేఘము కైవడి.

52

హనుమ వేగమున కదిరిపడిన పూ
లచటనె నిలిచెను, ఆప్తమిత్రులను
పంపగ వచ్చినవారలు నలిలో
పొంత తటంబున ఆగిపోవుగతి.

53

అతని మహారయ హతి రాలిన తె
ల్లని పువ్వులు నల్లని జలములలో
చూపట్టెను, వెలిచుక్కలు పొడిచిన
నీలాంబరమును పోలి అందమయి.

54

అతి లాఘవజవ గతి గమనములకు
లేచిన సుడిగాలికి తొడిమలు విడ,
చిత్రముగా పడు సింధు జలంబుల
వివిధ ద్రుమ పల్లవ కుసుమంబులు.

55

కపి పరుగులవడి కకవికలై వా
రధి జలములలో రాలిన పువ్వులు,
కానవచ్చె ఆకాశతలంబున
అలరారెడి ముత్యపు ముక్కలవలె.

56

వేగముగా వినువీధి నేగు హరి
చాచిన చేతుల చందము తోచెను,
కొండ నెత్తమునఉండి దిగు అయిదు
తలల పాముల జతరబలె వెలుగొన.

57

[illegible], దిగబడు,
సాగర జలములు త్రాగవచ్చెనన,
పైకి ప్రాకు ఎగుబాటుముగా వడి
నింగిని [illegible] మహాకపి.

58

వాయుమార్గమున వడివడి పరుగిడు
కపికేసరి తీక్షణ వీక్షణములు
మండుచు కనబడె కొండ నెత్తమున
వెలుగు జంట కొలివుల చందంబున.

59

గోరోచన రుచిమీఱి, గుండ్రముగ,
వెలుగు హరీంద్రుని పెద్ద కన్నుగవ,
ఒకచో నవ్వుడె ఉదయింబందిన
సూర్యచంద్రులన శోభిలుచుండెను.

60

ఎఱ్ఱని ముక్కును ఎఱ్ఱని మోరయు,
అగ్గలించె నన్యోన్యచ్ఛాయల,
సంజ సావాసముతో రంజిలు
సూర్యమండలము శోభల చాల్పున.

61

వంక లేనటుల పైపయి కెగయగ
చాచిన వాలము చక్కన కనబడె,
కపికేసరి స్వాగతమునకై దివి,
ఎత్తినట్టి దేవేంద్రు ధ్వజమువలె.

62

తెల్లనికోరల దీప్తు లెగయ, చ
క్రాకారముగా తోకచుట్టుకొన,
మారుతి కనబడె మార్తాండుడు గుడి
కట్టి కూరుచున్నట్టుల దీటుగ.

63

ధౌతతామ్ర రక్తములయి బలిసిన
పిరుదులతో కపివీరుం డొప్పెను,
చీల్చిన గైరిక శిలల జంటతో
గుబ్బతిల్లు పెనుకొండ చందమున,

64

పారావారముపయి రివ్వున చను
కపి కంఠీరవు కచ్చుల సందుల
దూసిపోవు వాతూలము మ్రోగెను,
జీమూతము గర్జించిన రీతిని.

65

వాలము నెత్తి ప్రవాహవేగమున
చెంగనాలతో చెంగలించె హరి,
ఉత్తర దిక్కునుండి చీల్చుకొని
దూకుచుపోయెడి తోకచుక్కవలె.

66

క్రుంకుచున్న సూర్యునివలె దీర్ఘము
గామున్న మహోన్నతు డగపడె,
నడుము కట్టగా పొడ వెదిగిన మద
మాతంగంబు పవమానముగా దివి.

67

నింగిని కాయము, నీళ్ళను నీడయు,
తోడ్తో నడవగ తోచెను మారుతి,
గాలి త్రోపుడుల పోలయు వారిధి
పైపడి నేగెడి నావ విధంబున.

68

పడమే పైపుల నెగనె వాయుసుతు
డాయతా చాయల తోయధిజలములు
గతివేగమువలన కల్లోలమువలై
పెరిగి విఱిగి పడె బిచ్చెత్తిన గతి.

69

[illegible] తో,
[illegible]
[illegible] నెట్టుచు
[illegible], [illegible] పోకపి.

70

కపి గతిరయమున కదలిన గాడుపు,
మేఘ భ్రమణము మీటిన ఘాతము,
కలిసి కలంచగ కడలి అంతయును
భీమ ఘోషమున బిమ్మిటిపోయెను.

71

ఉప్పెన రేగిన ఉప్పునీటి కెర
టాల కడలి గగ్గోలయి తూలగ,
అంతరిత విసిరింతల సుడివడ,
ధావించె సముద్రముపై మారుతి.

72

మేరు మందరాకారములుగ ఉ
ప్పొంగిన భూరితరంగ పంక్తులను,
లెక్కపెట్టు పోలికను వేగిరిం
చెను కపి సాగరమును తరించుతఱి.

73

హనుమగమన వేగాతిరేకమున
నురుగులు కట్టుచు పొరలిన వారిధి
తరగ లాకసము తాక నెగసి శర
దభ్రంబుల చాయల నగపడె భువి.

74

కడలి నీళ్ళు పాదెడలి పై కెగయ,
వెళ్ళబడెను తాబేళ్లు మొసళ్లు తి
మింగిల మీనము లంగవస్త్రములు
తీసిన జీవుల దేహంబులవలె.

75

గగనమార్గమున నెగిరి పరుగులిడు
కపి శార్దూలము కాంచి గరుడుడని,
ఉదధి యిల్లుగా నున్న సర్పములు
వడకుచు ముడిగెను ప్రాణభయంబున.

76

వెడలుపు పదియామడలు, పొడవు ము
ప్పది యామడలుగ వ్యాపించిన కపి
మేని నీడ బింబించె నందముగ
క్రింద మహార్ణవ కీలాలంబుల.

77

వాయుమార్గమున వడిధావించెడి
హనుమంతుని వెనుకనె చనునీడలు,
లవణార్ణవ సలిలంబుల తేలెను
శ్వేతాభ్ర ఘనశ్రేణి విధంబున.

78

అతి తేజస్వి, అనంతకాయుడు మ
హాకపి నిగిడి నిరాలంబ మయిన
వాయుమార్గమున పరుగిడుచుండెను:
పక్షంబులుగల పర్వతంబువలె.

79

బహు బలిష్ఠమగు వానర యూధప
మేదెస నారోహించె రయోద్ధతి,
ఆయా దెసను మహావాతాన్నిధి
కుదిసి సుళ్ళుపడి, క్రుంగి దొప్పగిలె.

80

పక్షుల గుంపున వ్రాలిన గరుడుని
కరణి, మేఘముల కలచి లాగు సుడి
గాడుపు కై వడి, కపివీరుడు వడి
పఱచుచుండె నంబరవీథింబడి.

81

మసలెడి మబ్బుల మునుగులలోపల
చాటగుచును బాహాటం బగుచును,
ఆకసమున నడయాడెను మారుతి;
దాగుడుమూతల దాగిలు శశివలె.

82

కపిదోర్దండాఘాతల పిగిలిన
మబ్బులు మెరసెను మలక వన్నెలను,
పాల తెలుపులై, నీలిచాయలయి,
పచ్చి పసుపులై, పండు కెంపులయి.

83

గాలిలో నట్టుల తేలియాడు పటు
వేగశాలి కపివీరుని చూచుచు,
పువ్వుల వానలు బోరున కురిసిరి
తనిసి దేవ గంధర్వ చారణులు.

84

రామభద్రు కార్యత్వర నేగు మ
హావానరు నిష్ఠార్థసిద్ధికయి,
తాపము కొలుపడు తపనుడు, పవనుడు
ఇవతాళించును హితముగ ఇరుగడ.

85

అలయక ఆగక ఆకసమున బడి
చనుచున్న మహౌజస్విని చూచుచు
తనిసిరి ఋషిసత్తములు, దేవతలు
పొగడిరి, గంధర్వులు కొనియాడిరి.

86

ఆకాశమున నిరాయాసముగా
పయనించు మహావానరు చూచుచు,
యక్ష పన్నగులు రాక్షస విబుధులు
హర్షించిరి ఉత్కర్షులై తలరి.

87

తారాపథమున బారలు సాచుచు
వేగవేగముగ సాగు హరిని గని,
ఇక్ష్వాకుల స్నేహితుడు సముద్రుడు
చింతించెను తన చిత్తమునం దిటు.

88

దేవరేంద్రునకు వలసిన సాయము
చేయకున్న నే నీ యవసరమున,
చెప్పుకోఁదగిన శిష్టులెల్ల నిం
దింతురు నన్నవిధేయుఁడ నంచును.

89

ఇక్ష్వాకుల కులహిమకరుం డయిన
సగర నృపాలుడు సాకెను నను మును,
ఇక్ష్వాకుల కతి హితుడగు నీతడు
ఇంత కష్టపడ నీయరా దిపుడు.

90

కావున నీతడు గాని తీర్చుకొను
వీలు వన్నుటయె విధి నాకిప్పుడు,
ఇంచుకంత విరమించిన సుఖముగ
పోవచ్చును తన భావికార్యమున.

91

ఇట్లు మదిని ఊహించి సముద్రుడు,
అడుగు మట్టమున అణగియున్న మై
నాకు హిరణ్మయు, నగ నత్తముతో
పలికె తన మనోభావ మచ్చుపడ.

92

పాతాళ భువన వాసులు దైత్యులు
ఊర్ధ్వమునకు రాకుండ సురేంద్రుడు,
అలవిగాని రీతి అడ్డగోడగా
నియమించెను నన్నచ్చట మును.

93

నాడు బలిష్ఠులు దైతేయులు క్ర
మ్మఱ పరాక్రమము కెరలఁ దేచి పా
తాళ ద్వారము దాటవచ్చినన్,
అడ్డగడియనై యపుడు వారిని.

94

పైకిని క్రిందికి ప్రక్కలకు పెరిగెడి
శక్తి కలదు గిరిసత్తమ! [illegible]
కావున చెప్పెద కార్యము కలదిటు,
లెమ్ము మీదికిన్ [illegible]

95

సాగరవంశ వివర్ధనుండు, మీ
రాతిపిర సాహసికుం [illegible]
హనుమ [illegible]ర్యార్థము నీ మీ
[illegible] నాకసమున నెగిరిపోయెడిని:

96

నాకు పూజ్యు లిక్ష్వాకు కులీనులు,
నీకును ఆదరణీయులు, వారిని
అనువర్తించు మహాత్ముని కితనికి,
సాయపడుట మన సహజ ధర్మ మగు.

97

కావున సమయము గడవకమునుపే
సహకరింపు మీ సచివకార్యమున,
స్నేహకృత్యమును చేయక తడసిన
గురువులు పెద్దలు కోపింతురు సుమి!

98

లెమ్ము లెమ్ము, సలిలమ్ముల ముసుగులు
విడివడ, మీదికి విచ్చేయుము సఖ!
పూజ్యుడు కపిసోముడు మన కతిథిగ
నిలుచుగాక నీ నెత్తమునందున.

99

నిను భజింత్రు సురలును గంధర్వులు,
కనక కలశ మంగళ శేఖరుడవు,
నీ యంతికమున నిలిచి మహా కపి
సాగిపోవును యథాగతి పిమ్మట.

100
కరుణాళుడు రాఘవుడు; ప్రవాస వి
షాదిని మైథిలి, సామీరి యితడు;
వీరి వెతలు భావించి, నగాగ్రణి !
మీదికి రమ్మిది మిత్రుల ధర్మము.

101
సాగరుడాడిన సాధూక్తులు విని,
పైకి లేచె మైనాకుడు; తోడ్తో
తోయధి జలములు త్రుళ్ళి సుళ్ళువడి
తరులును తీగెలు తరలి వెంటరాన్.

102
దీప్త కిరణముల దినమణి యెట్టుల
కాలమేఘములు చీలిచి బయలగు,
అటు లగాధతోయధి జలంబులను
భేదించుచు గిరి మీదికి వచ్చెను.

103
సాగరు నాదేశము మన్నించుచు,
నీటిలోపల మునింగియుండియును
లేచివచ్చెను మహాచలంబు తన
కనక శిఖరములు కనబడ మెఱయుచు.

104
పన్నగ కిన్నరులున్న హిరణ్మయ
శృంగము లపు డీక్షింపగ నాయెను,
అరుణకిరణమాల్యముల బోలి ఉ
ప్పరమును రాయుచు కెరలుచున్నగతి.

105
శైల శిఖరములు స్వర్ణచ్ఛాయలు
వెదజల్ల నెడాపెడ నుజ్వలముగ,
ఇనుప బొలము బోలిన ఆకాశము
పసిడి పంటలన్ మిసమిసలాడెను.

106

అచ్చపు మేలిమ నతిశయించు శిఖ
రము లెగసి స్వయంప్రభలను చిమ్మగ,
రాణించెను నగరాజు 'నూరుగుర్ఘ'
సూర్యులు పొడిచిన శుద్ధ శోభలను.

107

తనముం దసంగతముగా, వారిధి
నడుమ లేచి నిలబడిన గిరిని గని,
అనుమానించెను హనుమంతుం డది
విచ్చేసిన ఒక విఘ్నభూతమని.

108

అతివేగ బలోద్ధతుడు మహా కపి,
వజ్ర కఠినమగు వక్షుంబు నడచి,
పడద్రోసెను పర్వతము నమాంతము,
ఝంఝూవాతము జలధరమునువలె.

109–111

ఓమ్మ్రతాకునకు దిమ్మతిరిగి పడి
హరి బలవేగము నెఱిగి ప్రీతుడయి,
మానుషరూపము పూని నగేంద్రుడు
వానరేంద్రుతో పలికె నెలమినిటు.

112

అతి దుష్కరకార్యము సాధింపగ
సమకట్టితి విచ్చట కపిసత్తమ!
ఇంచుక నా శిఖరాంచల శయ్యల
విశ్రమింపుమీ వేసట జాఱగ.

113

రఘుకులీను లగు రాజఋషుల ప్రే
ముడిని సముద్రుడు పుట్టెను పొదలెను,
రాఘవ హితకార్య వ్రతు ని న్నిత
డర్చించుటకయి అర్థించు నిపుడు.

114

ఉపకారికి బదు లుపకరించుట స
నాతన ధర్మము; ఈతడు నిను పూ
జించి, సుకృతి గానెంచి, పిలిచి
ప్రేరేపించె హరీ! నన్నిటుల.

115

మాటిమాటికి సుదూరమొక్క మొగి
ఎగసి మీదుగ పరుగులెత్తు హనుమ,
నీ నెత్తములను నిలిచి సుంత వి
శ్రాంతి తీసికొని సాగి పోదగును.

116

అనుచు సముద్రుడు నను బోధింపగ
నీ నిమిత్తమయి నేనిటు లేచితి,
కాన నీవు నాకడన నిలిచి, వి
శ్రాంతిని గైకొని సాగిపోదగును.

117

నా యింటి సుగంధములు కందమూ
లముల నారగింపుము, సెలయేటి జ
లముల నాస్వాదింపుము, సేదలు తీ
ర్చుకొని పొమ్ము లేవకడ మహాబలి!

118

సుగుణోన్నతుల నెఱిగి పూజించుట
ముల్లోకములను ముఖ్యాచారము,
మాకుకూడ సంబంధంబున్నది
నిను పూజించి తనియుటకు హరీ!

119

ఎగురజాలు జీవగణంబులతో
ప్లవగులు ముఖ్యులు; వారల తోవల
నిను ముఖ్యునిగ గణింతు నిరంతము,
భావమునందున పవననందనా!

120

అభ్యుండయినను అతిథిప్రాజ్ఞులకు
పూజార్హుడుగద! పుణ్యంబున నీ
వంటి అతిథి భగవానుడు దొరికెను
ఏమివలయు నాకిక ధర్మార్థిక.

121

దేవత లందఱతో వరిష్ఠుడగు
మాతరిశ్వునకు ప్రీతిపుత్రుడవు,
జవసత్వంబులలో సాటివత్తు వా
మేటి కీవు, రిపుకూటకులాంతక!

122

నీ కర్పించిన నిష్ఠలుపూజలు
జనకు వాయుదేవుని తనియించును,
అందువలన నిపు డర్చింతును నిను,
కల దందు కొక కారణ మది విను.

123

మునుపు కృతయుగంబున పర్వతములు
ఱెక్కలుండ, నవి రివ్వురివ్వుమని
ఎగురసాగె నెగదిగ దిగంతముల;
పవన సువర్ణుల జివ సంభ్రమముల.

124

ఆ పర్వతముల యాతాయాత వి
హారములను ఏమారి కూలునని,
శంకించిరి భయ సంకటమతులయి,
మునులును దేవతలును భూతములును.

125

అది యెఱిగి సహస్రాక్షుడు ఇంద్రుడు
కుపితుండయి తన కులిశాయుధమున
ఖండించెను ముక్కలుముక్కలుగా,
పర్వతముల నిజపక్షబంధములు.

126

క్రుద్ధుడయిన ఇంద్రుడు వజ్రాయుధ
మెత్తి నావయిపు కేతెంచిన తఱి.
సుడిగాడుపువలె వెడలి సమీరుడు
చుట్టి నన్ను పడనెట్టె వారిధిని.

127

నీ జనకుడు కరుణించిన కతమున
దక్కెను నాకీ ఱెక్కలు పావని !
అది మొద లీ లవణార్ణవమున ఱె
క్కలను ముడుచుకొని కాలము గడపుదు.

128

రక్షించెను నను పక్షంబుతో
కాన, నాకు భగవానుడు పూజ్యుడు,
ఇది మన బాంధవహేతు, వందుచే
మాన్యుడ వీవును మాకు మహాకపి !

129

ఇట్లు నడిచె మును పీ వృత్తాంతము
కావున, కపిశేఖర! నీ విచ్చట
విశ్రాంతిం గొని, ప్రీతుడవై, మము
ప్రీతుల జేయు మభీష్టము తీరును.

130

అపనయింపుము ప్రయాసల వేసట,
అందుకొనుము మా అతిథి పూజలను,
బహుమానింపుము సుహృదుల ప్రీతిని.
ప్రీత మనస్కుడనైతిని నినుగని.

131

నగవరుడగు మైనాకుని పిలుపును
ఆదరించి బదులాడె నిటుల హరి,
ప్రీతుడనైతిని "ఆతిథ్యము గ్రహి
యించ" వనుచు భావించి కినియకుము.

132
కాలము చాలదు, కార్యము మించును,
నడుమ నెచ్చటను తడసి మసలనని
బాసచేసి నే బయలుదేరితిని,
క్షమియింపుడు నను కార్యాతురుడను.

133
ఆదరవచనము లాడుచు నిట్టుల
హనుమయు నపుడా అచలవతంసుని
తాకి కరంబుల తనిపి నవ్వుచును,
ఆకాశంబున నరిగె యథాగతి.

134
అంత సముద్రుడు నచలేంద్రుడును స
మీర నందనుని గారవమున నీ
క్షించుచు పూజించిరి, దీవించిరి
మనసారగ సమ్మదమున పొదలుచు.

135
శైల సముద్రుల సాంగత్యము విడి,
బహుదూరము ఉప్పరము పయింబయి,
తండ్రి మహానిలు దారి నందుకొనె,
అచ్ఛమయిన బహిరాకాశంబున.

136
మిక్కిలి యెత్తుగ మిన్నులు తన్నుచు
ఊతలేని దివినుండి, సాగరుని
మైనాకుని సమ్మదమున చూచుచు
పోవుచుండె కపి పుంగవు డయ్యెడ.

137
ఆ రెండవ కార్యమును చూచి "యె
న్నం డిట్టిది కన్నది విన్నది లే,"
దతి దుష్కరమని నుతియించిరి, సుర
చారణ సిద్ధ మహాఋషు లందఱు.

138

అచటనున్న అమృతాంధసు లానం
దించిరి, హనుద్విశ్రామార్థము
హేమ శిఖరముల నెత్తిన మైనా
కుని గని, ఇంద్రుండును హర్షించెను.

139

శ్రీమంతుండు శచీ మనోహరుడు
ముదితుండై గద్గద కంఠముతో
స్వయముగ నిట్టుల పలికె హిరణ్మయ
నాభుని, మెరసెడి నగనాథుని గని.

140

హేమనాభ ! శైలేంద్ర ! సంతసిం
చితిని నీవు చేసిన కార్యమునకు;
ఇచ్చితి నభయము, నింక స్వేచ్ఛగా
సుఖియింపుము ప్రస్తుత సువ్రతివయి.

141

శతయోజనముల జలధినిదాటగ
విక్రమించె నిర్భీతి నీ హనుమ,
సాయపడితి విష్టముగ నీ భయ
క్లిష్ట సమయమున గిరికుల భూషణ !

142

దశరథ పుత్రు డుదాత్తుడు రాముడు,
అతని దూతగా నరుగు మారుతికి
అతిథి సత్క్రియల నాచరింపగా
వచ్చితి, వియ్యది మెచ్చించెను నను.

143–144

అప్పుడు, తుష్టుండయి ప్రసన్నముగ
ఉన్న మహేంద్రు మహోదయు చూచుచు,
పర్వతేంద్రుడును పరమహర్షమున
తనిసి నిలిచెను యథాస్థానమున.

145

ఇంతలో హనుమ యెగసి చనుటగని,
సురలు సిద్ధులు ఋషులు గంధర్వులు
పలికిరి, సూర్యప్రభలతో వెలుగు
ఉరగమాతయగు సురసను కనుగొని.

146

అనిల తనూజుడు హనుమంతుడు వా
రాశి దాటు నాకాశమార్గమున
క్షణమాత్రము విఘ్నము కావించుము,
ఊతలేని యీ ఉప్పరవీధిని.

147

రక్కసి ఆకారముతో, ఆకస
మంట పెరిగి, పింగాక్షులు ఘూర్ణిల,
కోరలు సాచుచు, నోరు తెఱచుకొని,
కదలక నిలువుము కపి కట్టెదుటను.

148

నీ సమక్షమున నిలిచి, యెదిర్చి, జ
యించి పోవునో ? ఎడదారినిబడి
దేవురించుచున్ తిరిగి పోవునో,
చూడవలతు మీ శూరుని బలమును.

149

దేవతలిట్లు నుతించుచు పలుకగ,
నాగమాత చెలరేగిన బులుపున,
రక్కసి రూపున అంపిల్లుచు భీ
కరముగ లేచెను కడలికి నడుమను.

150

వికృత వికారవిభీతిభూతమగు
రూపుతో సురస, యేపుమీఱి చను
హనుమ మార్గమున కడ్డకట్టగా
చుట్టుముట్టి నిష్ఠురముగ పలికెను.

151
ఈశ్వరుండే పంపించె నిన్ను నా
కాహారముగా హరికులపుంగవ !
భక్షింతును నా వక్త్రమును ప్రవే
శింపుము ఆలోచింపక తడయక.

152
గంద్రవోతె కక్కసములు పలుకుచు
కదల కలత్యముగా నటు నిలిచిన
రక్కసి సురసకు, ప్రాంజలి మోడిచి
హర్షముఖుండయి హనుమ యిట్లనియె.

153
దశరథ నృపపుత్రకుడు రాఘవుడు
భార్య సీతతో భ్రాత లక్ష్మణుడు
వెంబడించగ ప్రవేశించెను శప
థము పాలింపగ దండకావనము.

154
బద్ధవైర మేర్పడె దైత్యులతో
రావణు డాకారణమున రాఘవు
భార్యను, సీతను, పరమయశస్విని,
అపహరించి చనె నతడు లేనపుడు.

155
రాముని పనుపున రాయబారినై
వెడలితి సీతను వెతక నేనిటుల,
నీకును విధియగు నీ కార్యంబున
సాయపడుట దాశరథుపౌరవీ !

156
ఇది కాదంటివ రయేని, ముందుగా
సీత మనికి లక్షించి, తదర్థము
తెలిపి రామునకు, తిరిగివచ్చి నీ
వక్త్రము చొత్తును, బాసచేసెదను.

157

అనుచు బాసచేసిన హనుమను విని
ఇచ్ఛారూపిణి యిట్లనె సురసయు,
అలవికాదు న న్నతిక్రమించగ,
వరమిట్టిది నా కెఱుగుము వనచర !

158

అపసరించి తన్నావల బోవగ
చూచు కపినిగని సురస యిట్లనియె,
హనుమంతుని పరాక్రమ బలములు
తెలియగోరి యేతెంచిన దగుటను.

159

కాదు కాదు శాఖామృగశేఖర !
పడవలె నీవిప్పుడె నా నోటను,
తప్పుకొనగ సాధ్యము కాదెట్లును,
బ్రహ్మయిచ్చె నీ వరము నాకు మును.

160–161

అని నోరు తెఱచుకొని నిలువబడిన
దాని చూచి క్రోధముతో ననె హరి
భూతంబా ! విప్పుము నీ వక్త్రము
నన్ను మ్రింగతగునంత వెడల్పగ.

162

దశయోజన విస్తరముగా పెరిగి
అఱచు సురసతో అట్లు పలికి హరి
తన దేహము పెంచెను దశయోజన
విస్తీర్ణముగా విపరీతాకృతి.

163

పదియోజనమున పఱపున మేఘము
కై వడి పీగెడి కపిరూపము గని,
ఇరువదామడల విరివి నెగడ తన
నోరు తెఱచె విడ్డూరముగ సురస.

164-165

కోరలు నిగుడగ ఘోరనరక గ
ర్తమువలెనున్న సురస నోరారసి,
కుంచె దేహ మంగుష్ఠమాత్రముగ
బుద్ధిశాలి కపిపుంగవు డప్పుడు.

166

వెంటనె వానరవీరుడు సురసా
వక్త్రబిలములోపల చొరబడి, వడి
దాని దేహము యథాయథలుగ ఛే
దించి, వెడలి, మీదికెగసి, యిట్లనె.

167

నీదు నోటిలోనికి చొచ్చితి, వి
చ్చేసితి; నన్నాశీర్వదించి, సెల
విమ్మా నాకు, పోయెద దాక్షాయణి!
సీతను దాచిన చేలకు వేగమె.

168

రాహుముఖ వినిర్గతుడగు శశివలె,
తన ముఖకందరమునబడి వెలువడి,
వెలుగుచున్న కపివీరుని చూచుచు,
పలికెను నిజరూపముతో సురసయు.

169

పొమ్మా! యథాసుఖముగ శుభమగు; నీ
యిష్టార్థము ఫలియించును పావని!
రఘుకులతిలకము రాముని వ్రజ్ఞకు
జనకసుతను సీతను పొందింపుము.

170

హనుమంతుడు చేసిన మూడవ దు
ష్కరకార్యంబును కాంచి భూతములు
'సాధుసాధ'ని ప్రశంసాగీతల
కీర్తించిరి ఉద్గీతస్వరముల.

171
శిశిరోదకములు చిందెడి మార్గము
పక్షులు పోయెడి అక్షయమార్గము
సాధు కైశికాచార్యుని మార్గము
ఐరావతము నడాడెడి మార్గము.

172
హరిశార్దూల విహంగ భుజంగమ
వారణములు చను వాహన మార్గము
బహువిమాన విభ్రమ విన్యాస క
లాపంబుల సమలంకృత మార్గము.

173
వజ్రాయుధ దుర్భర ఘాతలచే
పెకలి యెగసిపడు పిడుగుల రాపి
ళ్లకు లేచిన జ్వాలలమాలల సా
లంకృతమయిన నిరంకుశమార్గము.

174
పుణ్యులు, క్రతుఫలపూర్ణులు, నక్షయ
భోగము లందగ పోయెడి మార్గము,
అమృతములగు హవ్యములు మోసికొని
పావకు డేగెడి పావనమార్గము.

175
గ్రహములు, నక్షత్రములు, చంద్ర సూ
ర్యులు చరియించెడి జ్యోతిర్మార్గము,
నాగ యక్ష గంధర్వమహాఋషి
సంకులమగు కూలంకష మార్గము.

176
విమలము, వితత వివిక్తము, విశ్వా
వసు సేవితము, దివస్పతి యేనుగు
తిరిగెడి మార్గము, దినకర రజనీ
కర విహార మార్గము, శివమార్గము.

177

విధి నిర్మించిన వితత వితానమయి
విద్యాధరకుల విబుధ గణంబులు,
సంసేవించు విశాల మార్గమున
పక్షీంద్రునివలె పఱచె మహాకపి.

178

అతివిశాలము, నిరాలంబనమగు
వాయు మార్గమును పట్టి గరుత్మం
తుని వలె చనుచుండెను హనుమంతుడు,
జీమూతములను చీలిచి చిమ్ముచు,

179

కపియూథపు పటు గాఢ తాడనల
చెల్లాచెదరై నల్లని మబ్బులు
మిసమిస మెఱసెను పసుపుపచ్చలై
పండు కెంపులయి పాల తెలుపులయి.

180

వెనుకముందెడా పెడగొట్టిన
శ్యామలాభ్రముల సందిలిసందుల
హానరు డగపడె వానాకాలపు
చంద్రుడు చందమున చాటయి బయలయి.

181

అనిల తనూజుడు హనుమంతుండు, ని
రాలంబ నభం బంతయు తానయి,
ఖేచరులకు వీక్షించనయ్యె, ప్రే
లాడు ఱెక్కల కులాచలమట్టుల.

182

ఆ లీలన్ దివి తేలియాడుచున్
ఎగసిపోయెడి కపీంద్రుని గని, సిం
హికయను రాక్షసి, ఇచ్ఛారూపిణి
తలపోసెను మది తనువు పెంచి యిట్టు.

183

కూడు లేక అల్లాడుచుంటి చిర
కాలముగా, సంఘటితంబాయెను
నేటికొక్క మహనీయ సత్వమిట్టు,
ఆహరింతు నా యాకలి తీఱగ.

184

చింతించుచు నిటు సింహిక, దివి చను
కపివరు ఛాయను గావుపట్టె; తన
నీడనుపట్టిన పీడలు తోపగ,
తనలో నిటులనుకొనె హనుమంతుడు.

185

పట్టి కట్టి రెవ్వరో నా ఛాయను,
మందగించిన దమంద విక్రమము,
ఎదురుగాలి వడి గదిమినట్ట న
ట్టేట నిలిచిపోయెడి నావపగిది.

186

మీదను క్రిందను మిగిలిన కడలను
పరికింపగ కనబడె కపికయ్యెడ;
ఉదధినుండి పయికుప్పొన చాడ్పున
వెడలుచున్న ఒక విపరీతాకృతి.

187–188

ఆ దయ్యపు మొగమారసి, కపిరా
జప్పు డన్న ఛాయాగ్రాహి యనుచు
సందియమేది, భృశంబుగ పెంచెను
మేను మహాకపి; వానమబ్బువలె.

189–190

పెరిగిన కపి మే నరసి సింహికయు
పాతాళాంతర భూతంబుగ తన
నోరు తెఱచి, కపివీరుని కదియగ
వచ్చెను మేఘమువలె గర్జించుచు.

191

తన్ను మ్రింగ వక్త్రంబును తెఱచిన
సింహికను సమీక్షించి గ్రహించెను,
దాని కాయపరిమాణంబును మ
ర్మస్థానములను మారుతి ధీమతి.

192

అంతలోన అంతంతలుగా తన
వజ్రకాయమును వంచి కుంచి, మఱి
పించి, హరి ప్రవేశించెను సింహిక
తెఱచియున్న భీకరముఖబిలమున.

193

రాహుముఖ సముద్రములో గ్రహణము
నాడు మునుగు చంద్రముని చందమున
సింహిక నోటను చెనకి దుముకు, కపి
వీరుని చూచిరి సిద్ధచారణులు.

194

హనుమ దాని కుక్షినిబడి, తీక్ష్ణ
నఖములతో అంతర్మర్మాంత్రము
లెల్ల చీల్చి, బయలెక్కె మనోజవ
మున, అది నోటిని మూయకమునుపే.

195

ధృతి దాక్షిణ్య ధురీణములగు వీ
క్షణధారల రాక్షసిని సింహికను
హింసించి, హనుమ యెప్పటి యట్టుల
కాయము పెంచె నమేయముగ మఱల.

196

సృజియించెను పరమేష్ఠి సింహికా
మారణకై హనుమంతు నెన్నటుల,
ఆతని ఘాతల నగలగె గుండెలు
తూలి సోలిపడె త్రుళ్ళి నీళ్ళ నది.

197

వానరుచే హతమై నీల్గిపడిన
సింహిక నటు లచ్చెరువున చూచుచు
ఆకసమున నడయాడు భూతములు
వాతాత్మజుతో పలికిరి యిట్టుల.

198

అతిభీషణ కృత్య మిది మహాకపి!
అలవిమాలిన భయంకర భూతము
సింహిక, దానిని సంహరించితివి;
సాధింపు మభీష్టము నిక సుళువుగ.

199

స్మృతియును,ధృతియును,మతియు,దక్షతయు,
సామర్థ్యచతుష్టయ, మివి కలిగిన,
నీవంటి క్రియానేతలెన్నడును
కష్టపడరు తమ కార్యసాధనల.

200

తలపు ఫలించగ, దైవభూతములు
సంభావించగ, సంతోషముతో
అరిగెను క్రమ్మర ఆకాశంబున
గరుడుని కైవడి కపికులకేసరి.

201

అంతలోనె హనుమంతుం డవతలి
తీరమునందిగి, పాఱజూడ, కన
వచ్చెనంతటను పచ్చని తోటలు
శతయోజనములు చాళ్లుచాళ్లుగా.

202

దిగినంతనె హరి తిలకించెను శా
ఖామృగంబులకు కామితంబులగు
వివిధ వృక్షములవీధులు, మలయో
ద్యానవనంబుల బోనివాడలను.

203
ఉదధిని, ఉదధి దిగుదల పల్లముల,
తేమనేలల నెదిగిన వృక్షముల,
పరికించుచు సాగరసంగ నదీ
నదముఖంబులను ముదముగ చూచెను.

204
శ్రావణ మేఘము చాయవిస్తరిలి
ఆకసమంతయు ఆముకొన్న తన
ఆకారము నవలోకించి మదిని
భావించెను మేధావి హనుమ యిటు.

205
నా రూపోన్నతి, నావేగోద్ధతి,
చూచి రేని దనుజు లపూర్వంబీ
కపిభూతంబని కౌతూహలమున
విస్మితులై నా వెంబడి పడుదురు.

206
అని, కొండను పోలిన తనరూపము
సంక్షేపించెను స్వల్పాకృతిగా;
మోహము వీడ ముముక్షువు ప్రకృతి
స్థితి కొనుగతి పొందెను నిజరూపమ్ము.

207
పెంచిన రూపము దించి హనుమ, నిజ
వానరాకృతిని కానవచ్చె; మును
బలిబలము హరింపగ విష్ణువు మూ
డడుగుల పరిమితి ముడిగినభాతిని.

208
పలురూపంబుల మెలగి, అన్యులక
లవిగాని మహార్ణవము దాటి గ
ట్టెక్కి, కార్యము సమీక్షించి, అపుడు
సముచితమగు రూపము ధరించె, కపి.

209
కొబ్బరితోటలు, గుబురు మొగలిపొద,
లుద్దాలకముల ఓలము లొరసెడి,
లంబగిరితలంబున వ్రాలె, మహో
త్సుందు మారుతసుతుండు కొండవలె.

210
ఏటిగట్టున నొకింతనిలిచి హరి
గిరి సిగబంతిగ మెరయు లంకగని,
ఎగిరి దుమికె నా నగముమీద ప
క్షులు మృగములు కలగుండు గొని చెదర.

211
త్రుళ్ళి విరిగిపడు కల్లోలములకు,
నాగులకును, దానవులకు, నెలవగు
కడలిదాటి వెలిగట్టున దిగి, హరి
అరసెను లంకను అమరావతివలె.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౧

1

అట్లు, దాటుటకు అలవికాని పా
రావారము నతిరయమున దాటిన
హనుమ స్వస్థుడై యరసె త్రికూట శి
ఖరము మీది లంకానగరంబును.

2

కొండమీది ప్రాకు లురలి కురిసిన
పూల వానలన్ మునిగిపోయి, కపి
పుష్పమూర్తివలె పొడకట్టెను, పటు
వీరవిక్రమోదారుం డయ్యును.

3

నూఱామడల సుదూరము పఱచియు
అలసి సొలసి ఉసురసురని సొక్కడు,
ఉత్తమ విక్రమ సత్త్వాయత్తుడు
సాహసికాగ్రణి శ్రీ హనుమంతుడు.

4

నూఱామడ లొక దూరమె! పదినూ
ఱామడలయిన నికేమి! దాటగా
జాలుదు; సాక్షి సాగర లంఘన
మెంతటి దని హనుమంతు డుల్లసిలె.

5

అతిశయ వేగాన్వితులగు ప్లవగుల
లో నధికుడు, ప్లవమాన ప్రజ్ఞా
గణ్యుడు మారుతి; కావున వారిధి
దాటెను లంకను దరిసెను వేగమె.

6

అచ్చట నేపగు పచ్చిక బీళ్లు, సు
వాసనల్ చెరుగు పచ్చితోటలు, శి
లావలయంబులు, లాతినగంబులు,
చోద్యముగా చూచుచు తిరిగెను హరి.

7

పెద్ద చెట్లు కప్పిన ఊపడకల,
పూచిన వృక్షంబుల వనవీథుల,
ఇచ్చ మీఱ చరియించి మహాకపి,
దాటిపోయె నా కూటపరిసరము.

8

కొండ నెత్తమున కొంతసేపు నిలు
వంబడి క్రమ్మఱ పరికించెను కపి,
పచ్చని తోపులు, పఱగడ నడవులు
క్రాలుచున్న లంకానగరంబును.

9

కర్ణికారములు, ఖర్జూరంబులు,
ముచుకుందంబులు, మొగలి పూ పొదలు,
ప్రేంకణములు నేడపెడల పుంజుకొని
కుటజ కదంబ నికుంజము లొప్పెను.

10

పూచి పొలిచి పుప్పొడితో నిండిన
దేవదారములు, కోవిదారములు,
నీప, లెఱ్ఱగన్నేర్లు, ప్రియంగులు,
గుబురుకొనియె కోకొల్లగ నెల్లెడ.

11

పూచిన పువ్వుల మోతలతో, పూ
యని మొగ్గల సోయగముతో, కెరలి
యాడు పులుంగులతోడ, పయ్యెర లు
యాలలూప పోలుపారును తరువులు.

12

కలువలు తమ్ములు కవుగలించుకొన,
కారండవములు కలహంసములును
క్రీడించెడి దీర్ఘికలును, పలు తీ
రుల రమ్యసరస్సులును రంజిలును.

13

అన్ని ఋతువులను అడుగక ఉడుగక
పూచి కాచు తరువులును తీగెలును
వర్ధిల్లెడి ఉపవనముల వనముల
చూచె నవనవోత్సుకుడై పావని.

14

సకల భాగ్య సుఖసంపూర్ణుడు దశ
కంఠుడేలు లంకాపురికోట య
గడ్తలు విలసిలు కమలంబులతో
కలువలతో ఆ కాలము శుభముగ.

15

సీతను తో తెచ్చిన గిలి కెలకగ
బుగులుకొన్న దశముఖుతో, దానవ
భటులును తిరుగుధురటు నిటు నెల్లెడ
వేయుకండ్లతో వేషధారులయి.

16

పచ్చని కనక ప్రాకారముతో,
రమ్యమయిన నగరంబది, అందలి
మేడ లచ్చముగ మెఱయును శరన్మే
ఘముల చా[illegible]గ్రహముల నొత్తున.

17–18

ఎత్తగు బురుజుల నెగురుచున్న జెం
డాలవరుసల, విశాలరథ్యలను
అచ్చము తెల్లనిరచ్చతోరణాలు
కాంచె దేవపురి కైవడి లంకను.

19

కొండనెత్తముల, మెండుగ కట్టిన
తెల్లని మేడలు నెల్లని మిన్నుల
నంది పుచ్చుకొను నట్టులున్న లం
కా నగరంబును కాంచె మహాకపి.

20

రాక్షసేశ్వరుడు రావణుండు పా
లింప బలిమి, నిర్మింప నేరిమిని
విశ్వకర్మ, వినువీధుల తేలెడి,
లంకను కపితల్లజుడీక్షించెను.

21

ప్రాకారము మొలపట్టుగ, శూలము
లలకలుగ, బురుజు లాభరణములుగ,
జలధారలు వలువలుగ, మయుడు మన
సార కట్టిన ప్రియపురీమణి యది.

22–23

కైలాసగిరి శిఖరముల కైవడి
గగనము నొరుయుచు, గాలిని చీల్చుక
యెగిరిపోవుగతి మిగుల నెత్తుగా,
సుఖనివాసములు శోభిలుచుండెను.

24

నాగకులమునకు భోగవతి పగిది,
క్రూరరాక్షసుల కూటంబయ్యెను
ఎన్నగ నోపని యిష్టనగరి, యిది;
మును కుబేరు కాపుర మనుట నిజము.

25

కోరలు సాగిన క్రూరరాక్షసులు
పట్టసశూలము లిట్టటు త్రిప్పుచు
రక్షింతు రహోరాత్రము లీ పురి,
క్రూరసర్పములు కొండ గుహం బలె.

26

కట్టనిరక్షా ఘట్టమువలె లం
కను చుట్టిన ప్రాకారము నారసి,
ఘోరరాక్షసుల గూఢ రక్షణము
నంగబలము కపి ఆలోచించెను.

27

ఈదగరాని మహోదధి నెటులో
గడచి వచ్చెదరుగాక వానరులు,
అది నిరర్థకము; కదనంబున లం
కను పట్టు టశక్యము సురల కయిన.

28

బాహు విక్రమ ప్రథితుడె రాముడు
అయిన నేమిచేయంగల డిచ్చట?
పట్టగరాదీ పర్వత దుర్గము
గండు రక్కసులు కావలి యుండగ.

29

బలపరాక్రమోద్భటు లీదైత్యులు,
సామదానములు సాగవు, భేదము
పాఱదు, యుద్ధోపాయ మసాధ్యము,
కావరాదు అవకాశమింకొకటి.

30

వానరయోధులనైన యీ పనికి
గతి నలుగురె; అధిపతి సుగ్రీవుడు,
వాలి నందనుడును, నీలుడును, నేనును;
ఏమి చేయదగునీ దుస్సంధిని.

31

ఎందుకిప్పు డీ ముందు విచారము ?
మొదట వెతకెద ప్రపూతను సీతను,
ఉన్నదో లేదో ఉనికి తెలిసికొని,
ఊహింపందగు నుత్తర కార్యము.

32

అనుచు పర్వతమునందే నిలువబడీ
చిక్కబట్టి మనసొక్క నిమేషము,
రామ కామితార్థపరాయణ రతి,
ధ్యానమగ్నుడయి తలపోసె నిటుల.

33-34

ఈ రూపముతో నేను రాక్షసుల
దుర్గమ నగరము దూరు టశక్యము,
క్రూరు లుగ్రవీర్యుల నిశాచరుల
కనులు ప్రామి జనకజను వెతకెదను.

35

కనబడీ కనబడని రూపముతో
చీకటిపడ చొచ్చెద నగరంబును
వీలు చాలు కనిపెట్టి నేను వ
చ్చిన పని సాధించెద యుక్తంబుగ.

36

సురలకేనియు నసురలకేనియును
కాలిడ శక్యముకాని లంకలో
చొరబడి, దానిని చూచి, ఊరుపులు
పుచ్చుచు కపి తలపోసె నిట్లు మది.

37

రావణు డధిక దురాత్ముం, డాతని
కంటబడక లంకానగరములో
ఏ యుపాయమున నేను మైథిలిని
వెదకి చూడకలుగుదును శీఘ్రముగ.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౩

1

కదలి కులుకు శృంగములతోడ జీ
రాడు ఘనాఘనమట్టులొప్ప లం
బాచలమున తఱి వేచుచుండె మే
ధావి హనుమ భవితవ్య తితిక్షను.

2

పువ్వులతోటల పూర్ణ సరస్సుల
రమ్యధామమయి రావణుడేలెడి
లంకాపురమును జంకులేని ధృతి
చీకటిపడ  చొచ్చెను మహాబలుడు.

3

తెల్లని సంక్రాంతి మొగుళ్ళవలె
ధౌత సౌధ సంజాతము మెఱయగ,
ఏటి నీటి పయ్యెరలు విసరు ము
న్నీటి కెరటముల పాటలు వినబడ.

4

అలకాపుర శోభలదై వారును
రావణేశ్వరుని రాజధాని, తిని
త్రాగి మదించిన రాక్షస రక్షకు
లెత్తిన కత్తుల నెడప రెన్నడును.

5

మేఘ మాలికలు మెఱుపులు చిమ్మగ,
జ్యోతిర్గణములు చుట్టి చరింపగ,
ఝంఝానిలఘోషము లెలుగింపగ,
అతిశయించు లం కమరావతి వలె.

6–7

బంగరు బురుజుల ప్రహరిగోడల
జెండాలను గజ్జెలు గలగలమన,
ప్రాకార సమీపంబు చేరి కపి
వేడుక చెందెను విస్మయమందెను.

8

ముత్యములు, స్ఫటికములు, మణిపలకలు
తాపించిన నిద్దపు ముంగిళ్లును,
స్ఫటికపు చందన వైడూర్యములను
కలిపి సొగగా కట్టిన మెట్లును.

9–10

కరగబోసి వడకట్టి తేర్చిన ప
సిండి వెండి జిగిజిలుగు వన్నియల
అంగణములు సోయగములు కాన్,పురి
గగనమున కెగుయు కరణి కనంబడె.

11

అంచలసందడి, క్రౌంచముల పలుకు,
నెమళుల కేకలు, నెలతుకల నగల
చప్పుడు, వాద్యస్వరములు, పురమున
బోరుకలగు నలవోక యెల్లపుడు.

12

అలకానగరపు అందచందములు
కసరి కొసరి ఆకసమున కరుగుచు
నున్నభంగి చెలువొందు లంకగని
వేడుకపడి కొనియాడెను మారుతి.

38
విదితాత్ముఁడు రఘువిభు, డాతని కా
ర్యము ఫలించు విఘ్నము లేకేగతి
ఎట్లు చూడగల నేకాంతముగా
ఒక్కర్తుక నైయున్న జనకజను.

39
దూతలు నీతివిదులు కానప్పుడు
దేశ కాలములు తిరుగు నడ్డముగ
చెడును కార్యము సుసిద్ధంబయ్యును,
ప్రొద్దుపొడుపుల విఱుగు చీకటివలె.

40
కార్యంబులు విఘ్నములై చెడు దూ
తలు పండితమానులయిన; అర్థా
నర్థముల నిదానముపట్ల ప్రకా
శించక వారి విశేష ప్రజ్ఞలు.

41
రాముని యిష్టార్థం బెటు చెడకుండును
ఎట్లు పిరికితన మెనయకుండు నను,
దరిలేని సముద్రము దాటిన నా
శ్రమ మెట్టుల వ్యర్థము కాకుండును ?

42
ఆత్మవిదుడు, ధర్మాత్ముఁడు, రాముడు
రావణ సంహారమునకు సమకొనె,
ధర్మార్థం, బిది ధ్వంసమగును నే
నిట రాక్షసపతి దృష్టికి చిక్కిన.

43
రాక్షసవేషపరాయణుండనయి
సంచరించినను సందేహింతురు
శక్యము కాదజ్ఞాతచారమిట;
ఏ రూపున మఱి యెట్లు మెలగుదును?

44
బలపటిష్ఠు లీ పాపరాక్షసులు,
లేదు వీరికి తెలియనిదేమియుట,
గాలికూడ లంక వాసుల కే
ర్పడక విసరదని పలుకు లోకములు.

45
ఇప్పుడిచట నా యెప్పటిరూపున
ఉంటినేని మృత్యువుతప్పదు నా
అర్థాంతరమున అపహాసంబై
పోవు స్వామి సుగ్రీవుని కోరిక.

46
ఇది యిట్లగుటను, ఎట్టులేని రఘు
రాముని ప్రియకార్య సుసిద్ధికయి,
నా స్వరూపమును హ్రస్వగించి చొ
చ్చెదను లంకను నిశీథసమయమున.

47
కావున నేడీ రావణుపురము ని
శీథమున ప్రవేశించి యేమరక
మూలమూలలను గాలింతును దూ
రాంతికములు దర్శింతును సీతను.

48
అని చింతించుచు హనుమంతుడు వై
దేహిని చూచు కుతూహల లాలస,
నాతురుడై సూర్యాస్తమయము న
పేక్షించుచు గడిపెను పగలంతయు.

49
ప్రొద్దుగ్రుంకి, యిమ్ముల చీకటిపడ
తోడ్తో హరి తన తోరపు రూపును
సంకుచించి మార్జారమానముగ
మాటిపోయి విస్మయము జనింపగ.

50

ఆ ప్రదోషసమయముదాక నిరీ
క్షించి ప్రవేశించెను మారుతి, సువి
శాలములై వరుసలుగానున్న మ
హాపథముల లంకాపట్టణమును.

51

బంగారపు గుబ్బల కిటికీలును,
పాలవెండి స్తంభములు నొప్పు ప్రా
సాద వీధుల విశాలమగుచు, గం
ధర్వనగరి చందమున వర్ధిలును.

52

ఏడంతస్తుల మేడలు, నెనిమిది
అంతిపురంబుల హర్మ్యధామములు,
స్ఫటికఫలకములు పఱచిన నడవలు,
అతిశయించు హేమాలంకృతమయి.

53

వైడూర్యంబులు పచ్చలు ముత్యము
లలికినట్లు భాసిలు అంగణములు,
సుందరంబులై చూడ వేడుకగ
అమరు అసురనాయకుల భవంతులు.

54

చిత్రచిత్రమగు చెక్కడములతో
తీరుతీరు బంగారు తోరణము
లెల్లెడలను శోభిల్లుచుండె లం
కానగరము శృంగారమయంబయి.

55

ఎన్నరాని, ఊహింపగజాలని,
లంకానగర విలక్షణ విస్మయ
రూపము వానరదీపకు డారసి
మోద ఖేదముల మునిగె పదంపడి.

56

అచ్చ తెలుపుచాయల విమానములు,
నిగ్గు పసిడివన్నెల తోరణములు
శోభిల్లు దశాస్యుడు పాలింపగ
దనుజులున్న లంకను కనుచుండెను.

57

చుక్కలనడుమను సుఖముగ మెలగుచు,
వేయిచేతులను వెన్నెలచాందిని
చాచిపట్టి, హరిసాచివ్యమునకు
వచ్చె చంద్రభగవానుడు తూర్పున.

58

శంఖమువలె స్వచ్ఛంబయి, క్షీరమృ
ణాలకాంతులను నోలలాడుచుఁ,
కొలకున మెరసెడి కలహంసవలె
కాంచెను చంద్రుని కపికులచంద్రుడు.

13

సాటిలేని సిరిసంపదలెల్ల స
మృద్ధముగా వర్ధిల్లుచున్న రా
క్షసనాయకు లంకానగరము కని
వేడుకతో కొనియాడెను మారుతి.

14

ఎత్తినకత్తుల నెడపక దైత్యులు
రావణుబలములు రక్షింపగ నిది
బలిమిని పట్టగ వశముకాదు, లా
తులకెవ్వరికిని అలవికానిపని.

15

ఇట్టి ఖ్యాతిగలదీని, చాలుదురు
కుముదాంగద ముఖ్యులును, సుషేణుడు,
మైందవద్వివిదు; లంద ఱొక్కమొగి
దీక్షించిన సాధింపనోపుదురు.

16

లంకాపురమును లగ్గపట్టుటకు,
సూర్యపుత్రుడగు సుగ్రీవుండును,
కుశపర్వుడు, నలఘుండు కేతుమా
లియు, నేమను చాలిన సమర్థులము.

17

ఇంకను మది నూహించిచూడ, రా
ఘవు బాహావిక్రమమును, లక్ష్మణు
ధనురస్త్ర దురంత పరాక్రమమును
ఎదురులేనివని ముదమందెను హరి.

18

రత్నభవనములు రంగుచీ రెలుగ,
ఆవులచావ శ్శ్రీవతంసములుగ,
యంత్రశాలలు ప్రియస్తనంబులుగ
లంకయొప్పె సాలంకృత సతివలె.

19

వెలుగుచున్న దీపికల వెలుతురున
చీకటి నిలువగలేక వై తొలగ,
కళకళలాడెడి కనకభవనముల
రావణేశు నగరమును చూచె హరి.

20

చొరవ చేసికొని చొరబడుచున్న మ
హా బలవంతుని హనుమంతుని గనె
రావణేంద్రు పురదేవత లంక; ని
జాకృతి నంతట న ప్రమత్తయై.

21

రావణు నధికారమున మెలగునది
కాన, కపీంద్రునికాంచి, లేచి, అతి
వికృతముఖముతో విచ్చేసెను వడి
స్వయముగ నగరద్వారము చెంతకు.

22

కపిసింహంబునుకదిసి, కట్టెదుట
స్థిరనిలువుగా నిలబడి, బొబ్బలు
పెట్టుచు అరచెను గట్టిగ నిట్లు జ
గత్ప్రాణసుతుని కలవరపెట్టగ.

23

వనచరుడా! ఎవ్వడ? పీ విచటికి,
ఎందువచ్చితి విట్టుల నొంటిగ?
చెప్పుము నిజమును శీఘ్రంబుగ, నీ
ఉసురులు బొందిని మెసలుచుండగనె.

24

శక్యము కాదేచందమునను నీ
కింక ప్రవేశము లంకలోపలికి;
అతిగూఢముగా అన్నిమూలలను
కాపున్నవి రాక్షసగణబలములు.

25

తన సమత్తమున తడయక నిలిచిన
దానితోడ కపిశల్లజు. డిట్లనె;
అడిగితికాన యథార్థము చెప్పెద
వినుమీ యావద్వృత్తాంతంబును.

26

ఎవ్వతవీవు వివృత వికృతేక్షణ !
నగరివాకిటను నిలుతువెందులకు ?
భయపెట్టుచు నను ప్రతిరోధించితి
దారుణముగ, ఏ కారణార్థమయి ?

27

హనుమద్వచనములను విని లంకా
కామరూపిణి అఖండకోపమున,
మండిపడుచు హనుమంతునితో నిటు
దురుసులాడె నిష్ఠురకంఠంబున.

28

నేనిక్కడ లంకానగరమునకు
రక్షకురాలను; రాక్షసరాజగు
రావణు నాజ్ఞను కావలియుందును
ఎవరికిలొంగక దివమును రాత్రియు.

29

కాలిడ శక్యముకాదు లంకలో
గంతకట్టి నా కనులకు వానర ! ;
అడచితినేని యిపుడె నీ ప్రాణము
లెడలు; నిద్రపోయెదవిక లేవక.

30

నేనెనుమీ ! లంకానగరాధి
ష్ఠాన దేవతను సర్వంబును ర
క్షింతును స్వయముగ; చెప్పితి, నీవిక
తెలిసికొని ప్రవర్తింపుము వానర !

31

అట్టుల లంక అహంకారముతో
బింకములాడగ వినుచుండెను పవ
మానసుతుడు హనుమంతుడు కదలక;
కొండపై మఱొక కొండవలె నిలిచి.

32

వికృతరూపమున వెలసిన లంకా
స్త్రీరూపము నీక్షించి, మతి విచా
రించి, వానరవరేణ్యుడు, మారుతి,
మేధావి పలికె మెత్తని గొంతున.

33

లంకానగరి కలంకారములగు,
తోరణముల శృంగారంబును, ప్రా
కారంబుల గంభీరాకృతి, కను
లార చూడ మనసాయె వచ్చితిని.

34

పేరుమ్రోగె నీ ద్వీపమునందలి
పచ్చని పుష్పాల పండ్లతోటలును
చిక్కని వనములు చక్కని గృహములు,
వానిని చూడగ వచ్చితి వేడ్కను.

35

పవమానసుతుడు పలికిన పలుకుల
నాలకించి, వెనకాడక, యాసున
కామరూపిణి వికారవేషిణి, స
మీరసుతునితో మారుపలికె నిటు.

36

నను జయింపకున్నను దుర్బుద్ధీ!
రావణు డేలెడ రాజ్యములో నీ
పురముచూడ నీ తరము కాదిపుడు
చెప్పిన మాటల నొప్పరికించకు.

37

ఆ మాటలు విని హరి శార్దూలము,
మఱల నా నిశాచరితో నిట్లనె,
ఒక్కసారి యీ పక్కఁణమారసి,
వచ్చినదారినిపట్టి పోయెదను.

38

అంతట లంక దురాగ్రహమెత్త భ
యంకరంబుగ అఱచుచున్ తడయక,
చెంపదెబ్బ తీసెను క్రూరంబుగ,
హనుమంతుని దాంతుని బలవంతుని.

39

గొంతు పగుల మ్రోగుచు రాక్షసి బె
ట్టిదముగ నటు తాడించగ మారుతి,
నిబ్బరం బెడల బొబ్బలు పెట్టెను
ఘనభోంతరంబులు మార్మ్రోయగ.

40

అంతబోక పవనాత్మజుండు, ప్రళ
యాగ్రహంబుతో నుగ్రుండయి, కుడి
చేతి వ్రేళ్ళు ముష్టిని బట్టు బిగయ
ముడిచి, పొడిచె ఱొమ్ములలో దానిని.

41–42

పిడుగువంటి కపి పిడికిటి పోటుకు
ఊపిరాడకది ఒఱగి విఱిగిబడె;
స్త్రీయని తలచి అతిక్రోధం బిం
చుక జాఱగ, చంపక విడిచెను హరి.

43

ముష్టి ఘాతమున మూర్ఛితయై పడి
విలవిలలాడెడి వికృతాస్యను రా
క్షసిని చూడ కపి సత్త్వమున కపుడు
కనికారము తొణకెను కటాక్షముల.

44

అట్లు నేలబడి అపరయాతనన్
తన్నుకొను చసురి; తన్ను జాలితో
చూచుచున్న కపిసోమునితో నవె
గర్వమడచి గద్గద కంఠంబున.

45

రక్షించుము వీరకపిసత్తమ! ప్ర
సన్నుడవైనను మన్నించుము ! బల
వంతులు సత్వనితాంతులు నగు ధీ
మంతులు కరుణామయులుగారె హరి.

46–47

నేనె స్వయము లంకానగరిని కపి
కంఠీరవ ! నీ కరతలఘాతను
హతమై పడితి; స్వయంభువు నా కి
చ్చిన వరమున్నది, చెప్పెద వినుమది.

48

ఎపుడు వీరుడొక కపికుల ముఖ్యుడు,
చెనకి నిన్ను నిర్జించునొ, అప్పుడె
దైత్యుల లోకోత్తర మహోన్నతికి,
నాశకాలమని నమ్ముము ధ్రువముగ.

49

నీ యాగమనము నాయపజయమును
భావింపగ, ఆ భయకాల మిపుడు
దాపరించెనని తలతు హరీశ్వర !
మిథ్యయగునె పరమేష్ఠి భవిష్యము.

50

సీత నిమిత్తము చేసిన పాపము
ప్రభువు దురాత్ముడు రావణున, కతని
పౌరులు లంకావాసాసురులకు
సర్వమునను నాశనము తెచ్చినది.

51

రావణుడేలెడి రాజధానిని ప్ర
వేశించు, మభీప్సితములయిన కా
ర్యములను కావించుము, యథేచ్ఛగా;
వచ్చిన కార్య మవశ్య సిద్ధియగు.

52

రాక్షసరాజగు రావణేశ్వరుం
డేలగ, శుభములకిల్లయి, శాపము
తిన్నపురము చొత్తెంచి, జానకిని
వెతకుమంతటను వీరకపీశ్వర !

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౪

1

అతుల హనుమ మహాతేజస్వి, బ
లాఢ్యుడు, లేచి పరాక్రమించి, స్వే
చ్ఛా రూపిణి, లంకా రతికను ని
కారించి పురద్వారమున్ గడచి.

2

అపరరాత్రి సమయంబుచూచి, తల
వాకిలి విడి, పెడవాకిలి పట్టున
ప్రాకారంబును దూకి, ప్రవేశిం
చెను లంకాపురమును హనుమంతుడు.

3

సుగ్రీవునకున్ శుభదాయకముగ,
లంక చొచ్చువేళ తన యెడమకా
లిడెను శాత్రవుల నడినెత్తిన బలె
రాజనీతి పారగుడు మహాకపి.

4

రాత్రివేళ నగరంబును చొచ్చిన
హనుమ పోవుచుండెను లంకాపుర
రాజ వీధులను; రాలిన పువ్వులు
చల్లినట్లు రాజిల్ల నెల్లెడల.

5

జంత్ర వాద్యముల సన్నని పాటలు,
నవ్వుటాల సందళ్ళు సరసములు,
రమ్యమయిన నగరంబున నెల్లెడ
వినబడుచుండెను వీనుల విందుగ.

6

మంచి వజ్రముల మాలలు చుట్టిన
తెల్ల యేనుగుల తీరున భాసిలు
భాగ్యభవనముల పంక్తులతో పురి;
శుభ్రపయోధర సుందర దితివలె.

7

రేకులు విప్పారిన పద్మములను
బోలు రూపముల, పాలముబ్బుల సొ
బంగుల, స్వస్తిక మంగళాంకముల,
దీపించును లంకాపుర గృహములు.

8

చిత్రముగ రచించిన మాలలు, నా
భరణములు వెలయ, 'వర్ధమాన'మను
పేరులపలకలతో రమణీయము
లయిన గృహములను ప్రియముగ గనె కపి.

9

పలుచందంబుల బహురూపంబుల,
తీరుతీరుగా తీరిచి కట్టిన,
ఒక భవంతియందుండి దూకి, మఱి
యొక భవనముమీది కెగరసాగెను.

10

అమరలోకమున అప్సరసలవలె,
దానవయువతులు త్రాగిపాడు త్రి
స్థాన స్వరగీతా తరంగములు
వినబడె మారుతి వీనులకింపుగ.

11

మేలిమి మేడల మెట్లమీదుగా
ఎక్కిదిగుచు భ్రమియించు భామినుల
మొలనూళ్ళందెలు మొరయు రవళి విన
నయ్యెను గలగలమంచువాడలను.

12

అచటనచట ఉదయ వ్యాయామా
స్ఫోటనములు, ఆర్భాటారవములు,
మంత్రతంత్ర పరతంత్రుల కంఠ
శ్రుతులును వెడలె అసురుల నట్టిండ్లను.

13

స్వాధ్యాయ సునిష్ఠాపరులగు ఛాం
దస పుణ్యజనుల దర్శించెను కపి,
రాక్షసేశ్వర ప్రస్తుత గీతా
పాఠకులును కనబడిరి వీధులను.

14

రాజవీధి కిరుప్రక్కల నిలిచిరి
కత్తులతో రాక్షసభటు లెడనెడ,
చాటుమాటుగా సైనిక శిబిరాం
తికముల వేగులు తిరుగుచునుండిరి.

15

ఎద్దుతోళ్ళు ధరియించిన నిష్ఠులు,
జడదారులు, దీక్షాముండితులును,
పిడికిట దర్భలు ముడిచినవారును,
అగ్నిహోత్రులును యాతుధానులును.

16

కూటముద్గర క్రూరహస్తులును,
కండలుబలిసిన దండధారులును,
ఏకేక్షణులును, ఏకకర్ణులును,
లంబోదరులును లంబస్తనులును.

17

వంకరమూతులు, వామనమూర్తులు,
పీలమొగాల కరాళదర్శనులు,
ఖడ్గశతఘ్నులు కార్ముకముసలము
లెత్తితిరుగుదురు మత్తిలి దైత్యులు.

18

కరములం దినుపకట్ల గుదియలును,
మేనకవచములు మెఱయనెగడుదురు
బలుపెక్కక, మిక్కిలి బక్కటిలక
గిటకపాఱక, మిగిలి పొడుగెదుగక.

19

కారునలుపును చోకారుపు తెలుపును
కాని రాక్షసులు కానబడిరి, వి
రూపులు, నధికసురూపులుగా కలసి;
కొందఱు గిడ్డలు కొందఱు పొడుగులు.

20-21

విజయపతాకలు వివిధాయుధములు
తాల్చి, కావిగందము నలందుకొని
వజ్రాయుధములు వాడి శూలములు
వెలయ భ్రమింతురు విచ్చలవిడిగా.

22

పూలదండలను భూషణంబులను
తాల్చి, కావి గందము నలందుకొని,
బహువేషంబుల పలువాలకముల
వారినిగనె హరి స్వైరవిహారుల.

23

వజ్రాయుధములవంటి మున్మొనల
వాలములను మెయితాలిచి, వందలు
వేలు రాక్షసులు వాలి తిరుగుదురు
రావణు నంతిపురంబు చుట్టుకొని.

24

కొండనెత్తిన అఖండశోభతో,
చారు హిరణ్మయ తోరణములతో,
ప్రఖ్యాతంబగు రావణు రాజాం
తఃపురమును సందర్శించెను కపి.

25

తెలితామరపువ్వులతో నిండిన
కోటకందకము దాటకుండ, ప్రా
కారచక్రము గభీరముగా, వెలి
చుట్టు తిరిగివచ్చుట చూచెను హరి.

26

ఇంద్రుని నగరికి ఈడగు లంకను,
దివ్యనాదములు దివ్యాభరణ ని
నాదంబులు ప్రతినాదములీనగ,
హయముల హేషలు ప్రియముగ నుండెను.

27

రథములు, హస్తి తురగ విమాన వా
హనములు నగరమునందు సందడిల,
తెల్లనిమబ్బుల తీరున నాలుగు
కోరల యేనుంగులు విహరించును.

28–29

గుమికొనియాడగ గువ్వలు జింకలు
సాలంకృతమై, వేలురతుకులు
కావలికాచెడి రావణేశ్వరుని
రాణివాసము చొరంబడె మారుతి.

30

వ్రేలు కాడ ముత్యాల కుచ్చులు క
డాని చుట్టుగోడపయి చూరులను,
అగరు చందనము లలికిన రావణు
శోభన భవనముచొచ్చె మహాకపి.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౨

1

మిన్నుల నడుమను వెన్నెల పందిట,
పాలకెరటముల లీలగ చిలుకుచు,
ముచ్చటగా కనవచ్చెను చంద్రుడు;
ఆలకొట్టమున క్రాలుకోడెవలె.

2

లోక దోషములు పోకార్చుచు, జీ
వముల మహోల్లాసమున తనర్చుచు,
జలరాశి పయస్సులు పొంగించుచు,
శీతాంశుడు దివి సింగారించెను.

3

ముని మాపులను సముద్రుని శోభలు,
మంచినీట పద్మంబుల శోభలు,
ధాత్రిలోన మందరగిరి శోభలు,
మిళితమైనటుల మెరసెను చంద్రుడు,

4

వెండిగూటిలో పెంపుడంచవలె,
మందరగుహాలో మద కేసరివలె,
పోతుటేన్గుపయి పోటుమగని వలె,
రజనీరమణుడు రాజిల్లెను దివి.

5

సూదికొమ్ముమొటంచుల వృషభమువలె,
ఎత్తునెత్తముల హిమనగంబు వలె
పొన్నుకట్లరదముల ద్విరదమువలె,
చెలువారెను సమశృంగంబుల శశి.

6

మంచు బురద కసుమాలము జాఱగ,
గ్రహ శోభావహ గత కలంకియై
సుప్రకాశ రోచుల శుభాంకుడయి,
భాసిల్లెను భగవానుడు సోముడు.

7

గిరి శిఖరము నెక్కిన సింహము వలె,
కదనము కదిసిన మదగజంబు వలె,
రాజ్యము గెలిచిన రాజన్యుని వలె
వెలసెను పూర్ణకళలతో చంద్రుడు.

8

చంద్రోదయ శుచి జాఱెను చీకటి,
పెరిగె నసురులకు పిశితాశనరుచి,
మణగె మగువలకు ప్రణయదోషములు
స్వర్గభోగమనజాలె ప్రదోషము.

9

వీణలు మ్రోగెను వీనుల విందుగ,
ప్రియులతోడ నిదురించిరి పడతులు,
తిరుగవెడలె రాత్రించరజాతము
భయరౌద్రంబులు పయికొన నెల్లెడ.

10

మత్తెక్కిన దుర్మదుల సంకులము,
వీరశ్రీ శోభితుల సంభ్రమము,
రథ తురంగ మార్భటసంరంభము,
పిక్కటిల్లు పురవీధులు కనె హరి.

11

ఒకరినొకరు వికటోక్తు లాడుదురు,
బుజముల బుజములు పొడిచి నవ్వుదురు,
కైపు రేగిన ప్రగల్భము లాడుచు
తిట్టుచు తిమ్ముచు తికమక పడుదురు.

12

మగువ లగపడిన తగిలి దువ్వుదురు,
బొమ్మలు విఱుచుచు చిమ్ముచు చేతులు,
చాపములూరక మోపుచు దించుచు,
చిత్ర చిత్రమగు చేష్టల చెలగిరి.

13

ఇంపుగ పలుకుదు రింతులు కొందఱు,
కొంద ఱలసి తూగుచు పవళింతురు,
సుందరముఖు లిక కొందఱు నవ్వుదు
రూర్పులు విడుతురు ఓర్వనియువిదలు.

14

గజశాలల ఘీంకారారవముల,
బుధుల సదస్సుల పూజారవముల,
వీరజనుల నిట్టూరుపులను, పురి
బుసలుకొట్టు పాముల చెరువాయెను.

15

నానాసురుచిరనామధేయముల
ఖ్యాతిగణించిన యాతుధానులును,
బుద్ధిమంతులును, శ్రద్ధావంతులు
కనబడిరి మహాకపికి నగరమున.

16

సుగుణగణములకు, సుభగరూపముల
కనువర్తనులగు అసురులగని హరి
ఆనందించెను; అంతలంతల వి
కారరూపులు నగపడిరి కొందఱు.

17

కనబడిరచ్చట హనుమకు పిమ్మట,
వారి కులసతులు పరిశుద్ధచరిత,
లభిరూపవతులు, అనురక్తలు తమ
పతులపట్ల మధుపానము పట్లను.

18

రేలంతయు తమ ప్రియుల కౌగిలిం
తల నలిగిన నెలత లగపడిరి, మే
నుల వన్నెలు సిగ్గులను ముసుగుపడ,
పువ్వులపొర్లిన గువ్వల గోపున.

19

మెలతలు కొందఱు మేడలమీదను
ప్రియుల కవుంగిట పెనగి సుఖింతురు,
ఆచారవ్రత లయిన శుభాస్యలు
భర్తల యిష్టము తీర్తురు ప్రియముగ.

20

కోకలు జాఱిన గుబ్బెతల శరీ
రము లగపడె అపరంజి చాయలను,
విరహతాపమున వెలవెల బోయిన
వెలదులు శశిరేఖలవలె తోచిరి.

21

ఇచ్చకు వచ్చిన నెచ్చెలికాండ్రను
పొంది సుఖించిన అందకత్తెలను,
స్వగృహంబుల నిజవల్లభుల సరస
ముచ్చట తీఱిన ముగుదల నరసెను.

22

చంద్రుని శోభలుచల్లు ముఖములను,
వంగిన ఱెప్పల వాలికకనులను,
తొలకరి మెఱుపులు చిలుకు మంచి ర
త్నాల సొమ్ములు సరాలు చూచె కపి.

23

కాని, కన్నులకు కనబడదాయెను
వాతాత్మజునకు సీత, రాజ కుల
జాత, ఫుల్లపుష్పలతాభూత, ప్ర
పూత, శుభగుణోపేత, ఏకడను.

24

పరమ సనాతన పథమును వదలక
రాఘవ రాగపరాయణరతయై
భర్తృమనఃశ్రీపదనివిష్టయగు
సీత, కులస్త్రీజాతమతల్లిక.

25

పసిడి కంటెతో మిసమిసమను మెడ
కంటి నీటి కాకల చాఱలుపడె,
వంపు కురుల ఱెప్పల కను లెరియగ,
ఉండె నడవిలో ఒంటి నెమలి వలె.

26

తేటపడక కుందిన శశికలవలె,
బూడిద కప్పిన పైడి కాడవలె,
మొక్కపోయిన ప్రభువు కరాసివలె,
గాలికి తూలిన ఘనమాలికవలె.

27

మానవేశ్వరుడు, మాన్య చరిత్రుడు
రాము, డతని భార్యను సీత నచట,
కానలేక కటకటపడి మారుతి
దుఃఖహతుండయి తోప మూఢుగతి.

 14-12-1966



# సుందరకాండ

## సర్గ ౧

1

ఇష్టరూపముల నెత్తజాలు కపి
జానకి నచ్చట కానలేమి, దుః
ఖమున మునిగి శీఘ్రమె సమకట్టెను
లంక నాల్గుమూలలు గాలించగ.

2

సూర్యుని భాతిని జ్యోతిర్మయమై
బలముగకట్టిన ప్రాకారముతో
సర్వసంపదల సంశోభిలు దశ
ముఖు నంతఃపురము ప్రవేశించెను.

3

కంఠీరవములు కాననమున్ బలె
గండురక్కసులు కావలికాయగ,
దుర్గమమగు దైత్యుని నగరును గని,
కపికుంజరు డుత్కంఠితు డాయెను.

4

వెండిచట్టముల బిగియించిన చి
త్రరువులతో బంగరు తోరణములు,
అంచెలంచెలుగ నమరియున్న శి
ల్పంబులతో ద్వారంబులు వెలసెను.

5
ఏనుంగులపయి నెక్కు అమాత్యులు,
కాకలుతీఱిన కదనశూరులును,
అణచరాని మదహయములు కట్టిన
అరదములును నిండారియుండె పురి.

6
వెండితోడను పసిండితోడ గజ
దంతముతో కడు వింతగ చేసిన
రథములు తిరుగును రాజనగరి, శా
ర్దూల సింహముల తోలుగా సెనల.

7
బహురత్నంబుల భాండారములు, అ
పూర్వభాండము, లమూల్యరత్నకం
బళము, లందలంబు, లరదంబులు, సు
ఖాసనము, లసంఖ్యాతము లొప్పెను.

8
బలిసిన పెంపుడు పశులు మృగములు
చిన్నెలవన్నెల శృంగారముగా
గుంపులు గుంపులు గునిసియాడు, వా
కిండ్ల నెల్లెడల కండ్లపండువుగ.

9
నియమసుశిక్షితులయిన రక్షకులు
వెలుపలితల కావలికాయగ, ము
ఖ్య స్త్రీజనముల కలకలములతో
నిర్భరమై యుండెను నగరంతయు.

10
ముదితారత్నంబులతో, వారల
రత్నాల నగలరవళితో తరం
గించు రావణుని కేళీసౌధము
మ్రోతలతోడి సముద్రము చాడ్పున.

11

రాజలాంఛనలు రాజిలుచుండగ,
మంచిగంధపరిమళములు సుడియగ,
వీరగణము పరివేష్టింపగ, సిం
హములున్న అరణ్యామువలెనుండెను.

12

దుందుభిమర్దళ బృందవాద్యముల,
శుద్ధశంఖముల శుభనిస్వనముల,
ప్రతిదిన పూజల, పర్వహోమముల,
ఆరాధింతురు అసురులు దానిని.

13

పారావారమువలె గభీరమయి,
సాగరమట్టుల మ్రోగుచు సతతము,
రత్నములును, గృహరత్నములును రా
ణించు రావణుని నిలయముగనె కపి.

14

మందయానముల మసలు నేనుగులు,
కదనుత్రొక్కు నడకలను గుఱ్ఱములు,
దీమసంబుతో తిరుగు రథమ్ములు,
లంకాభరణ లలామ మయ్యెనది.

15–16

ఆ సౌధము భయమనక చొచ్చి, దశ
కంఠుని చెంతనె కలయతిరిగి, హరి
పాఱచూచెను భవంతులు, తోటలు
ఎక్కి దిగుచు ఒక్కొక్క అంతరువు.

17

అంతనప్రాకె ప్రహస్తుని భవనము
పైకి రయంబున, దూకె పిదప వీ
రాగ్రణియైన మహాపార్శ్వుని సౌ
ధాగ్రము మీది కనాయాసంబుగ.

18

కుంభకర్ణునకు కూర్చువాసమయి
మేఘము పోలిన మేడపై కెగసి,
దాని కవల శుద్ధముగానున్న వి
భీషణు శాంతినివేశము నరసెను.

19

పిదప మహోదరు ప్రియసదనమును, వి
రూపాక్షుని నిజకాపురము, నవల
విద్యుజ్జిహ్వుని వేశ్మము, నట్టులె
వజ్రదంష్ట్రుని నివాసగృహంబును.

20

శుక్లసారణుల సుఖసౌధంబులు,
వీక్షించి, పిదప ఇంద్రజిత్తు శో
భాయమాన దివ్యాయతనంబును
అవలోకించెను ఆమూలాగ్రము.

21-22

జంబుమాలి నిలయంబు, సుమాలి గృ
హము, సూర్యశత్రు నాలయము, నటులె
రశ్మికేతు హార్మ్యము వెదకి, పిదప
వజ్రకాయుని నివాసమున దుమికె.

23-24

ధూమ్రాక్షుడు, విద్యుద్రూపుడు, భీ
ముడు నున్న గృహంబులు పరికించెను,
ఘన విఘనులు, వక్ర, వికట, శఠ, శుక
నాసులునున్న భవనములు చూచెను.

25

హ్రస్వకర్ణ దంష్ట్రకులు, రోమశుడు,
ఇంద్రజిహ్వుడును, హితుడు వజ్ర జి
హ్వుడు, మత్తుడు, యుద్ధోన్మత్తుడు, హ
స్తిముఖుడున్న నిలయములను కాంచెను.

26

చూచెను పిమ్మట, శోణితాశుడు, క
రాళ, పిశాచ, దురాసదులున్న వి
శాల నికేతన శాలాగృహముల
నొకటి వెనుక వేఱొకటి  అరసె హరి.

27

ఎచ్చట చూచిన నచ్చట, సర్వ స
మృద్ధములయి అభివృద్ధి కిరవులయి,
భోగభాగ్య సంపూర్ణంబులుగా
కానబడెను లంకాభవనంబులు.

28

రూపురేఖల, నిరూఢవిభవముల,
సాటిలేని రాక్షసుల శుభ నికే
తనము లన్నిటిని దాటి, హనుమ స
మీపించెను లంకాపతి హర్మ్యము.

29-30

అచట రావణుని అంతికమందున
శూలముద్గర కరాళహస్తులను
వీక్షించెను వికృతేక్షణలను కపి;
వివిధ శిబిరముల విడిసెను సేనలు.

31

వివిధాయుధముల వీగు మహోకా
యుల రాక్షసయోధుల నొక్కెడ, ఎ
ఱ్ఱని తెల్లని పచ్చని వన్నెల యే
నుగుల నొక్కెడ గనుంగొనె మారుతి.

32

కులమును రూపును వెలయబుట్టి, శి
క్షణములన్ నలగి గడితేఱి, రణం
బుల పరగజముల పొడిచి తరుము ఐ
రావతమున్ బలె రావణు గజములు.

33

క్రమ్మగ్రమ్మరించు మేఘమ్ముల మాదిరి,
సెలయే ఝ్ఝరలి పొరలు కొండలవలె,
రణముఖముల మార్మ్రసలి కసిమసగి
తాండవించు మాతంగ వ్యూహము.

34

బలసాహస కౌశల చిహ్నములుగ
కనకపతకములు గైకొన్న దనుజ
వాహినీ పతులు వందలు వేలును
పొడకట్టిరి కపిపుంగవున కచట.

35

పసిడి జరీదుప్పట్లను కప్పిన
వన్నెల చిన్నెల పల్లకీలు చూ
పట్టెను హనుమకు, బాలసూర్య మం
డలముల చక్కదనాలు వెలార్చుచు.

36

లేత తీగె లల్లిన పొదరిండ్లును,
చిత్తరువులు రంజిలు చావళ్ళును,
చూడ చక్కనగు క్రీడాగృహములు
మ్రానికలపతో మలచిన నగములు.

37

పాన్పు లమర్చిన పడకటిండ్లు, అభి
రామములయిన విరామసదనములు,
రాక్షసేశ్వరుని రాణివాసమున
కండ్లపండువుగ కాంచె మహాకపి.

38

నెమలి గుంపులకు నృత్తశాల యగు
మందర పర్వత మకుట తలము వలె,
జెండాలాడెడి శిఖరంబులతో
ఇంపగు రావణు గృహము నరసె హరి.

39

బహురత్నములకు పట్టుకొమ్మలైయై,
నిధి నిధానముల నిక్షేపంబయి,
శిల్పసుసిద్ధికి సీమాంతంబయి,
ధనపతిధామంబును మఱపించెను.

40

రత్నాంగణముల ప్రజ్వల దీప్తులు,
రావణేశ్వరుని రాజసతేజము
కలసి పిక్కటిల కనబడె సౌధము,
రక్త కిరణముల రాజిలు రవివలె.

41

తీరు తీరు బంగారు మంచములు,
ఆస్తరణములు, సుఖాసనములు, తెలి
పట్టు జరీదుప్పట్లు పానుపులు,
పరిశుభ్రములగు పాన పాత్రములు.

42

మధువున తడిసిన మణిమణికంబులు,
వేలువేలుగా తీరిచియున్న కు
బేరుని భవనము మీఱి మెఱసె రా
క్షస రాజేశ్వరు శయనాగారము.

43

అందకత్తియల అందెల సందడి,
మొలనూళ్ల నొరయు మువ్వల రవళిక,
తతమృదంగ వాద్యమ్ముల ఘోషము
మంగళోత్సవ సమంబుగ నుండెను.

44

లలనారత్నకలాపముతో కళ
కళలాడెడి మంగళముఖాంగణము,
లంతంత మనోహరముగ నొప్పెడి,
శోభన గృహమును చొచ్చె మహాకపి.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౩

1

వైడూర్యమణుల వరుసలు పొదివిన
మేలి పసిడి కిటికీల మేడలను,
చూచె హనుమ పక్షులు తారాడగ
మెఱుపులు మెరిగొను మేఘమాల వలె.

2

శంఖశాలలును, చంద్రశాలలును,
చాపాయుధ కోశంబుల శాలలు,
గిరి శిఖర మనోహరశాలలు, వివి
ధ విశాల వినోద ప్రియశాలలు.

3

అన్నియు హేమమయంబులై మెఱయ,
దేవాసురు లర్థిని పూజింపగ,
దోసము లంటక దోర్బలార్జితము
లయిన రావణు గృహంబులు కనె హరి.

4

సకల సులక్షణ సంపూర్ణంబయి,
సర్వోత్తమముగ ఉర్విలో వెలయ,
దేవశిల్పి యత్నించి స్వయముగా
తీరిచి కట్టిన దివ్యభవన మది.

5

మేఘము మాదిరి మిక్కిలి యెత్తుగ
పుత్తడి బొమ్మనుబోలి, రావణే
శ్వరుని బలమునకు ప్రతిబింబంబగు
స్వీయ సౌధమీక్షించె మహాకపి.

6

లచ్చి నిల్చిన కళాభవనంబయి,
పువ్వులచెట్లకు పుట్టిల్లయి పు
ప్పొడి నిండిన గిరిపోలి భూతల
స్వర్గమగుచు అది భాసిలుచుండెను.

7

మెఱుపులు చిమ్మెడి మేఘమువలె నా
రీ భూషలతో శోభిల్లుచు, హం
సములు మోయ నర్హమయి విలసిలెను,
అతి సుకృతార్జిత మయిన 'విమానము.'

8

ఎగయు ధాతువుల నగచిత్రమువలె,
గగన చందిరగ్రహ చిత్రమువలె,
సమకూర్చిన మేఘము చిత్రమువలె
కానవచ్చెను విమానరత్న మట.

9

భూములు భూధరములతో నిండగ,
భూధరములు తరువులతో నిండగ,
తరులు విరుల పూతలతో నిండగ,
పువ్వులు కేసరములతో నిండెను.

10

పున్నమ సున్నము పూసిన మేడలు,
పువ్వులు విచ్చిన పూర్ణ సరస్సులు,
కేసరములతో కెరలు పద్మములు
ధన్యము లావ నధామచిత్రములు.

11
వాసికెక్కి 'పుష్పక'మను పేరిట,
నవరత్నప్రభ లవఘళింప, లం
కా సౌధంబుల కన్న ఉన్నతం
బయిన 'విమానము' నారసె మారుతి.

12
వైడూర్యంబుల వన్నెల పులుగులు,
వెండి పగడములు పెనచిన పులుగులు,
చిత్ర కాంతులను చెలగు భుజగములు,
జయ చిహ్నంబుల జాతి తురగములు.

13
బంగరు రంగుల పగడపు వన్నెల
ఱెక్కలల్లి సవరించుచు లీలగ,
వంచి ముక్కులను పంచాస్త్రుని పం
పునవలె గుమికొను పులుగుల జంటలు.

14
చెదరని ఱేకుల చెంగల్వలు తొం
డముల నున్న దంతావళముల; హ
స్తముల పద్మములు తాల్చియున్న ల
క్ష్మీ విగ్రహములు చెక్కిరి శిల్పులు.

15
చలికాలము కడచన సుగంధములు
నిండిన లోయల కొండవలె, మనో
హరమగు రావణు నంతిపురంబును
చొచ్చి చూచి కడు చోద్యమందె కపి.

16
ఆరాధింపగ నసురులు, రావణు
డేలెడి లంకను గాలించి వెతకి,
పతి గుణనిష్ఠకు బలియై వెతపడు
సీతను కానక చింతలో మునిగె.

17

అంత, హనుమ, సుకృతాత్ముడు, సత్పథ
చరిత్రు, డవేక్షాచక్షు, డంతటను
తిరిగి తిరిగి మైథిలిని, సుపత్నిను,
కనుగొనజాలక కటకటపడె మది.

20-12-1966

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౮

1

ఆ భవనము మధ్యను చూచెను హరి
రత్నంబులు దొరలుగా చెక్కిన
కనకపు కిటికీ కమ్ముల పట్టెల
సంస్థానము పుష్పక విమానమును.

2

గగనమున కెగసి, గాలిలో నిలిచి,
సూర్యమార్గమున శుభ చిహ్నముగా
వెలయజాలునది; విశ్వకర్మ స్వయ
ముగ నిర్మించె నపూర్వప్రతిమల.

3

పనివడి సాధింపనిది లేదెదియు,
తచ్చుజాతి రత్నాలు లేవచట
సురలకు సైతము దొరకని మణులవి,
మంచిది కానిది యించుక లేదట.

4

బలమున తపమున పడసిన యర్థము,
మనసు వచ్చిన ట్లనుగమించు సఖి,
బహువిశేషరూపముల కలాపము,
సురకులముల కాపురమువంటి దది.

5

ప్రభువు మన సెఱిగి పఱచు వాహనము,
అనిలజవమున నిరంకుశముగ చను,
పుణ్యులు, మహాత్ములు, యశస్కులగు
అమృతాంధసులకు అభిజనాలయము.

6

ఉత్తమముల నత్యుత్తమాఢ్యమై
అందంబుల చక్కందనమై, శర
దిందు విమలమై, ఇంపితమై, బహు
శిఖర మకుటముల శిఖరివంటి దది.

7

కుండలధారులు, తిండిపోతులు, ని
శాచరు, లాకాశచరులు, వంకర
కన్నులు త్రిప్పుచు కావడింతురు, మ
హౌజనులు శతసహస్రము లర్థిని.

8

మధుమాసకుసుమ మాంగల్యంబయి,
నవవసంత వైభవమును మించి, ని
తాంతశోభనపదమగు, పుష్పక ల
లామవిమానము లక్షించెను కపి.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౯

1

ఆ రాజాయతనాభ్యంతరమున్న
చూచెను మారుతసూతి, మహాకపి,
పొడవును వెడలుపు పొందిపొసగి, సువి
శాలమయిన శయనాలయరాజము.

2

సగ మామడ విస్తారంబయి, ఒక
యామడ పొడవున ఆయత్తంబయి,
రాక్షసేశ్వరుని ప్రాసాదము బహు
భవనంబులతో భాసిలుచుండెను.

3

అరికులాంతకుడు హనుమంతుం డా
సుందర సౌధముచుట్టి తిరిగె, సీ
తను దీర్ఘాపాంగను, శుభాంగనను
వెతకుచు జాగ్రదవేక్షమాణుడయి.

4

ఉత్తమరాక్షసులున్న ఉన్నత ని
వాస భవనముల వరుసలఁ గడచి,
హనుమ సమీపించెను రాక్షస రా
జన్యుడు రావణు శయనసదనమును.

5

మూడు దంతముల పోతుటేనుగులు,
నాలుగు కొమ్ముల నాగేంద్రంబులు,
మంద మందముగ మసలుచుండ, సా
యుధులై కావలి యుండిరి దైత్యులు.

6

దశకంఠుని సౌధంబున నుండిరి
పెండ్లియాడిన యువిదలును, బాహు ప
రాక్రమమున పరరాజన్యుల ని
ర్జించి అపహరించిన కన్యకలును.

7

మీన తిమింగిల మిళితాకులమై,
నక్రమకరమగ్న గభీరంబయి,
వాయు ధూతమయి, పన్నగభరమై,
రత్నాకరము కరణిని క్రాలునది.

8

ఘనపతియగు ఇంద్రుని యైశ్వర్యము,
ధనదుడగు కుబేరుని సౌభాగ్యము,
అన్నియు సుస్థిరమై నిలకడగొనె
రావణు నింట సురక్షితంబులుగ.

9

యమ వరుణ కుబేరాది దిక్పతుల
ఇష్టకామిత సమృద్ధి సర్వమును
అథవా! అంతకు నతిశయముగ దశ
కంఠుని గృహమున కాపురముండెను.

10

ఆ ప్రాసాదము అంతరముందున,
యోధ జనము సాయుధులై తిరుగ,
మిగుల మోహనంబుగ నిర్మించిన
రాణివాసముల శ్రేణిని చూచెను.

11

స్వర్గలోకమున బ్రహ్మకోసమయి
విశ్వకర్మ భావించి కట్టె నది,
పుష్పక నామంబున విలసిల్లును
నానారత్న వితాన ధామమయి.

12

పరమ తపస్యా పరిపాకముగా
మునుపు కుబేరుడు పొందె బ్రహ్మకృప,
రావణేశ్వరుడు రాజరాజును జ
యించి, తా నపహరించెను దానిని

13

అచ్చపు వెండిని పచ్చని పసిడిని
కరిగిపోసిన సొగసు నిలువులతో,
తోడేళుల మూర్తులతో, దిగ్భ్రమ
లావహించు నా దేవ విమానము.

14

వరుసగదుల, శోభనగృహముల, మి
న్నంటుచున్న పైపై యంతస్తులతో,
మందరగిరివలె మహితోన్నతమయి,
రంజిలునది అపరంజి కొండవలె.

15

విశ్వకర్మ ఒప్పిదముగ కట్టెను,
అర్కాగ్నిచ్ఛాయలు విలసిల్లగ,
బంగారపు సోపానవేదికలు,
సుందరంబుగా శోభిలుచుండెను.

16

కనకంబున స్ఫటికములు ఖచించిన
చక్కని కిటికీ చట్టము లొప్పును;
నీలములు మహానీలంబులును పొ
దిగిరి తీరుతీరుగ వేదికలను.

17
ఆ విమానమున కడుగుభాగమున
పండు పగడములు పఱచి బిగించిరి,
మంచి ముత్యములనెంచి పోహణిం
చిరి సౌందర్యము చిందులు త్రొక్కఁగ.

18
రక్తగంధధారల నెఱుపుమిగిలి,
పసిడి పసిమి మిసలెసగ, పుణ్యగం
ధ పరిపూర్ణమై, తరుణారుణమం
డలిబోని విమానము నెక్కెను కపి.

19
అచట గుబాళించుచు వలగొను మధు
పాన భక్ష్యముల పరిమళము లెగసి
రూపెత్తిన గతి వ్యాపింపగ, ఆ
ఘ్రాణించెను కపిరాజామాత్యుడు.

20
ఆ గంధానిల మనిల తనూజుని
రావణుచెంతకు రమ్మని రమ్మనుచు
ఆమతించున ట్లాయెను; చుట్టము
చుట్టంబును పిలుచు విధాయకమున.

21
అపుడు హనుమ కడు నచ్చెరువందుచు
అవలనడచి, అట నరసె మనఃప్రియ
కాంతవోలె కళకళలాడు దశ
గ్రీవు మనోహర కేళీశాలను.

22
మణుల పలకల నమర్చిన మెట్లును,
కనకముతో మలచిన గవాక్షములు,
దంతస్ఫాటిక ధౌతకాంతులను
అడుగు చుట్టిమింపార నచ్చముగ.

23
మంచి ముత్యముల మాలలు, పచ్చి ప
గడముల గుత్తులు, కలిసిమెలిసి జీ
రాడగ, వెండియు పైడియుకలిపిన
నిలువు కంబము లనేకము లగపడె.

24
హెచ్చులు తగ్గులు నించుక లేక, మ
హోన్నతములుగా ఒప్పుచున్న, ఆ
కంబంబులు బంగరు రెక్కలతో
అగపడె మింటికి ఎగయ నున్నటుల.

25
రావణు రాజసభావరణంబున
రత్నకంబళి పఱచి, రది; పృథివీ
లక్షణాంకితములగు రాష్ట్ర గృహం
బుల గుర్తులతో పొలిచె భూమివలె.

26
బలిసిన పక్షులు పిలపిలనాడగ,
దివ్యగంధముల తియ్యము సుడియగ,
మంచిరత్నకంబళ్ళతోడ రా
వణుడున్న శుభాంగణ మింపెసగెను.

27
అగరు ధూపములు ఎగువకెగయ, కల
హంసల చాయల నమల ధవళమై,
పూజించిన పూవులతో నగపడె
కామధేను పట కన్న లేగ లన.

28
మనసోత్సాహము నినుమడించుచు, ప్ర
సన్న వర్ణముల కన్నుల తనుపుచు,
శోకతాప మార్చుచు, సమకూర్చును
సిరిసంపదలను శ్రీదేవతవలె.

29

స్పర్శరూప రస శబ్ద సంగతుల
త్వక్చతు శ్రోత్ర రసనాదులను
తనియించెను హనుమను తల్లిపగిది;
రావణేశ్వరుని రాజాయతనము.

30

స్వర్గంబో ! ఇది బ్రహ్మలోకమో !
ఇంద్రు నగరమో ! ఏ పరమపదమొ !
కావలె నంచును భావించెను కపి
దశకంఠుని సౌధము పరికించుచు.

31

నిశ్చలముగ ధ్యానించుచున్నటుల
కదలకున్న బంగారు దీపములు,
ఓడిన జూదరు లొడుదుడుకు లుడిగి
నిలబడియున్నట్టుల చూపట్టెను.

32

దీపంబుల దోషాపహదీధితి,
రావణు భుజబలరాజసతేజము,
యువతుల నగల సముజ్జ్వలకాంతులు
జడిగొని జ్వాలల జాడ పైకెగసె.

33

చిత్రవర్ణముల చీరలు, రవికలు,
సొమ్ములు, పలువేసమ్ములు దాలిచి,
కళుకు పట్టుజముకాణముల సుఖా
సీనలయిరి యోషిత లంతరువుల.

34

ఆ దనుజాంగన లర్ధరాత్రి దా
కభిరతిలీలల నాడికూడి, వగ
లోపగజాలక తీపిత్రాగి, ఒడ
లెఱుగక పవళించిరి నిద్దురతమి.

35
మగువలు నిదురింపగ వారల భూ
షణముల గలగల యణగి కనబడిరి,
హంసల అలజడి, అళికులముల రొద,
విడుపుగొన్న అరవింద వనమువలె.

36
వాతెఱకప్పిన పలువరుసలతో,
వాలిన కనుఱెప్పలతో, నిద్దుర
బోవు మెలంతల మోములుగనె కపి
మొగిడిన తామరపువ్వుల పోడిమి.

37
రేయిజాఱ రమణీయముగా వి
చ్చిన పద్మంబులు, చీకటిపడగా
క్రమ్మఱ ముఖరేఖలను ముడుచుకొను
భంగినుండి రా పద్మదళాక్షులు.

38
వారల ముఖబింబంబులు పూచిన
పద్మము లనుకొని భ్రమసి మోహమున
మత్తమధుపములు మఱలమఱల ప్ర
దక్షిణించును వదల కపేక్షమెయి.

39
ఆ ప్రియదృశ్యము నరసి మహాకపి,
మేధావి, యిటుల మీమాంసించెను;
గుణవాసనలను ప్రణుతికెక్కె ప
ద్మము, లయ్యవి పంకమున పుట్టినను.

40
ఆ కాంతలతో అందముగ ప్రకా
శించె రావణుని శ్రీసదనము, శా
రదరాత్రుల తారామాలలతో
రాజిల్లు నభోరంగము భంగిని.

41

అసురకామినీ విసరము గిరికొన
రంజిలుచుండెను రాక్షసనాథుడు,
చక్కని చుక్కలు సరస చుట్టుకొన
భ్రాజమానుడగు రాకాశశివలె.

42

అనుభవింప మిగిలిన పుణ్యంబున
తారలు విష్ణుపదంబునుండి దిగి,
పుణ్యజనస్త్రీ భూషణంబులుగ
పుట్టిరంచు తలపోసెను మారుతి.

43

అచ్చట నున్న శుభాంగనలకు ప్రా
ప్తించెను, దివమున వెలుగు తారలకు
వలె, అక్షయలావణ్య ప్రభలును,
లలితప్రియమంగళ శుచిరుచులును.

44

ఊడిన కొప్పులు, వీడిన పూదం
డలు, చిక్కుపడిన నగలతోడ, వా
రందఱు, క్రీడల నలసి, మధువుగొని,
మతిపోయి, నిదురమబ్బుల తూగిరి.

45

తిరుగబడిన అందెలతో కొందఱు,
కరగి దిగిన తిలకంబుల కొందఱు,
హారంబులు పెడజాఱిన కొందఱు,
ప్రమదలాలసావశలై కొందఱు.

46

పెరిగిన ముత్తెపు సరములతో, జా
ఱిన వలువలతో, తునిగి పెనగు మొల
నూళ్ళతో, అట కనుపడిరి కొందఱు,
పడి పొర్లాడిన ఖాలహాయము లన.

47

రవ్వల కమ్మలు జూపుల మెఱయగ,
నలిగి తెగిన పువ్వుల గుత్తులతో
అగపడి, రేన్గులు పెగలిచి పడత్రొ
క్కిన పువ్వుల తీగెలవలె కొందఱు.

48

చందమామ హస్తాలవంటి ము
త్యాల సరులు కొందఱు ధరించి, రవి
పాలిండ్లనడుమ పవ్వళించి ని
ద్రించు హంసపుత్రిక లట్లగపడె.

49

ఉబలలి వైడూర్య సరంబు లమరె
అక్కున హత్తిన హంసలరూపున,
కంఠంబుల బంగారపు గొలుసులు
చక్రవాకముల చాళ్లవలె నెగడె.

50

కన్నెలేళ్ళు, జక్కవలు, హంసములు
ఈదుచున్న సెలయేళ్ళవోలె నుం
డిరి మదవతులు, కటీతటములు నిం
పెసలారె మెఱుగుటినుక తిన్నెలుగ.

51

బుగ్గలుగా చిఱుమువ్వలు గజ్జెలు,
మొగములుగా పరిఫుల్ల కమలములు,
కామభావములు కటికి మొసళ్లుగ
నదు లట్లుండిరి నిదురను నెలతలు.

52

మెలకల మెత్తని మేనులకు నగల
రాపిడిచే చాఱలుపడె కొందఱి,
కవి, కుచాగ్రములయందు శోభిలెను
పెట్టని సొమ్ముల యట్టు లందముగ.

53

కొందఱు లలితాంగులు ధరియించిన
జిలుగు చీర చెంగులు నిట్టూర్పుల
చాలితంబులయి సారెసారెకును
చిందులు త్రొక్కను సుందరాస్యముల.

54

అట్టులెగయు చేలాంచలములు, వర
వర్ణినులగు రావణు ప్రియాంగనల
మంగళ ముఖముల ముంగల మెఱసెను,
చిత్రపతాకల సిగల చందమున.

55

మఱికొందఱు కొమ్మలు ధరించిన క
ఢాని రత్నకుండలములు నిట్టూ
ర్పులకు కదలి అలవో కల్లసాలస
ముగ నూగెను సోయగ మెగపోయుచు.

56

మధుశర్కర పరిమళమిళితంబయి,
సహజ సౌరభస్యందంబగు, ప్రియ
కామినీముఖసుగంధమారుతము
సేవించె దశగ్రీవుడు ప్రియముగ.

57

ఆపరాని మోహాతిరేకమున
యువతులు కొందఱు సవతుల మొగములు
వాసన చూచిరి వాలాయముగా,
రావణు ముఖమని భ్రమపడి మఱిమఱి.

58

అత్యంతము కామాసక్తలయిన
రావణు సఖులు పరాధీనలగుచు,
సవతి మచ్చరము జాఱిపోవ ము
ద్దాడి, వారికి ప్రియంబునె సలిపిరి.

59

పసిడి కడియములు మిసమిస మెఱయగ,
లలిత బాహువులు తలాపిగా మడిచి,
జిలుగు చేతములు సెజ్జలుగా, శయ
నించిరి కొందఱు చంచలేక్షణలు.

60

సూత్రము గ్రుచ్చిన చొప్పున చేతులు
చేతులు కూర్చిన స్త్రీ జనమాలిక,
అళికులములవలె అలకలు ముసురగ,
పుష్పమాలికను బోలి శోభిలెను.

61

మదనస్నేహ నిమగ్నలై, నెలత
లొకరినొకరు కౌతుకము పైకొనగ,
తొడలను గిల్లుచు, దువ్వుచు ప్రక్కలు,
పిరుదులు నిమురుచు, పింపిళ్లాడిరి.

62

సన్నని నడుముల చానలు కొందఱు
అన్యోన్యము నంగాంగ స్పర్శల,
ప్రీతి పొలయ నిదురించి రొండొరులు
గొలుసుకట్టుగా కలపి కరంబులు.

63

ఒకతె వక్షమున నొక్కతె యొరగిన
దాని బుజంబులు తట్టె నింకొకతె,
ఒకతె అంకమున నొకతె యొత్తిగిల
దాని బాహులను తట్టె నింకొకతె.

64

మధుమాసమున సమస్తలయినటుల
పూచిన తీగెలు వీచిన గాలికి
పొదులు కదలగ బోదియలు పెకలి
ఒకదానిపయి మఱొకటి వాలిపడె.

65

తల్లక్రిందుగ మొదళ్ళు పెకల, అ
న్యోన్య భ్రమరకులాకులమయి వా
లిన పూదోటవలెః చూపట్టెను;
రావణు రమణీరాజోద్యానము.

66

ఆ మెలతల మెఱుగారు మేనులను
కట్టిన చీరెలు, పెట్టిన సొమ్ములు,
చుట్టిన మాలలు నట్టె యుండినను,
ఏవి యెవరివో యేర్పడకుండెను.

67

సుఖనిద్రను దశముఖుడుండ, అతని
మెఱుగు బోణు లనిమిషలై, ప్రియముగ
నిలబడి చూచిరి వెలుగుచున్న బం
గారు దీపకళికల చందంబున.

68

గంధర్వుల లోకమున, అదితి అ
న్వయమున, పితృదేవతల యింట, రా
జ ఋషుల గృహముల, జనియించిన క
న్యకలు కామవశలై రసురపతికి.

69

రణ జిగీషువగు రావణు డని మొన
గెలిచి తెచ్చె కన్యలను కొందఱిని,
మదన మోహమున మదవతు లెందఱొ
వచ్చిరి, ఆతని వలచి మరులుగొని.

70

ఆ ప్రమదామణులందు, బలాత్కృత
లయినవారు, పరులపయి మనసయిన
వారు, మగలు కలవారు లే రెవరు;
వైదేహియె అపవాద మందఱను.

71

మంచి కులమున జనించని వారలు
చక్కదనంబున తక్కువవారలు,
సరస సరాగము లెఱుగని వారలు,
కామించ తగని లేమలు లేరట.

72

అనుచు చింతిలెను హనుమ మఱల నిటు,
రాముని పత్నియు రావణు భార్యల
వలె సుఖించు నట్టులు వర్తించిన,
ఈతని జన్మము పూతమై వెలయు.

73

బుద్ధిశాలి తలపోసె మఱల హరి,
సీత విశిష్టగుణపూత ధ్రువము, లం
కేశుడు సుకృత మహితు, డటు లయ్యును,
ఆర్యపట్ల ఖలుడాయెను హతవిధి.



# సుందరకాండ

## సర్గ ౧౦

1

అంత, నా మహాయతనమందు కపి
అల్లనల్ల కలయన్ పరికించుచు
చూచె నొక్కయెడ సుందరరత్న
స్ఫటికమయంబగు శయనాసనమును.

2

పసిడిపట్టెలును, వైడూర్యమణి
స్థగితాసనములు, దంతపు కోళ్లను
వెలకందని పాన్పులును, దిండ్లు, దు
ప్పట్లు నందు శోభనముగ నుండెను.

3

ఆ పర్యంకము దాపున పూదం
డలు వ్రేలగ, వెన్నెలలను చిమ్మెచు
పున్నమచంద్రుని బోలిన భూరి
చ్ఛత్రం బగపడె నేత్రోత్సవముగ.

4

చిత్రభానురోచిస్సు లోలయ, బం
గారపు పసిమి నిగారముల్ పొలయ,
లల దశోకపల్లవ తోరణముల
మెఱయుచుండె నా మేలిమి మంచము.

5

పరిమళంబులు గుబాళించ, వివిధ
ధూపగంధములు పైపయి సుడియగ,
వింజామరములు విసరుచునుండిరి,
రాజముఖులు రవగాజులు మొరయగ.

6

నునుపారగ ఊనిన మెత్తని పా
ట్టలు చర్మములు వాలుగ పఱచిరి,
కైసేసిరి నానాసుగంధ బం
ధుర సుమమాలలతోడ నంతటను.

7

ఆ పానుపున మహాబాహువు, తె
ల్లని వస్త్రము, లెట్టనికన్నులు, ను
జ్జ్వల కుండలములు విలసిల నుండెను.
నిగనిగలాడెడి నీరదంబువలె.

8

శ్రీగంధంబు పరిమళించ, నవ
రక్తచందనము రంజిల మేనున,
వఱలె రావణుడు మెఱుపుల మేఘము
సంధ్యాంబర మాసాదించినగతి.

9

అందమయిన అసురాధిపు రూపము
ఆభరణోజ్జ్వలమై భాసిల్లెను,
కుసుమ నికుంజ విలసితంబై నిదు
రించు మందరగిరి ప్రతిమంబలె.

10

కామరూపి, రాక్షసకుల కన్యా
కామినుడు, మణికనకాభరణా
లంకృతుండు రేలంతయును రతో
పరత క్రీడల పొరలి బడలికల.

11

తనివితీరగా త్రాగి, కామ శీ
లాలోలుడయి, అలసత సొలసి, విర
మించి, శయించగ మేలిమిసెజ్జను,
వీక్షించెను కపివీరుడు రావణు.

12

బుసలుకొట్టు గిరిభుజగమువలె, ప్రభ
లెగయు పాన్పున శయించియున్న రా
క్షస నాథుని దగ్గరి, చెదరి, చకితు
డయినట్టుల వెనుకంజ యిడెను హరి.

13

వెంటనె, దరినొక వేదిక చాటున
నిలిచి మహాకపి తిలకించె తడవు,
బలిసిన బెబ్బులి భంగిని మాంసల
కాయుడయిన రాక్షసరాజేశ్వరు.

14

రాక్షసేంద్రుడు నిరాకులంబుగా
పవళించిన తల్పము తలపించెను,
మదగంధిలమగు మాతంగము ఆ
సాదించిన ప్రస్రవణగిరింబలె.

15

బంగరు మువ్వల బాజుబందులు ని
గారించగ, ఇరుగడలను చాచిన
రావణేశ్వరుని రాజ బాహువులు
దర్శించెను ఇంద్రధ్వజముల వలె.

16

కనబడె నచ్చట కాయలుకాచి సు
దర్శన చక్రవిదారణములు, వ
జ్రాయుధ మడచిన గాయము, లైరా
వత, మని పొడిచిన వాతలు నిగనిగ.

17

మలచినట్లుల సమముగ బలిసిన
భుజములు, చక్కని బొటనవ్రేళ్ళు, నఖ
ములు, నఱచేతులు, పుణ్య సులక్షణ
చిహ్నములయి భాసిలె నదోషముగ.

18

ఇనుప గుదియలకు ఎనయై, యేనుగు
వాలుతొండములబోలి, పాన్పుపై
చాచియున్న హస్తమ్ములు తోచెను,
అయిదుతలల కాలాహిరూపమున,

19

పునుగుపిల్లి చల్లని మదంబుతో
కలిపి, అపూర్వ సుగంధచూర్ణములు
నూఱిన లేపము లాఱగపూసిన,
సాలంకృతమగు హస్తము లొప్పెను.

20

ఉత్తమకాంతలు మెత్తగ నూఱగ
పరిమళమెత్తిన పచ్చిగంధములు
అలదిన రావణుహస్తము, ఉరగుల
సురగంధర్వుల వెఱ నేడ్పించెను.

21

పసిడిమంచమున పట్టుపఱుపుపయి
చాచియున్న రాక్షసపతి భుజములు,
మందరపర్వత కందరమున పగ
బట్టి తూగు పెనుబాములపోలెను.

22

చియ్యబట్టి పిచ్చిల లావణ్యము
తొణకు హస్తములతో దశకంఠుడు
నిస్తుల విశ్రాంతిని కనుపించెను;
జంట శిఖరముల శైలము చాడ్పున.

23

మామిడిపండ్ల సుమాళము, పున్నా
గ సుగంధంబు, పొగడపూలవలపు,
మధుపాయస పరిమళము లేకమయి
గుప్పించె దశముఖుని ముఖంబుల.

24

మెత్తని సెజ్జను మేనువాల్చి ని
ద్రించుచున్న రాత్రించర నాథుని
నిట్టూర్పులతో నిగిడి సువాసన
లాముకొనెను నిండార సౌధమున.

25

మణులును, ముక్తామణులును పొదిగిన
హేమకిరీట మొకయింత ఓరగా
జాఱ, కుండలోజ్జ్వలమగు రావణు
నెమ్మొగంబు రమణించె నందముగ.

26

అరుణచందనము నలది, ముత్యముల
దండలతో ధగధగలాడుచు, రా
క్షసవల్లభు వక్షస్తలంబు శో
భిల్లుచు నుండెను పీనాయతమై.

27

కనుల రక్త రేఖలు మెఱుగారగ,
కాసెబోసి కైసేసి బిగించిన
పసుపు పట్టుదోవతితో, తెల్లని
ఒల్లెవాటుతో నొప్పె రావణుడు.

28

చల్లని గంగాసైకత తటమున
పవళించిన గజవల్లభు కైవడి,
బుసలుకొట్టు పామువలె, నుండె దను
జేశుడు; మినుముల రాశినిపోలుచు.

29

నాల్గువైపులను వెల్గుచుండ, అప
రంజి సెమ్మెలను రత్నదీపములు,
దనుజేశ్వరు దొప్పెను, క్రొమ్మెఱుగులు
నివ్వాళించెడి నీలిమబ్బువలె.

30

దారాప్రియుడగు దశకంఠుడు మన
సోత్సాహముతో నుండగ, ఆతని
పాదమూలముల బడి సేవించుచు
బింబాధర లగుపించిరి కొందఱు.

31

చంద్రుని బోని ప్రసన్న శుభాస్యలు,
రవ్వలకమ్మల పువ్వుంబోణులు,
నలగని విరిదండల యలివేణులు
కొందఱు కనబడి రందు మారుతికి.

32

నృత్తవాద్యముల నేర్పుక త్తెలుం
డిరి దశముఖు నంతికమున కొందఱు,
కట్టిన కోకలు పెట్టిన సొమ్ములు
పళపళమన కనబడిరిక కొందఱు.

33

వైడూర్యములు రువాణించ నడుమ
మేలి వజ్రములిమిడ్చి బిగించిన
కమ్మలూగ, బంగారు సందిదం
డలు తాల్చిరి కొందఱు నెఱజాణలు.

34

వదన చంద్రబింబంబులతో, రవ
మెఱుగుల కర్ణాభరణంబులతో,
పడకటిల్లు విభ్రాజితమాయెను;
తారలు మెఱయు నభోరంగమువలె.

35

త్రాగి మత్తిలి సరాగక్రీడల
వసివాడిన రావణుని కామినులు
ఓపిక లెడలగ ఒండొరు లొరయుచు
సందుదొరక అందందు శయించిరి.

36

అవయవముల సౌష్ఠవ సౌందర్యము
లత్తుకొన్న ఒక ఆటకత్తె, అభి
నయభంగీ విన్యాసము తీర్చుచు
ఉన్నదున్నటులె ఒరిగి శయించెను.

37

ఒకతె తన విపంచిక కౌగిటనిడి
నిద్దురపోయెను; సిందువరదలో
కదలిన తామరకాడ తగులుకొని
పడవపొత్తు నెడబాయని భంగిని.

38

కాటుక కన్నుల కలికి యొకర్తుక,
వాయించిన తన వాద్య మడ్డుకము,
పజ్జనుంచుకొని పవళించెను; పసి
పాపను పాయని బాలెంతపగిది.

39

అఖిలాంగ మనోహారి ఒక సుస్తని
పీడించిన తప్పెట నెడబాయగ
లేక శయించెను; రాకరాక వ
చ్చిన ప్రియు నక్కున చిక్కబట్టుగతి.

40

కామేక్షణ యొక్కతె తన వేణువు
విడిచిపెట్టలే కొడినిపెట్టుకొని,
శయనించె, మనఃప్రియుని బట్టి కో
రిక తీర్చుకొను మురిపములు తోపగ.

41

నృత్తకుశల యొక మత్తకాశిని వి
పంచిని విడనోపక నిదురించెను,
కామించిన వల్లకానితో చనువు
తీయమింత యెడబాయలే నటుల.

42

మాంసలమై కోమలమగు మేను ని
గారింపగ, బంగారు వన్నె లొక
తీవబోణి మద్దెల వాయించుచు
పారవశ్యమున పవళించె నటులె.

43

సన్నని నడుము పిసాళించు మఱొక
క్షమపాలిక తన పార్శ్వతలంబున
పతమ్మృదంగ జంత్రము పడియుండగ,
తూగి శయించెను త్రాగిన మత్తున.

44

తన డిండిమవాద్యము విడనోపక
ప్రక్కకు నుంచుకొని పవళించె నొకతె;
తరుణవత్సమును తక్కనొత్తుకొని
నిదురపోయె తరుణీమణి మఱొకతె.

45

ఆడంబర వాద్యము నిరుకేలను
వాయించిన ఒక భామ సొమ్మసిలి,
మధువు త్రాగి కడుమత్తున నొత్తిలి,
ఒడలెఱుంగ కటు లొరగి శయించెను.

46

మదపతి యొక్కతె మద్యకుండికను
ఎత్తివైచి మధు వెగసి చిందిపడ,
పవ్వళించి కనబడె, వసంతమున
వడలినపువ్వుల దండ చందమున.

47

బంగరు కుండలవంటి స్తనములను
సుస్తిమితముగా హస్తతలం బల
నుంచి, పాన్పున శయించెనొకర్తుక;
నిద్రావేశము నిలుపగనోపక.

48

పూర్ణచంద్రముఖి ఫుల్లపద్మప
త్రాక్షి యొకతె మధువానిన మత్తున,
తోడి చెలియ పిరుదులు కౌగిటనిడి,
ఆదమఱచి తడయక నిదురించెను.

49

చెలువలు కొందఱు చిత్ర జంత్రములు
మురిపెముగా బొమ్మల నొత్తుకొనుచు
శయనించిరి సెజ్జలను; కామినీ
కాముకుల సరాగము లొప్పారగ.

50

వారలలో లావణ్యము చిమ్మెచు
హేమశయ్యపయి ఏకాంతమ్మెన
స్తిమితముగా నిద్రించుచున్న ఒక
రూపవతిని మారుతి లక్షించెను.

51

ఆణిముత్యముల హారంబులు, ర
త్నంబుల ఆభరణంబులు తాల్చి, ప్ర
సన్న దీప్తమగు సౌందర్యమున అ
లంకరించె గృహలక్ష్మి నా గరిత.

52

పసుపుపచ్చని సువర్ణచ్ఛాయల
సుందరి – ఆయమ మండోదరి – శు
ద్ధాంతఃపురనాయిక – రావణుని మ
నోభీష్టార్థము – శోభనరూపిణి.

53

రూపయౌవన సురుచిరప్రతిమను
ఆ మంగళముఖి నారసి మారుతి
తర్కించెను సీతాదేవియనుచు,
హర్షించెను కార్యము ఫలించెనని.

54

ఆపజాలని మహానందంబున,
ఆడించును, ముద్దాడును తోకను,
ఇగిలించును, దిగు' నెక్కు స్తంభంబులు
జాతి గుణవిశేషములు బయల్పడ.



# సుందరకాండ

## సర్గ ౧౧

1

తాను చూచినది జానకియను భా
వము విడిపోవగ, స్వస్థుడై హనుమ,
చింతించెను మది సీతార్థముగా
కాగల రాగల కార్య కలాపము.

2

రామ విరహదుర్దశలో జాకి,న
తినరా దిష్టమయినది, త్రాగకూ
డదు మధురసము, అలంకరణాదులు
పనికిరావుగద పరమవ్రతలకు.

3

సీత మహాసతి చేరగబో దా
దివిషత్పతియగు దేవేంద్రునయిన,
రామసములు కనరారెవ్వరు నిల
అనుచు తిరుగసాగెను మధు భూమిని.

4

పానభూమిలోపల జొరబడి, అట
కాంచె హనుమ చక్కని జవ్వనులను
ఆడిపాడి వసివాడిన భామల,
త్రాగి తేలగిలి తూగెడి లేమల.

?

బడలిరి కొందఱు పాడిపాడి, వసి
వాడిరి కొందఱు ఆడియాడి, సొగ
సిరి నాట్యము చేసి కొంద, ఱల
సిరి కొందరు మధుసేవనాభిరతి.

5

డోళ్ళమీద మద్దెళ్ళమీద, కం
బళ్ళమీద, చాపలమీద, అభీ
ష్టానుసార మాసీనలయిరి కొం
దఱు చిందరవందఱగా నెడనెడ.

6

రూపంబుల సల్లాపశీలముల,
చతురభాషణా సంగీతంబుల
నతిశయించు మదవతు లగపడి, రా
భరణంబుల ప్రభ లగ్గలించగా.

7

దేశకాలముల తీరుల కనువుగ
పలికి కులుకు మదవతులు కొందఱు ర
తోపరత్తులలో నోలలాడి, శయ
నించుచుండ కన్పించిరి హనుమకు.

8–9

మఱియొకవైపున మరునిబాళి సం
తాపించు వయోరూపవతుల, దర
హాసముతో పరిహాసమాడగల నెఱ
జాణ లగపడిరి రాణివాసమున.

10

ఆ లావణ్యవతీలలామముల
నట్టనడుమ శయనంబున రాజిలె,
అసురలోకనాయకుడు, గోష్ఠమున
ఆలమందలో ఆబోతుపగిది.

11

మసకొని దానవమత్తకాశినులు
ఆవరించిన దశాస్యుడు కనబడె,
అడవికిలోపల పడుచు శేనుగుల
మధ్యనున్న మదమాతంగమువలె.

12

సకల కామితములకు నట్టిల్లయి,
నిత్యోత్సవముల నిండిన, మోహన
పానభూమి చూపట్టె మారుతికి
దశకంఠుని సౌధమున నొక్కయెడ.

13

దున్న మాంసము, మృదుమృగామిషమును,
పందికూరయును పానభూమిలో
వేలువేలుగా తీరుతీరుల న
మర్చియుండ హనుమంతుడు చూచెను.

14

సగము భుజించగ సగము మిగిలిన నె
మిళ్ళ మాంసమును కోళ్ళకూరయును
ఓరలనుండగ తేటిచూచె బం
గారు కంచముల మారుతి అచ్చట.

15–16

పాకముచేసిన సూకర క్రకచ
మేషమాహిషామిషములు సగపా
లారగించిన ప్రియచకోరములును
పానభూమిలో కానబడె హరికి.

17

నంజగ మాగిన నవలేహ్యంబులు
త్రాగ తనివితీఅని పానకములు,
ఉప్పుపులుసు పాళ్ళొప్పగ ఎనపిన
షడ్రసమయభక్ష్యములు భోజ్యములు.

18

అందెలు గొలుసులు సంది దండలును
ఊడిపడి మెఱయ నొకట, మఱొక్కట
పండ్లుపోసి పుష్పసరంబులు చు
ట్టిన మధురసకుండిక లింపారెను.

19

ధగధగమని రత్నాల మంచములు
ప్రజ్వలింపగా పానభూమి దీ
పించెను, భగభగమంచు మండుచు
న్నట్టు లంతట అనగ్నిదగ్ధమయి.

20

చతురులయిన పాచకులువండి వా
సనకట్టిన మాంసములను విడివిడి
గా వడ్డించిరి కనకపాత్రలను,
పానభూమి శోభాయమానముగ.

21

ఇప్పపూలమద, మిశుక్షీరము,
పండ్ల రసము, పుష్పముల మరందము
కాచి తేర్చి వడకట్టిన మద్యము
దొంతల బానల తొణుకుచునుండెను.

22

పండ్ల నుండి, పుష్పములనుండి, ఇ
ప్పపువులనుండియు, పండిన చెఱకుల
నుండియు, చక్కెరనుండియు, ఆయు
త్తముచేసిన మద్యము లాసవములు.

?

తగిన సుగంధద్రవ్య చూర్ణములు
కలిపి సువాసన కట్ట మాగిన సు
రాభాండములను శోభనవీధుల,
వేలువేలుగా వీక్షించెను కపి.

23
తీరు తీరు బంగారు పళ్ళెములు
మంచి స్ఫటికములు మలచిన గిన్నెలు
చక్కని మేలిమి జారీచెంబులు
పానభూమి పొలుపార చూచె హరి.

24
వెండిబానల, పసిండి బిందెలను
రతనపు కడవల కుతికెల దాకను
నిండారి తొణకుచుండగ చూచెను
పానభూమిలో పవననందనుడు.

25
కాచి, దించి, వడకట్టిన చిక్కని
చెఱుకుపాలతో చేసిన శీధువు
మణి కలశంబుల, మంచి వెండి భాం
డముల, సువర్ణ ఘటంబులలో గనె.

26
సగమానిన ఆసవకలశంబులు,
పూర్తిగ త్రాగిన పూజెల ముంతలు,
ఏమియు త్రాగని హేమపాత్రికలు
పానభూమి నడవల పడియుండెను.

27
తిని వదలిన తీయని భక్ష్యంబులు,
త్రాగ మిగిలిన సురాభాగంబులు,
కొన్ని యెడల భుక్తాన్న శేషములు
పరికించుచునట తిరిగెను మారుతి.

28
పగులగొట్టి పడవైచిన ముంతలు,
ఉత్తవై దొరలుచున్న కుండికలు;
పండిన పండ్లును పచ్చిదుంపలును
పెట్టి, పూసరులుచుట్టిన పాత్రలు.

29-30

అందలి నెలతలు కొంద ఱొండొరుల
కవుగిలించుకొని రవశచిత్తలయి,
ఒకరి చీర నింకొకరు చుట్టుకొని,
కోకలు జాఱగ కూర్కిరి కొందఱు.

31

వారలు కట్టిన చీరల చెంగులు,
తాల్చిన పువ్వులదండ, ఊర్పులకు
అంతగా కదలియాడవు చిత్రము!
పయరగాలి పయిపయి సోకినటుల.

32

శ్రీగంధము వెదజిమ్మ చల్లదన,
మిఠుమద్యమున నెగయు సువాసన,
పూలమాలికల పొదలు పరిమళము,
దివ్యధూపముల తేలు సౌరభము.

33

అగ్గలించగా అన్ని గంధములు
గుచ్చియెత్తి సుడిగొని విసరెను, నా
నా సుగంధ సాంద్ర సమీరంబులు
పానభూమిలోపల్లను వెలపలను.

34

హరిచందనముల, చెఱుకుమద్యముల
పూలమాలల, అపూర్వధూపముల,
పిక్కటిల్లిన వివిధసువాసనల
దీటుకొనియె నట దివ్యవిమానము.

35

రావణు నంతిపురంబున నుండిరి,
కృష్ణవర్ణ భోగినులొక కొందఱు,
చామనచాయల చాలు కొందరు,
బంగారు పసిమిభామలు కొందరు.

36

నిదుర ముంచుకొన, మదను దలంచగ,
లేవలేక పవళించి కూర్కు పూ
బోణు లగపడిరి; ప్రొద్దుగ్రుంక ని
ద్రించుచున్న పద్మినుల చందమున.

37

అట్లు శోభిలెడి అంతఃపురమును
సాంతము వెతకిన సామీరికి జా
నకి జాడలు కానంబడవాయెను;
అంతమంది జవరాంద్ర కూటమున.

38

ఆ యేకాంత శయన సౌధంబున
ఒడలెఱుగక పడియున్న పడతుకల
చూచి చూచి ప్రాజ్ఞుడగు పావని,
ధర్మభీతి నాత్మను శంకించెను.

39

అవరోధంబున అలసి నిద్రలో
ఉన్న కాంతలను కన్నుల చూచుట,
పరమ పాతకము; జరిగిన దిచ్చట
ధర్మ లోపమని తలకెచింతతో.

40

కాదు కాదు ! నా కనులును చూపులు
పరదారలపయి పొరలలే దిచట,
పరులదారల నపహరించిన ఖలు
రావణుమీదనె రాకనిల్చినవి.

41

అట్లు వ్యాకులుండయిన మనస్వి, స
మీరసూతియు సమీక్షించెను భవి
తవ్యము; నేకాంతంబున చింతన
చేసె కార్యనిశ్చిత బుద్ధి నిటుల.

42

దశముఖు విశ్వ స్థలను సాంగముగ
దర్శించితి, నది తథ్యమే; అయినను
వికలము కాలే దొక యింతయు నా
మనసు, విషయకామప్రదీప్తమయి.

43

సర్వేంద్రియముల చలన చాలనకు
మానస మొకటె ప్రధాన కారణము,
నా మనసిచట అనాహతమయి, ఇం
చుకయు భ్రమింపదు సువ్యవస్థితిని.

44

స్త్రీల కూటమున స్త్రీని వెతకు టిల
ప్రాయికంబుగ విధాయక మెపుడును,
మఱియొక తావున మైథిలిని వెతకి
కనిపెట్టు టశక్యం, మది కానిపని.

45

ఏ జీవకులం బెచట వసించునొ
ఆ సజాతి నరయందగు నచటనె,
కానరాక యెడమైన లేమకయి
లేళ్లమంద గాలించిన నేమగు ?

46

పరిశుద్ధంబగు భావముతో ఈ
రావణు నంతిపురంబు సర్వమును,
వెతకితి, పరికించితి, గాలించితి
జాడచిక్కదే చాయను జానకి.

47

చూచితి పలువుర సుందరులగు గం
ధర్వకన్యకల, నాగకన్యకల,
దేవకన్యకల; దేవి జనకసుత
అడపొడ కనరాదాయె నుంతయును.

48

వెతుకవచ్చి రఘువీరకళత్రము
నామె కనబడక అన్యుల చూచుట,
కానికార్యమని పానభూమి వ
ర్జించి, హనుమ యోచింప మొదలిడెను.

49

అటుపిమ్మట సమయజ్ఞుడు పజ్ఞను
గడచినదానికి కళకళమందక,
వదలక దీక్ష, నుపక్రమించె ధృతి,
సీతాన్వేషణ, శ్రీమన్మారుతి.

15-1-1967

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౧౨

1

ఎలతీగెల పొదరిండ్లును, చిత్తరు
వులు మెఱసెడి శాలలును, పాన్పులు
న్న నిశాంతములను, తనిసన పరిశో
ధించె; లేదు మైథిలి అందెందును.

2

సీత కనబడక వాతాత్మజు డిటు
చింతించెను, నేనెంత వెతకినను
కానరాదు రాఘవుని కళత్రము,
జనకజ మరణించినదనుట ధ్రువము.

3

దురితకర్మ నిరతుండగు రావణు
ఇష్టకామితమ్ము నీసడించి, ధ
ర్మ ప్రవర్తనము మాననిసతిని, వ
ధించి యుండు వైదేహిని కసిమసి.

4

వక్రరూపముల బండ మొగంబుల,
తాటిచెట్లవలె తార్కొను రాక్షస
భూతములను గని, సీత రాజసుత
గుండె పగిలి పడియుండు తత్క్షణమె.

5

కాలము గడచెను కనిపెట్టగలే
నయితి, రామజాయను, సిద్ధింపక
పౌరుషము, హరీశ్వరు నెటు దరిసెద?
చండ శాసనుడు స్వామి! ఏమిగతి?

6

రావణు నంతిపురంబు చొచ్చితిని,
అచటి స్త్రీ జనము నంతయు చూచితి,
కనలేనయితిని గరితను సీతను,
గాలికి పోయెను కష్టమంతయును.

7

తిరిగిపోవ వానరవరు లందఱు
గ్రుచ్చి గ్రుచ్చి అడుగుదురు నన్నుగని,
'వీరుడ! పనివడి వెళ్ళి, తచట సా
ధించినదేమన' తెలుపుదు దేనిని.

8

కానరాదచట జానకి నాకన,
అభిమానంబును అపకీర్తి భయము
సుడియ వానరు లుసురులు పాయుదురు
గడువుదాటె, ఎటుగండము గడచును ?

9

వారిధి గట్టుకు వచ్చి నా కొఱకు
కూడినవా రే మాడుదురో, వృ
ద్ధుండు జాంబవంతుం డేమనునో ? కు
మారాంగదు డే మాటల నడుగునో ?

10

నిర్వేదమె అన్నిట నరిష్ట, మ
నిర్వేదమొకటె సర్వశుభంబులు,
నిఖిలసుఖము లందించును, సకలా
ర్థముల అనిర్వేదమె ప్రవర్తిలును.

11

మనుజుడు తన కర్మను వేసారక
చేసినపుడె ఫలసిద్ధిని పొందును,
కాన, విసిగి, వెక్కసపడి, విడకె
క్కుడు పూన్కిని కడగుదు కార్యమునకు.

12

ఇంతవఱకు అన్వేషింపని, పెడ
వాడలు వంకలు వదలక వెతకెద,
రావణుడేలెడి రాష్ట్ర, దేశ, జన
పదములనెల్లను పరిశోధించెద.

13

పానభూమి సర్వము పరికించితి,
పూలతోటలను పొదలను చూచితి,
చిత్రశాల లీక్షించితి, కేళీ
గృహములను పరీక్షించితి బాగుగ.

14

ఇండ్లతోటలను బండ్లబాటలను,
భూరివిమానంబుల సకలంబును,
అరసితి; ఐనను మఱల వెతకెదను,
అనుచు సాగె ముందునకు మహాకపి.

15

నేలక్రింది నెలఱాల మాడుగుల,
రెండంతస్తుల దండిమేడలను
చైత్యములను వేసారక, యెక్కి ది
గుచు, ఆగుచు, పరుగు లిడుచుండె కపి.

16

ద్వారబంధముల తలుపుల ఱెక్కల
తెఱచును మూయును తేపతేపకును,
బయటికరుగు, లోపలికేగును, పయి
కెగురును, క్రిందికి దిగును పోరంబోరి.

17-18

ప్రాకారము లోపలి త్రోవల, వే
దికల, చైత్యముల, దిగుడుబావులను,
హనుమ తిరుగనిది అంగుళమంతయు
లే దసురుని ప్రాసాదాంగణమున.

19

వికృతవదనలు, విభీషణ వేషిణు
లయిన రాక్షసకులాంగన లెందఱో
పొడకట్టిరి కపిపుంగవున కచట,
కనరాదెందును జనకుని నందన.

20

చక్కదనంబున సాటిలేని వి
ద్యాధర బింబాధరల నెందఱినో
చూచెనచట కపికుండాలము, కన
రాదు వారిలో రఘుకుల నందిని.

21

పున్నమచంద్రుని బోని శుభాస్యలు,
తరుణాంగులు, సుందర నితంబినులు,
నాగకన్య లెందఱో కనుపించిరి;
చూపట్టదు సీతాపుణ్యాంగన.

22

బాహుబలంబున పట్టి అపహరిం
చిన నాగవిలాసినుల కొందఱిని
అతినిదానముగ అవలోకించెను,
జనకరాజసుత కనబడ దెందును.

23

అంత హనుమ ధీమంతుడు, తనలో
ఖిన్నుండై దుఃఖించె మరల యిటు,
సీతను వెతకుచిసీ ! చూచితి పర
దారల నంచును సారెసారెకును.

24

వానర వీరుల పరమ యత్నమును
తన సాగరలంఘన ఘనకార్యము,
వ్యర్థమాయెనని పరితపించె చిం
తాకుల మానసుడగుచు మహాకపి.

25

అంత, విమానము నవల పోవిడిచి
శోకము చిత్తము నాకులపెట్టగ,
పరిపరివిధముల భావమునన్ తల
పోయగ సాగెను వాయుతనూజుడు.



17-1-1967

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౧౩

1

ఎక్కిన పుష్పక మెగిరి దుమికి, ప్రా
కార సమీపము చేరిన మారుతి,
పటువేగ సముత్కటుడాయెను; మే
ఘముల నడుమ క్రొక్కారు మెరుపువలె.

2

అసురలోక నాయకుడగు రావణు
దివ్యాంగణముల తిరిగి తిరిగి, జా
నకి జాడలు తెలియక, తనలో నిటు
లాలోచించె గతాగతార్థములు.

3

రాముని ప్రియకార్యము సాధింపగ
లంకాపురి నలువంకల భూములు
త్రిప్పి త్రిప్పి శోధించితి, కనలే
నయితి, సీత, నఖిలాంగసుందరిని.

4

చెరువులు, దొరువులు, సరసులు, సరితలు,
కోటలు, కోనలు, కొండలు వెతకితి
ఈ భూములలో ఏ పొంతను జా
నకి అడపొడ కానబడ దేమియును.

5

ఇచట రావణుని యింటనున్నదని,
గృధ్రపీరకులవృద్ధు, రాజ సం
పాతి చెప్ప విని వచ్చితి, గాలిం
చితి లంకంతయు, సీత లేదిచట.

6

జనకుడు సాకిన సదమలచరిత, వి
దేహరాజసుత, దిక్కుమాలి; రా
క్షసుని కావరము కక్కసించ బల
వంతపు బలిగా వసమఱిపోవునొ ?

7

సీత నపహరించిన దశకంఠుడు
రామబాణభయరభసంబున, వడి
వడి నాకసమున పరుగులెత్తగా,
దారినడుమ సతి జాఱిపోకాలెనొ ?

8

అథవా! ఋషులు, మహాత్ములు, సిద్ధులు,
సేవించెడి తారావీధిని బడి,
వచ్చుచు పారావారము నారసి,
గుండెచెదరి పడియుండునొ నీళ్ళను ?

9

చేతుల రెంటను చిక్కబట్టి, బిగి
తొడలనడుమ నొత్తుచు రావణుడిటు
తెచ్చుచుండగా, తీవ్రపీడ కో
ర్వక ప్రాణంబులు వదలియుండునో ?

10

అంతకంతకు విహాయస వీధిని
పయికి పైకెగసి పరుగులెత్తగా,
పెనగులాడుచు తపించి, తెగించి, కసి
దూకబోలు సతి తోయధిలోపల.

11

చుట్టపక్కములు చూడ దూరమయి,
రావణు ధూర్తరిరంస కొడబడని,
శీలరక్షదీక్షితను, తపస్విని
నాహరించెనో మోహదాహమున.

12

లేక రావణుని లేమలు, హింసా
దుష్టశీలలు మృదుస్వభావ శీ
లను సీతనువాలాయము చంపి భు
జించియుందురు కసిమసగి యీపున.

13

పున్నమచంద్రుని బోలు మొగముతో,
కమలమ్ములవలె క్రాలు కనులతో
అలరు రాఘవుని ధ్యానించుచు మర
ణించియుండు అభినీత సీతయిట.

14

హా రామా ! అహా లక్ష్మణ ! ఆ
హా ! అయోధ్య యని, ఆక్రందించుచు
దిక్కుమాలి, వైదేహి దేహమును
విడిచియుండు దుర్విధివిపాకముగ.

15

లేక బ్రతికియుండినచో రావణు
సౌధములో, పంజరమున చిక్కిన
గోరువంకవలె, కుములుచు నుండును,
కడగానని యిక్కట్లను క్రుక్కుచు.

16

జనకరాజఋషితనయ, తపస్విని,
రఘుకులేంద్రు భార్యారత్నము, నీ
లోత్పలలోచన ఓర్వలేక రా
క్షసునివశముకా దుసురు లుండగను.

17

రామచంద్రునకు ప్రాణప్రదంబగు
జానకి, మార్గములోన జాఱి పో
యినదో ! చనిపోయినదో కనబడ
లేదని యెట్లు నివేదింపతగును ?

18

చెప్పినదోషము, చెప్పమిదోషము,
రెండు దోషముల గండకత్తెరను
క్రిక్కిరియగ చిక్కితిని, చికీర్షిత
మేమిటి నాకిపు డీ దుస్సంధిని ?

19

సమకట్టిన కార్యము కొనసాగక
ఇటులయ్యెను నే నీ సమయంబున
ఎదిచేసిన ఒప్పిదమయి సరిపడు
నని విచారమున మునిగెను మారుతి.

20

సీత జాడలఱింప కిచట, నే
కిష్కింధకు తిరిగినచో అచ్చట,
అభిజన మేమను ? అథవా నే చే
సిన ఘనకార్యము చెప్పెద నేమని ?

21

అంతులేని లవణాంబుధి దాటుట,
కష్టమయిన లంక ప్రవేశించుట,
దుష్టులయిన దైత్యులలో తిరుగుట,
అన్నియు వ్యర్థంబయి, అబద్ధమగు.

22

తడయక కిష్కింధకు నే నేగిన
స్వామి సుగ్రీవుడేమనునొ ! ఎదురు
వచ్చిన వానరవరు లేమందురొ?
రామలక్ష్మణులు నేమి తలంతురొ?

23

పోయి, రాఘవుని ముందు నిలువబడి
'కనబడలేదెక్కడను సీత'యని
పలికిన నాతడు ప్రాణము విడుచును,
ప్రాణపదము శ్రీరాముని కాయము.

24

సర్వేంద్రియ దుస్తాపన మగు నీ
క్రూర కఠిన దారుణ భాషణమును
సీత విషయమున చెప్పుదునె ట్లిది
విన్నపిదప రఘువీరుడు బ్రతుకడు.

25

ఖరఖలమగు కర్కశ వేదనబడి
రామచంద్రుడటు ప్రాణము విడిచిన,
అత్యనురక్తుడు, అతిమేధానిధి,
లక్ష్మణుడును నేలబడి శమించును.

26

అన్నదమ్ములటు లస్తమించినన్,
భరతుండును జీవంబులు విడుచును,
సోదరమరణవిషాదము నోర్వక
శత్రుఘ్నుడు పంచత్వము నొందును.

27

కోడ లట్లుపోన్, కొడుకు లిట్లుకాన్,
కడుపులు చుమ్మలు సుడియ సుమిత్రయు
కౌసల్యయు, సతి కైకేయియు, మర
ణింతురు తల్లులు నిస్సంశయ మిది.

28

సూనృతశీలుడు సుగ్రీవుడు, కృ
తజ్ఞుడు, కపిసంతాన పాలకుడు,
రాముండాగతి ప్రాణముల్ విడువ
కాంచి, తానును త్యజించు జీవితము.

29

మానసికి వ్యథ మరుగుచు, భర్తృవి
రహశోకమున నిరానందినియై
దినములు గడుపు పతివ్రత రుమయును
తడయక ఉసురులు విడుచును, తథ్యము.

30

వాలిగతింపగ వలవలనేడ్చుచు,
శోకతాపమున సొగసి, మనోవ్యథ
నారాటించెడి తారాదేవియు,
జీవితంబును త్యజించుట నిక్కము.

31

తల్లిదండ్రు లిద్దరును గతించగ,
ప్రేమించిన సుగ్రీవుడు సమయగ,
బహుళవ్యసనము భరియించి పొగలు
చంగదుడెటు కాయంబును మోయును.

32

రాజులేని దుర్గతిని వానరులు
అతి దుఃఖమున నిరాశాహతులై
ముష్టిహస్తతలములతో శిరసులు
పగులకొట్టుకొను చగలుదు రాత్రిని.

33

సుగ్రీవుడు దక్షుడు విచక్షణుడు
చెలిమి బలిమి నచ్చికనుచ్చికలను
అరసికొన్న వానరకులీను లిక
బ్రదుకురోసి వీడుదురు ప్రాణములు.

34

వనభూములలో భవనంబులలో,
కొండకోనలలో గుంపెసలారుచు
వానరులిక ఇష్టానుసారముగ
తిరుగబోరు సంబరముల క్రీడల.

35

ప్రభువుగతింప విపన్నఖిన్నులయి
గొప్పవానరులు గుట్టలెక్కి పడి,
గోతులన్ దుమికి కూలుదురు, స్తనం
ధయకళత్ర బాంధవ సచివులతో.

36

ఉరులుపోసికొని, గరళముత్రాగి, ద
వానలమునబడి, అన్నపానములు
మానివేసి, దెసమాలిపోవుదు, ర
నాధలవలె వానరు లికమీదట.

37

కడముట్టును ఇక్ష్వాకులవంశము,
నశియించును వానరకులగోత్రము,
లెందుబోయినను ఏడ్పులు మూల్గులు
వినబడునని భావింతును మనమున.

38

కిష్కింధాపురికి తిరిగివెళ్ళను,
ఏమయినను సరె యిపుడు నేను; సీ
తాదేవిని సందర్శింపక, సు
గ్రీవుని ముఖమీక్షింపగజాలను.

39

వెళ్ళ కిచట నే వేగుచున్నచో
బ్రతికియుందు రిక్ష్వాకులు ధర్మా
త్ములు, మహారథులు తనుగని ఆశను,
కపిపుంగవులు పోకాలక నిలుతురు.

40

జానకి యెచటను కానరానిచో,
వానప్రస్థుడనై నిలిచెద నీ
చెట్లనీడలను, చేతికి నోటికి
అందిన శాకము లారగించుచును.

41

తృణకాష్ఠజల సమృద్ధంబులగుచు
క్షేమలాఅని ప్రదేశములందున,
కానల దొరకిన కట్టెలు పేరిచి
చితిమంటల కాహుతినైయె పోదును.

42

ఉచితాసనమున ఉపవిష్టుడనయి
సమ్యగ్ 'గ్లింగిని' సాధనచేసెద;
జీవి విసర్జించిన దేహంబును
ఆరగించు వాయసములు పులుగులు.

43

జానకి యెచటను కానబడనిచో,
పాఱుడు నీళ్ళను బడి శమియింతును,
నిర్యాణంబని నిర్దేశించిరి,
ఆదియందున మహర్షులు దీనిని.

44

మొదట చక్కగా మొలకరించి, ఉ
త్సవముగ సాగి, పొదలిన నా యశో
మాలిక తెగె చిరకాలము క్రిందనె;
జానకి నారయ జాలని కతమున.

45

నల్లని కనుల మనస్విని, సీతను
కనుగొను సుకృతము కలుగదేని, ఇట
తాపసినై వనతరువుల నీడల
నియమనిష్ఠలను నెట్టుదు దినములు.

46

భూపుత్రిక అడపొడ లేమాత్రము
తెలిసికొనకనే తిరిగి తిరిగి, అట
బోయిన వానరపుంగవు, డంగద
పుత్రు డాదిగా పొలియుదు రందఱు.

47

అది, యటులుండగ, ఆత్మహత్య బహు
పాప హేతువగు; ప్రాణధారణ మ
వశ్యము; బ్రతికి శుభములు పడయనగు;
కాన జీవములతో నుందు, ధ్రువము.

48

అనుచు హనుమ హృదయాంతరాళమున
పొరి పొరి పొరలెడి భూరి దుఃఖమున
కంతము కానక వ్యాకులుడాయెను,
బహుభంగుల అనవస్థాగతుడయి.

49

అంతలోనె, క్షణమంత ధ్యానమున
తత్కాల విషాదము తొలగ, మహో
జ్జ్వలుడై లేచెను 'చంపుదు రావణు,
సీత నపహరించిన పగతీర్తును'.

50

లేదా ! రాక్షసులేపి, యీడ్చుకొని
పోదు సముద్రము మీదు మీదుగా,
పశుపతి బలికై పశువును వలె; రా
మునకు సమర్పింతును పదిలంబుగ.

51

అని పలుకుచు, సీతను లక్షింపని
చింతావేదన సెలవెత్త మఱల,
దుఃఖ పరీతాత్ముండయి మారుతి,
ధ్యానమున నిలిచి తలపోసె నిటుల.

52

రామకళత్రము, రాజయశస్విని,
కనబడునందాకను మఱల మఱలి
గాలించెద లంకను సమస్తమును,
తిరిగి తిరిగి శోధించెద నింకను.

53
మాకచ్చట సంపాతి చెప్పిన ప్ర
కార మపుడె రాఘవు నిచటికి కొని
వచ్చియున్న; ఇట భార్యను కానక,
కాల్చి యుండు మా కపులనందఱిని.

54
కావున, నియతగ్రాసముతో, ఇం
ద్రియములను సమాధించి, ఇచటనే
నిలిచిపోదు, నావలన కాగల వి
నాశము తప్పును నరవానరులకు.

55
అదె, కనబడుచున్నది, శ్యామలతరు
సుందరంబుగ అశోకవనాంతము,
వీక్షించగలే దింతకు పూర్వము
పోయిచూతు నిప్పుడెయని సమకొని.

56
అసురలోక శోకావహముగ
మొదట దోయిలించెద, వసురుద్రుల,
కశ్విని మరుతుల, కాదిత్యులకు, అ
శోకవనంబును చూడబోవుతఱి.

57
రక్కసి మూకల చక్కాడెద, ఇ
క్ష్వాకువంశ సంవర్ధని సీతను
చేర్చి, సమర్పించెద రామునకు; త
పస్వి కిష్టసాఫల్యసిద్ధివలె.

58
అనుచు, హనుమ మహాతేజోనిధి
ధ్యాన స్తిమితుండయి, నిమేష, మిం
ద్రియములు కప్పిన తిమిరము విడిపోన్,
మేలుకొని విజృంభించె యథావిధి.

59

తొలుత వందనము సలిపి రామ ల
క్ష్మణులకు, పరమసుజాతకు సీతకు,
రుద్రునకు, మహేంద్రునకు, పవన యమ
మరు దినసోముల కెఱగెద వినతిని.

60

పతిసుగ్రీవుని, పితను వాయు దే
వుని, స్మరించి, పావని పిమ్మట, అటు
పరికించుచు దిగ్వలయము, చూచె న
శోక వనాంచల శోభన చక్రము.

61

చూచి నిశ్చయించుకొనె హనుమ యిటు,
మునుముందుగ వనము ప్రవేశింతును,
కాగల రాగల కార్యకలాపము
నాలోచించెద నటు పిమ్మట నట.

62

ఈ యశోకవన మేపున నున్నది
బహు వనపాదప్రబంధురమై, వన
పాలక రాక్షసభటజాలముతో,
కిటకిటమనుచుండుట సునిశ్చితము.

63

పాలకులును కాపాడుదు రీ ప
చ్చని తోటను నిచ్చలు నిచ్చకమున,
పాదపములు సుడివడగా విసరడు
భగవానుండగు పవమానుండును.

64

రామచంద్రు కార్యము సాధింపగ,
రావణుని ఉపద్రవ మరికట్టగ,
కాయము కుంచితి; కరుణింతురుగా
కిపుడు, దేవతలు ఋషిగణంబులును.

65

ఆత్మభవుడు బ్రహ్మయు, దైవతములు
పవన పావకులు, వజ్రి సురేంద్రుడు,
అనపాయ విధాయకులై అరయగ
కార్యసిద్ధియగుగాక, నా కిచట.

66

పాశహస్తుడగు వరుణుడు, హిమకర,
దినకర, మరు దశ్విను, లీశానుడు,
అనుకూలించి, మహాత్ములందఱును
విజయసిద్ధి కావింతురు గావుత !

67

సకల భూత సంచయమును, వారల
అధిపతి వర్గము, అగపడని యితర
శక్తిగణమును, ప్రసన్నులగుచు, నను
వీక్షించి, జయము నిత్తురుగావుత.

68

పద్మపత్రములవంటి కనులు, తీ
రైనముక్కు, కుదురైన పల్వరుస
తో నవ్వుచు, చంద్రుని బోలిన సీ
తాదేవి ముఖము దర్శింతు నెపుడు ?

69

అల్పుడు, పాపి, నిహంత, తామసుడు,
భీషణ భూషణ వేషధారి, రా
వణుడు బలిమికొని వచ్చిన పూతను
సీతను కన్నుల చూతు నే నెటుల ?

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౧౪

1

అమితవిక్రముడు హనుమంతు, డపుడు
నిముసమంత ధ్యానించి, ఉవ్వునన్
దూకెను చివ్వున ప్రాకారంబును,
ఆవలి సన్నాహము పరికించగ.

2

తోటగోడపయి పీటబెట్టి, హరి
ఉల్లాసంబున ఒడలు గగుర్కొన,
చూచె, చైత్రమున పూచిన తరువులు
సిగపువ్వుల సోయగముతో మెఱయ.

3

సుందరమైన అశోకంబులు, పు
ష్పించిన పొద సంపెగలు, పూత ప
ట్టిన మామిళ్ళును, ననిచిన యేపెలు,
చిగిరించిన పలు తెగల వృక్షములు.

4

లేత తీగెలల్లిన పొదరిండ్లును,
ఎలమావులు వర్ధిలిన తావులును,
పుంజుకొన్న తోపునదూకెను; విలు
త్రాడు దూసుకొని ప్రాలు ములికివలె.

5

ఆ పగిదిని అపురూపం బయిన అ
శోకవనంబున దూకిన మారుతి,
తిలకించెను పులుగుల యెలుగులతో
కలకలమను బంగారపు చెట్లను.

6

వెండి ఱేకు లనుపించు ఆకులును,
పసిడిరూపులన పొసగు చిగుళ్ళును,
చిత్రచిత్రమగు చెట్ల వీథులును
ప్రొద్దుపొడుపు తీరున సొంపారగ.

7

చక్కని పువ్వుల చారు తరువులును,
పచ్చని తియ్యని ఫలవృక్షములును,
తుమ్మెద గుంపులతోడి రాగములు,
కోకిలజంటల కోమలరుతములు.

8

మానవ శోభాధానకాలమయి,
మృగ విహంగ సంమేళనదినమయి,
నెమిలి కన్నెలకు నృత్తసమయమయి
ద్విజతతికి సమావేశ తరుణమయి.

9

తనుపు నా ముహూర్తమున, సుచరితను
జనకరాజఋషితనయను, సీతను,
అన్వేషించుచు, ఆదమఱచి, సుఖ
సుప్తినున్న పక్షుల నెగజోపెను.

10

లేచిన పులుగులు చాచి ఱెక్కలను
రెపరెపకొట్టుచు రెమ్మల కొమ్మల,
రివ్వున నెగిరి పరిభ్రమింప, పలు
రంగుల పువ్వులురాలె సాలముల.

11

ధారాళముగా జాఱు పూలు కపి
కంఠీరవు నతికాయము కప్పగ,
చూపట్టె నత డశోకవనంబున,
పుట్టి వర్ధిలిన పుష్పగిరి గరిమ.

12

గుంపులై గుబురుకొన్న వృక్షముల
వీధుల దాపల వెలపలబడి విహ
రించు వానరవరేణ్యుని చూచి వ
సంతుం డనుకొనె సర్వభూతములు.

13

తరువులు తీగెలు కురిసిన పూలు చి
వుళ్లు మెఱయ రాజిల్లె వసుంధర,
ముత్యాల పగడముల సొమ్ముల సా
లంకృతయైన నెలంత చందమున.

?

(చెట్లకొమ్మలను పట్లు సళ్ళి, తెగి
రాలిన వన్నెల పూలతోడ రా
ణించె, అశోకవనీతల్లి, ఆభర
ణములు పెట్టుకొన్న సుమంగళివలె)

14

బలిమికొలది కపికులమాతంగము
పట్టి తట్టి అట్టిట్టు నెట్ట, ఉ
ఱ్ఱూతలూగి ఛాయా తరువులు రా
ల్చెను తలపూ లెల్లను దులిపినగతి.

15

రాలిన తల చిగురాకులతో, తెగి
క్రిందబడిన పూపిందెలతో, కన
బడె వృక్షంబులు; వస్త్రాభరణము
లాదిగ ఓడిన జూదరు లట్టుల.

16
వేగశాలి కపివీరుం డెగసి క
దల్చి కుదిల్చిన ధాత్రీజాతము
విదిలించెను గజిబిజి దులిపిన
విచ్చిన పూలను పచ్చని పండ్లను.

17
గాలికి ఆకులు నేల రాల ఉ
లిక్కిపడి విహాగములు లేచిపోవ, చ
ల్లని ఛాయలు కోల్పడి వనస్పతులు
మోడులాయె, మారుతి తాడనలకు.

18
తలనీలాలు చెదరి చిక్కుపడన్
మెయిపూతల మిసిమితరుగ, వాతెర
దొండపండు తొగ రెండగ, నఖముఖ
దంతపీడనల నలిగిన చెలివలె.

19
వానరవీరుని వాలపాశబం
ధముల రాపులకు తలకి యులికి, కపి
కరచరణ నఖక్షతుల వికలమై
కనుపించె అశోకవని సోయగము.

20
పెనగ చుట్టుకొని బిగియగ బలసిన
గండ్ర తీగెలు పెకల్చి విసరె హరి,
వింధ్యాచలమున వీగు వర్ష మే
ఘములను ఉప్పెన గాలి చందమున.

21
అందునందు కలయన్ తిరుగుచు కపి,
మాణిక్యంబుల మంటపములు, బం
గారు వెండి చెక్కడములుగల సుం
దర కేళీ మందిరములు చూచెను.

22

నిర్మలోదకము నిండి తొణుకు మణి
సోపానంబుల సౌరుమీఱగా,
తీర్చి కట్టిన దిగుడు బావులను
వివిధాకృతులను వీక్షించెను హరి.

23

మేలిపగడముల మెత్తని యిసుకయు,
ఆణిముత్యముల అచ్చపుసున్నము,
కలిపి సుతారముగా నిర్మించిన
కృతకసాలముల క్రేవల నుండెను.

24

కలువలు కమలంబులు కొల్లలుగా
విచ్చి విలసిలగ వేడుక కొలకుల,
చక్రవాక కూజనములు, కలహం
సల కంఠస్వనములు దెస తెలుగిడు.

25

దరుల నొత్తుగా పెరిగిన తరువులు,
దొరలుగా నొప్పారగ, ఊర్జ
స్వల లయి మంగళవాహినులంతట
పుణ్యోదకములు పొంగ పెంపెసగు.

26

వేలకొలది తీవెల పొదరిండ్లును,
అంతట పూచిన సంతానతరులు,
నిబిడములగు గన్నేరుల గుంపులు
బోదెలు లేని అపూర్వసాలములు.

27

ఎత్తుగ పెరిగిన నెత్తంబులతో
చుట్టును చక్కని గుట్టలు మెఱయగ,
విమల శిలాకూటములతోడ, ఒక
గిరి యుండె పయోధరముచందమున.

28

ధాతుశిలల నందముగా కట్టిన
గృహపంక్తులతో, రెమ్మలు కొమ్మలు
జంపులయిన పచ్చని గుంపెనలను,
చిత్రముగా భాసిల్లుచునుండెను.

29

ప్రియుని కవుంగిలి విడిచిపోవు ప్రియు
రాలి పగిది, పర్వతతలంబు నెడ
బాసి, తరలి దిగజాఱుచున్న ఒక
జలపాతంబును తిలకించెను హరి.

30

తల కొమ్మలు జలములబడి మునుగుచు
ఓరగిల్లి దరినున్న రసాలము,
కినిసి యేటదూకిన యువతిని ప్రియ
జనము పట్టి ఆపిన యట్లగపడె.

31

మలుపు తిరిగి క్రమ్మఱలి, మఱల, గిరి
సందిలి దరిసిన సన్నని సొన గనె;
కోపము తీఱిన కోమలి వలపున
ప్రియుని కడకు చేరిన చందంబున.

32

అచటికి దాపున అమృతోదకములు
నిండియున్న కోనేళ్ళలోన క్రి
క్కిరియ పూచె తామరలు, పులుంగులు
పిల పిల మంచును పింపిళ్ళాడగ.

33

మేల్మిమెట్లు మినమినమని మెఱసెడి
దిగుడు బావులను తీపినీరు, ము
త్తెముల యిసుకపయి తేటలారు, పి
ట్టబు తామర కాడలపై నూగగ.

34

చిత్ర జంతువులు చెంగనాలిడుచు
తిరిగెడి వీధులు, దివ్య సౌధములు,
వింత వింతగా విశ్వకర్మ ని
ర్మించిన సాలంకృత శుభవన మది.

35

పండ్ల గెలలు, పుష్పంబుల గుత్తులు,
పచ్చని ఆకుల పైటల చాటయి,
వృక్షంబులు దీపింప, అశోకవన
మంతయు శోభిలు శాంతిమంతమయి.

36

పున్నాగంబులు, కన్నె సంపెగలు,
ఏడాకుల పయ్యెదల అనంటులు,
పసిడి తిన్నె లింపెసగన్, హేమ
చ్ఛత్రం బొక్కటి సందిట శోభిలు.

37

చిక్కగనల్లిన చిగురు తీవియలు,
పచ్చాకుల జొంపములు పెనంగొన,
చెంతనె అపరంజిపసిమి విసరుచు
తరుణ శింశుపాతరువుండె నొకటి.

38

దానిచుట్టు కుందనపు తిన్నెలును,
పరిశుభ్రములగు ప్రాంగణంబులును,
పల్లపు మడవలు, పాఱుచున్న స
న్నని సెలయేళ్ళను కనుగొనె మారుతి.

39–40

నిప్పుల కుప్పల చొప్పున వెలిగెడి
కనకవృక్షముల కాంతులన్ హనుమ,
తానును కనకంబైనట్లు తలచె,
మేరుశైలమున మిత్రుని కైవడి.

41

అపుడా బంగారపు చెట్లనడుమ
విసరెను మందాలసముగ పయ్యెర,
మొరసెను గజ్జెలు మువ్వలు గలగల,
విస్మయమందగ వీరుడు మారుతి.

42

మొలకలు పల్లవములు లేతాకులు
పూచిన కొమ్మలు పొలుచు శింశుపా
వృక్షమెక్కి క్రిక్కిరిసిన ఆకుల
వెనుకనుండె కపివీరు డగపడక.

43

ఆ శింశుపపయి ఆసీనుండయి
యోచించెను కపియోధుం డిట్టుల,
ఇచ్చటినుండి నిరీక్షించెద రా
ఘవదర్శనరక్తను, దుఃఖార్తను.

44

ఈ యశోకవన మిష్టమైనది దు
రాత్మునకు; ప్రియంబారగ పెంచిన
చందన చంపక చారువకుళ వన
రాజి శోభిలు విరాజమానముగ.

45

ద్విజసంతతులకు దివ్యాశ్రయమయి
రాజీవములకు రాణివాసమయి,
హృదయంగమమగు ఈ కాసారము,
రాకమానదిటు రామకళత్రము.

46

రాముని ప్రియదర్శన సంస్థానము,
రాఘవమహిషీరత్నమునకు, వన
సంచార మభీష్టంబగు, కావున
వచ్చి తీరు నీ పచ్చనివాడల.

47

అటుకాకున్నను హరిణేక్షణ రా
ఘవవియోగమున కాగుచు తోచక,
భ్రమియించుచు ఈ వనవీధులబడి,
రావచ్చు నిటు ధీరామబుద్ధి మెయి.

48

రాఘవ విరహనిదాఘతపనలో
వనరు తపస్విని, వనవిచక్షణా
పేక్షాసక్తి మెయిన్ భ్రమియించుచు
దేవి, యిట్టులే తెంచును ధ్రువముగ.

49

రామచంద్రుని పురంధ్రీరత్నము,
జనకరాజబుషితనయాతిలకము,
అడవిజనుల కభయ ప్రియాశ్రయము
వనచారిణియై వచ్చు నిచ్చటికి.

50

సందెజాముకోస మెదురు చూచుచు
సాధ్వి, జనకసుత సాయంసంధ్యా
వందనార్థమై వచ్చును తప్పక
మంగళతోయతరంగిణి వద్దకు.

51

రాజేంద్రుండగు రామచంద్రునకు
అనురూపిణి జాయామణి జానకి,
ఆమె వాసమున కర్హమయినదీ
రక్తాశోకప్రమదావనమును.

52

పూర్ణచంద్ర సఖముఖ వర్చస్విని,
దేవి జానకి బ్రతికి బాగుండిన
వచ్చును తప్పక పరమ మంగళో
దక నదీమతల్లిక వాటములకు.

53

అటు తలపోయుచు హనుమ మహాత్ముడు,
రామ కళత్రము రాకకై ప్రతీ
క్షించుచు పరికించెను సర్వము, సుమ
శాఖల యాకుల చాటునన్ నురిగి.

 21-1-19

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౧౫

1

ఆశింశువపై ఆసీనుండయి,
మైథిలికోసము మార్గము చూచుచు,
పారజూచె పావని అశోకవని
సర్వంబును కడు జాగరూకుడయి.

2

సంతాన లతలు సాగిన సీమలు,
కల్పవృక్షములు కాచిన కోనలు,
దివ్యగంధరసతేమనంబులయి,
తనుపుచుండె నవి వన సౌభాగ్యము.

3

అందచందముల నందనవనమై,
మృగవిహంగముల కిష్టరంగమై,
శుకపిక కలరవ సుమనోహరమై,
చారుగృహ ప్రాసాద జటిలమయి.

4

ఎఱ్ఱ కలువలును హేమకమలములు,
తేలియాడగా దిగుడు బావులను,
రమ్యాసనములు, రత్నకంబళులు
నెగడుచునుండెను నేలమాళుగుల.

5

సకల ఋతువులను వికసించెడి పూ
దీగెలతో, ఎడతెగక కాచు ఫల
వృక్షంబులతో, విలసిల్లె అశో
కోద్యానము భానూదయ ప్రభల.

6–8

సారెకెగుపుచున్ శాఖల పతులు
ఆకులు దులిపిన మ్రాకుల పంగల,
మొలకెత్తు నపుడపుడె పసిచిగురులు,
శోకము మాపు అశోకసాలముల.

?

మొదలునుండి సిగతుదిదాకను, ఎడ
తెఱపి లేక ఒత్తిన పూగుత్తుల,
బలువు బరువునన్ పచ్చని కొమ్మలు
తూలి వాలబడె నేలను తాకుచు.

?

కొండగోగు లటు కొల్లగ పూచెను,
ముమ్మరముగ ఇటు పూచె మోదుగులు,
గుంపు కొన్న మాకుల తలపసరున
కారుకొనెను ప్రాంగణము లన్నియును.

9

పున్నాగంబులు, పొదసంపెగ, లే
డాకుల యరటులు, అన్నివాడలను
పూచి పొలిచి అలవోకనందముగ
శోభిలుచుండెను చూడ వేడుకగ.

10

బంగారపు కడవలవలె కొన్నియు,
ఇంగలము సిగల భంగిని కొన్నియు,
కాటుకబోదెల దీటున కొన్నియు,
సొంపుగనుండె అశోకవృక్షములు.

11

వాసవు నందనవనము చందమున,
ధనదుని చైత్రరథంబు విధంబున,
దివ్యంబయి, భవితవ్యంబయి,
రమ్యంబయి అనురంజించె వనము.

12

పువ్వులు చుక్కలపోల్కి గ్రాల రెం
డవ ఆకాశమనన్దగి, పువ్వులు
రత్నములట్లు మెఱయ, పంచమ సా
గరమనజాలి ప్రకాశించె వనము.

13

సకల ఋతువులను వికసితంబులై,
తేనెవాసనల తేలుసాలములు,
ప్రియహరిణంబులు, పెంపుడు పక్షులు,
కలరవములతో పిలపిలలాడును.

14

పలుజాతుల పువ్వుల సువాసనలు,
ప్రసరింపంగ తరంగంబులవలె,
పుణ్యగంధ పరిపూర్ణమై పొలుచు
రెండవ గందపుకొండ చందమున.

15–19

ఆ యశోకవని కంతరమందున
కాంచె హనుమ వెయికంబంబులతో,
పగడపు మెట్లును, పసిడి తిన్నెలును,
తనరుచున్న చైత్యప్రాసాదము.

??

రూపురేఖలను చూపఱు నాక
ర్షించుచు, మితిమీఱిన మహోన్నతిని
ఆకాశంబును తాకి తారలను
పట్టి ఊచుచున్నట్టులుండె నది.

౧౨

అచట శుక్లపాడ్యమి నెలవలె ని
ర్మలముగ, మాసినవలువతో, ఉపా
సముల చిక్కి, రాక్షసుల నడుమ, ని
ట్టూర్పు లూడ్చు ఒక యువతి కానబడె.

20

తన సురూపసౌందర్య, ప్రభ లిం
చించుకంత కనుపించుచుండ; పొగ
లావరించిన హుతాశను కీలను
పోలియుండె నా పుణ్యసతీమణి.

21

నలిగిన పచ్చని వలువ నొక్కటియె
కట్టి, నిరాభరణగాఉన్న గరిత;
బురదపాముకొన పూలులేని తెలి
తామరకాడ విధాన కనంబడె.

22

దుఃఖతాపమున తుకతుకనుడుకుచు
సిగ్గుతో చితికి, చిన్నవోయి, కన
బడె నపుడా తాపసి; అంగారకు
నోటబడ్డ చంద్రుని రోహిణివలె.

23

కన్నుల నశ్రుల కట్టలు తెగ, దై
న్యముతో, శోకధ్యానమున మునిగి,
అన్నపానముల నంటక ముట్టక,
బక్కచిక్కి వసివాళ్ళు గంటుపడి.

24

ప్రియజనములు కనుపించక యెందును,
క్రూరరాక్షసుల గుట్టలనడుమను;
తల్లిమంద కెడదవ్వుల దిగబడి,
కుక్కలు మూగిన గున్న లేడివలె.

25

నల్లత్రాచు చందమున వాలుజడ
పిరుదులదాకను పొరలుచు వ్రేలగ;
వానమబ్బు లెడబడ, కార్కొను వన
రాజితో వెలయు రత్నగర్భవలె.

26

కష్టంబుల నెఱుగక సుఖంబుగా
పెరిగి దుఃఖముల కెరయై, మాసిన
చీరను చుట్టి, కృశించి తపించు, ఆ
తరుణిని గని సీతను స్మరించె కపి.

27

కామరూపి దశకంఠుడు కొనిపోన్
ఏ రూపము మే మారసితి మపుడు;
ఆ రూపమె యిట అచ్చుపోసిన
ట్లున్న దీమె యెడ వన్నె తఱిగినను.

28

పున్నమ చంద్రుని బోని మోముతో
కన్నుబొమల చక్కనతో భాసిలు
సుస్తని, యీామె సమస్త తమస్సును
పోకార్చును తన ముఖ వర్చస్సున.

29

పద్మపత్రముల వంటి కనులు, స
న్నని నడుమును, నల్లని వేణియును మె
ఱయగా, కాముని రతివలె కనబడు
లేమను, తలచెను రాముని సతియని.

30

పున్నమచంద్రుని బోలి, జగములకు
ఇష్టార్థమయి హసించుచు, తను సౌం
దర్యము చిందగ, తాపసనైష్ఠికి
వలె కూర్చుండెను వట్టి నేలపయి.

31-32

జడిసిన ఫణిపతి జాయచాయ బుస
కొట్టుచు, కార్కొను నిట్టూర్పులతో,
అధికశోకమున అగలి, పొగలు క
ప్పిన నిప్పుకవలె కనబడె నాయమ.

33

సందిగ్ధంబగు శాస్త్రముఁవలె, స
న్నగిలిన సంపద పగిది, కొనసా
గక తెగిపోయిన కాంక్షాలతవలె,
సడలి క్షయించిన శ్రద్ధవిధంబున.

34

విఘ్నంబులతో వికలమై చెడిన
కర్మసిద్ధివలె, కలుషం బంటిన
బుద్ధిభంగిని, అభూతంబగు అప
వాద పంకమున పడిన కీర్తివలె.

35

రాముని సత్యవ్రతమున బలియై,
అసురుని దుర్మోహంబున కెరయై,
దిక్కులు చూచును బిక్కవోయి, ఆ
లేడికనుల శాలీనవిలోచన.

36

నిండిపొర్లు కన్నీళ్ళభారమున
వంగెను నల్లని వాల్గను రెప్పలు,
ముడుచుకొన్న నెమ్మొగముతోడ ని
ట్టూర్పులు చిమ్ముచు నుండెను పొరిపొరి.

37

తీఱనివేదన దీనదీనయై
ఉన్న సొమ్ములను ఉజ్జగించి, మా
సిన మేనును చీరను చూడక, మే
ఘము కప్పిన శశికళవలె, చెన్నఱె.

38

పల్లెలేక పొర వారిన శ్రుతి పా
ఠము, స్ఫురింపక తడవుకొనురీతిని;
మైథిలి నటునిటు మఱిమఱి చూచుచు
హనుమయ్యు సందేహంబున తడబడె.

39

అపరిష్కృతమయి అర్థాంతరమగు
శబ్దమువలె కష్టపడి తెలుసుకొనె,
సొమ్ములు పెట్టక శోభలు కొఱవడి
బోసిపోయి, పసిమాసిన సీతను.

40

ఆ రాజసుతను, ఆయతనేత్ర, న
నింద్య చరిత్రను నిలుకడగా కని,
సందర్భ సమంజసములను తరచి,
నిశ్చయించుకొనె నెలత సీతయని.

41

జానకి యెక్కడ యే నగలు ధరిం
చెనని రాముడు చెప్పెనో నాకచ్చట;
ఆ నగలిక్కడ అగపడుచున్నవి
దేవి యంగముల తీర్చిన తెఱగున.

42

కెంపులు పగడము లింపుగ తాపిం
చిన గాజుల జతలును, కొనలను వం
పులు తీర్చిన రవ్వల కమ్మలు గా
త్రమున శోభిలును రాముడన్నటులె.

43

దీర్ఘ విరహమున తెర్లుచున్న మెయి
సెగల పొగలతో నగలు నల్లబడి,
ఆయా తావుల పాయకయున్నవి,
అచట రాఘవుం డన్న ప్రకారమె.

44
ఋశ్యమూకమున ఏవి చూచితిమొ
ఆ నగ లిక్కడ అగపడకున్నవి;
ఈమె మేన ఇపు డేయే సొమ్ములు
అగపడుచున్నవొ అవి లేవక్కడ.

45
అచట చెట్టునకు ఆఱగట్ట వా
నరు లందఱు చూచిరి బంగారపు
పట్టువంటి సతి పసుపు సైట; అది
యే కనుపించును ఇచ్చట నచ్చుగ.

46
వడివడి నింగినిబడి అసురుడు దో
తెచ్చునపుడు వైదేహి వేసటను
సొమ్ములనొలిచి, పసుపు చీరపయట
ముడిచి, చించి తడబడి పడవైచిన.

!

నగల మూట క్రిందబడెను గలగల
మ్రోగుచున్, వెతకపోయిన వానరు
లరసి, తెచ్చి యిచ్చిరి దానిని; చూ
చితి మచ్చట యీ చీర చెఱంగునె.

47
ఇంతకాల మొకటే ఒక కోకను
కట్టిన కతమున కనుమాసిన దిది,
అయినను మును పడవైచిన దేవీ
వసనాంచల మా వన్నెనె యున్నది.

48
ఈ కనకాంగి మహీశుడు రాముని
ప్రియపత్నియె సంశయము లేదిపుడు,
తోడునీడలకు దూరమయ్యె సతి
దూరము కాదు మనోరాగస్థితి.

49

కారుణ్యముచే, కామపీడచే,
దయచేత, విషాదముచేత, రఘూ
ద్వహు డెవ్వరికై పరితపించు నా
మానవతీమణి జానకి యీమెయె.

50

ధర్మపత్నియను దారుణశోకము,
అబల ఆర్తయను అతిసౌహార్దము,
స్త్రీయను జాలియు, ప్రేయసి యను రా
గము, బాధింపగ కుములును రాముడు.

51

దేవిరూపమును, దివ్యాంగంబుల
సౌష్ఠవమును, దాశరథుని కళ
లిచ్చి పుచ్చుకొను ; ఈ యసితేక్షణ
రాఘవుని కళత్ర, మిది నిశ్చయము.

52

ఈ సాధ్వి మనోధృతి ఆయనయం,
దా మహాత్ముని మన సీ యమయం, దవి
కల్పముగా లగ్నములైనవి; కా
వున బ్రతికెద రీ యనఘులిద్దరును.

53

అర్ధాంగిని, జాయను కోల్పడియును
దుఃఖదోషమున తూలి త్యజింపక,
దేహము మోయును ధీరశాంతు, డీ
ప్రభు, వశక్యమిది పరుల కందఱికి.

54

హనుమ యిట్లు సీతను దర్శించి, ప్ర
మోద పూరముల మునుగుచు తేలుచు
మనసును ధ్యానసమాధి నిలిపి, ల
క్షించి, ప్రస్తుతించెను శ్రీరాముని.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౧౬

1

స్తవనీయను సీతను కొనియాడుచు
హరిపుంగవుడగు హనుమంతుండును,
తోడ్తో విదితాత్ముడు రఘురాముడు
తలపు తగుల చింతన్ బడె క్రమ్మఱ.

2

ధ్యానస్తిమితుండయి ఒక నిమిషము
జానకి దురవస్థలు తలంచి, తే
జస్వి యయ్యు హరిసత్తముడు, మనో
వ్యథ లాపగలే కలమటించె నిటు.

3

గురువుల శిక్షల పెరిగిన లక్ష్మణు
నకు మాన్యస్థానము, రాముని క
ర్ధాంగి సీత; ఇటు లయ్యు దుఃఖమున
తపియించును, విధి దాటరానిదో !

4

రాముని శస్త్రాస్త్రముల ప్రభావము
లక్ష్మణు బాహుబల పరాక్రమములు
ఎఱిగినదగుట మృగేక్షణ క్రుంగదు ;
తొలకరించు ప్రొద్దుల గంగపగిది.

5

కులశీలంబులు, గుణరూపంబులు,
తులతూచిన యట్టు లమరె వీరికి,
రామునకు తగిన రమణి జనకసుత,
వైదేహికి తగు వరుడు రాఘవుడు.

6

మేలిమి వన్నెల మెఱయు లక్ష్మివలె
జగదనురంజనియగు జానకి గని,
మనసు రామచంద్రుని సన్నిధిగొన,
పులకరించి తలపోసె హనుమ యిటు.

7

రావణుబోని పరాక్రమాంధుని క
బంధుని కూల్చెను బలిమిని రాముడు,
బహుబలశాలిని వాలిని చంపెను,
ఈ విశాల కమలేక్షణ కోసమె.

8

భీమ విక్రమోద్దాముడయిన వి
రాధ రాక్షసుని రణమున మార్కొనె,
మును దేవేంద్రుడు మోహరించి శం
బరుని వధించినభంగి సులభముగ.

9

ఘోరకర్మరులు క్రూరదానవులు
పదునాలుగువే లెదిరించ జన
స్థానమున శరజ్వాలలు కురిసెను
భస్మంబై కుప్పలు పడ నడవిని.

10

యుద్ధముఖంబున ఉదురు మిడుకగుచు
నిలిచిన ఖరుఖండించెను, త్రిశిరుని
పరిమార్చెను దాశరథి, దూషణుని
తెగనేసెను ఉద్దీప్త శౌర్యమున.

11
వాలి బాహుబలశాలి యేలగా
అన్యదురాసద మగు వానర ల
క్ష్మీవిభవము సుగ్రీవున కిచ్చెను;
ఈమె కోసమయి రాము డుద్ధతిని.

12
ఈ విశాల ధవళేక్షణ ఉనికిని
ఆదిపాదులను అన్వేషింపగ
వచ్చితి నేనును, పారావారము
దాటితి; చొరబడి తడవితి లంకను.

13
రాముడీ సతికొఱకు సప్తసము
ద్రములు, నాలుగు చెఱగుల భూతలము
తిరిగి తిరిగి శోధించిననేనియు,
ఆశ్రమయుక్తం బనియె తలచెదను.

14
ముల్లోకముల ప్రభుత్వ విభవమును,
సీత, జనక ఋషి కూతురి గరిమయు,
రెండు సరసి తర్కించినచో, సీ
తకు చాలదు సుంతయు సామ్రాజ్యము.

15
ధర్మశాలి, తత్త్వజ్ఞుడు, మిథిలా
రాజ్యపాలకుడు, పూజ్యుడు, జనకుడు
అతనిసుత యీ సీత, సూర్యకుల
తిలకుని సతియై వెలుగు పతివ్రత.

16
యాగార్థముగా సాగి, వరిపొలము
నాగలితో దున్నగ, మొగచాలున,
పద్మరేణువులవంటి సుగంధపు
మృత్కణములతో మెఱసె నీ గరిత.

17

అని మొన వెన్నియని శూరాగ్రణి,
సూర్యవంశ వనసురమందారము,
ధర్మశాలియగు దశరథునింటికి,
పెద్దకోడలయి పేరు తెచ్చినది.

18

ధర్మజ్ఞుండు, కృతజ్ఞుండు, దయా
దాక్షిణ్యమయు డుదారుడు రాముడు,
ఆ మహాత్ము నర్ధాంగి యీ యబల,
కుశ రాక్షసుల పాలయు పొగులును.

19

భోగము లన్నియు పోనడంచి, భవి
తవ్య మించుకంతయు తలపోయక,
భర్తృస్నేహము బలిమి చెలిమి,
దుర్గమ కానన మార్గము పట్టెను.

20

దొరికినకాయలు దుంపలు తిని, తని
వోయి, భర్తృ సేవాయితమతియై,
కష్టవనములను ఇష్టభవనముల
వలె సుప్రీతిని మెలగచునున్నది.

21

కనకమువలె పచ్చని మెయిమెఱయగ
మచ్చిక నవ్వుల ముచ్చట లాడుచు
సైచును చెఱలను జానకి ఆలన
పాలనలేని అభాగిని భంగిని.

22

రావణ రాహుగ్రస్తమయిన యీ
శుభగాత్రి ముఖము చూడ, తపించుచు
న్నాడచ్చట ప్రియనాథుడు రాముడు;
చలిపందిలికోసము పిపాసివలె.

23

ఈ రామామణి ఇనకులాగ్రణికి
మఱల లభించిన పరమప్రీతిని
తనివి చెందు డెందమ్మెన; పోయిన
రాజ్యము వచ్చిన రాజన్యునివలె.

24

కామ భోగభాగ్యములు విడిచి, ప్రియ
బంధుజనము నెడబాసి, దూరమున,
మోయుచునున్నది కాయము మానిని,
రామసమాగమ రక్తిని భక్తిని.

25

కసరికొట్టు రక్కసుల నెఱుంగదు,
పూచి ఫలించిన భూజము లరయదు,
ఏకాగ్రస్థితి హృదయంబున ల
క్షించు నొక్క రఘుశేఖరు మాత్రమె.

26

భూషణములలో భూరిభూషణను
భర్త భార్య, కా వరభూషణ దూ
రగమైయె జానకి రాజిల; దిప్పుడు
సంజె చీకటిని చక్రవాకివలె.

27

ఇట్టి మంగళాకృతి కిమైథిలికి
వెలియై రాముడు వేదనలంబడి
కమిలి కూల కెటో కాయముమోయును,
శక్యము కాదీ సహన మందఱికి.

28

వల్లని కురులకొనలు మెఱసెడి, యీ
పద్మేక్షణ సుఖపడ తగినది, ఇ
ట్లగచాట్లంబడి పొగలుట చూచిన,
నా మనసును కొందలమున క్షోభిలు.

29

సహానంబున భూజనని బోలు నీ
కమలేక్షణ రాఘవుల రక్షణన్
మెసలె మునుపు, రక్కసుల కావలిని
చెట్టుక్రింద గాసిలుచున్నదిపుడు.

30

మంచుపడ్డ తామరపువ్వువలె శో
భలు మాయగ నెవ్వగల కృశించుచు,
సహచరుబాసిన చక్రవాకివలె,
దీన దశానిహతిన్ బడె జానకి.

31

చలికా రెడలిన చంద్రుడు విరహో
ద్దీపన పరుడై తెర వెడలెను తమి,
పూలతోడ కైవ్రాలు ఈ యశో
కములు కూడ శోకమునె దాకొలుపు.

32

ఈ గతి మారుతి బొగాము లవే
క్షించు, చాసుదతి సీతయనుచు మది
నిశ్చయించుకొని నికటంబున గల
వృక్షముపై ఒక్కెడ కూర్చుండెను.



# సుందరకాండ

## సర్గ ౧౩

1

తెల్ల కలువగు త్తివలె, నపుడు, శశి
తేటలు తేరుచు దివినుదయించెను,
నీలోదకముల నిండు చెరువులో
అత్తమిల్లు కలహంసము కైవడి.

2

కపి సత్తమునకు ఉపచారంబులు
సలుపగవచ్చిన సచివునిచాడ్పున,
స్వచ్ఛములగు తన చల్లని కరముల
అభిషేకించెను ఆప్యాయనముగ.

3

అప్పుడు కనుగొనె హనుమ పూర్ణ చం
ద్రాస్యను సీతను, అధికశోక దు
ర్భర పీడనమున వాడిన వనితను;
నడిసముద్రమున నావ విధంబున.

4

ఆమె యథాస్థితి నరయు తలంపున,
పరిసర మంతయు పరికింప హరికి
అగపడిరయ్యెడ అనతిదూరమున,
ఘోరరూపముల గొడ్డురక్కసులు.

5

ఒంటికన్నుకల, దొక చెంప చెవి క
లది, తమ్మెలులేనిది, తలలో ముకు
చెఱమ లున్నదియు, చేట చెవులదియు,
పలు వికారరూపంబులవారలు.

6

బక్కపడిన మెయి, బండవంటి తల,
పీలబోయి కడు పెరిగిన నిడుమెడ,
బట్టతలలు, చిట్టిపొట్టివెంట్రుకలు,
చిఱిగిన కంబళి చింపిరి గంపలు.

7

వ్రేలాడు నోసలు వీనులు, జాఱిన
ఉదరంబు, లురు పయోధరంబులును,
దిగవ్రాలిన వాతెఱలు, చెక్కులు మొ
గాలు, కీళ్ళు, మోకాళ్ళ చిప్పలును.

8

పొట్టిపొడుగు తనువులు కలవారలు,
గూనివాపు, మరుగుజ్జులు, గిడ్డలు,
కఱిమేనులు, వంకర మోములు కల
వార లెందఱో కనబడి రెడనెడ.

9

వికృతాంగులు, కోపిష్ఠులు, కా
లునలుపు, గోరోచనపురంగు మే
నులను విడియువారలు, గయాళి జం
తలు, బలు బకితెలు తాల్చినవారును.

10

పులి మొగములు, దున్నలమోములు, పం
దుల ముట్టెలు, నక్కలమోరలు, హరి
ణాననములు, హయ్యశ్వగజోష్ట్రీ
వ్యాఘ్ర పాదములవంటి పాదములు.

11

ఒక్క హస్తమును, ఒంటిపాదమును,
గాడిదచెవులును, గజకర్ణములును,
గుఱ్ఱపు చెవులును, గోకర్ణములును,
సింగపు వీనుల చెలగిరి కొందఱు.

12

నొసటఁజీఁపడుము బుసబుసమను ముక్కులు,
ఏనుగుతొండముఁబోని ముక్కు, ల
ద్దముఁగ తిరిగి వికటములగు ముక్కులు
కలవార, లనాసలును కనబడిరి.

13

ఏన్గులకాళ్ళను ఎద్దులకాళ్ళను,
చిట్లినపదములు చీలినవ్రేళ్ళను,
నాటుఁకందని వక్షోదరములు,
అతివిపరీతము లసురుల రూపులు.

14

పింతిపింతిర మిడిమిట్టి మొగంబులు
కొమ్ములు, దీర్ఘనఖంబులు, నాల్కలు,
పందుల మోరలు, పశువుల మొగములు,
ఏనుగు మోములు ధేనుముఖంబులు.

15

ఘోరరూపముల క్రోధముతో, ఉ
ద్ధురముగ కలహింతురు గీపెట్టుచు,
అశ్వఖరోష్ట్ర భయానకవక్త్రులు,
క్రూరరాక్షసులు కోలాహలముగ.

16

భీకరంబులగు ఆకారంబుల
మాంసభోక్తలయి, మద్యరక్తులయి
త్రాగుచు తూలుచు రక్కసి మూకలు
బూడిదె తూరు లల్లాడ భ్రమింతురు.

17

పచ్చిమాంసమును, వెచ్చని నెత్తురు,
కుడిచి, పూసికొని, ఒడ లెఱుపెక్కగ,
సందడించు రాక్షసు లెడాపెడల
చేరి రంద ఆొక చెట్టుబోదెకడ.

18

దాని కొమ్మక్రిందనె దీనముగా
కూరుచున్న జనకుని పుత్రిని, నిర
వద్య చరిత్రను వైదేహిని ద
ర్శించెను జయలక్ష్మి ప్రియుడు హనుమ.

19

కురులు మఱికితో బిరుసెక్కగ, శో
కమునకాగి మెయికాంతులు తగ్గెను,
చేసినపుణ్యము క్షీణించగ, తా దివి
విడిభి నేలపైబడిన తారవలె.

20

చరితలకెక్కిన సాధ్వీమణి, పతి
విరహంబున అభరణము లంటక
పోయినను కళలు మాయవు; పెనిమిటి
ప్రేమాభరణము విడువని కతమున.

21

పాపి రావణుడు బందెపెట్ట, బం
ధులకు దూరమయి, దురపిల్లును సతి;
మంద కెడంబయి మధ్యగహనమున
సింహ మడ్డగించిన కరిణికరణి.

22-23

కాలవర్షముల కడపట, శరద
భ్రము లలమిన చంద్రకళ విధంబున,
జీవతంత్రులను చేవడి సవరిం
చక విడిచిన వల్లకి చందంబున.

24
శోకమంటని అశోకవనమున నె
శోకసాగర క్షోభల సుడివడి
త్రెళ్ళుచుండె మైథిలి; అవగ్రహము
చిక్కఁబట్ట శోషిలు రోహిణివలె.

25
మేను పసిమితో మెఱయుచనున్నను
పేరిన మురికిని విన్నబోయి సతి,
పాఁచి బురదలో పడి పూడిన తా
మరకాడ వగిది మెఱసీ మెఱయదు.

26
మాసిన కోకను మైబిగియ పెనచి,
లేడికనుల వాలిక చూపులతో,
దెసలు చూచు వైదేహిని కనె హరి,
పూఁవు లేని లవలీలత భాతిని.

27
దీనత తూలియు దేవి, ఆత్మవిభు
లావు చేవఁలు తలంచి, తేఱి, తే
జరిల్లుచుండె, ఉజ్జ్వలతరమగు తన
శీల మహిమ రక్షింప తల్లివలె.

28
లేడి కనుల బోలిన కటాక్షములు
దిగ్భ్రమంబుతో తిరుగ, భయపడిన
కన్నెలేడి వలె కలవరబోయి, ఎ
గాదిగ చూచుచు కనబడె మైథిలి.

29
ఉడుకు బెడకు నిట్టూర్పుల వేడికి
చివురాకుల చెట్టువిసి నల్లబడ,
శోకం బంతయు చుట్టబెట్టుకొని
ఉప్పెన లేచిన చొప్పున నుండెను.

30

బక్కచిక్కి ఆభరణాలంకర
ణములు పెట్టుకున్నను శోభిల్లెడి,
సర్వాంగ సులక్షణవతి సీతను
కాంచి, వేడ్క పులకించి మహాకపి.

31

నెత్తురు జీఱలు జొత్తిలు కన్నుల
వైదేహినిగని పరమహర్షమున
ఆనందాశ్రులు వానకురియ, స్మరి
యించెను తోడ్తో ఇనకుల తిలకుని.

32

సీతా దర్శన జాత ప్రీతిని
ఉత్కంఠుండయి ఉబ్బి, రామ ల
క్ష్మణులను తలచి నమస్కరించి, కపి
వీరుడుండె కనిపించక చెట్టున.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౧౮

1

పూచి అశోకతరువులు హసించు వని
పుష్పించిన తరువుల ఉద్యానము
తిలకించుచు, వైదేహి రాకకై
వేచుచుండె కపివృషభుడింతలో.

2

సాంగవేదములు చదివి, క్రతువులను
పచరింపంగల బ్రహ్మరాక్షసులు,
పలపల వేగిన వల్లెలు చెప్పెడి
వేదఘోష వినిపించె నంతటను.

3

వీనుల విందుగ వీధుల మ్రోగెడి
ప్రాతర్మంగళ వాదిత్రములను
ఆలకించుచున్. మేలుకొనె యథా
కాలంబున బలశాలి రావణుడు.

4

లేచినంతనె నిశాచరనాథుడు,
నలిగిన దువ్వలువలతో, తునిగిన
పూదండలతో, వేదురుపాటున
సీతనె చింతించెను స్మరియించెను.

5

సూరుడేచ కామాతురుడయి, వై
దేహిమీది దుర్మోహతాపము స
హింపలేకపోయెను లోలోపల;
మదమాంసల తామసుడగు అసురుడు.

6

మేనంతయు క్రొమ్మెఱుగులు చిమ్మెడి
ఆభరణంబులు శోభిల తాలిచి,
వేగిరపడుచు ప్రవేశించెను, బహు
పుష్పఫల ద్రుమములతో వెలయుచు.

7

నిండియున్న కోనేళ్ళను, పూచిన
తరుశాఖలు సుందరముగ కనబడ,
మదవిహంగ సంభ్రమకూజితములు
ఎలుగు లీన నెల్లెడ సంకులముగ.

8

చూచుటకెంతయు సుందరంబుగా,
మణికాంచన తోరణములు భాసిలు,
వనవీధులలోపల నుండె, చమ
త్కృతములయిన పలుమృగముల ప్రతిమలు.

9

చెట్లనుండి నలుపట్లను రాలిన
పండ్లతో, విహగపంక్తులతో, అతి
సుందరమయిన అశోకవనంబు ప్ర
వేశించెను అసురేశుడు బిరబిర.

10

రావణేశ్వరుడు పోవుచుండగా,
వెంబడి నడిచిరి వెలదులు వందలు,
ఇంద్రుడు వెడల మహేంద్రగిరికి గం
ధర్వ దేవకాంతలు వెనుకొనునటి.

11

కొందఱు తాటాకుల వీవనలను,
వింజామరలను విసరుచునుండిరి,
మఱికొందఱు నిమ్మళముగ బంగరు
కాగడాలుగొని సాగిరి వెంబడి.

12

ముందునడిచి రొక కొందఱు శీతో
దకసువర్ణ కుండికల నెత్తుకొని,
మద్దుకత్తులును మద్య భాండములు
మోసుకొని వెనుకపోదురు కొందఱు.

13

త్రాగుట కింపగు ద్రాక్షాసవమును
వెలితి లేక నింపిన కనకాలుక
నొక గడితేఱిన యువతీమణి తన
కుడి చేతంగొని కులుకుచు నడిచెను.

14

మిసమిస మెఱసెడి పసిడి కామతో
పున్నమచంద్రుని వెన్నెల చిమ్ముచు,
రాజహంసవలె రాజిలు ఛత్రము
కొనివచ్చుచునుండెను వేఱొక్కతె.

15

నిద్రలు చాలక, సిశి త్రాగిన మధు
పాన మాంద్యములు వదలక నడిచిరి,
మ్రాగన్నులతో రావణు కాంతలు;
మేఘుని వెనుకొను మెఱుపుల వరుసను.

16

దండకడియములు తారుమాఱుగాన్,
కంఠహారములు కలగి చిక్కుపడ,
చెరగిన పూతల, చెదరిన కురుల, చె
మర్చిన మొగముల మదవతులుండిరి.

17

చాలని నిద్రల తూలుచు, మత్తున
భ్రమసి తిరుగు నేత్రపులతో, చెమ
ర్చిన మేనులతో, చెదరిన సిగ దం
డలతో నుండిరి మెలతుక లలసత.

18

రావణుడట్టుల పోవుచుండ, వె
న్నంటి నడిచెను ప్రియాంగనాజనము,
త్రాగి, కన్నులను రక్తము జొత్తిల,
కామలాలసను గౌరవంబునను.

19

వారి ప్రియుడు రావణుడు, మహాబల
శాలి, కాముని వశంబయి, సీతా
సక్త మానసము స్వాధీన మెడల,
ముందుడై నడిచె మందమందముగ.

20

అప్పుడు వినబడె నచ్చట హనుమకు
ఉత్తమ కాంతల యొడ్డాణపు ము
వ్వల మ్రోతయు, అందెల కడియంబుల
గలగల రవళియు, కర్ణసుఖంబుగ.

21

ఆ కలకలమును ఆలించి, అసురు
సాటిలేని బలశౌర్యంబులు చిం
తించుచు, హరితిలకించెను రావణు
బలగములు వనద్వారము దరియగ.

22

కమ్మని నూనెల దమ్ముగ తడిపిన
వత్తులతో జాజ్వల్యమానముగ
వెలుగుచున్న దీపికల వెలుతురున
సర్వమును ప్రకాశమయం బాయెను

23

కామదర్పముల కావర మెగయగ,
త్రాగిన యేపున తరుణారుణ నే
త్రంబులు మెఱయగ, దశముఖు డగపడె,
విల్లు లేని రతివల్లభురూపున.

24

చిలికిన అమృతపు తళుకు నురుగు వలె
మకిలలేని సుకుమారదుకూలము,
జాఱి తగులుకొన సంది దండలను
పయి కొత్తును రావణుడు పలుమఱును.

25

అపుడు మహాకపి ఆకులకొమ్మల
మాటున చాటయి, మనసును చూపును
ఏకాగ్రముగ నయించి, సమీపిం
చెడిరావణు నీక్షించుచుండె హరి.

26

అటు లవేక్ష నేకాగ్రచిత్తుడయి
పరికించెడి వానర కుంజరునకు,
రూపయౌవన సురుచిర ప్రతిమలు
దశముఖుని కళత్రములు కనబడిరి.

27

సానలు పట్టిన చక్కదనపు బొ
మ్మల వలె చానలు చెలిమిచుట్టుకొన,
హరిణవిహగ సంవరణ మయిన అ
శోక వనంబును చొచ్చె రావణుడు.

28

త్రాగి తీవిగా, దంతపుకమ్మలు
తళుకొత్తగ, చిత్రవిభూషణములు
పెనగొను బలశాలిని, యశోవిశా
లుని, విశ్రవసు సుతుని కనుగొనె హరి.

29

సుందరాంగనా బృందము నడుమను
రాజిలుచుండగ రాక్షసేశ్వరుడు,
చూచెను కపికులసోముడు రావణు,
తారల మధ్య సుధాకరు పోలిక.

30

అనిలసుతుండు, మహాకపి అప్పుడు
"ఇతడే రావణు డింతకుపూర్వము
నగరులోన శయనముననున్న వా
డని" నిశ్చితుడాయెను తన మనమున.

31

అమిత వీర్యబలుడయ్యు మారుతి, ప్ర
చండమైన రాక్షసు తేజోద్ధతి
కులికి, నెమ్మదిగ ఒదిగి ఓరసిలె,
కొమ్మల కారాకులలో చాటుగ.

32

నల్లని కురులును నల్లని కనులును
చక్కదనాలు వెదచల్లుచున్న, సు
శ్రోణిని, సీతను చూచు తమకమున
కదియవచ్చె దశకంఠు డంతలో.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౧౫

1

ఆ వాలకము, అట్లువచ్చు, యౌ
వన సురూప మోహన భూషణు, రా
వణు చూచెను, నిరవద్య చరిత్ర, ప
విత్ర, రాజకుల పుత్రి, క్రీగనుల.

2

చూచి రావణాసురుని వైఖరిని,
భయ విభ్రాంతుల భ్రమగొని, మైథిలి,
కంపించెను సాంగముగా; ఉప్పెన
గాడుపు కొట్టిన కన్నెకదళివలె.

3

ఉదరంబును తొడలొత్తి మూసుకొని,
కరములతో కుచభరము కప్పుకొని,
చతికిలపడె శ్రీమతి జానకి వెత,
దిక్కుగూలి రోదించుచు బిమ్మిటి.

4

అపుడు రావణుడు, అసురీగణములు
కాపుండగ దుష్కర దుఃఖార్తిని
మగ్నయై తెరలు మైథిలి సరసెను;
మున్నీట మునుగుచున్న నావగతి.

5

స్వజన మెవ్వరును ప్రక్కనలేక, అ
నావృతయై, నిత్యవ్రత నిష్ఠను,
ఒంటరిగా కూర్చుండె నేలపయి;
విఱిగి పడ్డ ఫలవృక్షశాఖవలె.

6

నగలు పెట్టుకొన తగినవి పెట్టక,
తరుణాంగంబుల మురికి పాముకొన;
బురదపడిన తామరతీగెవలె, ప్ర
భావతియయ్యును భాసించదు సతి.

7

అపు డాయమ హృదయాశయములు, గు
ఱ్ఱములట్లు మనోరథమును లాగగ,
విదితాత్ముని రఘువీరుని రాముని
సన్నిధికేగుచు ఉన్నట్లాయెను.

8

శోకతాపమున శుష్కించియు, శ్రీ
రామ ధ్యాన పరాయణ బలమున,
అంత మగపడని అగచాట్లు పడుచు
ఒంటిగ యాతన నోర్చును జానకి.

9

కట్టుమంత్రమున చుట్టబు తిరిగెడి
పాముపడతివలె, ధూమకేతువు గ్ర
సింప చెన్ను మాసిన రోహిణి చం
దమున, ఆమె యందములు మఱుగుపడె.

10

మంచి కులమున జనించి, సదాచా
రములు వృత్తశీలములు కలిచియు,
దుష్కుల సంగతదోషంబున సం
స్కారము వలసిన కన్యక చాడ్పున.

11

ఖిలమైన మహాకీర్తిభంగి, పా
లించని శ్రద్ధవలెన్, క్షీణించిన
ప్రజ్ఞచందమున, భగ్నమయిన ఇ
ష్టార్థముకై పడి అగపడె జానకి.

12

ప్రతిరోధించిన ప్రభువు నాజ్ఞవలె,
వికలమైన భావి శుభార్థమువలె,
కాని కాలమున కాలుదిక్కువలె,
భగ్నమయిన భగవత్పూజన్ బలె.

13

ధ్వంసమయిన పద్మలత విధంబున,
శూరులు తెగిన చమూరంగమువలె,
నీటిధార యెండిన నది పగిదిని,
తిమిరము మ్రింగిన దివసప్రభవలె.

14

ముగియ క్రతువు కడిగిన వేదికవలె,
చల్లారిన వైశ్వానరు శిఖవలె,
రాహువు మ్రింగిన రాకాశశితో
కన్నుల వ్రేగగు పున్నమ నిశవలె.

15

పచ్చని రేకలు వన్నెలు వాడగ,
తుమ్మెదలు భయముతోడ లేచిపోన్,
ఏనుగుతొండముతో విదిలించిన
తామరతూడు విధాన భిన్నయై.

16

పతివియోగతాపమున సన్నగిలె
నీరు తీసిన వినిర్మల నదివలె,
స్నానపానములు మానగ కాంతివి
హీనమై మిగిలె కృష్ణరాత్రివలె.

17

మంగళాంగి సుకుమారి, రత్నగృహ
ముల నుండదగిన ముదిత, తాపమున
వడబడి సొగసె; నపుడపుడు పెరికిన
నళినీనాళము నడియెండనువలె.

18

చిక్కి, పట్టుబడి, చెట్టుకు కట్టగ
గజపతి కెడమయి గహనము నడుమను;
ఉత్తలమున నిట్టూర్పులు విడుచుచు
దిగులొందిన యేనుగు రాణింబలె.

19

అప్రయత్నముగ ఆమె కుంతలము
లొంటి పాయజడ యోజ రాజిలెను;
మేఘము విడిచిన మేదినిపయి రం
జిల్లెడి నల్లని చెట్లచాలువలె.

20

భయముచేత, ఉపవాసంబులచే,
అల్పాహార ధ్యాననిష్ఠల, కృ
శించియు కనుపించెను, తపస్సులో
సన్నగిలియు, వర్చస్వినియై సతి.

21

ఆర్తయయ్యెను దురంత దుఃఖమున,
భావనలో రఘువల్లభుని నిలిపి,
అంజలిపట్టి, దశాస్యోపరిభవము
ప్రార్థించెడి దేవతవలె నుండెను.

22

శుక్లారుణ చతూపక్ష్మంబులు
నాయనేడ్చు కులపత్నిని, ననింద్యను,
వేధించును పాపిష్ఠి రావణుడు
కామలుబ్ధుడయి రామునతన్మయిని.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౨౦

1

అపుడు దశాననుఁ డా పతివ్రతను
దీనవదనను, నిరానంద, నిటుల
పలుకరించె నర్మిలి చేష్టల, తీ
యని మాటల, తన మనసు మెఱయగా.

2

నన్ను చూచి, యెలనాగరో! భయమున
దాచుకొందు, ఉదరము నురోజము
లిందుముఖీ! నీ సుందరాంగములు
అన్యులకెవరికి నగపడరాదో !

3

నినుకామించితి నను ప్రేమింపుము,
సర్వాంగ గుణాశ్రయ సంపన్నవు,
మనసారగ బహుమానింపుము, నా
ప్రియ సహచరివై, త్రిభువన సుందరి !

4

మానవమాత్రులుగాని, కామరూ
పులగు రాక్షస జనులుగాని, మఱె
వ్వరును లేరిచట, వరవర్ణిని ! నా
వలని భయంబును వదలము నీ విక.

5

పిరికి దానవు విభీతమృగేక్షణ!
పరదారహరణ, వరణ, విహారము
లసురులకు స్వధర్మాచారంబులు,
ఇది నిస్సంశయ మేదు లోకముల.

6

అయినను నాపయి అనురాగము నీ
కంకురించనిది అంటబోను నిను,
వేచుగాక పూవిలుతు, డా సెగల
ఉడుకనిమ్ము నా యొడలులోపలనె.

7

భయమొందకు మీపట్ల దేవి! యిది
విశ్వసించి నను ప్రేమింపుము మన
సారగ, తీఅని వ్యధలన్ కుములుచు
శోకలాలసవుగాకు మీ వికను.

8

నేలమీద శయనింతువు, మాసిన
కోక కట్టుదువు, కురులు దువ్వ, వుప
వాసధ్యాన వ్యసన ప్రయాసలు
పనికిరాని వప్రస్తుతములు సుమి.

9

చాయ చాయ పూసరము, లగరు చం
దన సుగంధలేపనములు, తెల్లని
పట్టు చీరలును, స్వర్ణ ఖచిత ర
త్నాభరణములును అడుగక యున్నవి.

10

పలువిధముల మధుపాన రసంబులు,
అంచల ఱెక్కలు నించిన పాన్పులు,
నృత్తగీతములు స్వేచ్ఛాక్రీడలు,
అందిపొంది ఆనందింపుమి, యిక.

11

మదవతులకు తలమానిక మీ, విటు
లుండు, టశోభన; మొడలినిండ సొ
మ్ములు ధరియింపుము ముదితరో! నను పొం
దియు ననర్హ్హవై తి వెటు సంపదకు.

12

మిసమిసలాడుచు మేన మెఱయు నీ
పచ్చి జవ్వనము పరుగిడుచున్నది ;
సెలయేటిని తళతళమని పాఱెడి
తియ్యని తోయము తిరిగిరాదు సుమీ.

13

రూపకర్తయగు ఆ పరమేష్ఠియు,
నిన్ను తీర్చి మానెను తనపనియని
తలతు ; కానరా దిలలో సుందరి !
నీకు సాటియగు నెలత మఱొక్కతె.

14

రూపంబును, తారుణ్యము, గుణ సౌ
శీల్యములును పూచిన నినుచూచి, పి
తామహుడై నను తమకించు నిజము,
ఇతరుల సంగతి, నేల తలంచగ.

15

ఎందు నెందునీ సుందరాంగములు
సోకి తగిలె నా చూపులు రమణి
అందందే అవి హత్తి బందెవడి
కదలవు మెదలవు కట్టకట్టుకొని.

16

ఇతరవిమోహము నెడలించి, ప్రియా !
ప్రాణేశ్వరివయి పాలింపుము, నా
అంతఃపురమున కగ్రమహిషివై
ఊడిగములు కొను ముత్తమాంగనల.

17

ఈ లోకము నలుమూలలనుండియు
బలిమి నొడిచి కొనివచ్చిన నానా
రత్నరాసులును, రాజ్యము, నేనును
నీ యధీనములు నీరదవేణీ!

18

పృథివినంతయు జయించి, మించి, బా
హా విక్రమమున నాక్రమించి, స్వా
ధీనమయిన నానానగరీమా
లిక నర్పింతు జనకునకు నీకయి.

19

ముల్లోకంబుల నెల్ల వెతకియును
చూడలేవు నాతోడి బలాఢ్యుని,
చూడగలవు నీ వీడులేని నా
శౌర్యవీర్యములు సమరము వచ్చిన.

20–23

ఎన్నిసారులో మున్ను యుద్ధముల
నన్నెదిర్చి, భగ్నధ్వజ రథులయి,
దిక్కులు పట్టిన దేవదానవు, ల
శక్తు, లిపుడు రిపుసంరంభమునకు.

।

అందగించుకొను మాభరణంబులు
సుందరమగు నీ సుభగాంగకముల,
ధగధగలాడుచు ధన్యములగు, నవి,
నీ గాత్రము నంటిన సుకృతంబున.

।

సాలంకృతమై సంపూర్ణముగా
నలిచిన నీ సౌందర్యపర్వ మీ
క్షించ నెంతొ కాంక్షింతును దేవీ!
దాక్షిణ్యమున కటాక్షించుమి యిక.

24

చవిచూడుము భక్ష్యములు భోజ్యములు,
చెఱుకుపాలు దోసిళ్ళను త్రాగుము,
అనుభవించుము సమస్త భోగములు,
దానము చేయుము ధనమును భూములు.

క్రీడించుము నాతోడ యథేచ్ఛగ,
ఆజ్ఞాపించుము అధికారముతో,
ప్రియసతివై విహరింపగ నాతో
అభినందింతురు ఆప్తులు బంధులు.

25

చూడుమీవు మంజులగాత్రీ ! మా
మకసమృద్ధ సంపదను యశస్సును,
నారలు కట్టి వనంబుల త్రిమ్మరు
రామునితో నీకేమి కార్య మిక.

26

సిరిసంపదలు త్యజింపగ, జయకాం
క్షలు కడముట్టగ, కానల జటియై
కటికనేల పడకల పవళించుచు,
ఉన్నాడో లేడో అతడిప్పుడు.

27

ముందల కొంగలు క్రందుకొనగ, న
ల్లని మబ్బులు కప్పిన పున్నమ వె
న్నెల చందంబున నిన్ను చూడలే
డెందును రాముడు కుందసుగంధీ !

28

నా కైవసమయిన నిను రాఘవుడు
కైకొనజాలడు క్రమ్మఱ కామిని !
మును పింద్రుని కరపుల చిక్కిన హి
రణ్యకశిపుని అగణ్య కీర్తివలె.

29

నీ చిఱునవ్వులు, నీ పలు మొగ్గలు,
కర్ణములంటెడు కాటుక కన్నులు,
నాచికొనెను సుందరి! నా మనసును,
పాము కన్నెకను పక్షిరాజువలె.

30

అనలంకృతవైనను, మాసి నలిగి
పోయినట్టి కౌశేయము కట్టిన
నిన్ను చూచి రమణీ ! మన సొగ్గదు
స్వకళత్రంబుల సాంగత్యమునకు.

31

అంతఃపురి నా యనుగు చెలియలగు
కోమలాంగులకు స్వామినివై, పరి
పాలించుము, నా వైభవమ్మ స
ర్వస్వమ్మును నీ వశము కృశోదరి !

32

త్రిభువన రూపవతీ లలామ లెం
దఱో, అసితాలక ! అరసి నన్వలచి
వచ్చిరి, వారలు పరిచరింతు, ర
ప్సరసలు పరమేశ్వరి లక్ష్మినివలె.

33

ధనదు నోడిచి తెచ్చిన ధనకనకని
ధానరత్న సంతతులను, నన్నును,
స్వీకరించి, ఆలవోక సుఖముగా
అనుభవింపుము సమస్తము సుందరి !

34

తపమున, బలమున, ధనవిక్రమముల,
నాతో పోలడు శాతోదరి ! నీ
రాముడు; సాటికిరాడు నాకు తే
జో యశఃప్రశస్తుల నేనిప్రియా !

వర్గ ౨౦

35

తుమ్మెద గుంపులు చిమ్మిరేగ పూ
చిన తోటలలో, సింధు తీరమున,
స్వర్ణ మౌక్తికాభరణగాత్రివయి,
నా దండను సుందరి! విహరింపుము.



# సుందరకాండ

## సర్గ ౨౧

1

రావణుడటు లనరాని మాటలా
డిన కంపించి, కఠినశోకాహతి
వలవలనేడ్చుచు బదులాడగడగె
జానకి దీనస్వరము రాలుపడ.

2

పతిచింతా తాపముతో వెతలన్
విలపించు తపస్విని, పతివ్రత, శు
చిస్మితయై సముచితముగ నిట్లనె,
అడ్డముగా నొక గడ్డిపఱకగొని.

3

మఱలించుము నీ మనసును నా యెడ,
ప్రేమించుము నీ ప్రియజనంబులను,
తగదు నీ కిటు లడుగుట నన్ను; పా
తకుడు పుణ్యఫలితమును కోరుగతి.

4

పుట్టితి సత్కులమున, పుణ్యముచే
మెట్టితి మఱియొక మేటి యింటి, నే
చేయరాని పని చేయను, కులకాం
తాలోక నిషేధ, మిది అకార్యము.

5

ఇట్లు పలికి జగదేక యశస్విని,
కోపతాపములు కొంకకొంలాడగ,
క్రమ్మఱ పలికెను రావణువైపుకు
వీపు త్రిప్పి సాధ్వీధీరంబుగ.

6

ఏను నీకు తగు ఇల్లాలిని కా,
నన్యుని పత్నిని, అరయు మింగితము,
సాధుజనుల ఆచారము నెఱుగుము,
ధర్మము సాధుపథంబున నడచుట.

7

నీ నిజదారల నీ వెట్టుల ర
క్షింతువొ, ఇతరుల కాంతల నట్లె
రక్షించుట ధర్మపరాయణము, సు
ఖించుము స్వీయసఖీజనసంగతి.

8

తమ భార్యలతో తనివొందక, అతి
చపలేంద్రియులై సంచరించుచున్,
స్త్రీలను వంచించెడి దుర్మదుల, ప
రాభవింతురు పరమ పతివ్రతలు.

9

తెలిసినట్టి పెద్దలు లేరేయిట !
లేక వారిని నిరాకరింతువొ ! స
దాచారము లడగారిపోవ, నీ
వృత్తి యిట్లు విపరీతంబాయెను.

10-11

అనృతాత్ముండయి, అవినీతి పథ ప
రాయణుండయిన రాజు పాలనన్
బడిన రాష్ట్రమును పట్టణంబులును
ఐశ్వర్యంబును అంతరించుసుమి.

12

అదియట్లగుటను, అఖిలరత్న కూ
లంకషంబయిన లంకానగరము,
నీయపరాధాపాయము కతమున
సర్వంబును నాశనమగు శీఘ్రమె.

13

దూరాలోచన త్రోసిరాజని, వి
శృంఖలముగ చేసిన అకార్యముల
పాపములే నిను భక్షించు, అపుడు
సర్వభూతవములు సంతోషించును.

14

నీ పాలనమున నిష్ఠురబాధల
కగ్గమైన ప్రజ, ఎగ్గుతీఱెనని
సంతసింత్రు నీ చావును కని విని,
దేవు డరిష్టమును తీర్చెనటంచును.

15

నీ వైశ్వర్యము నీ ధనకనకము
లించుక ఆకర్షింపలేవు నను,
సూర్యుని ఛాయాసుందరివలె, రా
ముని తప్ప పరుని ముట్టదు జానకి.

16

లోకనాథు, సుశ్లోకు, రాఘవుని
దక్షిణహస్తము తలగడగాగొని
పూతయైన యీ సీత వేఱొకని,
తలచిచూడ, దిక, తాకుట యెక్కడ ?

17

వసుధా చక్రేశ్వరుడగు రాముని
కర్ధాంగిని, నే నార్యను, రాక్షస !
వ్రతినై శుచినై, స్వాత్మవేత్తయగు
విప్రోత్తమునకు వేదవిద్యవలె.

18

ఎడమై మందకు అడవిలో నడలు
కన్నె యేనుగును గజపతితో బలె,
విభునిబాసి దురపిల్లు నన్ను భ
ద్రముగా చేర్చుము రఘురామునితో.

19

ఘోరమరణమును కోరవేసి, నీ
పదవి నిలుపుకోతలతువేని, రా
క్షస! రాముని సఖ్యము నర్థింపుము,
కుశలమగును నీకును నీవారికి.

20

శరణాగత వత్సలుఁడు రాఘవుడు,
ధార్మిక చరితు, డుదారు, డుదాత్తుడు,
ఆతని మైత్రిని యాచింపుము, రా
వణ ! నీవింకను బ్రతుకతలంచిన.

21

రక్షణకోరిన ప్రాణుల కభయము
ఇచ్చు దయావ్రతు, డిక్ష్వాకులు, నను
పంపి, రాఘవుని ప్రార్థింపుము, నిను
సుప్రసన్నుడగుచు కటాక్షించును.

22

మన్ననతోడుత నన్ను విభునకు స
మర్పించిన శుభమగును నీ, కటుల
గాక, వేరుమార్గంబున నడచిన
చావు తప్పదు నిశాచరనాయక !

23

పిడుగు రాలియును విడుచుగాక నిను,
మఱచుగాక యేమటి అంతకుడును,
కోపించిన రఘుకులసోముడు, రా
త్రించర ! నిన్ను వధింపక విడువడు.

24

దిక్కుల గుండెలు గ్రక్కదల్చు రా
ముని కోదండ ధ్వనులను విందువు,
క్రూరములగు పిడుగులు కురిసెడి ఇం
ద్రుని వజ్రాయుధ రూక్షరావములు.

25

రామలక్ష్మణ పరాక్రమాంకములు,
కణుపులు తీర్చిన కలకు టలుంగులు
కురియును రావణ! కోరలమంటలు
గ్రక్కు కాలసర్పముల చందమున.

26

బంతులుగా రాబందులమంద, లె
డాపెడ దిగి, పట్టణమున తిరుగుచు,
రక్కసిమూకల అక్కి ముక్కులన్
పొడిచి పీకి తిను విడక సందిడక.

27–28

తన్నుకపోవును దానవవిషస
ర్పములను రామసుపర్ణుడు శీఘ్రమై,
అసురలక్ష్మివి హరించిన హరివలె,
ననుకొని పోవును నాథుడు రాముడు.

29

దానవులు జనస్థానమందు దా
శరథి శరంబుల చచ్చి చాళ్ళుపడ,
ఎదిరింపగలే కొదిగి రాక్షసుడ!
నిర్వహించితీ నీచకార్యమును.

30

జంట సింహముల వంటి అన్నద
మ్ములిరువు రాశ్రమమున లేనప్పుడు,
వాలు చూచి, యతిపోలెవచ్చి, వం
చించి నన్ను తెచ్చితి వసురాధమ!

31

నిలువగజాలవు నీవు రాఘవుల
వాసన పాటిన వాడలనైనను,
పులియడుగుల చప్పుడు వినవచ్చిన
దిక్కాకు మొగమగు కుక్కపోతువలె.

32

కదనములో ఒక్కడవు నీవు, వా
రిరువురు మగలు జయించుటయెక్కడ?
ఏక హస్తుడగు వృత్రుడు, ఇంద్రుని
చేతుల రెంటను చిక్కి కీడ్వడడె.

33

సన్నగిల్లు నది నున్న జలములను
ఆదిత్యుడు వడి అపహరించు గతి,
నీ ప్రాణములను నెగయజిమ్ము రా
ఘవుడు తోడ లక్ష్మణుడుండగ, అని.

34

గిరిని కుబేరుని గృహమున దాగిన,
వరుణుని రాజ సభన్ చొరబడిన, త
ప్పుకొనలేవు రాముని బాటికి, కా
లము తీరిన వృక్షము పిడుగునువలె.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౨౨

1

సీతయటు లుదాసించి కటువుగా
ఆడిన మాటల నాలకించి, ప్రియ
దర్శనయగు సీతాదేవిని గని
అప్రియ వచనము లాడె తీవ్రముగ.

2

ఎంత యిచ్చకము లేను నెఱపితిని
అంత అధీనుడ నయితి నింతులకు,
మెచ్చులాడితిని మెయి మెయి నెంతగ
అంత పరాభవ మందితి నెపుడును.

3

మనసై నిను తగిలిన నా కామము
అదిమిపెట్టుచున్నది క్రోధంబును,
పెడత్రోవను పరుగిడు గుఱ్ఱములను
బిగ్గలాగి నడిపెడి సారథివలె.

4

జనుల కెచట అపసవ్యములగు కా
మాపేక్షలు హృదయముల పొత్తుకొను,
అచ్చట స్నేహదయారసము లొలసి
బాధించును ప్రతిబంధకంబులయి.

5

ఆ కారణముననే కమలాక్షిరో !
వధ్యవయ్యు చంపక నిను విడిచితి,
బైసిమాలి సన్యాసిని తగిలిన
నిన్నెటు లవమానించినన్ తగును.

6

దూజితి నన్నే దురుసు మాటలను
మైథిలి ! ఆ-యవమాన భాషలకు,
ఒక్కొకదానికి ముక్కముక్కలుగ
కోయతగును నిను కూరకాడవలె.

7

అట్లు రావణుడు అనుగతముగ మా
టాడుచు మైథిలితోడ, తొడింబడి
క్రోధసంకుల క్షోభావశుడై
కొఅకొఅలాడుచు మఱల నిట్లనియె.

8

గడువిచ్చితి నింకను రెండు నెలలు;
అంతలోన కనకాంగిరో ! మైకొని
సాలంకృతవై అరుగుదెంచి నా
పడకటింటిలో పాన్పు నెక్కవలె.

9

రెండు మాసములు నిండక మును నను
భర్తగా గ్రహింపక, శఠించినన్,
నా తొలి భోగమునకు నిన్ను తఱిగి
పాకముచేతురు వంటసాలలో.

10

రాక్షసేంద్రుడు దురాగ్రహాంధుడై
జానకినటు తర్జన భర్జనలన్
భయపెట్టగ, వలవల నేడ్చిరి గం
ధర్వ దేవకన్యక లందఱు నట.

11

రావణు డట్టుల రజ్జులాడ విల
విలలాడెడి మైథిలిని చూచి, ఓ
ఢార్చిరి మటికొందఱు నిగూఢముగ
ముఖ నేత్రాధరముల సైగలతో.

12

సాటి చేడియల సానుభూతి సం
జ్ఞలను తేలుకొని జానకి అంతట,
చిత్తవృత్తి సౌశీల్య గర్వములు
అలమ, రాక్షసుని అలిగి పలికెనిటు.

13

చేయకూడ దిది చేటు కార్యమని
వారించమి నీ వారెవ్వ రిపుడు,
తెల్లమాయె రాత్రించర ! నీ
మేలు కోరువారే లేరని యిట.

14

దేవేంద్రునకు శచీవధూటివలె,
రామున కేను పురంధ్రిని రాక్షస !
ఈ త్రిలోకముల నీవు తప్ప న
న్నెవడడిగె మహానిష్ఠూరము నిటు.

15

అతి తేజోమయు డయిన రామునకు
అర్ధాంగిని నన్నడుగ తెగించితి,
రాక్షసాధమ ! విమోక్షము లేదిక
రాము బాణధారల హతమగుదువు.

16

కుందేలును మదకుంజరమును వసి
యించుగాక యెడ నెడ నొక అడవినే,
రామగజేంద్రము అంపిల్లిన కుం
దేలు చందమున నీవు పోయెదవు.

17

నాడొక బంగరు లేడి నెపంబున
ఇక్ష్వాకు ప్రభు నేమరించియును,
లజ్జించవు పాలసుడ ! అతని కగ
పడతివేని నీ బయసి బయటపడు.

18

క్రూరములై దుర్మోహంబున, నలు
పెత్తి తిరుగు నీ నెత్తురు కన్నులు,
పరమ పతివ్రతపై తార్చితి, వవి
రాలి నేల పడవేల ? అనార్యుడ !

19

ధర్మాత్ముండగు దాశరథికి నే
గృహిణిని, రఘువుల యింటి కోడలిని,
పలుకరాని పాపము లాడిన నీ
నాలుక నిలువున చీలదేమిటికి ?

20

పరమ తపస్సత్యము వ్యయమగునని
విభుని అనుమతి లభింపలేదనుచు
నిను బూడిదచేయను దశకంఠుడ !
భస్మము చేయు ప్రభావంబున్నను.

21

ధీమంతుడగు రాముని పత్నిని
అలవియగునె న న్నపహరించుటకు,
రావణ ! నీ మారణమునకై యిది
కారణార్థముగ కల్పించెను విధి.

22

బాహుపరాక్రమ బలధురీణుడవు,
ధనదు కుబేరుని అనుగు తమ్ముడవు,
ఎందు కీవు రఘునందును నటు వం
చించి, అపహరించితి వతని సతిని.

23
సీత వాక్యములు చెవిసోకిన రా
క్షసపతి రావణు డెసలారుచు, రూ
క్షము లగు కన్నులు కనకనమన ఘూ
ర్ణిలుచు ఆమెను సిరీక్షించె నలిగి.

24
కారు మొగులువలె కాయము కొలలగ,
దీర్ఘ బాహువులు దీర్ఘ కంఠములు,
కన్నులు నాల్కలు కాలుచు మండగ,
సింహాస త్త్వగతి చేష్టలు పైకొన.

25
చలియింపగ ఔదలను కిరీటము,
పూదండలు మెయిపూతలు చెదరగ,
మణికాంచన భూషణములు త్రుళ్ళగ,
తాండవించెను ప్రచండ కోపమున.

26
నడుముకు కట్టిన నల్లని మొలత్రా
డురియాడ దశాస్యుడు చూపట్టెను,
అమృత మంథనార్థము సర్పముతో
బంధించిన కవ్వపు కొండపగిది.

27
కండలు తిరిగి నిగారించెడి హ
స్తములు రెంటితో దైత్యుడు కనబడె,
జోడునెత్తములతోడ నొప్పు మం
దర శైలము చందమున నందముగ.

28
పొడుపుటెండ కెంపులు చిమ్మెడి కుం
డలములతో రంజిలెను రావణుడు,
రక్త పల్లవ ప్రసవాశోక స
మంచితంబయిన అంజనాద్రివలె.

29

కల్పతరువు చక్కన లోప్పొర, వ
సంతుశోభల నెసంగు రాక్షసు, డ
లంకృతుడయ్యు భయంకరుడాయెను,
వల్లకాటి దేవళము చందమున.

30

కోపవేగమున ఘూర్ణిలి, నెత్తురు
జొత్తిలు కన్నుల చూచుచు సీతను,
పలికె మఱల రావణుడు, దెబ్బతిని
బుసలుకొట్టు రాజస సర్పమువలె.

31

నిప్పచ్చరమున నిలువ నీడ లే
కవదయైన సన్యాసిని తగిలిన
నిన్ను నేడె ఖండించి ముగించెద;
తన దీప్తిని సందెను సూర్యుడు బలె.

32

జనకజతో నిట్లనుచు రావణుడు,
ఆగ్రహమ్మున మహోగ్రుండై, ఇటు
లాజ్ఞాపించెను అచ్చట నున్న భ
యంకర దర్శను లగు రక్షికలకు.

33

ఒంటి కన్నువా, రొక చెవివారలు,
పూడిన చెవు, లల్లాడు చెవులు, ఆ
వుల యేనుగుల చెవులు కలవారలు,
చెవులు లేని రక్షికలు నుండిరట.

34

అశ్వపాదములు, హస్తిపాదములు,
గోపాదంబులు, కుటిలపాదములు,
ఒక్కపాదమును, ఒక్కకన్ను గల
వార లుండిరి, అపాద లెందఱో.

35

కొలదికి మించిన కుచ, కంఠ, శిరో
ధర; లతిమాత్ర వదన, నేత్ర; లనా
స, లజిహ్వా; లతిరసన లతిజిహ్వాలు;
గోకిరి హరిముఖ భీకర, లెందఱో.

36

వారినిగని రావణుడు పలికె నిటు,
ఏయే విధముల ఏయే తంత్రము
లాచరింప తగు నట్లొనర్చి, నా
కలవఱచుడు మైథిలిని శీఘ్రముగ.

37

ఎప్పటికెయ్యది యొప్పిద, మటు మె
ప్పించియు, ఇటు లాలించియు సీతను.
దాన సామభేదంబుల వంచుడు,
వంగదేని కడపట తాడించుడు.

38

అట్లు రావణుడు ఆనబెట్టి ర
ఊికల; చెప్పినదె చెప్పుచు, కామ
క్రోధాతురులై కొసరి కొసరి, త
ర్జించగ సాగెను సీతను క్రమ్మఱ.

39

ఆ గతి నతిమోహంబున తమకిం
చెడి పతి నారసి కడపటి పెండ్లము,
ధాన్యమాలిని మదనపీడితయై
దాగిలి రావణు కౌగిలించుకొని.

40

పలికె నిటు మహాప్రభుచంద్రమ ! ఎం
దుకు నీకీ జానకి, దరిద్ర దే
వత, కృశాంగి, నరసతి ? క్రీడింపుము
నాతో నీకు మనసు తీరి తనియ.

41

దానవేంద్ర ! నీ దర్పబలార్జిత
భోగభాగ్యములు ముచ్చట తీరగ,
అనుభవింప వ్రాయడు పరమేష్ఠియె
దీని నొసట బాధింపగనేటికి ?

42

కామించని అంగనతో కలయిక
మనసును తనువును మలమల కాల్చును,
వలచు వనితతో వలరాచటికము
ప్రీతినిచ్చి ఈప్సితమును తీర్చును.

43

తచ్చనలాడుచు ధాన్యమాలినియు
వాటున బిగియగ పట్టె దశాస్యుని,
మెత్తగిల్లె నవమేఘశ్యామల
మసృణాంగుండగు అసురస్వామియు.

44

దశకంఠుడు అంతట అశోకవని
విడిచి, నేల కంపింపగా నడిచి,
భానువలయ దీప్తంబగు రాజభ
వనము ప్రవేశించెను సంభ్రమమున.

45

ఆవరించిరపు డసురేశ్వరు గం
ధర్వ యక్ష సుర నాగ కన్యకలు,
ఉడురుపాటువన్ గుదిగొని అందఱు,
చొచ్చిరి రావణు శోభన సదనము.

46

ధర్మపథమును వదలని మనస్విని
సీత నటుల తర్జించి, రావణుడు
వేసరిలి విడిచి వెళ్ళి, ప్రవేశిం
చెను భాస్వరమగు స్వీయసౌధమును.



18-3-1967



# సుందరకాండ

## సర్గ ౨౩

1

జనకరాజఋషి తనయను సీతను
రావణుడటు లనరాని మాటలని,
వెడలిపోయె, సేవిక లందఱికిని
ఆజ్ఞ లిచ్చి కఠినాతి కఠినముగ.

2

రాక్షసేశ్వరుడు రాణులతో తన
అంతఃపురమున కరిగిన వెంటనె,
అతిభయంకరాకృతులగు, రావణు
సేవిక లదవద సీతను మూగిరి.

3

దయ్యపురూపుల దైత్యచేటికలు
ఒడలెఱుంగని మహోగ్రకోపమున,
చుట్టుముట్టి నిష్ఠురమగు మాటల,
కారాడిరి కటకట పడ మైథిలి.

4

జన్మించె పులస్త్య బ్రహ్మకులం
బునను, వరేణ్యుడు, పుణ్యజనాగ్రణి,
ఈ దశకంఠుడు; ఏల నీవతని
కిల్లాలి వగుట కిష్టపడ వీటుల.

5

కురులన్నియు ఒక కోర కొప్పిడిన
ఏకజట యనెడి రాకాసి యొకతె,
రాగికన్ను లెఱ్ఱబడ బిట్టలిగి,
సీతను పిలుచుచు చేరి యిట్లనెను.

6

చరితార్థులగు ప్రజాపతు లార్వుర
లో నాలవవాడు పులస్త్యు, డతడు
బ్రహ్మ మానసోద్భవుడంచును వి
ఖ్యాతికెక్కె లోకముల నంతటను.

7

అతని సుతుడు మహర్షి సత్తముడు,
మానసభవుడు సమానుడు బ్రహ్మకు,
విశ్రవసుండని విశ్రుతుడాయెను,
సాధుతపస్తేజస్వి, మహాత్ముడు.

8

రావణు, డరికులరావణు, డావి
శ్రవసుని పుత్రుడు, రాక్షసాధిపతి,
అతని కీవు భార్యవు కాదగుదువు,
వినుము నేను చెప్పిన శుభార్థమును.

9

పిమ్మట మఱియొక పిల్లికనుల రా
క్షసి హరిజట, ఆగ్రహమున, మిడిమిడి
గ్రుడ్లు తిరుగ దారుణముగ ఇట్లనె,
సీతభీతయై చేష్టలు తడబడ.

10

ఎవ్వ డొక్కడె జయించెను సురపతి
తోడను ముప్పది మూడు కోట్ల దే
వతలను బాహాబల విక్రమున,
అతని కీవు భార్యవు కాతగుదువు.

11

పిదప ప్రఘసయను పిశితాశని యో
ర్తుక ఒడలెఱుగక ఒొప్పుచు రోజుచు,
దరిసి జానకిని తర్జన భర్జన
లాడె నిట్టుల భయానక భంగిని.

12

అనిలో వెనుచూపని శూరాగ్రే
సరుడు, పరాక్రమశాలి, రావణుడు,
నిను కోరగ, మన్నించి భర్తగా
చేకొన కేటికి శోకించెద విటు?

13

రాజు, మహాబలరాజి, రావణుడు
అభిమాన ప్రియురా లగు భార్యను
వదలి, నిను మహాభాగనుగా సే
వించు; వరించి, భజించు, సుఖింపుము.

14

వేలు వెలదులు వయాళింపగ, నా
నామణి గణరత్న సమృద్ధంబగు,
అంతఃపురి విడనాడి నిను కొలుచు
రావణు డే సువ్రతములు చేసితో!

15–16

వికటయనెడి రక్షిక యిట్లనె, వై
దేహీ! యెవ్వడు దేవ నాగ గం
ధర్వుల రణముల తరిమెను పలుమఱు,
అతడు నీ సరస అనువర్తించును.

17

ఇట్టి ప్రభావసమృద్ధు, డుదాత్తుడు,
దానవ భాగ్యవిధాత, రాజు, రా
వణుడు, నీవతని పట్టపు రాణివి
కావెందుకు రాకాచంద్రముఖీ!

18

ఆపయి దుర్ముఖి యను సేవికయనె,
ఎవని భీతి రవి యెండలు కాయడు,
పవనుడు విసరడు పడమటిగాడ్పులు.
ఏల నీ వతని కిష్టపడ విటుల?

19

ఎవనికి భయపడి జవజవ వణకుచు
పూలు విరులు దిగబోయు వృతువులు,
ఎప్పుడు వలసిన అప్పుడిచ్చును ప
యోధర భూధర వీధులు జలములు.

20

అట్టి రావణున కఖిల దైత్య సా
మ్రాజ్యాధిపతికి, రాజరాజునకు
ప్రాణేశ్వరివై రాణించుట కీ
వేల యిష్టపడవో లోలాలక!

21

నీ సుఖ శోభన నిత్యావృత్తమున
కొప్పగు మాటలు చెప్పితి స్మితముఖి!
భావింపుము నింపాదిగ మనసున,
ఒప్పుకొనుము లేకున్నను బ్రతుకవు.



2-4-1967

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౨౪

1

తదనంతర, మా దానవ సేవిక,
లతివికారముఖు లందఱొక్క గుమి
గూడి, జానకిని పీడించిరి వరు
షములగు దుర్భాషలతో పొడుచుచు.

2

పసిడిమంచములు, పట్టు పానుపులు,
అమరియున్న శుద్ధాంతఃపుర సుఖ
వాసము లేటికి వాంఛింపవు? నీ
వఖిల భూత మోహన మనోహరివి.

3

మానవ జన్మము కాన, మానవుని
భార్యవగుట భావ్యమె నీ, కయినను
రాఘవునుండి మఱల్పుము మనసును,
లేదు మీరిక కలిసెడి సుయోగము.

4

జగములలోపల సాటిలేని ధన
కనక వస్తు వాహన సంపన్నుడు
రావణు డాతని ప్రాణేశ్వరివై
సుఖముగ విహరించుము వైదేహీ !

5

మానవకాంతవు గాన వరించిన
రాముని, రాజ్యభ్రష్టుండైనను
ధ్యానము మానవు మానవుడగుటను,
నిజము నీ వనిందితవు శోభనీ !

6

ఆ రాకాసుల ఆఱడి మాటల
నాలించి మనోవ్యథల కగ్గమయి,
పద్మపత్రములవంటి కనుల బా
ష్పములు కాల్వలయి పాఱ నిట్టులనె.

7

నాకు చెప్పితిరి లోకారిష్టము
అగు మాటలు మీరంద ఱేకమయి,
మనసుకెక్కవే మాత్రము నవి, నే
చేయబోను దుష్కృతము నెన్నడును.

8

మానవ కన్యక మానిసి తిండికి
భార్య కాతగదు; పాటించను మీ
పాడుమాట, లెప్పాటను తథ్యము,
చంపి తినుడు మీ చలము చల్లబడ.

9

దీనుడు కానీ, దేశరాజ్య పద
హీనుడుకానీ, ఎవడు భర్త నా
కతడే దేవుడు; అనుసరింతు నే
నతని; సువర్చల ఆదిత్యునివలె.

10

హిమకరుతో రోహిణివలె, ఇంద్రుని
తోడ శచీసతి జాడ, వశిష్ఠుని
తోడ అరుంధతి పోడిమి, జీవిం
తును నే రామునితోడ నీడవలె.

11

చ్యవనుండు సుకన్యయు, అగస్త్యుడును,
లోపాముద్రయు, లోకారాధ్యులు
సత్యవంతుడును సావిత్రియు, కపి
లుడును శ్రీమతియు, విడువ రొండొరుల.

12

సగరుని కేశిని, సౌదాముని మద
యంతి, నలుని దమయంతియు, మును
పెటులనువర్తించిరో అటులనె నేనును
ఇక్ష్వాకుని త్యజియింపక మెలగుదు.

13

ఇట్లు జరుగు నా హింసాకాండను
చూచుచుండెను వనేచర కేసరి,
శింశుప వృక్షము చిగురు జొంపముల
నిశ్శబ్దముగా నిలిచి దాగుకొని.

14

సీత యట్లు నిరసించి పలుక విని
వికృతముఖులు రక్షికలు క్రోధమున,
ఒడలెఱుగక, యెగబడి సీతను కా
రించసాగిరి అరిష్టభాషలను.

15

వ్రేలు పెదవులును కోల నాల్కలను
ఒత్తుచు, గొడ్డండ్రెత్తి హస్తముల,
భయవేగంబున వణకుచున్న సీ
తను చేరగిలిరి దైత్య దూతికలు.

16

రాక్షసేశ్వరుని రాణి కాదగు అ
దృష్టము లేదీ దేబె కటంచును,
పట్టరాని కోపమున రక్షికలు
సీత నొఆసి ఘర్జింపగసాగిరి.

17

కావలిక త్తెలు కాఱులఱచుచున్
చుట్టిన, భయపడి, నిట్టూర్పులతో
శింశుపనీడకు చేరగవచ్చెను,
సీత బాష్పములు చేతుల తుడుచుచు.

18

ఆ వృక్షము చాయల రఘునందిని,
అసురు లేకమయి యాతన పెట్టగ,
అగలి దుఃఖమున దిగబడి, బెగ్గిలి
దీనముఖముతో తెర్లుచునుండెను.

19

చింతలచిక్కి కృశించిన దానిని,
దీనయై వనరుదానిని, మాసిన
చేలము కట్టిన సీతను, వేధిం
చిరి నలువైపుల చేరి రక్షకులు.

20

చూడ భయంబగు చుఱుకు చూపులను
గాదె కడుపు రాకాసి యొకర్తుక,
వినత పేరిటిది, కినుకను కనకన
లాడుచు మైథిలితోడ పలికె నిటు.

21

కట్టుకొన్న వలకాని స్నేహితము
పాలించితి, వికచాలుఃను జానకి!
ఏ ఘనకార్యము నేనియు అతిగా
సాగించిన కష్టాం కంపయగు

22

మానవ కులధర్మము జవదాటక
సలిపితిందనుక, సంతోషించితి,
మైథిలి! ఇపుడొకమాట చెప్పెదను
వేనును, వినుమది నీకు శుభంబగు,

23

రావణేశు భర్తగ వరియింపుము,
సర్వరాక్షసేశ్వరు డాతడు, భుజ
విక్రమశాలి, పరాక్రమవంతుడు,
రూపసి, దేవేంద్రునికి సమానుడు.

24

దాక్షిణ్యంబున, త్యాగశీలమున,
రూపమున, కృతార్థుండు రావణుడు,
మానవమాత్రుడు మందభాగ్యు, డా
రాఘవుని విడిచి రావణు చేరుము.

25

హరిచందనమును అలదు మంగముల,
మెఱుగు సొమ్ములను మెయి కై సేయుము,
నేడు మొదలు నీ మూడు లోకముల
కీశ్వరివై హసియింపుము మైథిలి!

26

అగ్నితోడ స్వాహా భగవతివలె,
దేవేంద్రునితో దేవి శచి పగిది,
నీవును రావణుతో విహరింపుము,
రామునితో నీకేమి కార్యమిక.

27

ఎట్లుచెప్పి తే నట్లు నీవు చే
యక హఠమున చెడనాడితేని, మే
మందఱ మిప్పుడె ఆకలి తీరగ
నీ మాంసముతిని నెత్తు రానుదుము.

28

వికట, పేరిటి మఱొక రాత్రించరి,
కినుకమీఱ పిడికిలి చూపించుచు,
పైకిదూకి యిటుపలికె సీతతో,
బలసిన ఱొమ్ములు బరువున వ్రేలగ.

29-30

పలికితి వప్రియములు పెక్కులయిన,
సైచితిమేమును జాలిని దయతో,
కాని నీ హఠము మానవు, మా చె
ప్పిన హితవాక్కులు విని నడుచుకొనవు.

31

ఇతరుల కెవరికి ఈదరాని సా
గరమున కివతలి గట్టిది, ఇక నీ
వున్న అంతిపురి చిన్నచీమ చొఱ
రాని సురక్షిత రాజనిశాంతము.

32

రావణుండు తన రాణివాసమున
నిను దాచె మహా నిక్షేపమువలె,
మేము కాపుదల మేల్కొని యుందుము,
ఎత్తుకపోలే డింద్రుం డయినను.

33

నీ హితవాదిని నేను మైథిలీ!
చెప్పిన మాటల చొప్పున మెలగుము,
శోక మడచి, అశ్రుల నాపు, మన
ర్థకములు చింతాదైన్యము లెందును.

34

త్యజియించి సంతతదైన్యము, భజి
యింపు, మసురరాజేశ్వరు రావణు
ప్రేయసివై సంప్రీతి సుఖింపుము,
మనసుతీర కామ్యక్రీడల సతి !

35

పిటికిదాన నీ వెఱుగవు, స్త్రీలకు
జవ్వనంబు శాశ్వతము కాదనుచు,
తరుణప్రాయము దాటక మునుపె, య
థాకామసుఖాధానము నెఱపుము.

36

మదిరేక్షణ ! యీ మలల లోయలను
పూచిన తోటల పొదరిండ్లను, ప
చ్చని మావుల చల్లని తావులలో
రావణు సహచరివై విహరింపుము.

37

రాక్షస గణముల రాజరాజు రా
వణుని వరింపుము భర్తారునిగా,
వేయిమంది అరవింద ముఖులు నీ
యడుగుల కడకువ మడుగులొత్తెదరు.

38

ఇపుడే చెప్పిన హితవాక్యములను
అవధరించి మనసార మెలంగుము,
లేదయేని గుండెలు పెకల్చి, నీ
తీయని కండలు తిందుము సీతా !

39

చండోదరియను బండరక్కసి యొ
కర్తుక ఒడ లెఱుగని క్రోధముతో,
శూలము త్రిప్పుచు నుడిసి మీదబడ
వచ్చి, సీతతో వదరసాగె నిటు.

40

లేడికనుల వ్రాలిక చూపులతో
భయమున ఒొమ్ములు వణకుచుండగా
సీతను కొనివచ్చిన వఱువాతనె
నమిలి మ్రింగవలె నని మనసాయెను.

41

గుండెచీల్చి, అడుగున కుడియెడమల
మంచిమాంసము నమలుచు, మెదడు మీ
గడ నంజుకొనుచు, కడుపునిండగా
ఆరగింప మనసాయె నాకపుడె.

42

ప్రఘస యనెడి దుర్జని యిటు లనుచెను,
తాళనేల, ఇది కూళ, కరాళిక,
గొంతుపిసికి దిగ్గురనచంపి, చ
చ్చిన దంచును ప్రభువునకు చెప్పెదను.

43

సంతోషించును స్వామియు నందుకు,
తినివేయుండని తీరుపుచెప్పును,
సందేహములే, దెందు కూరకీ
నసనస లంచును కసమస లాడెను.

44-45

అంత అజాముఖి ఆర్భటించెను, స
మముగ మాంసపిండములు పంచుడు, వి
వాదల కే నొప్పను, తెప్పింపుడు
చల్లని కల్లును, చవుల నంజుడును.

46

కడపట శూర్పణఖయను ఘోర ర
తిక వాయెత్తి వచించె, అజాముఖి
చెప్పిన ముచ్చట ఒప్పుగ నున్నది,
నాకు కూడ ఇది నచ్చిన పథకము.

47

కల్లుకడవ వేగమె తెప్పింపుడు;
సకలశోక నాశక పానకమది,
నరమాంసము తిని, సురను త్రాగి, న
ర్తించెద కుంభిల దేవతముంగల.

48

దేవజాతి పుత్రికల కీడయిన
సీత నట్లు హింసింప రక్కసులు,
ధైర్యమెడలి దుస్తర తాపంబున
విలవిలపోవుచు వలవల యేడ్చెను.



6-4-1967

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౨౪

1

రక్కసు లిట్టుల టంకెలు వేయుచు
ప్రాణగొడ్డములు పలుక పరుషముగ,
జనకపుత్రి వేసరి పరితాపము
పట్టలేక, ఒక పెట్టున నేడ్చుచు--

2

పలికె నిట్లు రావణు కావలి క
త్తెల చూచుచు మైథిలి మనోవ్యథల
పొడిచి పొర్లి వచ్చెడి కన్నీళ్ళ
కట్టిన గద్గద కంఠస్వరమున:

3

మానవకన్యక దానవపురుషుని
భార్య కాతగదు; పాలించను మీ
పాడుమాట లెప్పాటను, తథ్యము
చంపి తినుడు నన్ను చల్లార్చు వ్యథలు.

4

దేవకన్యలకు దీటగు జనకజ
రాకాసుల మాటాటములన్ బడి
సుఖ మెఱుగక నిష్ఠుర దుఃఖార్తిని
పొగులుచుండె దశముఖు తర్జనలకు:



14

5

మందవిడిచి వనమధ్యమందు తో
డేళ్ళ గుంపున బడిన లేడిపగిది
ఒడలంతయు లోనొదుగ ముడుచుకొని
వణకుచుండె నతిభయమున మైథిలి.

6

పొడుగుసాగి పువ్వుల గుత్తులతో
శోభిలుచున్న అశోకశాఖ అవ
లంబనముగ వల్లభుని స్మరించుచు
మనసు గాయపడ క్రుగ్గుచు నుండెను.

7

అంతుకనబడని అష్టకష్టముల
నడిసముద్రమునబడి శోకింపగ,
కనుదోయిని పొర్లిన జలములతో
స్నానమాడె జానకి సుస్తనములు.

8

రక్కసులటు లూరక వేధింపగ
ఛిన్నచిత్తయై విన్నబాటొ౦దయు,
భీతభీతయై సీత శోభిలెను,
సుడిగాడ్పుల కీడ్వడిన కదళివలె.

9

కాతరమతియై కంపించిన వై
దేహి వెన్నునన్ దీర్ఘదీర్ఘముగ
వ్రేలుకాడె ముడివిచ్చినజడ; పొద
లాడుచున్న కాలాహిచందమున.

10

శోకవేగమున సాగయగ చిత్తము,
నిట్టూర్పులు ఘూర్ణిల్ల, నార్తయై
విలపించుచు మైథిలి, వెడదకనుల
వెళ్ళబోసె కన్నీళ్ళు కడవలను.

11
హా ! రఘురామా యని వాపోవును,
హా ! లక్ష్మణ యని ఆక్రందించును,
హా ! కౌసల్యా ! హా సుమిత్రా ! య
టంచు స్మరించు, తపించును, తహతహ.

12
గడవరాదు లోక ప్రవాదమని
పెద్దలు చెప్పిన సుద్ది వాస్తవము,
కాలము రానిది కలుగదు మృత్యువు,
పురుషులకైనను పొలతులకైనను.

13
ప్రాణేశ్వరు నెడబాసి క్షణంబును
ఉండరా దటయ్యును నే జీవిం
తును రాఘవునకు దూరనై, నిశా
చరులు క్రూరముగ చెఱలు పెట్ట నిట.

14
నోచితి తక్కువ నోములు మును పిసి
నారినగుచు, ఈనా డనాథవలె
అల్లాడుదు; లవణార్ణవమున ఉ
ప్పెన గాడ్పుల బడి మునుగు నావవలె.

15
రక్కసి మూకకు దక్కి చిక్కుకొని,
ప్రియునిచూచు వీలయినను తోచక
శోకముతో దరిలేక క్రుంగెదను;
నీటివడికి తెగు ఏటి యొడ్డువలె.

16
ధవళ పద్మముల మివులు కనులతో
సింహామువలె ధర్షించి నడచు, నా
ప్రియుని రాఘవుని, నయభాషిని, ద
ర్శింతురు పుణ్యము చేసిన ధన్యులు.

17

మనసెఱిగిన స్వామిని, శ్రీరాముని,
సహవాస సుఖోత్సవములేక, నా
బ్రతుకు దుస్సహము; పచ్చివిసము తీ
వ్రముగా సోకిన ప్రాణి చందమున.

18

ఏ పాతకములు ఎఱిగీ యెఱుగక
కావించితినో గత జన్మములను,
ఇంత ఘోరమును ఇంత దారుణము
నగు దుఃఖము నిపు డనుభవించెదను.

19

రక్కసు లిట్టులు రాత్రిందివములు
కన్నులు మూయక కావలి తిరుగన్,
లభియింపడు నా విభుడిక, కావున
ప్రాణత్యాగమె పరమార్థంబగు.

20

ఎంత హీనమో యీ నరజన్మము
చచ్చుటకైనను సాధ్యముకా ది
ష్టానుసారముగ; అంతయును పరా
ధీనము లోకములోన జీవితము.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౨౬

1

ఆ విధమున వాపోవుచు జానకి
కండ్లనీళ్లుబికి కాల్వలు కట్టగ
ముఖము వంచుకొని బోరున ఏడ్చెను
తల్లడిల్లి పసిపిల్లచందమున.

2

పిచ్చిదానివలె, వికలచిత్తవలె,
శివమెత్తిన దానివలె, నేలబడి,
పొర్లాడెను వంపులు తిరుగగ మెయి,
అశ్వబాల చాయను జనకాత్మజ.

3

ఏమఱి రాఘవు డెడమైనప్పుడు
మాయవేసమున డాయవచ్చి, నను
బలిమిపట్టి రావణుడు తెచ్చె వడి,
పెనగులాడి యేడ్చినను విడువ కిటు.

4

ఇచ్చట రక్కసి మచ్చరి కత్తెలు
కోరాడగ చిక్కన బడి పొక్కుచు
దుస్సహార్తి వందురుచుంటిని; ఇక
బ్రతికియుండ నోపను క్షణమైనను.

5

రాముని కతిదూరంబుగ, క్రూరా
సురుల నడుమబడి శోభిల్లెడి నా
కెందుకు సొమ్ములు, ఎందుకు సంపద,
లెందులకీ దురదృష్టజీవితము ?

6

ఇంతటి కష్టము లీడ్చి మొత్తినను,
పిగిలి బ్రద్దలై పగులకున్న, దిది
నా హృది పాషాణమొ ? జరామరణ
శూన్యమయిన నిష్ఠురలోహార్ధమొ ?

7

ప్రియునకు దూరంబయి చిరకాలము
బ్రతికితి నెంతటి పాపజీవినో !
కాను కులసతిని, కాబో నార్య, ని
సీ ! యిక నా బ్రతుకెందు కుర్విలో.

8–9

ఈ నిశాచరు, నికృష్టు, నిషాదుని,
ఎడమకాలితో నేని స్పృశింపను,
ననుకోరె నృశంసను, డీది, తనకును
తన కులమున కంతకమని యెంచక.

10

ముక్కముక్కలుగ చెక్కిన కానీ,
చీల్చినకానీ, కాల్చినకానీ,
రావణు పజ్జకు రానురాను, నిజ
మేమిటి కిక మీరిట్లు వదరెదరు ?

11

పేరందిన రఘువీరుడు, ప్రాజ్ఞుడు,
సాధువృత్తనయశాలి, కృతజ్ఞుడు,
రామచంద్రుడు, డభిరక్తలోచనుడు,
నా దురదృష్టమునన్ శంకించెను.

12
తానొకడె జనస్థానంబున పదు
నాల్గువేల దానవులను దునిమెను,
అంత పరాక్రమవంతు డతడు, నను
రక్షింపని కారణ మేమగు నిప్పుడు?

13
పరికించిన రావణు డల్పబలుడు,
అపహరించి యిట ఆకట్టైను నను,
అమిత సమర్థుండగు, నా విభు డీ
ద్రోహి, నసురు, నెందుకు తునుమాడడు?

14
దండకాటవిని దానవయోధు వి
రాధు చంపె నా నాథుడు రణమున,
అసురుల నడుమన అగచాట్లు కుడుచు
నన్నేటికి కరుణన్ కాపాడడు?

15
కడలినడుమ దుర్గముగ కట్టిన
లంకలో విడిసి లగ్గపట్టు, టది
కష్టమైన నగుగాక, రాము శ
స్త్రాస్త్రముల కిచట అడ్డుకనబడదు.

16
దృఢ పరాక్రముడు, దివ్యాయుధ ధౌ
రేయుడు రాముడు ప్రియకళత్రమును
తెచ్చి యిచట బంధింపగ; ఆయమ
చెఱలు మాన్ప విచ్చేయ డెందులకు?

17
బందినై యిచట కుందుచుంటినని
తెలియదు విభునకు, తెలిసి యున్న తే
జస్వి రాఘవుడు సైచునే పరా
భవ దురాకృతము, పరపీడనమని.

18
అసురుడట్లు నన్నపహరించి పఱ
తెంచుచున్నపు డెదిర్చిపోరిన జ
టాయు వెపుడో తెగటారె, నింక నా
వృత్తాంతము పతి కెవ రెఱిగింతురు?

19
వృద్ధుండై నను వీర కేసరి జ
టాయువు రావణు నడ్డగించి పో
రాడెను నను కాపాడగ ఎక్కటి
కయ్యములో గ్రక్కదలక ఘనముగ.

20
నేనీగడ్డను దానవ ఘాతల
పాలయి దుఃఖిలు వార్త సోకినన్,
రాము డపుడె క్రూరాస్త్ర శస్త్రముల
లోక మరాక్షస లోకము చేయును.

21
లంకగడ్డ లవలన కంపిల్లపగ
జలము లింకి వార్ధులు శోషింపగ,
ఊరు పేరు లేకుండ మాసిపోన్,
నీచుని రావణు పీచమడంచును.

22
మగలు చావగా మిగిలిన మగువలు
ఇంటింటను పడి యేడ్తురు, నే నిపు
డేడ్చుచున్నటులు, ఏపును ప్రాపును
బూడిదయై పోవును లంకాపురి.

23
రామలక్ష్మణులు రణ దుర్జయు లీ
లంక నాల్గు మూలలును వెతకి, రా
త్రించరులను కడతేర్తురు; చావక
బ్రతుకడు శత్రువు వారి కంటబడి.

24

కాటి పొగలతో కార్కొన త్రోవలు,
గ్రద్దల గుంపులు గగనము కప్పగ,
సంకులమై యీ లంక శీఘ్రమే
వల్లకాడుగా పాడఱు గావుత.

25

ఈడేరును నా యిష్టము వేగమె,
మీ దుర్మార్గ నిమిత్తము లరయగ,
పోగాలము దాపున తోచును, విప
రీత కాలమిది యాతుధానులకు.

26

అశుభ సూచనము లగపడుచున్నవి
లంక నాల్గు కడలను; భావింపగ
అతి శీఘ్రమె మీ యైశ్వర్య ప్రభ
లాఱి, మాఱి, మాయమగును తథ్యము.

27

పాపి రావణుడు పడినంతనె; మును
ముట్టగ, చుట్టగ, పట్టరాని
లంక సర్వము కళా శూన్యమగును;
ధవుడు పోయిన విధవ రూపంబున.

28

పుణ్యాదినోత్సవములకు దూరమయి,
ధవులు లేని దానవ వధువులతో,
దీపములాఱిన కాపురములతో
ముండమోపివలె నుండు లంకయిక.

29

ఇంటింటను భరియింపరాని వెత,
పెద్దపెట్టున తపించి యేడ్చు రా
క్షస కులకన్యల కంఠరోదనము
లాలకింతు తథ్యము శీఘ్రముగనె.

30

రాముని శస్త్రాస్త్ర దవానలమున
కూలి, కాలి, సంకులమై, వెలుతురు
లేక, చీకటులు ప్రాక, హతాసుర
వీరులతో వెలవెంచు లంకయిక.

31

ఈ విధమున నశియించు లంక; నే
నిక్కడ రావణు గృహమున పడు క
ష్టంబులు విని, తత్క్షణమె రాఘవుడు
అభిసంధించును అస్త్రశస్త్రముల.

32-33

అధముడు క్రూరుడు హతక రావణుడు,
పెట్టిన గడువిదె కట్టిన, దైవమా
నాకు విధించిన వధమంత్రవు మృతి
పనిమీదనే వెలుచుక పడునోకో!

34

తామసించిన అధర్మ కర్మములు
దాకోలుపు మహోత్పాత ప్రళయము,
మాంసాశన మదమత్తులగు నిశా
చరులీ పర్యవసానము నెఱుగరు.

35

చలిది నగుదు రాక్షస రాజునకే,
నయిన నేమి చేయంగల దానను,
రక్తలోచనుడు రాము డగపడక,
అంతులేని శోకార్తిని కుములుచు.

36

ఎవరైనను నాకిచ్చుట యిప్పుడు
విషదానము కావించిన, శీఘ్రము
పతిని చూడకయె పితృపతి దర్శన
మున కేగుదును విముక్త దుఃఖనయి.

37

నేను బ్రతికియుంటిననని యెఱిగి యుం
డడు నా నాథుడు లక్ష్మణాగ్రజుడు,
ఎఱిగియున్న సోదరుల గతి ఊ
రకయుండరు వెతుకక జగమంతయు.

38

నే నెడబాసిన నిష్ఠుర దుఃఖము
తెరలి పొరలి బాధింప, వీరుడు స
హింపలేక త్యజియించి దేహమును
దేవలోకము నధిష్ఠించి యుండనగు.

39

నా నాథుని, నలినాయతనేత్రుని
దర్శింతురు నిత్యంబును అచ్చట,
సిద్ధులు, సురలు, ఋషిప్రవరులు, గం
ధర్వులు; వారలు ధన్యులు పుణ్యులు.

40

అట్లుగాక, పరమాత్ముడు రాముడు
ధర్మకాము, డిహ కర్మమోచనము,
కాంక్షించెనో ? ఇక్ష్వాకురాజఋషి
కెందుకు భార్యాహేతుబంధమిక.

41

ఒకరినొకరు చూచుకొనుచున్నపుడె
పెనగొను నరులను ప్రీతిప్రేమలు,
ఎడబాటున నవియెందు కొందఱికి;
రాము డట్టి దుర్జనుడు కాడుగద.

42

రామచంద్రునకు రాజమహిషినై
రాణించితి, దూరంబై భర్తకు
బ్రతుకుచుంటినిటు, భాగ్యమె తరిగెనొ ?
లోపించెనొ నాలో సుగుణంబులు?

43

అప్రియ మెఱుగని సుప్రసన్ను, డరి
కుల మర్దనుడు, రఘుకులవర్ధనుడు,
అతనికి దూరంబయి నేనిటు బ్రతు
కుటకన్నను చచ్చుటయె శ్రేయమగు.

44

అట్లుగా, కిరువురన్నదమ్ములును
శస్త్రాస్త్రములను సన్యసించి, వ
ల్కలము లూని, ఆకులలములు తినుచు
వానప్రస్థ వ్రతులై సురిగిరొ.

45

లేక, రాక్షసకులేశుండు, దురా
త్ముండు, రావణుడు, ద్రోహవ్యూహము
పన్ని, రాఘవుల నన్నదమ్ముల ను
పాయముగా మటుమాయము చేసెనొ!

46

కాలమిట్టు లొడిగట్ట కష్టములు
కాలమృత్యు సాంగత్యము కోరితి;
దుఃఖ పీడనల దొరలుచు నున్నను,
మృత్యుదేవత సమీపింపదు నను.

47

కిల్బిషములు కడిగిన మహాత్ములు, ము
నీంద్రులు ధన్యులు, ఇష్టానిష్ట స
మాధానములైన మనసులను
వర్తింత్రు, మహాభాగులు వారలు.

48

ప్రియమున దుఃఖము పయికొన దెవరిని,
అప్రియమున భయ మలమట పెట్టును,
రెంటినికూడ పరిహరించి నిలుచు
మహనీయులకు నమస్కరించెదను.

49

హృదయం బెఱిగిన ప్రియధాముడు, రఘు
రాముని కటుదూరం బైతిని; ఇటు
పాపి రావణుని బందినైతి, నిక
ప్రాణత్యాగమె పరమశరణ్యము.



# సుందరకాండ

## సర్గ ౨౩

1

ఇట్లు జానకి అనిష్టములాడగ,
ఆలకించి క్రోధావేశంబున
క్రూర రాక్షసులు కొందఱు వెళ్ళిరి
రావణునకు వార్త నివేదింపగ.

2

తిరిగివచ్చి చెచ్చెర రక్షిక లు
ద్రేకముతో మైథిలిని చుట్టుకొని
చెప్పిన సోదెనె చెప్పగ సాగి ర
నర్థార్థకముల నపరాధోక్తులు.

3

సీతా! పాతక భూత, వనార్యవు,
సాహసించితివి ద్రోహకర్మకిటు,
రాక్షసులము మేమీ క్షణంబుననె
భక్షింతుము నీ పచ్చి మాంసమును.

4

జానకినటు తర్జన భర్జనలన్
దైత్య సేవిక లుదాసీనింపగ,
త్రిజట పేరి కులవృద్ధురాలొకతె
మేల్కొని తత్క్షణమే యిటుల పల్కెను.

5

తినబోకుడు సీతను, క్రూరులు మీ
రనుగు బిడ్డయిది జనక మహర్షికి,
రాజేంద్రుడు దశరథునకు కోడలు;
భక్షింపుడు మీ కుక్షినిండ వను.

6

కలగంటిని నే గడచిన రాతిరి,
ఒడలెల్ల గగుర్పొడిచెను దిగ్గన,
కనుగొంటిని రాక్షసుల నాశనము,
జానకీ విభుని జయ మహోత్సవము.

7

అట్లు త్రిజట వెఱగంద వచింపగ
ఉలికి రాక్షసులు ఉత్రోక్రశముతో
తడబడు చామెను అడిగి, రేమి చూ
చితి నిశి కలలో చెప్పుము మాకని.

8

సేవికలందఱు వావిడి అడిగిన
నాలకించి, ఆమూలాగ్రముగా
విప్పి చెప్పెనా వృద్ధ, త్రిజట, తన
ప్రాతఃకాల స్వప్న కథ నిటుల.

9–10

గజ దంతముతో కట్టిన పల్లకి
హంసలు మోయ విహాయస వీధిని;
వచ్చె రాముడు ధవళదుకూల మా
ల్యములను తాలిచి లక్ష్మణ సహితము.

11

సాగర జలములు రేగి చుట్టు శ్వే
తాద్రిమీద కననయ్యె సీత, శు
క్లాంబరధారిణియై రామునితో ;
భాస్కరు పజ్జ ప్రభాదేవతవలె.

12
ఆదెస నొక కొండంత యెత్తయిన
నాలుగుకోరల నాగమెక్కి, ల
క్ష్మణునితోడ రాఘవు డొరసి ప్రకా
శించుచుండ చూచితిని స్వప్నమున.

13
స్వీయదీప్తి రాజిల్ల, శూరశా
ర్దూలము లిద్దరు తోడుతోడ తె
ల్లని చీరెలు మాలలు ధరించి, యే
తెంచిరంత వైదేహి దాపునకు.

14
రాజకుమారులు రామలక్ష్మణులు
ఎక్కివచ్చిన గజేంద్రము దరియగ,
జానకి ఆకాశ నగాగ్రము దిగి
ఎక్కెను తెల్లని యేనుగు వెన్నున.

15
అగుపించెను నాకపు డొక అద్భుత
దర్శనంబు, సితాసితలోచన
విభుని అంకమును విడిచి సూర్యచం
ద్రులను కరంబుల దువ్వుచున్నటుల.

16
కలలో పిమ్మట కానుపించెను కు
మార వీరసింహము లిద్దరు వై
దేహితోడ నధిష్ఠించిన వె
ల్లేనుగు లంకపయిన్ చనుదేఱగ.

17
ఎనిమిదికాం డ్లెనయించిన రథమును
తెల్లని యెద్దులు తిన్నగ లాగగ,
కాకుత్థాన్వయ రాకాచంద్రులు
సీతతోడ విచ్చేసి రీ దెసకు.

౧

అతడు పరబ్రహ్మము, పరతత్వము,
పరమబీజ, మహాపరమార్థము,
పరమజ్ఞానము, పరమక్షేత్రము,
కారణకారణ కల్పము రాముడు.

౨

ప్రథిత శంఖచక్రగదాభరణుడు,
హసిత పుండరీకాయతేక్షణుడు,
నిత్యశ్రీవరణీయు, డజేయుడు,
శ్రీవత్సాంక మహోవక్షు డతడు.

18

ప్రజ్వలించు పుష్పకము నెక్కి, ల
క్ష్మణునితోడ రాఘవు డేతెంచెను,
తెల్లని మడుపులు దీపింపగ, తె
ల్లని పువ్వులదండలు వ్రేలాడగ.

19–20

సూర్యకిరణములు చూఅబోవు పు
ష్పకము నెక్కి రఘువరు డేతెంచి, ఉ
దీచికి తిరిగెను, త్రిభువనములు సచ
రాచరముగ బ్రహ్మాండము కదిలెను.

21

ఇంకను కలలో ఇట్లు లగపడెను,
భార్య సీతయును, భ్రాత లక్ష్మణుడు
వెంటనుండ దీపించుచుండె, రఘు
రాముడు విష్ణుపరాక్రమధాముడు.

22

సురులేనియును అసురులేనియు, రా
క్షసులేనియు తేజస్వి రాఘవుని
ముందునిలిచి జయమందు టశక్యము;
పాపులు స్వర్గము పడయలేనిగతి.

23

రావణేశు నారసితి వేఱొకట,
నూనె పూసుకొని మేనంతయు, ఎ
ఱ్ఱని గుడ్డలు ఎఱ్ఱని దండలు ధరి
యించి, త్రాగి, ఒడ లెఱుగక యుండెను.

24

పడ ద్రోయగ పుష్పకమునుండి నే
ల బడిన రావణు, లాగి యీడ్చుకొని
పోవుచుండె నొక బోడితలది, న
ల్లనిది, నల్ల కోకను ధరించినది.

25

రక్తచేలములు రక్తమాల్యములు
క్రాలగ, తైలము త్రాగుచు, నవ్వుచు,
ఆడుచు గాడిదె లీడుచు బండిని,
మతిపోయిన దిమ్మరివలె నుండెను.

26

దక్షిణ దిక్కుకు తరలిపోవుచున్
గాడిదె త్రోయ దిగంబడి, తలక్రిం
దుగ దొర్లుచు, భీతునివలె, వేఱొక
యెడ రావణు డగపడె దీనునివలె.

27

అటు, పడిలేచి దశాస్యుడు, మదవి
హ్వాలుడై భయవిభ్రాంతులు పెనగొన
వగపెగయ, దిగంబరుడై వాగుచు,
ఉన్మత్తునివలె ఉక్కటి, దిక్కటి.

28

చిమ్మచీకటిని చెడువాసనతో
నరకమువలె దుర్భరమై మురిగెడి
మలపంకము లోపల తూలి తలకి
పడెను దశగ్రీవుడు తలమున్కగ.

29

ఆ మలపంక ప్రహదమందు దశా
స్యుని కంఠంబుల కురివేసి బిగిచి,
లాగుచుండె నల్లనిదొక్క తె, మెయి
బురద జాఱ, కాపులు జీఱాడగ.

30

గోచరించి రట, కుంభకర్ణుడును,
దశముఖు సుతులును తలలు బోడిగా,
నూనె పూసుకొని మేనుల నిండను,
స్వప్నమందు విస్పష్టముగా నిశి.

31

పందినెక్కె రావణుడు, ఇంద్రజితు
పాదుకొనె మొసలిమీద, కుంభక
ర్ణుండొంటెపయిని నూల్కొనె, నందఱు
దక్షిణంబుగా తరలిరి దిరదిర.

32

తెల్లని గొడుగుల చల్లని చాయలు
క్రందుకొనగ, శ్రీచందనము నలది,
శ్వేతాంబరములు, సితసుమసరములు
విలసిలనుండె విభీషణు డొకరుడు.

33–34

నృత్తగీతములు నెగడ, శంఖ దుం
దుభి వాద్యంబులతో నుండెను; మే
ఘునివలె మొరయుచు, కొండబోని నా
లుగు కోరల యేనుగుపై నాతడు.

35

నలుగురు మంత్రులు కొలిచి వెంటరాన్
తూర్యనాదములతో విభీషణుడు,
వచ్చె విమానము వద్దకు; చూచితి
సరసజనసమాజ ప్రకరమునట.

36

రక్తవస్త్రములు రక్తహారములు
తాల్చి, పొరిబొరి త్రాగిరి దైత్యులు,
కుంజర హయరథ గోపుర తోరణ
ములతో లంక సముద్రమున మునిగె.

37

రావణేశ్వరుడు రాజధానిగా
రాత్రిం దివములు రక్షించిన యీ
లంకను, రాముని లెంక వానరుడు
కాల్చుచుండగా కాంచితి కలలో.

38

నూనెలు త్రాగుచు దానవకాంతలు
శివమెత్తినగతి చిందులు త్రొక్కుచు,
అఱచుచు నవ్వుచు అదవద చొచ్చిరి
బూడిదయై పొలివోయిన లంకను.

39

కుంభకర్ణుతోకూడ, దీటయిన
రాక్షస వీరధురంధరు లందఱు,
రక్తవస్త్రములు గ్రహియించి ప్రవే
శించిరి గోమయసిక్త తటాకము.

40

కావున నిక రాక్షసు లందఱు, వై
తొలగిపొండు, పోదుఱు నాశనమయి,
సీతను కలిసెను శ్రీ రఘురాముడు
రాక్షసకుల మారణ మొనరించును.

41

రాఘవునకు ప్రియురాలు, వనంబుల
విడనాడక సేవించెను, మన్నన
చేయు నతండును, సీతను తర్జిం
చిన మిము భర్జించును సహియింపడు.

42

శాపనార్థములు చాలింపుడు, సాం
త్వన భాషల సీతను యాచింపుడు;
ఇదె మనకందఱ కిపు, డగత్యమని
చింతించెద నా చిత్తము లోపల.

43

ఈ స్వప్నార్థము ఎవరి విషయమో
ఆ దుఃఖితయగు వైదేహి చెఱల్
తీఱిపోవు, సిద్ధించు నా సతి అ
భీష్టార్థంబులు ఇచటనె శీఘ్రము.

44

బాధించితి మీవఱ కాసతి నని
అరమర తడయక యాచింపుడు, రా
క్షసకుల భయ మాసన్నంబయినది;
రాముని శస్త్రాస్త్ర ప్రహారణముల.

45

జాలిగుండెగల జానకి దేవత
వంటిది, రాక్షస భామినులను కా
పాడ చాలినది; ప్రాంజలికి అధీ
నులు కారె మహాత్ములు లోకంబున.

46

అసిత విశాలములయిన కనులతో
శోభిలు జానకి శుభ్రాంగములను
పరికింపగ కనబడ వనార్య ల
క్షణము లేవియును సంశయింపకుడు.

47

దేవి విమానము క్రేవల చేరిన
యపు డగపడె, ఆయమ మేని పసిమి
వన్నెమాత్ర మొకవాసి తఱిగె, దుః
ఖము లోర్వగలది కాని కతంబున.

48

తలతు నేను మైథిలి మనోరథం
బింతలోనె యీడేర నున్నదని;
రాక్షసేంద్రుని పరాసనమును, రఘు
రాముని జయసంరంభము చూడగ.

49

ఎదియొ మహత్ప్రియ మీమె పొందునని
కనబడు శుభసూచన లించించుక;
చెంపలు తాకెడి సితకటాక్ష మదె
కదలుచు నున్నది కమలదళమువలె.

50

అన్యుల మనసుల ననునయించు ఈ
సీత పరమ దాక్షిణ్య దయాకరి,
ఆమె యెడమచెయి అదరుచున్న దొ
క్కటి పులకించి అకారణంబుగా.

51

ఏనుగు తొండముబోని జనకసుత
వామోరువు గరుపారిన తీరున
కదలుచు నున్నది కాంతుడు రాముడు
ముంగల అంతికమున నున్నట్టుల.

52

ఎట్టయెదుట ఫలవృక్షము కొమ్మను
ఉన్న శకుంతము ఉత్సాహముతో
పలుకుచు నున్నది స్వాగతవచనము;
చుట్టము రాకకు సూచకంబుగా.

53

విభుని జయము విని వేడుకపడి హ్రీ
మతియై బాలామణి, అంత దయన్
ఈ కల నిజమగునేని ధ్రువంబుగ
అభయమిత్తు మీ కందఱకే ననె.



14-4-1967

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౨౮

1

తన దుష్కామితమును రావణు డటు
తెలిపినవిని వైదేహి భయార్తిని
కళవళపడి గాసిలె నడవిని సిం
హముబాటి పడిన ఆడేనుగువలె.

2

భయపెట్టగ రావణుడు, రక్కసులు
చుట్టుముట్టి చెఱపెట్ట సీతయే
డ్చుచు నుండెను, జనశూన్య గహనమున
వర్జింపబడిన బాలిక పోలిక.

3

కాలము రానిది కాదు మృత్యువని
పెద్దలు చెప్పిన సుద్ది యథార్థము,
దుస్సహ భయమున క్రుస్సి కుములుచున్
బ్రతికెద నెంతటి పాపరాశినో.

4

సుఖము లేక యించుకయును, దుఃఖము
పుట్టలు పెట్టగ, గట్టిపడిన నా
గుండె యెండియు పగులదు ముక్కలుగ;
పిడు గడచియు నెఱపడని బండవలె.

5

నా దోషము సుంతయు లేదిందుకు;
చంపవచ్చు రాక్షసు డప్రియురా
ల ననుచు; అటులని అద్విజునకు ద్విజు
డీయ తగునె ఆమ్నాయ మంత్రమును.

6

లోకనాథు డిక్ష్వాకు డింధు రా
కున్న రాక్షసుడు నన్ను కోయు నిక
సన్నని శితశస్త్రముల గర్భగత
శిశుశల్యములను ఛేదించు పగిది.

7

నేరమునకు బందెంపడి, ఉరికయి
వేగు తస్కరుని వేదనవలె; ఈ
రెండుమాసములు నిండవు నాకె
న్నటికిని, దుఃఖమున మఱుగుచున్నను.

8

హో! రామా! రామానుజ లక్ష్మణ!
హో కౌసల్యా! అకట సుమిత్రా!
అల్లాడెద నేనల్పభాగ్య నిట;
ఉప్పెనపాలయి ఉలుకు నావవలె.

9

నా మూలంబున నాడు రామల
క్ష్మణు లుడిపోయిరి మాయమృగము మిష
కోడెలు పోలిన జోడు సింహములు
పిడుగుపాటుతో అడగారిన గతి.

10

మృగరూపము ధరియించి మోహపె
ట్టెను దుష్కాలము నను, తత్ఫలముగ
కోల్పోతిని రఘుకులాభరణుని,
గుణమణియగు లక్ష్మణుతో నప్పుడు.

11

హా రామ! మనోహరముఖరాకా
సోమ! దీర్ఘభుజ శోభనకామా!
సత్యవ్రత! రాక్షసులు నన్నిచట
కడతేర్చెడి సంగతి నీ వెఱుగవు.

12

ఇతర దైవముల నెఱుఁగ, కోర్కెతో
నేలపాన్పుగా, నియత ధర్మముల
పరగితి పాతివ్రత్య దీక్ష; వ్య
ర్థంబాయె నది కృతఘ్ను సేవవలె.

13

ధ్వంసమాయె నా ధర్మాచరణము,
వ్యర్థమాయె నా పాతివ్రత్యము'
చిక్కి, చాయచెడి చెంత నీవు లే
కా ఉంటిని సంగమ నాశాకిరణము'

14

నడపి తండ్రియానతి, తలపెట్టిన
వ్రతము పూర్తిగ నివర్తించి, కృతా
ర్థుడవై, యింటి వధువులు భజింపగ,
సుఖియించెద వనుచున్ భావించెద.

15

నీయెడ బద్ధస్నేహంబున సలి
పితిని దీర్ఘముగ వ్రతములు తపములు,
వ్యర్థములై కొనివచ్చె నాశన మి
కీ! త్యజింతు దురదృష్ట జీవితము.

16

ఈ హేయపు బ్రతు కిపుడె త్యజింతు వి
షము త్రాగియో, శస్త్రము నర్దించియో;
శస్త్రముగాని విషంబుగాని నా
కిచ్చు దాత యొక డిచట కనబడడు.

17

ఇటు పలు తెఱగుల కటకటపడి, క
ష్టము గట్టెక్కగ జనకజ తెగబడి
తన జడనే ఉరిత్రాడుగా పెనచె,
యముని పాదమూలము చేరుదునని.

18

సర్వమృదుల రంజనగాత్రి సమీ
పించి శింశుపావృక్షము, శాఖను
పట్టుకొనెను, భావమున రాముల
క్ష్మణులను కులమును స్మరియించుచపుడు.

19

శోక నిమిత్తములుగాక, లోకమున
ధైర్యకారణార్థములని చిరముగ
సుప్రసిద్ధమగు శుభశకునంబులు
తోచె భావి ఫలసూచన లార్యకు.



15-4-1967

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౨౯

1

బాధలు విడువక వేధింపగ, సం
తోష మెఱుంగని దురదృష్టను, దీ
నను సీతను పైకొనె శుభచిహ్నాలు,
శ్రీమంతులను పరిజనంబులవలె.

2

నలుపుతెలుపు జీఱలు తళుకొత్తగ,
వంపుకురులతో వాలిన ఱెప్పల
యెడమ కన్నొకటె జడికొని అదిరెను,
చేపలు కొట్టిన చెందామరవలె.

3

అగరు చందనము లలద నెసగి, ప్రియు
నుపలాలనలకు యోగ్యంబయి, కం
డగల గుండ్రని జనకజ యెడమచెయి
అదరసాగె వడి పదపడి చిరముగ.

4

ఏటవాలయిన యేనుగు తొండము
పోలి, ఒత్తుకొని, క్రాలు ఎడమతొడ,
వదలక పలుతడవలు కదలాడెను,
కట్టెదుటను రాఘవు డున్నట్టుల.

5

మేలిమిపసిమిని మెయిమెఱయగ, దా
నిమగింజల దంతములు తొలక, శుభ
గాత్రి, వినిర్మల నేత్ర మేన, కొం
చెము మాసిన చేలము దిగజాఱెను.

6

పూర్వాపరముగ పొడకట్టిన శుభ
చిహ్నములు తలచి సీత తెప్పఱిలె,
గాలికి ఎండకు క్లాంతమైన వి
త్తనము వానలకు తలిరుపోయుగతి.

7

అధరబింబ మెఱుపార, కనులు, కను
బొమలు, ఱెప్పవంపుల కురులు మెఱయ,
సితరదనములు హసింప, సీత శో
భిల్లెను రాహువు విడిచిన శశివలె.

8

ఆఱగ శోకము, జాఱగ తందర,
తీఱగ తాపము, మీఱగ హర్షము,
సీతముఖము భాసిల్లెను; చంద్రో
దయమున పులకితమయిన రాత్రివలె.



# సుందరకాండ

## సర్గ ౧౦

1

చెట్టుకొమ్మలను గుట్టుమట్టుగా
కూరుచున్న కపికుంజరుండు వినె,
త్రిజటకలయు, వైదేహిమాటలును,
రాకాసుల తర్జనభర్జనలును.

2

సుందరంబయిన నందనవనమున
దేవత తీరున తేజరిల్లు సీ
తాదేవిని కని తలకి హనుమ యిటు
చింతించెను తన చిత్తంబున నిటు.

3

ఎవరికోసమయి యెల్లదిగ్దిగం
తములు వెతకుచున్నారో వానరులు
వేలు లక్ష, లాబాల, రాఘవుని
ప్రేమమాల కనుపించె నా కిచట.

4

జాగ్రన్మతినై శత్రుల శక్తిని
వేయికండ్ల కనిపెట్టుచు నంతట,
గూఢముగా తిరుగుటవల్లనె, ఈ
వాడల నీమెను చూడగల్గితిని.

5

లంకగడ్డ నలువంకల త్రిమ్మరి
కనిపెట్టితి రాక్షసుల రహస్యము
పరికించితి రావణుని ప్రభావము,
లక్షించితిని బలపరాక్రమములు.

6

సకల జీవులను సమముగ నరయు ద
యాళువు రాఘవు, డప్రమేయు, డా
తని కళత్ర మీమెను, పతిదర్శన
కాంక్షిణి, ననువుగ కనికరింపతగు.

7

పూర్ణచంద్రముఖి, పుట్టి యెట్టి క
ష్టము లెఱుగని రాజకుమారిక, విడు
గరతోచని దుఃఖముల నీదు, నీ
సుదతి నూఱడించుట నా ధర్మము.

8

శోకతాపమున సోలిన దేవిని
జానకి నోదార్చకపోయిన నా
పోక పాపమగు, రాకయు వ్యర్థం
బగును, మిగులు నాయాసం బొక్కటె.

9

ఎట్లు కదలి నే నిచటికి వచ్చితి,
అట్లె వెనుతిరిగి అరిగిన; తన కిక
రక్షణ లేదని రాజపుత్రి, శశి
విశద యశస్విని, విడుచు ప్రాణములు.

10

అచట రాముడు, మహాబాహువు, పూ
ర్ణేందుబింబముఖు, డీయమ కోసము
వేగుచున్నవా డాగరానివెత;
న్యాయమగును నా కాతని తేర్చుట.

11

ఈ నిశాచరులు మానక కావలి
కాయుచుండ, జనకజతో భాషిం
చుట యుక్తముకా, దెటులీ దుస్సం
కటము గడుచునని కళవళపడె కపి.

12

మిగిలియున్న యామిని తుదిగడియలు
గడవక మునుపే కలిసి జానకిని
ఊరడించు టది యుచితము, లేకు
న్నను విడుచును ప్రాణములను తప్పక.

13

ఇంతదూర మే నేతెంచియు జా
నకిని పలుకరింపక వెళ్ళిన; అట
'నన్ను తలచి యేమన్న దామె' యన
నేమి చెప్పుదును రామచంద్రునకు.

14

జానకి సందేశము గైకొనక
తిరిగి వెళ్ళినన్ తీవ్రముగా కో
పించి చెచ్చెఱ దహింపవచ్చు రఘు
వీరుడు తీక్షణ వీక్షణంబులను.

15

రామ కారణార్థముగ నేను సు
గ్రీవుని ప్రభువును ప్రేరేపించిన,
దండు సాగు, నాతండు, సైన్యసం
రంభమెల్ల వ్యర్థంబయి ముగియును.

16

ఈ నిశాచరు లొకింత యేమఱిన
సందు చూచి, దుస్తాపజ్వాలల
తెరలుచున్న మైథిలి నల్లల్లన
ఓదార్చెద నిందుండియె కదలక.

17

నా రూపము చిన్నది, వానరుడను
పోల్చలేరు నా పొడవును, మఱియును
దానవు లెఱుగని మానవ సంస్కృత
భాషలోన సంభాషించెద, నిట.

18

అయినను, నే బ్రాహ్మణజాతునివలె
సంస్కృతంబులో సంభాషించిన,
నను రావణుడని అనుమానించును
సీత భీతయగు, చెడును సర్వమును.

19

కిచకిచమని యెలిగించు వానరుడు
మానవభాషను మాటాడుట యెటు
లైన, నర్థమగునట్టుల మనుజుల
వాక్కున పలుకు టవశ్యము నా కిట.

20

ఊఱడించక మఱొకగతి లేదీ
సతి అసురుల తర్జనభర్జనలకు
సొమ్మసిల్లె, ఇక దిమ్మతిరిగి పడు,
నా రూపముగని నా మాటలు విని.

21

ఎడనెడలను భ్రమ విడిచినప్పుడు, వి
శాలేక్షణ నా వాలకమును గని,
కామరూపి రాక్షసపతి అనుకొని
భీతిలి అఱచును పెద్దపెట్టునన్.

22

సీతాక్రందము చెవిబడినంతనె
కాలకింకరుల బోలిన క్రూరులు
నానాయుధములు పూని దానవులు,
గచ్చువిచ్చుగా వచ్చి మూగుదురు.

23
ఇచ్చట ననుగని రెచ్చిన కచ్చెను,
వికృతముఖులు రక్షక లుద్వేత్తుగ
గిట్టి, నలుగడల చుట్టి చంపగా
బలముకొలది తలపడుదురు దండడి.

24
అంత నేనును, మహాశాఖలు, నుప
శాఖలు, శాఖాంచలములు, బోదెలు,
పట్టి యెక్కి దిగి పరుగులెత్తు టను
కని, భయశంకను కలవరపడుదురు.

25
అటు లశోకవని నడుమ తిరుగు నా
రూపు చూచి భయమోపలేక, ది
క్కుమొగంబుల ఎగాదిగ పఱచును,
ముసురుకొన్న రక్కసుల తండములు.

26
పిదప రక్షకలు బెదరి, రావణుని
రాజభవన నిజరక్షకులను, కే
కలు పెట్టుచు బిగ్గరగా పిలితురు,
ఆపన్నులవలె నార్త స్వరముల.

27
వారలందఱును క్రూరులు శూరులు
కత్తులు శక్తులు కరముల త్రిప్పుచు,
పట్టి కట్టి నను కొట్టగవత్తురు
ఉద్వేగించిన విద్వేషమ్మున.

28
అన్నివైపులను నన్నటికట్టిన
అసురబలములను కసిమసగ గలను,
కాని; పిదప సాగర మావలి తీ
రము చేరుట శక్యము కాదనిపించును.

 

29

తొందఱపడి, తుందుడుకు రాక్షసులు
పై బడి పట్టిన పట్టవచ్చు నను;
అటుపిమ్మట నిచ్చట సీతకు రఘు
విభునివార్త చెప్పెడి వారుండరు.

30

హింసను మరగిన ఈ ఘాతుకు లిట
జనకసుతను చంపినను చంపుదురు;
వ్యర్థ మగును తరువాత రామ సు
గ్రీవులు తలచిన కృత్యమంతయును.

31

అదియుగాక, జనకాత్మజ యిప్పుడు
ఉన్న ప్రదేశము ఉగ్రరాక్షసులు
రక్షింపగ, వారాశిలోన మా
ర్గంబు లేని నడిగడ్డన నున్నది.

32

ఈ మారటలో నేను రాక్షసుల
చేజిక్కినను, నశించినను, పిదప
రఘురాముని కార్యప్రయాసలన్
కాగల సాయము కనబడ దెచటను.

33

ఈ కలహంబున నేహతంబయిన,
నూఱామడల పయోరాశిని దా
టగల వానరుం డగపడ డచ్చట,
ఆలోచింప యథార్థము నియ్యదె.

34

వేలరక్కసుల తోలి వధింపగ
తగు బల సామర్థ్యములున్నవి, నా
కైనను, మఱల మహార్ణవ మావలి
గట్టుచేర శక్యము కాదనిపించును.

35

నమ్మరానివి రణములు, జయాపజ
యంబులు సందేహములు; రుచింపవు
నా కిట్టివి; అయినను ప్రాజ్ఞుడెవడు
సంశయించు నిస్సంశయంబులను !

36

సీత తోడ భాషింపక వెళ్ళిన
ఆయమ ప్రాణత్యాగము చేయును ;
అది దోషంబగు, అట్లుకాక భా
షించిన తప్పదు చేటు నా కిచట.

37

దూతలు చెన్నటిపోతులైనపుడు
దేశకాలముల తీరు వైరమై,
సిద్ధకార్యమును చెడి, చేటు కలుగు ;
ప్రొద్దుపొడుపున వెలుగు చీకటివలె.

38

ఇది కార్యం బియ్యది అకార్యమని
నిశ్చితమయిన మనీషయు జడమయి
కార్యసిద్ధిని విఘాతమొనర్తురు
దూతలు పండిత దురభిమానులయి.

39

ఎటు మెలగిన విఘటింపక కార్యము
గండముల్ గడచి గట్టెక్కను, సా
హసముచేసి లవణాంభోరాశిని
దాటిన శ్రమ వ్యర్థము కాకుండును ?

40

ఈమెతోడ నేనే భాషను మా
టాడ భయపడక ఆలకించునని
మథనలుపడి హనుమంతుడు తుది
నిశ్చయించుకొనె నెమ్మదిలో నిటు.

41

అప్రియమగు కార్యమ్ముల నెఱుగని
రామచంద్రు కీర్తనమును పాడెద,
ఆలకించు చుట్టాల సురభి, రా
మాను రక్తహృదయము సుఖియింపగ.

42

ఇక్ష్వాకు నృపుల యింటికి దీపము,
విదితాత్ముడు రఘువీరుడు రాముడు,
అతనికి సర్వశుభార్థకంబులగు
స్వస్తి వాచనము లాలాపించెద.

43

మధురములగు రామచరితార్థములు
వీనులవిందుగ వినిపింతును, వి
శ్వాసము కొలిపెడి సర్వమార్గముల
ననుసరింతు శ్రద్ధాసక్తులతో.

44

అనుచు హనుమ మహానుభావు డటు
పరిపరివిధముల భావించుచు, లో
కాధిపు ప్రేయసి నరయుచు, తియ్యగ
పలికె నిట్లు కొమ్మలలో నుండియె.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౩౧

1

ఆవిధమున కార్యాకార్యంబులు,
ఔగాములు బాగోగులును తలచి,
పలుకసాగె కపికులతిలకుడు వై
దేహి వినంగా తీయని యెలుగున.

2

ఉండెను రాజన్యుండు, దశరథుడు,
రథమాతంగతురంగ బలాతిశ
యుండు, సత్యసంధుండు, పుణ్యశీ
లుండు, యశోలోలుండు, ప్రసిద్ధుడు.

3

రాజఋషులలో ప్రథితచరితుడు, స
మానుడు ఋషుల కనూనతపస్యను,
చక్రవర్తి కులజాతుడు, దేవేం
ద్రసమానుడు విక్రమ బలదీప్తుల.

4

అక్రూరుడు, కరుణాత్మ, డుదాత్తుడు,
సత్యపరాక్రమశాలి; సమస్త సు
గుణనిధి, ఇక్ష్వాకు కులవతంసుడు,
శౌర్యమూర్తి, ఐశ్వర్యవర్ధనుడు.

5

రాజలక్షణ విరాజితుండు, ల
క్ష్మీనిలయుడు, నృపశేఖరుడు, చతు
స్సాగర చేలాంచల ధరాధిపతి,
సుఖి, సుఖదాత, యశోదిశాంబరుడు.

6

అతని పెద్దకొడు, కధిక ప్రియుడు, సు
ధాంశు సుందరశుభాస్యు, డగ్రగ
ణ్యుం డుదగ్ర కోదండధారులను,
రామమనోహరనామ ఖ్యాతుడు.

7

రక్షించు స్వధర్మము, రక్షించు స్వ
జనమును, రక్షించును సచరాచర
జీవలోకమును, శిక్షించు నధ
ర్మము, ధర్మము సంరక్షించును ధృతి.

8

సత్యసంధుడు దశరథుడు జనకుడు
చిన్నభార్య కిచ్చిన వరమును, శిర
సావహించి జాయాసోదర సహి
తముగా వనవాసమునకు తరలెను.

9

అతడు మహారణ్యమున తిరిగి వే
టాడుచు, ఒక్కడె హత మొనరించెను,
కామరూపులగు తామసులను రా
క్షసవీరుల పెక్కండ్రను పోరుల.

10

ఖరదూషణు లిద్దరిని జన
స్థాన రణంబున చంపె ననుచు, రా
వణుడు రోషదారుణమతియై, రా
ముని భార్యను సీత నపహరించెను.

11

మాయలేడి నొక మాటుచేసి, వం
చించి రావణుడు సీతను కొనిపోన్,
అడవుల భార్యను తడవుచు రాముడు
సుగ్రీవుని గని సుహృదునిగాకొనె.

12

ఆవల నాతడు అరిపరంతపుడు
సుగ్రీవుని నిజసోదరుడగు వా
లిని వధించి, యేలికగా అభిషే
కించె నతని కిష్కింధానగరిని.

13

అంతట సుగ్రీవాజ్ఞను తలనిడి
ఇచ్చకువచ్చిన కృతకవేషముల
వేలు వానరులు వేవేగమె బయ
లెక్కిరి వైదేహిని వెతకు చెల్లెడల.

14

మాకు చెప్పె సంపాతి, యీామె మని
కా చొప్పున నూఱామడ కడలిని
దాటివచ్చితిని తడయక నేను, వి
శాలనేత్రముల జానకి నరయుచు.

15

రాముడు చెప్పగ ఏమి పోలికలు
వింటి నచట, అవి కంటిని యిచ్చట,
మేనిచాయ, అమ్లానశోభ, సౌ
మ్యాకృతి కనబడు నచ్చొత్తిన గురి.

16

ఇట్లు రామకథ ఇచ్చగింపుగా
పలికి యూరకొనె వానరసత్తము,
డాసుఖవాక్యము లాలకించె వి
స్మయము పల్లవింపగ వైదేహియు.

17

నల్లని వంపుకొనల ముంగురులు ము
ఖంబున ముసర నఖంబుల ద్రోయుచు,
పిటీకితనంబును వెలపునొత్త, మొగ
మెత్తి శింశుపావృక్షము చూచెను.

18

కపి పలుకుల నాకర్ణించి, మదిన్
తొలకరింప సంతోష మొకించుక,
రామధ్యాన పరాయణయై మై
థిలి వీక్షించెను దిక్కుల నెల్లెడ.

19

పైనను క్రిందను, ప్రక్కలు మూలలు
కనులు విప్పి పరకాయించుచు, అట
చూచె చెట్టుపయి సుగ్రీవసఖుని,
ఉదయాదిత్య సముజ్వలు వానరు.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౩౨

1

పెనచి చుట్టి తెల్లనివస్త్రము సిగ,
క్రొత్తకారు మెఱుగుల కుచ్చెలవలె
కొమ్మల నడుమన కుదిసి కదిసి కూ
ర్చున్న కపినిగని ఉలికెను మైథిలి.

2

ప్రియవాక్యముల అభయములు పలుకుచు
బంగారపు కన్నుంగవ మెఱయగ,
రక్తాశోక ప్రసవరాశివలె
మెఱయుచుండె వానరకేసరి యట.

3

ఆతని చూచుచు సీత చకితయై
విస్తుపోయి భావించె నిట్లు మది;
చూడరానిదీ పీడాభూతము,
వానరమంచు నపస్మారంబున.

4

దుర్నిరీక్ష్య మీ దుష్టజంతువని,
తెలిసి, క్రమ్మఱన్ దిమ్మవోయి, విల
పింపసాగె కంపించి తీవ్రముగ
వైదేహి భయభ్రాంతు లావుకొన.

5
రామరామయని వేమఱు పలవును,
హా ! లక్ష్మణయని అంగలార్చు, దుః
ఖార్తి మిగుల హా ! యని రోదించును,
మందమందమయి మ్రాన్పడ కంఠము.

6
అటు లేడ్చుచు తన అంతికమందున,
వృక్షము కొమ్మల వినయముగ నణగి
మణగియున్న హనుమంతుని తలచెను
జానకి, అదియొక స్వప్నం బగునని.

7
వానరనాథుని ఆనల నడచెడి
సూరివరేణ్యుడు, సుగ్రీవ సఖుడు
నిడుమోమును చప్పిడిముక్కను పొలు
పారు వానరుం డగపడె నప్పుడు.

8
కళవళపాటున కాళ్ళుచేతు లా
డక, ప్రాణములు తడబడ సొమ్మసిలి,
ఇంచుక స్పృహకొనలెత్తగ, క్రమ్మఱ
తలపోసెను మైథిలి లోలోపల.

9
ఈ కలలోన వికృతరూపంబగు
కోతి కానబడె, కూడదందు రిది;
స్వస్తి ! రామలక్ష్మణుల, కాప్తులకు,
స్వస్తి ! రాజఋషి జనకునకు, పితకు.

10
పూర్ణచంద్ర శుభముఖుడగు రాముని
స్మరియింపుచు సుఖమెఱుగక, కన్నులు
మూతపడక, వాపోవుదు, నీ జా
గరములలో ఇది కలగాదు నిజము.

11

రామరామయని బ్రాతిని పలుకుచు,
మనసులోన ఆతని భావించుచు,
తన్మయనై తిని, తదనురూపమును
కనుచుంటిని మఱి వినుచుంటి నిటుల.

12

మనసిజాత పీడను ప్రాణంబులు
ప్రియునెడ లగ్నములయి నందున, నే
దేని నెపుడు చింతించుచుంటినో
ఆ ప్రతిరూపము లగపడు వినబడు.

13

ఇది కలయేని అభీష్టసిద్ధి యగు
నని తలతును, కాదని తర్కింతును,
ఏమన రూపవిహీన మభీష్టము,
కలరూపున ఇది పలుకుచు నున్నది.

14

బ్రహ్మదేవునకు, వైశ్వానరునకు,
వాచస్పతికిని వాసవునకును న
మస్కరింతు, కపిమాటలు తథ్యము
లన్యంబులు మిథ్య లగును గావుత !

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౩౩

1

పండిన పగడమువంటి మోముతో,
వినయవినతమగు వేషముతో దా
సునివలె దగ్గరె ప్రణతులు సలుపుచు
వృక్షము దిగి కపివీరుండప్పుడు.

2

అతితేజస్వి, మహానిలతనయుడు,
శ్రీమన్మారుతి చేతులు రెండును
జోడించి శిరస్సున, వైదేహిని
పలుకరించె నర్మిలి మధురోక్తుల.

3

ఎవరి యింటిదానవు పద్మేక్షణ !
కలుకు నారమడి కాసె చుట్టి, ఈ
చెట్టుకొమ్మ నొకచేత పట్టుకొని,
ఏల నిలువబడితీ వనాంతమున.

4

ఏటి కిటుల నీ కాటుక కన్నుల
నూరెల జాఱెడు శోకబాష్పములు,
మంచి తెల్లతామర పూఱేకుల
నుండి జాఱిపడు ఉదకంబులవలె.

5

సురు లసురులు, కిన్నర గంధర్వులు,
రాక్షస పన్నగ యక్షఖేచరుల
జాతులలో నీ జాతం బెక్కడ ?
ఎఱిగింపుము శరదిందు శుభానన !

6

రుద్రులగణమొ, మరుత్తులగణమొ, వ
సువులగణమొ మానవతీ ! నీ వె
వ్వరిదానవు తెలుపందగు; దేవత
భాతి నాకు చూపట్టెద విచ్చట.

7

చంద్రుని సందిలి జాఱిపోవ, వై
హాయసపథ మెడబాయు, అంతరి
క్షము విడిచిన నక్షత్ర కులములో
గణుతికొన్న రోహిణివో దేవీ !

8

మోహమొ కోపమొ ముసియింపగ, గురు
పాదు వశిష్ఠుని బాసి, ప్రవాసము
రోసి వచ్చిన అరుంధతీ భగవ
తివా ? కళ్యాణీ ! తెలియగ చెప్పుము.

9

సుతుడో, జనకుడో, పతియో, భ్రాతయొ
కాలము తీఱగ ఈ లోకము విడి
పరలోకంబున కరిగిన, నీ విటు
లాత్మశోకమున అదవద వనరెదో ?

10

తెలుపి లేక రోదింతువు నిట్టూ
ర్పుల పొగలెగయగ, భూమినంటు చర
ణములు, రాజచిహ్నము లున్నవి ; ప
ట్టపుదేవి వని తడయక తలంతును.

11

నీ మెడ నగపడు నేయే చిహ్నము
లాలక్షణముల నాకాంక్షించిన
ఏ పృథివీపతికో పట్టమహిషి
వయిన రాజకన్యకవని నమ్మెదు.

12

దశముఖుడు జనస్థానమునుండి, బ
లాత్కారముగా లాగి హరించిన
సీత వీవయిన చెప్పుము శుభమగు;
అడిగెద నిది రామార్థము సాధ్వీ!

13

చూడరాని నీ శుష్క దైన్యమును,
సాటిలేని నీ చక్కదనంబును,
తాపసి వృత్తము తలచి చూడ, రా
ముని మహిషివి నీ వనుచు ధ్రువంబగు."

14

రమణీయముగా రామకీర్తనము
హనుమ ముఖంబున నాలకించి వై
దేహియు ఆనందించి, చెట్టుదరి
నున్న వానరుం డూకొన నిట్లనె.

15

జగతిలోని రాజన్య లోకమున
వన్నె వాసిగల పార్థివ ముఖ్యుడు,
శత్రుసాదన యశస్వి దశరథుడు;
ఆతని కోడలినైతి పుణ్యమున.

16

విదితాత్ముడు, శ్రుతివేత్త, విదేహా ధ
రాధీశ్వరుడు, మహామతి జనకుడు,
ఆ పూజ్యుని తనయను, సీతను, నే
ధీమతి, రఘుపతి, రాముని భార్యను.

17

అఖిల భోగభాగ్య సమృద్ధమయిన
ఇక్ష్వాకు నృపుల గృహముల, పన్నెం
డేండ్లు వసించితి ఇష్టకామ్యములు
తీఱ సుఖంబుగ గౌరవంబుతో.

18

పదుమూడవయేట దశరథేశుడు
రఘుకులనందను రాజ్యంబున కభి
షేకించ తలంచి, వశిష్ఠుని చో
దన నుపక్రమించెను విధియుతముగ.

19

శ్రీరాముని అభిషేక మహోత్సవ
సంరంభము లటు సాగుచుండగా,
భర్తారునితో బ్రాతిమాలి కై
కేయి యిట్లు పలికెను పరుషంబుగ.

20

నీళ్ళు త్రాగ, నిక నిత్యభోజనము
చేయను, మామక జీవిత వృత్తమె
అంతమగును వసుధాధిప! శ్రీరా
ముని అభిషేకము పూర్ణమయినచో.

21

నృపసత్తమ! నీవపు డిచ్చిన ప్రియ
వాగ్దానము తప్పక యిప్పుడు జరు
గన్వలె, పోవలె కానకు రాముడు,
కావలె కాగల కారణార్థములు.

22

సత్యసంధు, డిక్ష్వాకు కులీనుడు
దశరథుడును మును తా నిచ్చిన వర
ములను స్మరింపుచు మూర్ఛపోయె, కై
కేయీ కఠినోక్తి ప్రహారముల.

23
ధర్మమునకు సత్యమునకు కదలక
కట్టుబడిన యిక్ష్వాకుం డంతట,
జ్యేష్ఠుండు యశస్వియు నగు పుత్రుని,
యాచించెను రాజ్యము రోదించుచు.
24
అభిషేక ప్రాజ్యశ్రీ కంటెను
పితృవాక్య మతిప్రియమని రాముడు
మనసుచే మొదట అనుమతించి పి
మ్మట తెలిపెను సమ్మతి వాక్కులతో.
25
సత్యపరాక్రమశాలి రాముడు
ఇచ్చుటమాత్రమె యెఱుగు, నెఱుంగడు
పుచ్చుకొనుట యెప్పుడును, అప్రియము
పలుకడు ప్రాణాపత్తిని సైతము.
26
పైపచ్చడ మావలనైచి, విడిచి
రాజ్యమున్మను సర్వము; భావించెను
నన్ను జన్మెగా కన్నతల్లి ప్రియ
హస్తంబులలో అప్పగించుటకు.
27
కాని, నే నతనికన్న ముందుగనె
సిద్ధమయితి వనసీమల యాత్రకు,
రామ సాహచర్యము లేనిది కాం
క్షింపను స్వర్గనికేతన మయినను.
28
అంతకుమున్నె మహాభాగుండు, సు
మిత్రా పుత్రుడు, మిత్రానందుడు,
నారగుడ్డలు పెనంచి కట్టి యా
త్రార్థుండాయెను అన్నతోడ చన.

29

జనపతి ఆదేశము మన్నించి, దృ
ఢవ్రతులమయి వెడలి వచ్చితి మిటు
బుద్ధిపూర్వముగ; పూర్వము చూడని
గంభీరములగు కాంతారములకు.

30

దండక లోపల నుండగా మహా
బాహువు శ్రీ రఘుపతి పత్నిని నను,
కపటవేషమున అపహరించి కొని
వచ్చె నిచ్చటికి పాపి, రావణుడు.

31

కరుణించెను రాత్రుసుడు రెన్నెలలు
ప్రాణముతోనే బ్రతికియుండుటకు,
రెండుమాసములు నిండిన వెంటనె
జీవితమ్మును త్యజింతు నిచ్చటనె.

25-4-1967

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౩౪

1

దుఃఖము వెంబడి దుఃఖము తఱుమగ
కుములుచున్న ఆయమ పలుకులు విని,
సీత నూఱడించెను హనుమంతుడు
చల్లనిమాటల సాంత్వన మొదవగ.

2

నేను రాముని వినీతదూతను, పు
రంధ్రీ ! కుశలము రామున కచ్చట,
అతడు పంప వచ్చితి నీ క్షేమము
తెలియగోరి సందేశము గైకొని,

3

బ్రహ్మాస్త్రం బెవ్వానికి అధీనము,
వేదవిదులలో విశ్రుతు డెవ్వడు,
ఆ దాశరథి మహాభాగుడు నీ
క్షేమస్థితి నడిగెను సుమంగలీ !

4

మహిత తేజస్వి, మానధనుడు, శ్రీ
రామసేవాభరణము లక్ష్మణుడు,
శోకమున తపించుచు దేవీ ! తల
వాలిచి నీ కభివాదము సలిపెను.

5

అపుడు, జంట సింహములను బోలిన
రామలక్ష్మణులు క్షేమవార్త లం
పించిరనుచు పులకించి పొంగి వై
దేహి హనుమతో తియ్యగ నిట్లనె.

6

బ్రతికియున్నచో పడయవచ్చు సుఖ
మెప్పుడైన నూఱేండ్లలో ననెడి,
లోకుల సామెత తాకె నన్నిపుడు
భావి శుభోదయ ఫలసూచకముగ.

7

కపివరేణ్యు డటు కలిసినయంతనె
సీతకు హృదయము ప్రీతితో తడిసె,
వారిరువురు విశ్వాసముతో ప్రా
రంభించిరి ప్రియ సంభాషణములు.

8

మండు శోకమున మ్రగ్గి మసలు వై
దేహి మాటలను దీనావస్థను,
విని కని హనుమయు వెన్నవలె కరగి,
మెల్లమెల్లగ సమీపింప దొడగె.

9

ఎంతయెంత కపి అంతికమాయెను
అంతయంత సతి అనుమానించెను,
కామరూపి రాక్షసుడు రావణుడు
వంచన చేయగవచ్చె మఱలనని.

10

ఎంత చెడ్డపని యిది యిస్సీ ! నా
వృత్తము నీ పాపిష్ఠికి చెప్పితి,
రూపుమార్చి చేరువ కేతెంచెడు,
వీడు రావణుడె, పీడాగ్రహ మిది.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౩౪

1

దుఃఖము వెంబడి దుఃఖము తఱుమగ
కుములుచున్న ఆయమ పలుకులు విని,
సీత నూఱడించెను హనుమంతుడు
చల్లనిమాటల సాంత్వన మొదవగ.

2

నేను రాముని వినీతదూతను, పు
రంధ్రీ ! కుశలము రామున కచ్చట,
అతడు పంప వచ్చితి నీ క్షేమము
తెలియగోరి సందేశము గైకొని,

3

బ్రహ్మాస్త్రం బెవ్వనికి అధీనము,
వేదవిదులలో విశ్రుతు డెవ్వడు,
ఆ దాశరథి మహాభాగుడు నీ
క్షేమస్థితి నడిగెను సుమంగలీ !

4

మహిత తేజస్వి, మానధనుడు, శ్రీ
రామసేవాభరణము లక్ష్మణుడు,
శోకమున తపించుచు దేవీ ! తల
వాల్చి నీ కభివాదము సలిపెను.

5

అపుడు, జంట సింహములను బోలిన
రామలక్ష్మణులు క్షేమవార్త లం
పించిరనుచు పులకించి పొంగి వై
దేహి హనుమతో తియ్యగ నిట్లనె.

6

బ్రతికియున్నచో పడయవచ్చు సుఖ
మెప్పుడైన నూఱేండ్లలో ననెడి,
లోకుల సామెత తాకె నన్నిపుడు
భావి శుభోదయ ఫలసూచకముగ.

7

కపివరేణ్యు డటు కలిసినయంతనె
సీతకు హృదయము ప్రీతితో తడిసె,
వారిరువురు విశ్వాసముతో ప్రా
రంభించిరి ప్రియ సంభాషణములు.

8

మండు శోకమున మ్రగ్గి మసలు వై
దేహి మాటలను దీనావస్థను,
విని కని హనుమయు వెన్నవలె కరగి,
మెల్ల మెల్లగ సమీపింప దొడగె.

9

ఎంతయెంత కపి అంతికమాయెను
అంతయంత సతి అనుమానించెను,
కామరూపి రాక్షసుడు రావణుడు
వంచన చేయగవచ్చె మఱలనని.

10

ఎంత చెడ్డపని యిది యిస్సీ ! నా
వృత్తము నీ పాపిష్ఠికి చెప్పితి,
రూపుమార్చి చేరువ కేతెంచెడు,
వీడు రావణుడె, పీడాగ్రహ మిది.

11

అని కళవళపడు చార్త్రిశోపిలి, అ
శోకశాఖను తదేకాశ్రయముగ
పట్టుకొన్న రఘువంశలక్ష్మి, అది
వదలిపెట్టి ధరపైన కూలబడె.

12

దుఃఖపీడనలు తూటాడగ, తన
వైపు చూడని సువాసిని నరయుచు,
దిగులు మిగులగా దీర్ఘ బాహువులు
రెండును చేరిచి దండము పెట్టెను.

13

సోలి భయంబున చూడనోడియును,
చేతులు జోడించిన వానరు గని,
బుసబుస నూర్పులు పుచ్చుచు వగపున
మైథిలి యిట్లనె బాధాస్వరమున.

14

మాయవేసములు వేయంగల మా
యావివి రాక్షస! రావణుడవు నీ;
వేల మఱల నన్నేడిపించెదవు,
ఖిన్నల నేచుట క్షేమము కాదిల.

15

దండకాజనస్థానంబున మే
మున్నపు డీవొక సన్యాసివిగా,
కనబడితివి రాక్షసరూప మణచి,
నీవు కావె ఆ రావణుడ విపుడు.

16

ఉపవాసంబుల నుడికి కృశించుచు,
పీడని క్షోభల వేగుచున్న నను,
కామరూపివై కాటందగ వె
న్నాడెద విది నీ నాశనకాలము.

17

అనుచు శంక పైకొనగా పలికియు,
కాదని తోపగ వైదేహి, మఱల
హనుమతోడ నిట్లనె, నిను చూడగ
పాతరలాడును ప్రీతి నా మనసు.

18

రామచంద్రునకు రాయబారివై
వచ్చితివేని శుభంబు నీ కగును,
ఇక్ష్వాకుల కథ యిష్టము నా కిపు
డడిగెద చెప్పుము అతని వివరములు.

19

నా మనోహరుని రాముని సుగుణ గ
ణంబులు మిగుల ప్రియంబులు చెప్పుము,
నా చిత్తము వానర! హరించితి; న
దీజలవేగము తీరంబునుబలె.

20

ఎంత సుఖావహ మీ స్వప్న, మహో!
ఎంతకాలమాయె దశాస్యుడు నను
బలిమి పట్టికొనివచ్చి; కంటి ఇ
ప్పటికి రాఘవుడు పంపిన దూతను.

21

కలనైనను లక్ష్మణుతో రాముని
చూచిన బ్రతుకుదు శోక మణచుకొని,
ఏమి పాపమో యిది! మచ్చరియై
స్వప్నము సైతము సాధించును నను.

22

కల కాదిది నిక్కము, కలలోపల
వానరములు కనబడిన శుభంబులు
కానేరవు; శుభకర మాయెను గద
నా కిపు డీ వానరుని దర్శనము.

23

చిత్తమోహమో ! పిత్తవికారమొ !
వాతదోషమో ! భూతావేశమొ !
ఎండమావుల అకాండ తాండవమొ !
లేదా ! ఒక ఉన్మాద విశేషమొ.

24

ఉన్మాదము కానోప దీ అవిధి,
ఉన్మాదంబున కొక లక్షణమగు
మోహమొ ! కాదది, బుద్ధి కెఱుకపడు
నేననియు, ఎదుట వానర మనియును.

25–26

ఇటు పలుభంగుల ఇందువదన ఔ
నని కాదని మనసున తర్కించుచు,
రావణుడే యను భావము పయికొన,
హనుమతోడ మాటాడక నిలచెను.

27

సీత మనోనిశ్చితమును సులువుగ
తెలియగజాలిన ధీమతి మారుతి,
పలుకసాగె మైథిలి కిష్టములయి
వీనుల కింపితమైన వాక్యములు.

28

సూర్యునివలె తేజోవిరాజితుడు,
శశివలె లోకోత్సవ కళామయుడు,
రాజరాజు, వైశ్రవణ శ్రీనిధి,
ధీప్రకాశమున దేవ బృహస్పతి.

29

లోకసంస్తుత శ్లోకుడగు మహా
విష్ణువు బోలును విక్రమపటిమల,
మధురభాషి, నిర్మల సత్యవ్రతి,
కీర్తిశాలి, లక్ష్మి నిక్షేపము.

30

చారురూప వర్చస్సు భగుడు, కా
వలసినచోట అవక్రవిక్రముడు,
ఉత్తమజనముల నుత్తమోత్తముడు,
రథికులను మహారథికుడు రాముడు.

31–32

ఎవని ప్రాపున సుఖించు లోకములు,
అతనిని మృగమిష నవలలాగి, శూ
న్యాశ్రమమున నిన్నహరించె, నే
పాపి చూచు తన పాపము పండగ.

33

రఘువీరుం డచిరంబె రణంబున
రోషజ్వాలాభీషణంబులయి,
వేడిమి జడికొను వాడి తూపులను
పఱపి నెఱపి రావణుని వధించును.

34

ఆ రాఘవు డిటు లంప దూతనయి
వచ్చినాడ నీ పజ్జకు దేవీ!
తావక విరహాతపమున నాతడు
కృశియించుచు నీ కుశలం బడిగెను.

35

మహిత తేజస్వి, సహచరుడు, సుమి
త్రానందన వర్ధనుడు లక్ష్మణ కు
మారుడు నీకు నమస్కారంబులు
చేసి అడిగె నీ క్షేమము సాధ్వీ!

36

వాలి సోదరుడు, వానరేశ్వరుడు
రామచంద్రునకు ప్రాణసఖుడు, సు
గ్రీవుడు వీరచరిత్రుడు, ప్రాంజలి
పట్టి అడిగె నీ స్వస్థవృత్తమును.

37

నిను స్మరించు; ధ్యానించు సదా రా
ఘవుడు తోడి లక్ష్మణ సుగ్రీవులు
వేదనపడ, జీవించియుంటి వే
పుణ్యమొ రక్కసిమూకల చిక్కియు.

38

ఇచ్చటనే నీ వీక్షింపగలవు,
రాముని బాహుపరాక్రమధాముని
లక్ష్మణుతో, శతలక్ష కపిబలము
తో, సుగ్రీవునితో, వైదేహీ !

39

నేను సుగ్రీవుని సచివుండను,
హనుమంతుం డను నను లోకంబులు,
లవణార్ణవమును లంఘించి, ప్రవే
శించితి లంకా శ్రీ నగరంబున.

40

స్వీయ విక్రమము విశ్వసించి, దురి
తాత్ముడు రావణు నౌదలమీదను
అడుగుమోపి, యిక్కడికి వచ్చితిని
తావక శుభముఖ దర్శన దీక్షను.

41

నా రూపము గని, నా మాటలు విని,
దేవీ ! యేమే మీ వూహించితో,
స్వస్తి చెప్పు మిక వాటికన్నిటికి,
గమనింపుము నమ్ముము నా పలుకులు.



# సుందరకాండ

## సర్గ ౩౫

1

వానరోత్తము డనూనముగా రా
ముని చరితంబును వినిపింపగ సతి,
అభిముఖియై సౌమ్యముగా ఇట్లనె
తిన్నని ఎలుగున తీయని మాటల.

2

కలిసికొంటి వెట్టుల రాముని ? నీ
వెఱిగితి లక్ష్మణు నే చందంబున ?
నరులకు మీ వానరులకును సమా
గమ మెట్టుల గహనమున ఘటిల్లెను ?

3

చెప్పుము వానరశేఖర ! రాముని
లక్షణంబు లేలాటివో ? లక్ష్మణు
చిహ్నము లెట్టివో శీఘ్రమె; నా హృది
శోకక్షుభితము కాక పూర్వమే.

4

రాముని ఆకారప్రభ లెట్టివి ?
అవయవ శుభవిన్యాసం బెట్టిది ?
చేతుల తొడల విశేషము లేమి ? వి
లక్షణుడాయెను లక్ష్మణు డెందుకు ?

5

జానకి అట్లు ప్రసన్నముగా, త
న్నడిగి యూరకొన; హనుమయు తోడనె
అభివర్ణింపగ ఆరంభించెను
రాఘవుని యథార్థ స్వరూపమును.

6

ఎంత యదృష్టమొ ! ఎఱిగియుండియును
నన్నడిగితి నీ నాథుని కలరూ
పును, లక్ష్మణురూపును, కమలాక్షీ !
ప్రతిపన్నుడనేవారి కిద్దరికి.

7

అవధరింపు మసితాయతలోచన !
రాజకుమారుల రామలక్ష్మణుల
ఇరువురలోపల నే గుఱుతించిన
రూపురేఖలు నిరూపించెద నిక.

8

సర్వభూత రంజకుడు, పద్మప
త్రములువోలె నేత్రములు హసించును,
పుట్టుకతోడనె పెట్టని నగలై
దైవారె దయాదాక్షిణ్యంబులు.

9

తేజంబున ఆదిత్యుని, తాల్మిని
భూదేవతను, సుబుద్ధిచే బృహ
స్పతిని, కీర్తిచే స్వర్గపాలకుని,
సాటివచ్చు ఇక్ష్వాకు కులాగ్రణి.

10

రక్షించు స్వధర్మము, రక్షించు స్వ
జనమును, రక్షించును సచరాచర
జీవసంతతి నశేషము, రక్షిం
చును ధర్మప్రతిష్ఠను, పరంతపుడు.

11

నేలమీదగల నాలుగు కులములు
పాలించును నిష్పక్షపాతమతి,
లోకాచారములు సవరించు, తా
నడచు, ఇతరులను నడిపించు నియతి.

12

తేజోవిభవాధికుఁడు, పూజితుఁడు,
పాలించు సదా బ్రహ్మచర్యమును,
ఉత్తమజనులకు ఉపచారములును,
కర్మపరుల కుపకారములు సలుపు.

13

అఖిల రాజవిద్యల సుశిక్షితుడు,
అనయము బ్రాహ్మణుల నుపాసించును,
జనవాక్యము నెఱిగినవాడు, సుశీలుడు,
సంపన్నుడు, రిపుశమనుడు రాముఁడు.

14

యాజుషధర్మ నియమ వినీతుడు
అభ్యసించె వేదాంగములు, యజు
ర్వేదమును ధనుర్వేదమ్మును ; పూ
జించు శ్రోత్రియులు శిష్టులు నిష్ఠులు.

15

కంఠమొప్పు శంఖమువలె, కండలు
పొసగిన చక్కని మూపులు, దీర్ఘభు
జములు, మంగళాస్యము, ఎఱ్ఱని క
న్ను లని చెప్పుకొందురు జను లాతని.

16

దుందుభిస్వనము చిందు కంఠమున,
నునుపు మెఱయు మేనున, శూరుని ధృతి,
సువిభక్త సుభగములగు అంగము,
లొప్పియున్నవి రఘూత్తమునకు సతి !

17

మూడు స్థిరంబులు, మూడు దీర్ఘములు,
మూడు సమంబులు, మూ డున్నతములు,
మూడు లోతు, లెఱుపులును మూడు, మె
త్తనివి మూడు; రాముని అంగంబులు.

18

ముడుతలు వంపులు మూడుమూడు, మూ
డు తలసుడులు, నాలుగు అంగములును,
కళలు నాల్గు, రేఖలు నాలుగు, నా
ల్గు సమంబులు, కిష్కువులును నాలుగు.

19

నాల్గు గతులు, దంతంబులు నాలుగు,
పెద్దవి కణతలు, పెదవులు, ముక్కులు,
పదునాల్గు జతలు, చదరము లెనిమిది
యెముక లయిదు స్నిగ్ధము లవయవములు.

20

పది పద్మంబుల వంటివి, పది యె
త్తయినవి, విఖ్యాతములు మూడు, శు
ద్ధములు రెం, డున్నతము లారును, తొ
మ్మిది సన్ననివి, అమేయుడు మూడిట.

21

ధర్మసత్య పరతంత్రు, డనుగ్రహ
సంగ్రహ క్రియాశాలి, దేశ కా
ల విభాగవిదుడు, లక్ష్మీపూర్ణుడు,
సకల లోకంబులకును ప్రియు డతడు.

22

ఇద్దరు తల్లుల ముద్దుబిడ్డడు, సు
మిత్రాసుతు; డుపమింపగ నొప్పును,
అన్న రాముతో, అనురాగమున, సు
రూపవత్వమున, గుణకలాపమున సతీ!

23

పులిపిల్లలవలె భూపకుమారులు
నాలుగుమూలల నేలను నీకయి
వెతకుచు తిరుగుచు విపినంబులలో
కలిసిరి మాతో తలవనితలపుగ.

24-25

అపహరింప రాజ్యంబు నగ్రజుడు,
వెఱచి పఱచి, బహువృక్ష సాంద్రమగు,
ఋశ్యమూకగిరి పృష్ఠభాగమున
చూచిరి ప్లవగేశుని సుగ్రీవుని.

26

అన్న రాజ్యమును ఆచుకొనంగా
ఆవలపోయిన ఆ సుగ్రీవ
స్వామి సన్నిధిని పరిచర్యల కే
ముంటిమి, అడవుల నంటిపట్టుకొని.

27–28

నారచీరలను నడుములను బిగిచి,
ధనువులు చేతుల తాలిచి వచ్చిన,
వారిని గని భయవశుడై దూకెను
వానరపతి పర్వతముపైకి వెస.

29

వానరేశ్వరుడు తాను పర్వతపు
నెత్తమునందే నిలిచి శీఘ్రముగ,
నన్ను పంపెను వనాటుల వారల
చూచి విచారింపుము నీ వనుచును.

30

అటు సుగ్రీవుడు ఆనతి యిచ్చిన
ప్రభువు పలుకులను పాలింపగ అతి
రూపలక్షణ సురుచిరులయిన నృప
శార్దూలంబుల సన్నిధి కేగితి.

31

వచ్చిన కార్యవివరము లన్నియును
వారల కెఱిగింపగ, ప్రీతులగుచు,
ఇరువురు కూర్చుండిరి నా వీపున
చేర్చితి కపికులశేఖరు చెంతకు.

32–33

అచట హరీశ్వరు డాదరమున భూ
వరసుతులను విశ్వాసముతో గొనె;
చెప్పుకొనిరి గడచిన తమ కథలను,
ఊరడిల్లి రొండొరులు ప్రీతులయి.

34

స్త్రీ మూలముగా జ్యేష్ఠ సోదరుడు
అపహరించెను సమస్త రాజ్యమని,
శోచనీయమగు సుగ్రీవునికథ
విని ఓదార్చెను వెంటనె రాముడు.

35

చెప్పగ లక్ష్మణు డప్పుడు రావణు
డపహరించె ని న్నడవిలో ననుచు,
సుగ్రీవుడు విని శోకించె, నిరప
రాధి రాముని దురంత విపత్తికి.

36

వానరపతి రామానుజుండు చె
ప్పిన దంతయు విని, వెలవెలబోవుచు,
నిస్తేజుండయి నిలిచెను; గ్రహణ
గ్రస్తుడయిన భాస్కరుని చందమున.

37

రాక్షసు డటు నిను గ్రక్కదల్చి, విను
వంక హాహాహాకారము పలుచు సమయమున,
కోపతాపములనోప, కీ వొలిచి
తీసి క్రిందపడవేసిన సొమ్ములు.

38

నీ యంగము లెడబాయక మెఱసిన
వాటి నన్నిటిని వానరులు వెతకి,
తెచ్చి రాఘవున కిచ్చిరి; వారికి
తెలియదాయె నిను తెచ్చిన మార్గము.

39

మింటినుండి భూమిని పడవేయగ,
మ్రోయుచు రాలిన నీ యాభరణము
లేనె తెచ్చితిని; వానిని చూచుచు
రాము డగలి మూర్ఛావశు డాయెను.

40

ఆ నగలను కని ఆదరంబుతో,
అక్కున నిడుకొని ఆవురుమని యే
డ్చెను భరియింపగ లేక, దేవ వ
ర్చస్కు డయిన రఘురాముడు పొరిపొరి.

41

మాటిమాటికిని వాటిని చూచుచు
పొరలి తెరలు వగపున వాపోయెను,
నిన్నెడబాసిన నెవ్వగ పొగయుచు
నగలు చూడగనె రగిలి మండనగు.

42

అట్లు దుఃఖమున అవశుడైన రా
ఘవుని నేనె అతికష్టంబున, ఉప
చారవాక్యముల చాలసే పనున
యించి, తేర్చితిని యెట్లో దేవీ!

43

మఱిమఱి తాకుచు మంగల్యములగు
సొమ్ముల నాదట చూచిచూచి, త
మ్మునికి చూపి, యిచ్చెను సుగ్రీవున,
కశ్రులు నిండగ ఆయతాక్షులను.

44
నీవు కనబడని నిష్ఠురశోకము
వేపగ కుమిలి, తపించు, నెల్లపుడు
రాఘవు; డంగారములో లోపల
కాలుచున్న ఇంగలపు కొండవలె.

45
నీ కారణమున శోకమగ్నుడయి,
నిదుర రాక చింతించుచు, దుస్తా
పమున చలించును పార్థివ పుత్రుడు,
అగ్నులు కాల్చెడి అగ్నిగృహమువలె.

46
నిను చూచెడి పున్నెము దూరముకాన్
శోకాకులుడై సుడివడె రాముడు,
భూకంపముచే మొదలు కదలి అ
ల్లాడుచున్న హేమాచల మట్టుల.

47
నీవు వజ్జలేని మనోవ్యథలో
ఇంపుగావు రాజేంద్ర పుత్రునకు,
పచ్చనితోటల పడకలేని, చ
ల్లని సెలయేళ్ళ కెలంకు లేనియును.

48
రిపువృషభములకు నృపశార్దూలము
రఘురాముం; డచిరమె యీ లంకను
లంఘించి, సమూలముగా రావణు
పుత్రమిత్ర బలముల హతమార్చును.

49
నిన్ను వెతకుటకు నిశ్చయించు నెడ
చేసిన రాముని బాస ప్రకారము,
సోదరు లిద్దరు సుగ్రీవునితో
బయలుదేరి రట వాలిని కూల్పగ.

50

తరువాత, హరీశ్వరుడును, రాజ కు
మారు లిద్దరును చేరగవచ్చిరి
కిష్కింధకు వేగిరమె, యుద్ధమున
వాలిని బహుబలశాలిని కూల్పగ.

51

అవల, రాము డాహవమున వాలిని
పరిమార్చి, సకలవానర నర చ
క్రంబున కధిపతిగా సుగ్రీవుని
అభిషేకించెను శుభముహూర్తమున.

52

దేవి ! రామసుగ్రీవుల కట్టుల
అన్యోన్య స్నేహము సిద్ధించెను;
వారి దూతనయి వచ్చితి నిచటికి,
హనుమంతుడ, విఖ్యాత నామకుడ.

53

పోయిన రాజ్యము పొంది మఱల, సు
గ్రీవుడు సకల హరిప్రవరుల పిలి
పించి పంపె నిను వెతకుటకయి, పది
దిక్కులకు బలాధికులగు వారిని.

54

ఉగ్రశాసనుడు సుగ్రీవు, డతని
శాసనమును శిరసావహించి నడ
కొండలు పోలిన గండు వానరులు
పోయిరి నీ అడపొడ గుర్తింపగ.

55

స్వామి వాక్యమును జవదాటని వా
నరుల మేము, తండములుగా బయలు
దేరినాము ధాత్రీచక్రంబును
గాలించుటకయి నాలుగు మూలల.

56

సంపన్నుడు, బలశాలి, వాలి సుతు
డంగదుండు నాయకుడయి, మా ము
క్కోటి బలగమును కూడగట్టి, ప్ర
స్థానము కట్టెను సన్నాహముతో.

57

వింధ్యపర్వతపు భీకరాటవుల
బడి, దిమ్మతిరిగి, బాటతప్పితిమి,
గడచిపోయెను పగళ్ళును రేలును,
తత్తరించితిమి తడబడి సుడిబడి.

58

అంత మేము కార్యము చెడెనంచు ని
రాశను, సుగ్రీవాజ్ఞకు భయపడి,
అలజడి కర్తవ్యము తోచక, ప్రా
యోపవేశమున కుద్యమించితిమి.

59

అడుగుపెట్ట సందిడని యడవులను,
ఘూర్ణితంబులగు కొండవాగులను,
వెతకివెతకి దేవీ ! నీ అడపొడ
తెలియక, తుది, కడతేఱ తలచితిమి.

60

అందఱమును మే మా గిరిపయి ప్రా
ణపరిత్యాగమునకు సిద్ధమవుతి;
మదిగని అంగదు డార్తి వార్ధిలో
మునిగి వివశుడయి బోరని యేడ్చెను.

61

నీ యపహరణానిష్టము, వాలివ
ధాయత వ్యథ, జటాయువు వధ, మా
ప్రాణత్యాగ విపర్యాసభయము,
పిచ్చలించి యేడ్పించె నంగదుని.

62

అపుడు, స్వామికార్యము చెడెనంచు ని
రాశచెంది తెగటాఱనున్న మము,
వారించుటకై వచ్చిన పగిదిని,
పక్షిరాజొకడు ప్రాలెను మా కడ.

63

అతడు జటాయువు నగ్రసోదరుడు,
సంపాతి ఖగస్వామి, బలిష్ఠుడు,
అనుజుని మృతివిని, ఆగ్రహోగ్రుడై
మండిపడుచు మార్గమసిలి యిట్లనెను.

64

ఎవ్వ డెచట వధియించె నా యనుజు?
పడె నెట్టుల తమ్ముడు పోరితమున?
ఎఱిగింపుడు వానర కులోత్తములు,
వినగోరెద నా వృత్తాంతంబును.

65

అంతట అంగదు డంతయు చెప్పె, జ
నస్థాన భయానక వధమును, ఆ
వల నీకయి రావణు నడ్డగ జరి
గిన రణమున కూలిన జటాయుకథ.

66

అరుణుని పుత్రుండగు సంపాతియు
తమ్ముడు పడిన విధానంబును విని
శోకతప్తుడయి, మాకు చెప్పె నీ
విచట రావణుని యింట నుంటివని.

67

ప్రీతికొలుపు సంపాతి మాటలను
విని సంతోషము పెనగ, వానరుల
మండలమును మే మంగదుండు నా
యకుడై నడప ప్రయాణం బైతిమి.

68

వింధ్యాద్రి ప్రాంతము విడిచి లేచి, సా
గరతీరము నొక్కటిగి చేరితిమి,
నిను దర్శించి, తనిసి, సుఖింతమను
ఉత్సాహము మ మ్ముద్వేగింపగ.

69

కాని మహాసాగర తీరంబును
దరిసి చూచి జంకిరి వానరు లం
గదసహితముగ, భగవతీ ! నిను కను
వేడుకలెంతగ వేగిరించినను.

70

పారములేని పయోరాశిని కని
అలజడినందిన హరిపుంగవుల భ
యంబు తీర్చి, నూఱామడల కడలి
గడచి, ఒక్కడనె గట్టెక్కితి నిట.

71

రక్కసి మందలు క్రిక్కిఱిసిన లం
కను చొచ్చితి చీకటిలో తడయక,
చూచితిని దశాస్యుని; నిన్నిపుడు
చూచుచుంటి నిట క్షోభిలుచుండగ.

72

దేవీ ! ఇది వర్తిల్లిన గత వృ
త్తాంతము, చెప్పితినంతయు దాచక,
నమ్ముము రఘునందను దూతను, భా
వింపుము నాతో స్వేచ్ఛగ తడయక.

73

రఘురాముని కార్యము నెఱవేర్పగ
నీ నిమిత్తమయి నే నిటువచ్చితి,
దేవీ ! నే సుగ్రీవుని సచివుడ,
వాయుసుతుడ ఇది వాస్తవమెఱుగుము.

74

శస్త్రధరులను ప్రశస్తుడయిన ఇ
క్ష్వాకున కచట కుశలము, గురులను
ఆరాధించు కుమారలక్ష్మణుడు
గుణవిలక్షణుడు కుశలము మైథిలి !

75

వీరుండగు నీ విభునకు హితముగ
సహకరించు నిశ్చయముతోడ, సు
గ్రీవుడు చెప్పగ దేవి ! వచ్చితిని
ఇందుల, కొకడనే సందేహింపకు.

76

నిను కొనివచ్చిన నీడలు జాడలు
కనిపెట్టుటకయి కామరూపమున,
అసహాయముగా అంతలంతలన్
తిరిగి, దక్షిణపు దిక్కు పట్టితిని.

77

నిను వెతకుచు కన్పించ, కలసి, వి
షణ్ణులయిన వనచరవర్గములకు
'నినుచూచితినే' నని చెప్పి, వెతల్
తీర్చు భాగ్యమునుకూర్చె నాకు విధి.

78

దేవీ! ఎంతయదృష్టమొ నాకిది,
వారిధి దాటుట వ్యర్థము కాలే
దిక, నీ దర్శన సుకృతఫలితముగ
మొలుచు కీర్తియును నిలుచు లోకముల.

79

రాక్షసాధిపుని రావణు నిచటనె
మిత్రబాంధవ సమేతము బలిగొని
పొంది నిన్ను కొనిపోగలడు, మహా
బాహువు రాము డవశ్యము శీఘ్రమె.

80
గిరులలో మహత్తరమగు క్షేత్రము
మాల్యవంత, మామలనుండి మహా
వానరు డొక పర్వంబున వెళ్లెను
గోకర్ణంబునకున్ యాత్రార్థము.

81
ఆ మహాకపియె మామక జనకుడు,
అతడు బ్రహ్మఋషు లాదేశింపగ
శంబుండను రాక్షసుని నృశంసుని
చంపెను, సాగర సంగ తీర్థమున.

82
హారిణ క్షేత్రమునం దచ్చట నే
వాయుదేవుని ప్రభావ బలంబున
జనియించితి, జాతిని వానరుడను,
ఖ్యాతి కెక్కితి జగముల హనుమ యని.

83
నిను నమ్మింపగ నిశ్చయించి నీ
విభుని గుణగణము లభివర్ణించితి,
దేవీ ! ఇక సందేహము వలవదు,
రాముడు నిను శీఘ్రమె కొనిపోవును.

84
ఈగతి హనుమ సహేతుకముగ భా
షించి, తెలుప పరిచితగతార్థములు,
విశ్వసించెను కపిని దూతయని, వి
పన్నయై చివుకుచున్న జానకియు.

85
అప్పుడు సీతకు అంతులేని ఆ
నంద మెడందను కందళించె, వం
గిన ఱెప్ప కురుల కనుల నశ్రువులు
గిరగిర తిరుగుచు పారలె ధారలయి.

86

ఎట్టని జీఁబల నింపయి, తెలి తా
మర పువ్వులవలె మెరయు కనులతో,
తేటలారె మైథిలి ముఖబింబము;
గ్రహణము విడిచిన తుహినాంశునివలె.

87

ఎదుటనున్న వా డితరుడు కాడని,
వానరు డగు హనుమానుం డతడని,
తెలిసికొన్న మైథిలి ముఖ వైఖరి
నాకళించి మాటాడసాగె హరి.

88

చెప్పితి జరిగిన చెయిదము నంతయు,
ఊరడిల్లుము పయోజదళాక్షీ!
ఏమి చేయదగు నే నిక చెప్పుము,
ఎట్లు తోచె నీ కట్లు మెలగెదను.

89

నాడు మహర్షులు వేడుకొన్న నా
జనకుడు కేసరి చంపెను శంబుని,
అయ్యెడ పుట్టితి అనిలు నంశ, వా
నరుడ, ప్రభావమున అతనికి సముడను.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౩౬

1–3

సీత నమ్మకము చెదరకుండుటకు
హనుమ మఱల నిట్లనె అనునయుగ,
వనచరుడను, దూతను, తెచ్చితి వీ
క్షింపుము నీ విభుచేతి యుంగరము.

2

నీ విశ్వాసము నిలువరించుటకు
రాముడిచ్చెను కరాంగుళీయకము,
కొనివచ్చితి, కైకొని చూడుము, శో
క ముడిగి, ఊరడిలుము తపస్వినీ !

4

ముమ్మరింపగా మోదము మైథిలి
ఉపశమించి, ఆ యుంగరమునుగొని,
భర్త చేతి ఆభరణము నరయుచు
రాగిల్లెను భర్తనె పొందినగతి.

5

ఎఱుపులు తెలుపులు గిఱికొను కన్నుల
చెలువము చిమ్మెడి సీతావదనము,
కనబడె హర్షోత్కటమై యప్పుడు,
రాహువు విడిచిన రాకాశశివలె.

6

విభుని క్షేమమును విజయంబును విని,
సంతోషము లజ్జయు మిక్కుటముగ
పెనగొన, జానకి ప్రీతిదాతను, మ
హావానరు కొనియాడె నిచ్చమెయి.

7

ప్రాజ్ఞుడవు, పరాక్రమశాలివి, కా
ర్యసమర్థుండవు హరికులవర్ధన!
లంఘించితి దుర్లభదుర్గమమగు
ఈ రాక్షస పద మీ వొక్కండవె.

8

నూఱామడలు కఠోరమయిన మక
రాలయమును ఒక ఆవు పాదముగ
చేసి దాటితివి నీ సాహస వి
క్రమ బలములు శ్లాఘ్యములు హరీశ్వర !

9

నిను సామాన్య వనేచరునిగ భా
వింపను హరివర! బెదరవు చెదరవు
రవ్వంతయినను; రావణ రాక్షసు
పేరు విన్న క్షోభిల్లు లోకములు.

10–11

విదితాత్ముడు రఘువీరుడు పంపిన
దూత వగుట నాతో భాషింపగ
అర్హుడ; వాతడరసిపరీక్షిం
పక పంపడు నా సన్నిధి కెవరిని.

12

న్యాయ సంగర విధాయి, ధార్మికుడు,
రాఘవుడు, పరాక్రమశాలి సుమి
త్రా సుతు, డిద్దరరణ్య మధ్యమున
నా భాగ్య వశమునన్ కుశలురు గద.

13

కాకుత్థ్సాన్వయ రాకా సోముడు,
రాముడు క్షేమముగా మనియుండిన,
వార్ధులు చుట్టిన వసుధా చక్రము
కాల్చడేల? లయకాల వహ్నివలె.

14

అమరులనైనను హతమార్పంగల
శక్తినిధులు దాశరథి సోదరులు,
ఐనను నా చెఱమాపుప తలపరో!
లేక అంతమే లేదో నా చెఱకు!

15

బడలడుగద రాముడు మనోవ్యథను,
నా వియోగతపనన్ పొగలడుగద,
పురుషోత్తము డిక ముందుకాదగిన
పనుల ప్రయత్నములను మానడుగద.

16

దీనుండయి భ్రాంతిన్‌బడి కార్య క
లాపములను ప్రాలాన్మెలడుగద, పురు
షార్థములు విధాయకముగ జరుపుచు
నుండునె? రాజసుతుండు నిత్యమును.

17

తనుపునె మిత్రుల దానసామముల
రెంటను? శత్రులవెంటను నడుపునె
దానదండ భేదమ్ములు మూడును?
రాముడు జయకాంక్షామనస్వియై.

18

కలిసి మెలిసి మిత్రులు వర్తింతురె?
మిత్రులతో తామెలగునె చనువుగ?
సుహృదులు రాముని శుభము కోరుదురె?
గౌరవింత్రె రాఘవుని, వారలును.

19
భగవదనుగ్రహాబల మర్దించునె?
దైవము తోడయి దారి చూప పురు
షార్థ సిద్ధి తథ్యము; (సకాలమున
దున్నిన పొలములు తొలకరితో వలె.)

20
కలుసుకొనక, చూపులును లేని దీ
ర్ఘ ప్రవాసమున రాముని స్నేహము
నాదెస తెగిపోలేదుగద హరీ!
తేర్చునె యీ చెఱతీర్చినను విభుడు.

21
సుఖముగ పెరిగిన సుకుమారుడు, దుః
ఖము నెఱుగని రా కొమరుడు, రాముడు;
ఇల్లు విడిచి గాసిల్లుచు నడవుల
శోక భరంబున సొగసి పోడుగద!

22
సాధ్వీమణి కౌసల్యాదేవి, సు
మిత్ర దీన చారిత్ర, వారి కుశ
లము విందురె వారము వారము నట,
వినవచ్చునె భరతుని క్షేమంబులు.

23
లోకమాన్యు డిక్ష్వాకు కులీనుడు,
నా విరహాదురంత వ్యథల నలిగి,
అన్య మనస్కుండై అలియడు గద!
రక్షించునె నను రఘుకుల తిలకము.

24
అన్నను దేవునియట్లు భజించును
భరతుడు భయభక్తులతో నాతడు,
మంత్రి సురక్షితమయిన క్షీపణా
క్షౌహిణీ బలము నంపునె నాకయి.

25

శ్రీమంతుడు సుగ్రీవుడు నాకయి
వెడలివచ్చునే వీరకపులతో!
ఖరదంష్ట్రిలతో కఱకుగోళ్ళతో
రక్కసి మూకల రక్కి త్రెక్కొనగ.

26

శుద్ధ శూరకుల సోముడు, సుమి
త్రానందను, డరిదాహకు, డస్త్ర వి
శారదుండు లక్ష్మణుడు వధింపడె!
తన శరముల నీ తామసకోటిని.

27

రణరంగములో రాముని శస్త్రా
స్త్రదవానలమున మ్రగ్గి రావణుడు
పుత్రమిత్ర కళత్రముగా హత
మారుట చూతునె అల్పకాలమున.

28

నా వియోగ తపనకు శుష్కించెనొ!
పసిడివన్నెలతో పద్మపరిమళము
విసరు విభుని ముఖబింబ మెండలో
నీరింకిన కాసార కమలమయి.

29

త్యజియించెను రాజ్యము ధర్మార్థము,
నడిపించెను కాల్నడన న్నడవికి,
శోకవ్యథ లించుకతోప వపుడు,
చెదరదుగద ఆహృదయస్థైర్యము.

30

తల్లిగాని, మఱి తండ్రిగాని, ఇత
రులుగాని రఘువరునకు స్నేహమున
కా రధికులు నాకంటె, నిందనుక
బ్రతికియుంటి ప్రియువార్తను వినుటకె.

31

ఇట్లు మైథిలి హరీంద్రునితో మధు
రార్థములగు వాక్యములు పలికి విర
మించెను, హనుమయె మిగత రామకథ
చెప్ప నాలకించెడి వేడుకతో.

32

సీత యట్టులు వచించిన దంతయు,
విని హనుమంతుడు భీమ విక్రముడు,
శిరసున చేతులు చేర్చి వినయముగ
వాకొన దొడగెను ప్రత్యుత్తరముగ.

33

నీ విచ్చటనుంటివి బందెనబడి
యని తెలియక తోడ్కొనిపోడాయెను
రాముడు; మును శీఘ్రముగ శచీదే
విని దేవేంద్రుడు కొని చనినట్టుల.

34

నేను పోయి విన్పించిన వెంటనె
నానాభల్లుక వానరవీరుల
సేనలతో చెచ్చెర విచ్చేయును
రణకోవిదుడగు రాముడు సాధ్వీ!

35

రాఘవుడు శరపరంపరలను గు
ప్పించి, వార్ధి స్తంభింపజేసి, సై
న్యములతో విడిని, నాశ మొనర్చును
లంకతోడ నెల్లర నిశాచరుల.

36

రాముని రణయాత్రా మార్గంబున
మృత్యు వెదిర్చిన, దైత్యులు దేవత
లంద ఱేకమయి అడ్డిన, నాతని
ఆగ్రహాస్త్రముల కాహుతి యగుదురు.

37

నీవు కనబడని నిష్ఠురశోకము
లోన మునిగి తేలుచు రఘురాముడు,
సుఖము నెఱుంగక శోభిలుచుండును,
సింహము బాధించెడి యేనుగువలె.

38

ఇది సత్యంబని యేను బాస తిం
దును; పుట్టి, పెరిగి, మను, వింధ్యాచల
మలయమందరాచలముల తోడని,
అందలి కందఫలాన్నము తోడని.

39

ఇంతంతలు కను, లెఱ్ఱని పెదవులు,
కుండలముల మెఱుగులతో శోభిలి
పున్నమచంద్రుని బోలిన రాముని
మోమిదె చూతువు పూజ్య పురంధ్రీ !

40

ఐరావతమం దమరేంద్రునివలె,
ప్రస్రవణ నగముపై రఘునందను,
కన్నుల తమి తమకంబులు తీరగ
చూతువు శీఘ్రమె పూతచరిత్రీ !

41

మాంసము ముట్టడు, మధువును తాకడు,
కాలోచితముగ కానల లోపల
దొరికిన కాయలు దుంపలు తిని, నీ
రాని తృప్తిపడు రాజకుమారుడు !

42

అంతరాత్మ నీయందు లగ్నముగ
శోకనిరతి తదేక ధ్యాన ప
రాయణుడై గాత్రమ్మున ప్రాకెడి
చీమల దోమల పాముల నెఱుగడు.

43

కామవశుండయు రాముం డేదో
ధ్యానమున మునిగి అన్యము నేమియు
చింతింపడు రవ్వంతయును మనో
వాక్కాయ వ్యాపారదూరుడయి.

44

రాజో త్తముడగు రాముడు నిద్దుర
రాక తపించును రాత్రిందివములు,
కన్నులు మూసిన కలవరించు సీ
తా యని పలుమరు తీయని యెలుగున.

45

పండుగాని పుష్పముగాని, మ రే
రమ్యమగు పదార్థంబుగాని కని,
ఉడికి ఉబుకు నిట్టూర్పులు పుచ్చుచు
హా! ప్రియా యను తహతహ మైమఱచి.

46

రఘునందనుడు, స్థిర వ్రతనిష్ఠను,
నిన్నె యెపుడు ధ్యానించును, పిలుచును,
సీతసీతయని హాతెఱ కదలుచు,
యత్నించును నీ అడపొడ లెఱుగగ.

47

రామునివలె దుర్భర దుఃఖితయగు,
జనకజ, ప్రియుకీర్తన విని కనబడె,
శేష మేఘములు చిందులు మానగ
చంద్రుడు పొడిచిన శారద నిశివలె.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౩౭

1

హనుము వచనములు విని ధర్మార్థం
బుల నిటు లడిగెను పూర్ణచంద్రముఖి.
కపివర ! నీ వాక్యము లమృతములో
విషమును కలిపిన విధమున నున్నవి.

2

ఇతరాసక్తుల నెఱుగక రాముడు
ధ్యానపరాయణు డాయెనంటివి, నా
విరహాశోకమున వికలు డాయె నం
టివి వెంటనె, పొసగవుగద రెండును.

3

అతి విస్తరమగు ఐశ్వర్యంబున,
కడుదారుణమగు కష్ట దైన్యమున,
పెనుపాశంబులు బిగిచి మానవుల
లాగును దైవ మధోగతి నంటగ.

4

విధి చెయిదము తప్పింపగరానిది
ప్రాణుల కెల్లను; రాముండును, ల
క్ష్మణుడును నేనును ప్రమగ్గద మార్తిని
గతి మోక్షంబులు గానరాని వెత !

5

నడిసముద్రమున నావ పగిలిపోన్
నీళ్ళలోనబడి, సుళ్ళు గుండములు
ముంచి తేల్చ శోషించు రాఘవుడు,
గడచి యెప్పటికి గట్టెక్కునో గద.

6

రక్కసిమూకల నుక్కడించి, పా
పిష్ఠి రావణుని పిలుకుమార్చి, లం
కాపట్టణము పెకల్చి, విజయుడై
నను చూచునో యెన్నడు నా నాథుడు ?

7

వేగిరింపుమని విభునితో నివే
దింపుము వానర తిలకమ ! నా ఆ
యుష్కాలం బిక ఒక్క వత్సరమె ;
పిదప నేను జీవింపను సత్యము.

8

జాలి యెఱుఁగని నిశాచర నాథుడు
ఒక్కయేడు గడువొసగె ; దానిలో
పదినెల లాయెను ఇదివఱకె హరీ !
మిగిలియున్నవి సుమీ రెండునెలలె.

9

నన్ను పంపు యత్నముచేసె విభీ
షణు, డాతని అనుజన్ముడు పలుమఱు,
మనవిచేసి, బ్రతిమాలి, భంగపడె;
మాఱదు రాక్షసు క్రూరమానసము.

10

దుష్టుడు రావణు డిష్టపడడు తా
ముచ్చిలించినది యిచ్చివేయుటకు,
వెదకులాడుచున్నది మృత్యువు రణ
ముఖమున కాలము మూడెను వీనికి.

11

నల పేరిటి కన్యక, విభీషణుని
పెద్దకూతు; రా పిల్ల స్వయముగా
తల్లిపంప, నా దరికి వచ్చి, యీ
వృత్తాంతము వినిపించె నొంటరిగ.

12

ధృతిమంతుడు, కులవృద్ధుడు, మేధా
వి, వినయశీలుఁడు, విద్వాంసుడు, రా
వణున కిష్టు, డనవద్యు; డవింధ్యుడు
కృతాకృత్యము లెఱిగిన హితపరి.

13

ఆతడు రాగల అవిధిని పొడగని
రామునితో వైరము రాక్షసకుల
నాశమూలమని నాటగచెప్పెను,
విహిత వాక్యములు వినడు దురాత్ముడు.

14

తలపోయుదు, హరితల్లజ ! నా మది
ప్రాణేశుడు సత్వరమె కలియునని,
అంతరాత్మయును అతిశుద్ధముగా
నున్నది, గుణసంపన్నుడు రాముడు.

15

పౌరుషమును, చేవయు, ప్రభావమును,
మెత్తని చిత్తము, మిత్ర కృతజ్ఞత,
శక్తి విక్రమోత్సాహములు కలవు,
వలసినన్ని రఘువంశ సోమునకు.

16

పదునాలుగువేల దనుజగణమును,
అనుజుడు సైతము అండలేనియెడ,
చెండాడెను రాముం డొక్కడె హరి !
అతనికి వెఱవని అరికుల మున్నదె ?

17

ఆబోతుంబలె అతిబలిష్ఠుడగు
రాఘవు డే వ్యసనాఘాతములను
ఇంత చలింపడు, ఎఱుగుదు నే నది,
దేవేంద్రు శచీదేవి విధంబున.

18

రాముని శరధారాపాతము మా
ర్తాండు నిదాఘాతపమై మండగ,
వైరి రాక్షసుల వాహినీజలము
లాఱి, యింకి, అడుగంటి హరించును.

19

ఇట్లు సీత యేమేమో వదరుచు
భర్తృవిరహతాపము సెలలెత్తగ,
కనుల నశ్రువులు కార్చుచు నిలబడె,
వానరు డంతట వైదేహిని గని.

20

పలికె నిట్టుల, తపస్విని ! రాముడు
నీ వేదనలు వినిన యంతనె కపి
భల్లూకచమూ బలములతో శీ
ఘ్రమె వచ్చును లంకకు శంకింపకు.

21

కాదంటివా రాకాచంద్రముఖీ !
తప్పించెద నిన్నిప్పుడె దైత్యుల
నరకయాతనల నడుమనుండి, నా
వెన్నుపలకపయి వేంచేయుము వెస.

22

వేల్పు ముడుపువలె వెన్నున నిడుకొని
దాటుదు వార్ధిని తారాపథమున;
కలదు శక్తి లంకను రావణుతో
పెళ్ళగించుకొని వెళ్ళుటకైనను.

23
హవ్యవాహనుడు యజ్ఞాహుతులను
దేవేంద్రున కందించు విధంబున,
నిన్నర్పించెద నేడె, ప్రస్రవణ
గిరిపైనున్న సుకృతికి రామునకు.

24
రాక్షస సంహారమునకు వెడలిన
విష్ణుమూర్తివలె వెలయు నీ విభుని
రాఘవుని, సుమిత్రానందనుతో
చూతు వీ దినమె శుక్లయశస్విని !

25
నినుగన నుత్కంఠితుడై ఆశ్రమ
మందు నున్న రఘునందను చూతువు,
మేరుపర్వతముమీద సుఖాసీ
నుండయిన సురేంద్రునివలె శోభని.

26
దేవి ! మది సందేహింపకు, తి
న్నగ కూర్చుండుము నా వీపున; రో
హిణి చంద్రునివలె, నీవును రాముని
కలిసికొనెడి యోగ మపేక్షింపుము.

27
చలువలు చిమ్మెడి చంద్రునితో నటు,
చుఱచుఱ లాడెడి సూర్యునితో నిటు,
మాటలాడుచున్ దాటెదు వార్ధిని,
నా వెన్నున తిన్నగ కూర్చుండిన.

28–29
నిను కొనిపోయెడి నను వెంటాడగ
జవసత్వంబులు చాలవు లంకా
వాసుల; కేగతి వచ్చితి నిటు, లా
గతి పోగల నాకాశ మార్గమున.

30

అద్భుతంబులగు హనుమ వాక్యముల
నాలకించి సర్వాంగములును పుల
కించి పొంగ, పలికెను మైథిలి హను
మంతునితో విస్మయ హర్షంబుల.

31

దూరము పయనము, దారి గాలిలో,
నను నీ వెట్టులు కొనిపోగలుగుదు ?
ఘటనాఘటనలు గమనింపని ఉ
త్సాహాము మీ కపి జాత్యము హనుమా !

32

మానవ పూజ్యుని నానాథుని సా
న్నిధ్యంబును పొందింప తలచితివి;
ఎట్టుల కొనిపోయెద విధి సాధ్యమె ?
అల్పము నీ కాయము హరిపుంగవ !

33

సీత సందియము చెవిని సోకగనె,
చింతలో మునిగె శ్రీమన్మారుతి,
తలవనితలపుగ తనకు క్రొత్త ప
రాభవంబు సంప్రాప్తమాయెనని.

34

ఈ యసితేక్షణ యెఱుగ దింత నా
సామర్థ్యమును నిజప్రభావమును,
చూచుగాక యీ సుముఖి యిపుడు నా
కామరూప రేఖాప్రకాశనము.

35–36

అని భావింపుచు హనుమయు నంతట
చెట్టునుండి దిగి, సీతను దగ్గరి,
ఆమెకు నమ్మక మాదుకొనగ, ఆ
కారము పెంచుట కారంభించెను.

37

మేరుపర్వతము మించి మందరా
చలము మించి అతిశయమగు రూపున
ప్రళయకాల తీవ్రములగు ప్రభలన్
నిలిచె హనుమ మైథిలి కట్టెదుటను.

38

విపరీతముగా పెరిగి కొండవలె,
రాగివన్నె తేఱగ మోమున, వ
జ్రములవంటి నఖములును కోరలు
గోరగింప, కపికుంజరు డిట్లనె.

39

కొండలు కోనలు, కోటలు తోటలు,
ప్రాసాదంబులు ప్రాకారంబులు
అన్నిటితో, అసురాధిపుతో, లం
కను సొంతము నే కొనిపోగలుగుదు.

40

దేవీ ! నీ సందేహము మానుము,
తేకువతో బుద్ధి నిలువరింపుము,
అపనయింపు మిసుమంత రామల
క్ష్మణుల తీవ్రతీక్షణ శోకంబును.

41

అని పలికెడి అనిలాత్మజు, పర్వత
సంనిభు, కపికుంజరమును చూచుచు,
పూచిన తామరపువ్వులవంటి వి
శాల నేత్రముల జానకి యిట్లనె.

42

తెలిసికొంటి హరికుల వీరాగ్రణి !
తావక బలసత్వ ప్రభావములు,
పవనుని వేగము భానుని తేజము
పొంది పొసగి నీ యందు పాదుకొనె.

43

మహిలో నరసామాన్యు డెవ్వడును
మఱియొక డింత సమర్థు డగపడడు,
పారములేని లవణ మహార్ణవము
దాటివచ్చి తీ దరికి మహాకపి !

44

నీ గమన బలోద్వేగము తెలుగుదు,
నను కొని పోగలవనియును నమ్ముదు
కాని, రాఘవుని కార్యసిద్ధిని, వి
చారించు టవశ్యము మునుముందుగ.

45–47

నీతో నే పయనించుట యుక్తము
కాదు హరీశ్వర ! కడలిమీద వే
గాతివేగమున అరుగునపు డడలి
మూర్ఛిలి నే పడిపోదును నడుమన.

?

జాఱి త్రుళ్ళిపడ సాగరజలముల,
మకర తిమింగిల మత్స్యజాతమున
కన్నం బగుదును హరికుల వర్ధన !
దిక్కుమాలిన మృతియగును నా కది.

48

శత్రుకుల వినాశకుడవు నీవు, ని
జంబె, కాని రాజాలను నీతో,
నిను కళత్రవంతునిగా లోకము
శంకించును నిశ్చయము మహాకపి !

49

నీవు నన్ను కొనిపోవుజాడ గని
దుర్దమ విక్రమధూర్తులైన రా
క్షసులు వెంటబడి కారింతురు, చల
పట్టి రావణుడు కట్టడి చేయగ.

50

బల్లెము, లీశెలు బద్దలు, తూపులు
పట్టి రక్కసులు చుట్టుముట్టగా,
వీరకళత్రము వెంట ఉన్నదని
భయసంశయములు పైకొను నీకును.

51

ఉప్పరమున ఏ యూతలేక, ఏ
ఆయుధములు లే, కాయుధధారు ల
నేక రాక్షసుల నెదిరి పోరు, చెటు
నను రక్షింపగ నగు నీకు హనుమ !

52

క్రూరకర్ములగు ఘోరరాక్షసుల
తో తలపడినన్, తుముల సమరమగు,
ఆ సంకుల సమయమున నేను నీ
వెన్నుపట్టెడలి వ్రేలు కాడుదునొ.

53

భీమబలాఢ్యులు వేలు దానవులు
వివిధాయుధ కోవిదులు, నిను నిరా
యుధుని, ఒక్కరుని, యోడింపగ నో
పుదురు పోరితంబున ఎట్టులైనను.

54

యుద్ధము చేయుచు ఒక్కప్పుడు నీ
వెడపెడ మొగ మిడితేని; క్రిందపడ,
నన్ను పట్టి బందంబులేసి రా
క్షసులు మఱల లంకకు కొనిపోదురు.

55

లేక, నన్ను బల్మిని నీ చేతుల
నుండి లాగుకొన నోపుదు రేనియు,
పగగొని చంపగవచ్చు, జయాపజ
యమ్ములు రణమున నమ్మగరానివి.

56

అట్లుగాక, ఇక్కట్లమారి ర
క్కసులు కసరి వెక్కసమున హిం
సించిన, నేనె త్యజింతు ప్రాణములు,
వృథయగు నీ పని, వ్యథ మిగులును హరి!

57

ఈ నిశాచరుల సేనల చంపగ
చాలు దీవు కపిసత్తమ! చూడుము!
రాక్షస సంహారమునకు పుట్టిన
రాముని కీర్తి పరాస్తమగు నపుడు.

58

అదియుగాక ఈ యసురఘాతకులు
నను కొని చని మానవులు మెసలని ర
హస్యదేశమున ఆకట్టినచో,
తెలియదు దాశరథులకు నా యునికి.

59

నా చెఱ తీర్చుటకై చేసిన నీ
యత్నము లన్నియు వ్యర్థమగు నపుడు;
కాన నీవు రాఘవు తోడ్కొని లం
కకు వచ్చుటయే కర్తవ్య మిపుడు.

60

అరసి చూడుము, మహాత్ముని రాముని
మనుగడయును, లక్ష్మణసహోదరుల
బ్రతుకును, మీ కపిరాజు జీవితం
బు, నిపుడు నాతో ముడివడి యున్నవి.

61

మామక రక్షణమతులు రాఘవులు,
వానరులును నా పట్ల నిరాశను
చెందిరేని, కపిశేఖర! విడుతురు
వారు ప్రాణంబులు వీరోచితముగ.

62

వానరేంద్ర! నా ప్రాణవల్లభుని
తక్క మఱొక్కని తాకను సత్యము;
అస్ఖలితంబగు అస్మదీయ పా
తివ్రత్యముతో దీక్ష పట్టితిని.

63

నన్ను పట్టి స్యందనమున నిడి, పఱ
తెంచునపుడు, పరదేహము తగిలెను,
ఏమి చేయుదు, అనీశ, ననాథను,
పరబలాత్కృత నవశను నే నపుడు.

64

ఎప్పటికైన శమించునె నా వెత!
రావణుని పది శిరములు నేలబడి,
అతని బలంబులు హతమై, నప్పుడు
ననుకొని చను టొప్పును రాఘవునకు.

65

రణదుర్జయుడగు రాముని శౌర్యము
వింటిని వీనుల, కంటిని కన్నుల,
నాగదేవ గంధర్వ రాక్షసుల
నెవ్వడు నాతని కెనగా డనిమొన.

66

గాలి తోడయిన కీలిపోల్కి, ల
క్ష్మణుడు తోడుగా, రణమున చాపము
నెక్కడి దైత్యుల చక్కాడు మహేం
ద్రప్రతాపు నెదురన్ నిలుతు రెవరు?

67

దురమున లక్ష్మణుతోడ, దిగ్గజము
వలె రాక్షసులను పడద్రొక్కుచు, బా
ణాగ్నులు రేగ, యుగాంత భానుడగు
రాము నెదురు వారలు కల రెవ్వరు?

68

కావున బలములతో వేగమె రా
ముని తోడ్కొని రమ్మా, ప్రియ విరహమున
కృశియించెడి నా ఖేదము నార్చుము
సుఖమును చేకూర్చుము మహాకపీ !



# సుందరకాండ

## సర్గ ౩౭

1

అట్లు జానకి నయంబుగ పలికిన
ఆలకించి హృదయము హర్షింపగ,
సమయజ్ఞుడు, వాచావిశారదుడు
కపిశార్దూలం బపుడు పల్కె నిటు.

2

నీ భాషితము లనింద్య చరిత్రీ !
సకల స్త్రీలకు స్వాభావికములు,
సాధ్వీచరితల సంప్రదాయములు,
సీతా శోక వినీతార్థంబులు.

3

నీ వన్నట్టుల నా వీపున మి
న్నక కూర్చుండి, మణగి, నూఱామడ
కడలిని దాటుట కష్టమె అబలకు;
చాలవు నీ తను జవసత్వంబులు.

4–5

తాకను రాముని తక్క అన్యుని
వినయముగా చెప్పిన రెండవ కా
రణము నీకె తగు రాముని పత్నికి;
ఎవతె పలుకగల దిట్టిమాట సతి !

6

విన్నవింతు దేవీ! నే చూచిన
శీలవృత్తములు, చెప్పిన నీ సా
ర్థక వాక్యములను సకలము, కా
కుత్థ్సునితో నటు కుంచక పెంచక.

7

రామునిపై నా ప్రేమనిష్ఠలకు
పలుకారణములు కలవు తపస్విని!
స్నేహంబున చిగిరించిన మానస
మతిశయింప, నటు లభివర్ణించితి.

8

మొదట, దాటరానిది మహార్ణవము,
పిదప లంక ప్రవేశ మసాధ్యము,
రెండింటి సమర్థించిన నా బల
పాటవములు తెలుపగ నటు లాడితి.

9

నిన్ను విభునితో నేడే చేర్పగ
ఉత్సాహము చిగురొత్తగ, గురుభ
క్తియు నెక్కొన, పలికితినటు నురవడి,
దేవీ! వేఱుగ భావింపకు మది.

10

నాతో ప్రస్థాన మిపు డసంగత
మగుచో, నీ విరహమున వేగు రా
రామునికి గుర్తుగా పుణ్యవతీ! లాం
ఛన మేదయిన ప్రసాదింపగ తగు.

11

అని విధేయముగ హనుమ పలుక
దేవకన్య భాతిని భాసిల్లెడి
జనకసుతయు బాష్పము లాకట్టిన
ఎలుగు రాలుపడ ఇట్లనె మెల్లగ.

12
ప్రియ లాంఛన మిది విభున కిమ్మ్మ, మును
ఫలతరూదకప్రాజ్యమూలమగు
చిత్రకూటమున చేరి, కాపురం
ముంటిమి, గిరిపూర్వోత్తర తటమున.

13
తరువులతో క్రిక్కిరిసి, వివిధ పు
ష్పసువాసనలు విసరుచుండ, ఏ
కాంతవాస యోగ్యమయి, తాపసుల
ఆశ్రమములలో విశ్రుతం బగుచు.

14
సిద్ధులు విడిసి వసింపుచున్న మం
దాకిని దరి నిద్దరము తిరిగితిమి
చాలసేపు, వేసరి నే నొరగితి
చెమటనీట తడిసిన నీ యొడిలో.

15
అపు డచ్చట మాంసార్థముగా ఒక
కాకి నన్ పొడిచె, గడ్డలు రువ్వితి,
విడిచిపోక అది పెడల దాగి, క్ర
మ్మఱ వచ్చెను మాంసము మరగిన తమి.

16
బలిపిండములకు అలవాటయి ఆ
పాడుకాకి నరపలలము రుచిగొని,
మానలేక పలుమఱు నన్ పొడిచెను,
పొంచియుండి దాపులనె దాగుకొని.

17
చలమున, పోక, పిశాచి కాళకా
కోలము నా మొలనూలులాగె, నే
కినిసి కసరి దానిని అదల్చుచుం
డగ నీ వారసి నవ్వితి వల్లన.

18

నాథుఁడు నవ్విన నానయు కోపము
నగ్గలించె, వాయసమును వదలక
విడిచిపోక నను వేధింపగ, దెస
మాలి వల్లభుని మాటున కేగితి.

19

ఒొమ్మొచీఱి, కాకమ్మొ కొొసరి నా
చీర లాగినన్ చిన్నపుచ్చుకొని,
సిగ్గును కోపము లగ్గపట్ట నీ
యంకమునె మఱల నాశ్రయించితిని.

20

కాకపీడనకు కాఱియపడి, క
న్నీళ్ళతో మొగము నిండగ, కన్నులు
తుడుచుకొనుచు చేడ్పడియుండగ క
టాక్షంబుల నన్నాదరించితివి.

21–23

విసిగి, వేసరిలి విరమించి, నిదుర
పోతి చాలసేపు విభు నంకమున
పిదప రాఘవుడు నిదురించెను నా
యొడిలోపల శిరసిడి సుఖంబుగా.

:

ఒడ లెఱుంగక ప్రియుని యొడినే నిదు
రించి లేవగనె, పొంచియున్న కా
కోల ముచలమున వ్రాలి నాపయి త
టాలున స్తనములు చీలిచె చివ్వున.

24

స్తనములు గాయములను కాఱిన ర
క్తపు చుకక్కలతో తడిసె, నంత, కా
కోల బాధలకు తాళలేక, సుఖ
సుప్తినున్న రఘుసోముని లేపితి.

25

గాయములయి రక్తము కాఱిన నా
వక్షంబును రఘువల్లభు డారసి,
క్రుద్ధుండై ఎడకోడె త్రాచువలె
బుసలు చిమ్ముచున్ కసరి యిట్టులనె.

26

ఎవడు తెగించి ఒడ లెఱుగ కిచట నీ
ఱొమ్ము గీఱి గాయమ్ములు చేసెను?
అయిదుతలల కాలాహితోడ చె
ల్లాటల కెగబడె చేటుమూడి యిటు.

27

అనుచు విభుడు వాయసమునకై పరి
కించి చూడసాగెను నలువైపుల ;
అది నా కెదురుగ కదలక యుండెను
నెత్తురు జొత్తిలు కత్తిగోళ్ళతో.

28

ఆ వాయస నాయకుడు, మహేంద్రుని
వరసుతు డనియును, వాయువేగమున
భూసంచారంబునకు వెడలి, దిగి
వచ్చెనని తెలియవచ్చె విభున కెద.

29

అంత, మహాభుజు డాగ్రహోగ్రుడయి,
కనుచూపులు కనకన భ్రమియింపగ,
పొరజూచి ఆ బలిపుష్టము నెడ
క్రూరమగు ప్రతీకారము తలచెను.

30

తా నాసీనుండైన చాప నొక
దర్భను బ్రహ్మాస్త్రముగా అభిమం
త్రించి వైచెను, జ్వలింపుచు అది వా
యసమునంటి వెన్నాడెను వదలక.

31

బ్రహ్మాస్త్రము వెంబడిపడ, కాకము
ప్రాణభీతితో పాతర లాడుచు,
సంరక్షణకయి సర్వభూతలము
దిగ్దిగంతములు తిరిగి త్రిమ్మరెను.

32

తండ్రి యింద్రుడును, తక్కిన సురలు, మ
హర్షు లెల్ల పొమ్మనితోయగ, వెఱ
నిస్సహాయుడై, నీవే దిక్కని,
కడకు రాఘవుని కాళ్ళమీద బడె.

33

శరణాగత రక్షణ దీక్షితుడగు
కాకుత్థ్సుండా కాక పిశాచిని
మన్నించెను చంపతగినదైనను,
శరణని భూమిని చాగిలి వ్రాలగ.

34

తిరిగితిరిగి బలమఱి, దుఃఖించుచు
క్రమ్మఱిలిన కాకము గని రాముడు,
బ్రహ్మాస్త్రము త్రిప్ప నశక్యము; దీ
నికి చూపుము శాంతిని నీ విపుడనె.

35

కాక మంత రాఘవ! నీ యస్త్రము
నా కుడికన్ను కొనందగు ననె; అ
ప్పుడు కుడికంటిని పొడిచె నస్త్రమున
రాముడు, కాకికి ప్రాణము దక్కెను.

36

రాజు దశరథుని, రక్షకు రాముని,
ప్రస్తుతించుచున్ ప్రణతులు సలిపి, ని
జాలయంబునకు అరిగె వాయసము
వీరుడు రాముడు విడిచిపుచ్చగా.

37–38

నాకొరకు అప్పుడు కాకిమీద బ్ర
హ్మాస్త్ర మెత్తితివి, అకటా! ఏల యు
పేక్షింతివిపుడు మహీధవ! నిన్నెడ
బాపి నన్ను కొనివచ్చిన రాక్షసు.

39

నాటి వీర కరుణారసంబులను
నేడు నా పయిన నెరపుము రాఘవ!
నిను నాథునిగా గొను సౌభాగ్యము
కలిగి, అనాథను వలె తపింతు నిట.

40

ధర్మములందు ఉదాత్త ధర్మము ద
యా విశేషమని నీవె చెప్పగా
వింటిని, తావక వీరవిక్రమో
త్సాహము తెలుగుదు సాటిలేనివని.

41

నీ గాంభీర్యము సాగర మట్టిది,
కదలదు చెదరదు కలతలు చెందదు;
నాల్గు సముద్రముల నడిగడ్డకు పా
లకుడవు, సురనాయక సమానుడవు.

42

అస్త్రశస్త్రవిద్యా కుశలుడు, భుజ
బల పటిష్ఠుడు, డనవద్య సత్యసం
ధుడు, రాఘవు డెందుకు సంధింపడు,
ధనువున నస్త్రము దైత్యుల దునుమగ.

43

నాగాసుర గంధర్వులేని, ఆ
మరుతు లేనియును మార్కొనజాలరు
రణరంగంబున, రాముని క్రూర శ
రప్రయోగ ధారాపాతంబును.

44

ఆ వీరుడు నాయాతన లింత త
లంచి, జాలిని కలంగెనేని, ఇటు
లూరకుండ గానేల, వ్రాలిరా
తుసులను తుయలోకమునకు పంపడు.

45

రిపువాహినులకు గ్రీష్మతపనుడగు
లక్ష్మణు డమితబల ధురంధరు, డ
న్న యనుమతినిగొని నాశము చేయడు
కంటకులగు రక్కసుల నెందులకు ?

46

అగ్నిసమానులు, అనిల సంనిభులు,
తేజోజవశక్తి ప్రతాపు, లీ
పురుష వ్యాఘ్రంబులు సమర్థులై
ఏమిటి కిట్టు లుపేక్షింతురు నను.

47

చేసిన నా దుష్కృత మేదో కల
దతి బలవత్తరమైనది, తథ్యము;
లేకయున్న రిపులోక దాహకులు
బయిసినూలి విడువరు న న్నిగతి.

48

కనుల నశ్రువులు కాఱ దీనముగ,
కరుణ గద్గదస్వరయై పలికిన
వైదేహి విలాపము విని, కరగిన
మనసు చివుకుమన హనుమ యిట్లనెను.

49

దేవి ! నమ్ము మిదే ఒట్టు తినెద,
రాముడు నీ పయి ప్రాణములన్నియు
పెట్టి, సర్వసుఖ విముఖుడాయె, ల
క్ష్మణుడు తపించు విషాదవేదనల.

50

కన్నుల చూచితి నిన్నెటులో యిట,
తఱిగా దిది చింతాచింతనలకు,
దుఃఖాంతము చూతువు వైదేహీ !
ఇంతటిలోనె అదృష్టవశంబున.

51

పులిపోతంబులవలె బలిష్ఠులగు
రాజసుతులు వార లిరువురును, నిను
చూచు సంభ్రమము రాచ లేచి, కా
లిచి లంకను బూబూడిద కావింతురు.

52

దశకంఠుని బాంధవ బలములతో
ఘోరరణంబున కూల్చి రాఘవుడు,
నిను తోడ్కొనిపోవు నయోధ్యకు, ము
జ్జగములు మెచ్చగ జనక కుమారీ !

53

ఏమి చెప్పదగు నేనుపోయి, అట
ధీమంతులయిన రామలక్ష్మణుల
తో; సుగ్రీవునితో, కపివీరుల
తో నదెల్ల నాతో చెప్పు మిచట.

54

హనుమ చెప్పినది ఆమూలము విని,
సురసుత బోలిన శుచిముఖి మైథిలి,
శోకముతో మనసు తపింపగ, ఇ
ట్లనె కపిసత్తము డాకర్ణింపగ.

55

సుమనస్విని, ప్రస్తుత చరిత్ర, కౌ
సల్య లోకరక్షకుగా కడుపున
కన్న రాముని సుఖ మడిగి, శిరసును
వంచి, సలుపు మభివాదము మారుతి !

56

రమ్యమాల్యములు, రత్నహారములు,
పృథివీ రాజ్యము, ప్రియ కళత్రమును
స్వేచ్ఛగా విసర్జించిన లక్ష్మణ
పుత్రునికన్న సుమిత్ర ధన్యయగు.

57

తల్లిదండ్రులను తనిపి, అడవులకు
నడచు అన్నవెంబడి వచ్చె, నఖిల
సుఖములు విడిచి, విశుద్ధుం; డన్నకు
అనుకూలుడు పావనశీలు డతడు.

58–59

సింహపు మూపుల శృంగారముతో,
దీర్ఘ బాహువులు తేజరిల్లు ప్రియ
దర్శనుడు, మహోదారుడు, సుఖములు
కోర, డన్న కనుకూలుం డాతడు.

60

వృద్ధ జనుల సేవించును, శుభ సం
పల్లక్షణములకెల్ల నాస్పదుడు,
గంభీరుడు, లక్ష్మణు, డర్చించును
నన్ను తల్లివలె, నాథుని పితవలె.

61

రాజసుతుడు, సర్వప్రియుండు, నా
మామగారికి సమానుడు, పరిమిత
భాషి, అపరిమిత పౌరుషరాశి నా
కన్న ప్రియుడు రాఘవునకు ఆతడు.

62

రాముం డేకార్యమునకు పనిచిన
సాధ్యాసాధ్య విచారణ సలుపక,
నిర్వహించు దానిని; రఘునందను
డతని చూచుకొని పితనే మఱచును.

63

నా పక్షంబున నా మాటలుగా
కుశలమడుగు మనుగుంగతి లక్ష్మణు;
దక్షుడు, కోమలు, దక్షతశుచి, నా
కన్న ప్రియుడు రాఘవునకు తమ్ముడు.

64

వానరసత్తమ ! ప్రాణగొడ్డమగు
ఈ కష్టము గట్టెక్కించుట నీ
భారము, తగిన ఉపాయసాధనలు
నిర్ణయించుటకు నీవె ప్రమాణము.

65

నీ సాయము, పూనికయును, నను కొని
పోవగ రాముని పురికొల్పగవలె,
నా చెప్పినదంతయు పలుకుము రా
మునితో, శూరుడయిన నాథునితో.

66

ప్రాణంబులు బిగబట్టియుందు నొక
మాసము దాకను, మాసము దాటిన
జీవింపను రఘుశేఖర ! సత్యము
పలికితి నీతో ప్రాణసాక్షిగా.

67

పాపి, కామి, రావణుడు, నన్నిటుల
పట్టితెచ్చి నిర్బంధింపగ, దుర
పిల్లుచుంటి, విడిపింపగతగు; పా
తాళ కౌశికనుబోలె రఘూత్తమ !

68

అనుచు సీత అపుడపుడె, హనుమ క
ర్పించె చీర ముడివిప్పి, దివ్యభూ
షణమును చూడామణిని, రాముని క
భిజ్ఞానముగ అర్పింపుమనుచు ధృతి.

69

అపురూపంబగు ఆ శిరోమణిని
స్వీకరించి తన వ్రేలికి తొడిగెను,
ఆదిచాల కది అరపకపోయెను
బలిసియున్న కపి బాహాంచలమున.

70

మణిరత్నము కైకొని హనుమంతుడు
సీతకున్ ప్రదక్షిణముగ అభివం
దనము నెఱపి, యెంతయు వినయంబుగ
ఒక పార్శ్వంబున కోసరిలె నొదిగి.

71

సీతాదర్శన జాతానంద స
ముత్కంఠిత హృదయుం డగు హనుమకు
హృదయ మెప్పుడో యెగసిపోయె రా
ఘవునికడ, కపట కాయమె యుండెను.

72

తన ప్రభావబలమున సీతను కని,
ఆమె దాచిన శిరోమణి గైకొని,
సుడిగాలి విసరి విడిచిన గిరివలె,
సుఖియై గమనోన్ముఖు డాయె, హనుమ.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౬౫

1

చేతి కిచ్చి మణి, సీత యిట్లనియె,
వానరవర ! ఈ యానవాలు నే
నంపినదని తడయక నమ్మను ప్రా
ణేశుడు, రాఘవు డెఱుగు దీనికథ.

2

ఈ చూడామణి చూచినయంతనె
స్మరియించును ముువ్వురను రాఘవుడు,
జననిని కౌసల్యను, నన్నును, జన
కుని దశరథ నృపతిని, విఖ్యాతుని.

3

ఎటు మొదలిడదగు నీ కార్యంబును,
పిదప నేమి కావింపవలయు, అది
ఉత్సాహముతో యోచింపుము, దా
నికి సమర్థుడవు, నీవె మనీషీ !

4

నా కష్టము లంత మగుట కెయ్యది
ఆవశ్యకమో భావింపుము మది,
అది సాధింపగ యత్నింపుము హరి !
కడముట్టింపుము కట్టిడి దుఃఖము.

5

సీత యట్లు యాచించి యూరకొన,
వల్లె యనుచు పావని, మహాబలుడు,
ప్రతినచేసి, తలవాల్చి వినతి, సీ
తకు ప్రణమిల్లి, కదలె ప్రయాణమై.

6

తిరుగు పయనమున తరలిపోవు హను
మను చూచి మరల మైథిలి యిట్లనె,
కనుల నశ్రు లుత్కటమై కంఠము
బంధింపగ రాల్పడిన యెలుంగున.

7

అడిగితి క్షేమంబని చెప్పుము, హరి!
కూడియున్న రఘుకుల నందనులకు,
సుగ్రీవునకును, సుహృదులకు, సచివ
వృద్ధుల, కఖిల కపిప్రవరులకును.

8–9

ప్రాణము లుండగ పత్ని నుద్ధరిం
చెను ధర్మాత్ముడు శ్రీరాముండను
కీర్తి వెలయగా వర్తింపు మనుము;
నా దుఃఖము మాన్పగ నీవె తగుదు.

10–11

నిత్యము వదలక నీ వుత్సాహము
తొలక చెప్పు పలుకులు విని రాముని
మనసు నా వయిపు మరలి, పౌరుషము
చూప నుత్సహించును నను పొందగ.

12

నీవు నాదు సందేశము చెప్పిన
రాఘవుడు విని పరాక్రమించి, త
ప్పక పిం విధాయక తత్పరుడగు,
చక్కపడు సమస్తమును మహాకపి!

13
సీత వాక్యములు చెవియొగ్గి వినిన
అనిలనందనుడు హనుమంతుండును,
శిరసున చేతులు చేర్చి వినయముగ
బదులు పలికె బరవశము దీటుకొన.

14
రాగల డిచటికి రాముడు శీఘ్రమె,
వానర భల్లుక సేనలు మునుకొన,
సమరంబున రాక్షసుల చంపి, నీ
శోకము చల్లార్చును శుభగాత్రీ!

15
రాముని బాణపరంపర కురియగ
ప్రాణాలు తప్పక రణరంగంబున
నిలబడగల యోధులు కనిపింపరు
నరులలో సురాసురులలో నయిన.

16
ఆలి మొనయందున, అందును నీ కో
సము వచ్చిన యుద్ధమున, రాఘవుడు,
ఇంద్రునేని, దివసేంద్రునేని, యము
నేని, తుదకు సహియింప కెదుర్చును.

17
రత్నాకర సూత్రము మొలనూలగు,
క్షితిచక్రము శాసింపగలడు రా
ముం, డా విజయాభ్యుదయము సిద్ధిం
చును నీ మూలంబున తపస్వినీ!

18
అట్లు విహితముగ హనుమంతుడు ప
లికిన సుభాషితములను మెచ్చుకొనుచు,
జానకి క్రమ్మఱ సంభాషించెను
మనసులోని అలమట లురియాడగ.

19

పయనము కట్టిన పావనివై పున
తిరితిరిగి వావిరి వీక్షించుచు,
భర్తృస్నేహము పల్లవింప మె
త్తని యెలుగున ఇట్లనెను జనకసుత.

20

ఇంచుక తడయగ ఇష్టమున్న నీ
వీ సికటంబున కానరాని కడ,
ఒక్కదినము శ్రమతక్క నిలిచి పో
వచ్చు, లేచి పఱువాతనె మారుతి!

21

చేసిన యేకించి దదృష్టమున నో
తావక సాన్నిధ్యసుఖం బబ్బెను,
ఇంచుకంత లభియించె తెలిపి నా
తీవ్రదుఃఖ దుర్దినముల నడుమను.

22

పోఁ ఋఃరమ్మొ హరిపుంగవ! క్రమ్మఱ;
నా ప్రాణము లందాక బొందిలో
ఉండునొ లేదో ఊహింపగ లే
నది; దినగండము బ్రదుకి చెఱలో.

23

నెమ్మి నెఱపి యిటు నీ వేగిన నిను
చూడని దుఃఖము పీడించును నను,
దుఃఖము విడిచినతోడనె పొడిచిన
దుఃఖము మిక్కిలి దుస్సహం బగును.

24

ఒక్క సంశయము కక్కసించు నను
కపికుంజర! అక్కడ మీ బల మంతయు
కపులును భల్లూకము లంతియెగద,
సాయము రణమున చేయజాలినవి.

25

వానర భల్లుకబలము కాని, రా
ఘువ సోదరులే కాని, తమంతట
దుష్పారంబగు తోయధి నెట్టుల
దాటివత్తు రీ యేటిగడ్డపయి.

26

వాయు సుపర్ణులు, పావని వీవును,
ముప్వురు మాత్రమె భూతకోటిలో
కలరు, మహాసాగరమును దాటగ
చాలిన లాఘవ జవసాహసికులు.

27

కనబడుచున్నది కండ్ల కట్టెదుట,
దాటరాని దీ యాటంకము, ఎటు
పరిహరింతు వీ వరసిన చెప్పుము,
కార్యదక్షుడవు కపివీరాగ్రణి !

28

ఈ కార్యము ఫలసాకల్యముగా
నిర్వహించుటకు నీవు సమర్థుడ
వరిమర్దన ! నీ యశము లోకముల
స్వీయబలోపార్జిత మూర్జితమగు.

29

నా కొఱకయి సైన్యములు కూర్చుకొని,
సత్యసమరమున దైత్యునోర్చి, విజ
యుండయి నాథు డయోధ్య కేగుట, య
శస్కరమగు నీ చరితకు నాకును.

30

ఈడులేని విలుకాడు రాఘవుడు,
బాణధార జడివాన కురిసి, లం
కను నీటగలిపి, నను కొని పోవుట
అనుగుణమ్మగును ఆతని ఖ్యాతికి.

31
అరికులాంతకుడు, ఆహవశూరుడు
రాఘవు డను క్షాత్రప్రఖ్యాతికి,
అనువుగ వీరవిహారము జరిగెడి
సమరవ్యూహము సమకూర్చుము హరి!

32
హితకరములును సహేతుకములు నగు
జనకజ వాక్యములను గమనించి, ని
దానించి సమాధానముగా, ఇటు
పలికె నామెతో పవననందనుడు.

33
దేవి! ప్రభువు సుగ్రీవుడు తన భ
ల్లూక వానర చమూకోటిని అం
కితము చేసె నీకై రాఘవునకు,
సర్వసత్వ బలసంపూర్ణు డతడు.

34
వేలుకోట్లు కపివీరాగ్రేసరు,
లొక్క యుద్దవిడి యుద్ధకాంక్షతో,
రాక్షసకుల మారణదీక్షను సు
గ్రీవువెంట దూకెదరు లంకలో.

35
విక్రమ సాహస భీమబలాఢ్యులు,
మనసుతోనె రయమున వాలగలరు;
వానరభల్లుక సేనలు పతులును,
వత్తురు సుగ్రీవప్రభు నాజ్ఞను.

36
మిట్టపల్లములు, మెలికలు, తిరుగు,
ళ్ళడ్డగలేవా గడ్డు వానరుల,
అలవికాని కార్యములకు జంకరు,
అతితేజోమయు లని మొన వారలు.

37

ఏడుసముద్రము, లెనిమిది పర్వత
ములతో శోభిలు భూచక్రమును, ప్ర
దక్షిణించి రుత్సాహముతో పలు
మారులు మున్ను సమీర మార్గమున.

38

నాకంటెను మిన్నలును సమానులు,
కల రెందఱో మా కుల విఖ్యాతులు
సుగ్రీవునికడ, సుముఖీ ! నాకం
టెను కనీయు డొకడును లేడచ్చట.

39

అధికుల నంపరు అన్నిపనులకు, క
నిష్ఠుడని నను పనిచి రీపనికయి,
కడలిదాటి నీ కడకు నేనె రా
గలిగితి, ఇక పెద్దల తలపెందుకు ?

40

విలపింపకు దేవీ ! నీ శోక త
పనలు శమించును, వానర సేనలు
ముమ్మరముగ దిగి మొగరించును లం
కావాసులు దిక్కా మొగములుగాన్.

41

జోడుసింహముల పోడిమి మెఱసెడి
రామలక్ష్మణులు నా మూపురముల
మీదనె వచ్చి సమీపింతురు నిను;
పొడుచుచున్న సూర్యుడు చంద్రుడువలె.

42

నరవరేణ్యులు, రణభయంకరులగు,
రఘుకులవీరులు రామలక్ష్మణులు,
కలిసివచ్చి లంకను పట్టి, వివిధ
సాయకముల నాశనము చేయుదురు.

43
రావణేశ్వరుని రాక్షసగణముల
నాహవమున హతమార్చి సమూలము,
నిను కొనిపోవును నిజపురంబునకు,
శీఘ్రమె రఘుకులశేఖరు డార్యా !

44
ఊఅటచెందుము, యోగకాలమును
కాంక్షింపుము, మంగళమగు, మైథిలి !
ఇంతలోనె వీక్షింతువు నీ విభు,
జ్వాలాభరణ కృశాను సమానుని.

45
ఈ దశకంఠుడు సోదర మిత్ర క
ళత్ర బాంధవ బలంబులతో తెగ,
కూడెదు రామునితోడ నీవు, రో
హిణి చంద్రుని కూడిన కైవడి నిట.

46
కళ్యాణీ ! వేగమె నీ వీ ఖర
కష్టసముద్రము గట్టెక్కఁద, వతి
శీఘ్రముగనె చూచెదవు రామశర
కాండంబుల దశకంఠుడు తెగిపడ.

47
ఇట్టుల వైదేహిని ఓదార్చి
తిరిగిపోవు బుద్ధిని తమకించుచు
మారుతి, క్రమ్మఱ మైథిలి వైపున
చూచు చనియె నౌత్సుక్యముతో నిటు.

48
ఆశ్మవిదుడు, రిపుహంత రాఘవుని,
చాపధరుని లక్ష్మణకుమారునిన్,
లంకవాకిటి కెలంకుల చూతువు
అతిశీఘ్రముగా శతపత్రేక్షణ !

49

సింహంబుల వాసిని, బెబ్బులుల బ
లిమిని, మదగజేంద్రముల బీరమున,
విక్రమింత్రు కపివీరులు గోళ్ళను
కోరలు శరముల తీఱున క్రాలగ.

50

కొండలుబోలిన గండువానరులు,
మేఘంబులవలె మిఱుమిట్లొలయఁగ,
గర్జించుచు, లంకా మలయాచల
సానువుల తిరుగుసందడి విందువు.

51

తల్లీ ! అతను నిదాఘపీడలను
సుఖమెఱుగక, ఉస్సురనుచు వేగును,
రాఘవు డంతర్దాహ వేగమున;
కేసరి బరి చిక్కిన మదకరివలె.

52

ఇక, శోకంబున నేడ్వ కనదవలె,
మనసున అప్రియమును శంకింపకు,
నీవును నాథునితో విహరింతువు,
దేవేంద్రునితో దేవి శచి పగిది.

53

రామునికన్న పరమ విశిష్టు డిల
కలడె ? ఎవరు లక్ష్మణు సరివత్తురు ?
పవనపావక ప్రాయులు నీ కా
శ్రయులై యొప్పెడి రాజసోదరులు.

54

రాక్షస హింసా రౌద్రభూమియగు
లంకనుండ వీ వింక దీర్ఘముగ,
వచ్చు నీ విభుడు వైళమె, నైపుము,
పోయివత్తు కమలాయతలోచన.



27-5-1967

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౪౦

1
అనిల సుతుండు మహాత్ముఁడు పలికిన
వాకుల నన్నియు ఆకళించి సుర
కన్యబోని జనకసుత హనుమతో
ఇట్లు పలికె తన యిష్టార్థంబును.
2
ప్రియము తెచ్చిన కపిప్రవరుని నిను
చూచి మానసము సుఖముఖ మాయెను.
సగసగము మొలక సాగిన క్షేత్రము
వానకురియగా పచ్చగిలిన గతి.
3
అతను తాపమున అగలి సెగలలో
కాగుచున్న విభుగాత్రముతో, సమ
ముగ తపియించుచు నొగులు నాదు గా
త్రము సోకు ఉపాయము సమకూర్చుము.
4
కాకి కన్నొకటి పీకివేయుటకు
పచ్చని గరికెను బ్రహ్మాస్త్రముగా
విసరినకథ చెప్పితిని, చెప్పుమది
పతికి జ్ఞాపకము వచ్చును తప్పక.

5

పెట్టుకొన్న నా బొట్టు చెఱిగిపోన్,
ప్రీతితో మణిశిలా తిలకంబును
చెక్కిలి ప్రక్కన చుక్కపెట్టె, ఆ
ప్రియచేష్టితము స్మరింపు మనుము హరి !

6

ఇంద్రవరుణులకు ఈడుజోడయిన
వీరుండవు రణశూరుండవు, నీ
తను నీ పత్నిని, తలచవేల ? అప
హృతనై, రాక్షస హింసల పాల్పడ.

7

దాచుకొంటి నీ తలమాణిక్యము
పయటలో ముడిచి ప్రాణప్రియముగ,
ఈ దుర్వ్యథల సయితము, దీనిగని
నిను చూచిన భాతిని సుఖియింతును.

8

సిరులకు నెలవీ శ్రీచూడామణి
రత్నాకర గర్భంబున పొడమెను,
దీనిని కూడ విభో! నీ కంపితి
బ్రతుక లేనిక దురంతదుఃఖమున.

9

గుండెలు పగిలెడి బండతిట్లకు, భ
రింపరాని విపరీత యాతనకు,
ఓర్చి, నే బ్రతికియుంటి నీ కొఱకు;
ఈ శోకముతో నిక జీవింపను.

10

ఒక నెలమాత్రము ఉసురులు నిలుపుదు,
శాత్రవకుల నాశక ! ఈ లోపల
నీ దర్శన మందింప జేని విధి,
గడువు దాటు, నే విడుతు ప్రాణములు.

11
జాలియెఱుగని నృశంసను డీ రా
క్షసనాథుడు, కశ్మలమగు చూపుల
చూచు నన్ను; ఆలోచనలను నీ
వాలసింప, నా కాలము తీఱును.

12
నిష్ఠురార్తి కన్నీళ్ళు కార్చు, చతి
దీనముగా వైదేహి పలుక విని,
మనసు ద్రవింపగ మారుతి పలికెను
కరుణ కరుణముగ కంఠము రాల్పడ.

13
దేవి! రాముడు నీ వియోగ దుః
ఖమున అన్నిటను విముఖుండయి కృశి
యించు, అట్టులె తపించు లక్ష్మణుడు,
సత్యముతోడని శపథము చేసెద.

14
ఎటులో నీ విచ్చట అగపడితివి,
సమయము కాదు విషాదవేదనల,
కంతములగు నీ అష్టకష్టములు
ఇంతలోనె సీమంతిని! చూడుము.

15
మచ్చలేని ధర్మచరిత్రులు, బె
బ్బులలబోని నృపపుత్రు, లిద్దరును
విచ్చేసెద రిటు వేగమె నిను గన,
లంకభస్మపటలము కావింతురు.

16
క్రూరుడయిన రక్షోవిభు రావణు,
నాత్మబంధు యోధామాత్యులతో
హతమార్చి, విశాలక్షీ! రాముడు
నిను కొనిపోవును నిజపురంబునకు.

17

పూతశీలవు, పునీత వీవు, దే
వీ ! రాఘువునకు ప్రియమగు చిహ్నము
మఱియొకటిమ్ము సమర్పింతును, దా
నినిగని ఆనందించు నతండును.

18

అన విని జానకి, హరివర ! అన్నియు
అరసియె, నా కేశాభరణము ని
చ్చితి, గుర్తించును పతియును దీనిని.
నామాట వినుము, నమ్మము నీ వనె.

19

సతిపలుకులు విని సామీరి, శిరో
మణిగొని, వంగి నమస్కరించి, గమ
నోత్సాహముతో ఒడలు పెంచసా
గెను, వినువీథి నెగిరిపోవు తమిని.

20–21

పెరుగుచున్న బహువేగశాలి కపి
వీరుని రూపము వీక్షించుచు, క
న్నీళ్ళుచాళ్ళు నిండిన ముఖంబుతో,
మఱల పలికెసతి మందస్వరమున.

22

హరివతంస ! సింహములవంటి రా
ఘువసోదరులను, కపిరాజును, సే
నాపతులను, వానరులను, సచివుల
నందఱిని కుశల మడిగితినను, మట.

23

దుఃఖజలంబుల దొప్పదోగు న
న్నుద్ధరించును రఘూద్వహు డెట్టుల,
అట్టు లతని మది హత్తగ చెప్పుము,
అందుల కీవె సమర్థుడవు హరి !

24

దుస్సహమగు నా దుఃఖ యాతనలు,
క్రూర రాక్షసుల ఘోరబాధలును,
తొలగింపగ నేర్తువు నీ పొకడవె.
సుగమ సుఖప్రద మగును నీ పథము.

25

రాజపుత్రి సార్థకభాషణముల
హర్షించె కపి కృతార్థు డైనటుల,
మనసు పఱచి మిగిలిన కార్యముపయి,
ఉత్తరదిక్కున కున్ముఖు డాయెను.



# సుందరకాండ

## సర్గ ౪౧

1

మైథిలి పనికిన మంచిమాటలు ప్ర
సన్నముగా మానసమును తనుపగ,
పయనించిన హనుమయు ఆచోటును
విడిచిపోయి భావింపసాగె నిటు.

2

వచ్చిన కార్యము పాటునబడె, వై
దేహి అడపొడలు తెలిసె, నింక మిగి
లిన దల్పము, మొదలిటి మూటిని విడి
చతు రుపాయమే సరిపడు నిచ్చట.

3

సామము సాగదు తామసు లసురులు,
దానము చెల్లదు ధనికుల పట్టున,
పొసగదు భేదము బలవంతులయెడ,
దండ మొకటె యుక్తమయి రుచించును.

4

బలపరాక్రమ ప్రక్రియ తప్ప, మ
ఱే ప్రయోగమును ఇచ్చట పొసగదు,
అనిలో కొందఱ హతమార్చిన, మె
త్తపడుదు రావల దానవ ధూర్తులు.

5

కలవు పెక్కు మార్గములు కార్యమును
నిర్వహించుటకు; చెప్పిన పూర్వో
త్తరములకు విరోధము రాకుండగ,
సాధించుటె ప్రజ్ఞావిశేష మగు.

6

అల్పకార్యముల కచ్చివచ్చిన ప్ర
యోగ మొక్కటే ఉత్తమమన తగ,
దొక్క దానితో పెక్కు ఫలితములు
సంఘటించుటే సామర్థ్యంబగు.

7

ఇచ్చటనే యిపు డితరుల బలమును
స్వబలంబును సాక్షాత్తుగా తలచి,
నిశ్చయించుకొని నే కిష్కింధకు
అరిగిన సార్థకమగు ప్రభు నానతి.

8

నాకును రక్కసిమూకలకును సం
గరము ఘటిల్లినగాని రావణుడు,
తెలిసికొన డతని బలముల సారము,
నాదు భుజాదండ ప్రభావమును.

9

సచివ సైన్యబల సన్నాహముతో
రావణు డెదిరిన రణములో నడచి,
అతని మతియు సైన్యముల చేవయును,
ఎఱిగి తిరిగిపోయెదను సుఖంబుగ.

10

ఇదె, ఆ దుష్టుని కిష్టమయిన ఉ
ద్యానవనము, నందనమును పోలుచు
కనుల కందమయి, మనసున కింపయి,
తనరారు బహులతాతరు వీథుల.

11

ధ్వంసము చేసెద పచ్చని తోటను,
ఎండిన అడవిని ఇంగాలమువలె,
అది విని, రావణు డాగ్రహ మెక్కగ,
నన్ను పట్ట సైన్యములను పంపును.

12

గుఱ్ఱంబుల ఏన్గులను రథంబులను,
ఎక్కి శూలములు ఉక్కు గుదెలుకొని,
దశకంఠుని మదదర్ప సైనికులు
దుముకుదు, రంతట తుముల సమరమగు.

13

దుర్జయులగు దైత్యులతో నేనును
చండ విక్రమము గండరింపగా,
రావణు బలముల అంకె లడచి, సు
ఖంబుగ పోవుదు కపినగరమునకు.

14

అనుచు క్రుద్ధుడయి హనుమ, ఉద్దవిడి
తొడలబలిమి రాపడ కుప్పించుచు,
విఱుచుచు చెట్లను, పెరుకుచు తీగెలు,
ప్రారంభించెను వన వినాశమును.

15

కొమ్మల మత్త శకుంతము లాడగ,
పాదులలోపల పచ్చగ పెరిగిన
నానాజాతుల ద్రుమానుల తీగెల
విటతాటనముగ విఱిచి విదర్చెను.

16

కుదిసి పెల్లగిలి కూలె సాలములు,
సుళ్ళు తిరిగి కోనేళ్ళు నీ ళ్ళుబికె,
కొండ నెత్తములు పిండిపిండిగాన్,
చూపుల వెగటై తోపు పాడువడె.

17

కాసారంబుల గట్లుతెగెను, వా
డెను మాకుల యెఱ్ఱని చిగురాకులు,
పక్షులు మూల్గెను బాధాస్వరముల,
నేలవాలిపడె పూలతీవియలు.

18

కాలుచిచ్చు కాకలు సోకినగతి,
పొగసి శోభ లుడిపోయె ననువనమును,
పచ్చనితీగెలు ముచ్చ ముడుచుకొని,
వెలవెలబాఱెను బిత్తరిపాటున.

19

ఛిన్నము లాయెను చిత్రసౌధములు,
బెగడి బయటపడె మృగములు పాములు,
భగ్నంబాయెను పాలఱాల భవ
నములు, రూపఱె వనంబు భ్రష్టమై.

20

దశకంఠుని నిత్యప్రమదోత్సవ
శోభనమైన అశోకవనము, శో
కము తీగెలు సాగగ పాడుపడెను,
హనుమద్బల భీషణ తాడనమున.

21

రావణు ధనదర్ప మనఃస్ఫూర్తికి
మాన్పరాని అవమానంబును దా
కొలిపి మహాకపి కూర్చుండెను, తో
రణమున రాక్షస రణకౌతుకమున.

17

కాసారంబుల గట్లుతెగెను, వా
డెను మాకుల యెఱ్ఱని చిగురాకులు,
పక్షులు మూల్గెను బాధాస్వరముల,
నేలవాలిపడె పూలతీవియలు.

18

కాఱుచిచ్చు కాకలు సోకినగతి,
పొగసి శోభ లుడిపోయె ననువనమును,
పచ్చనితీగెలు ముచ్చ ముడుచుకొని,
వెలవెలబాఱెను బిత్తరిపాటున.

19

ఛిన్నము లాయెను చిత్రసౌధములు,
బెగడి బయటపడె మృగములు పాములు,
భగ్నంబాయెను పాలఱాల భవ
నములు, రూపఱె వనంబు భ్రష్టమై.

20

దశకంఠుని నిత్యప్రమదోత్సవ
శోభనమైన అశోకవనము, శో
కము తీగెలు సాగగ పాడుపడెను,
హనుమద్భల భీషణ తాడనమున.

21

రావణు ధనదర్ప మనఃస్ఫూర్తికి
మానరాని అవమానంబును దా
కొలిపి మహాకపి కూర్చుండెను, తో
రణమున రాక్షస రణకౌతుకమున.

6

ఎవడు వీ ? డిచట యెవ్వరి చుట్టము ?
ఎచటనుండి ఇట కెందుకు వచ్చెను ?
ఏమని నీతో ఏకాంతంబున
సంభాషింపగ సాహసించె నెటు ?

7

ఇంతలు కన్నుల యెలనాగా ! నీ
కెట్టి భయము లేదిపు డిచ్చట, ఆ
తోకవాడు నీతో ఏమంచును
ముచ్చటించె చెప్పుము మా కిప్పుడు.

8

అంత సీత సర్వాంగసుందరి, ని
శాచరాంగనల చూచుచు ఇట్లనె,
పెదరూపులతో వెడలి తిరుగు, రా
క్షసుల చర్య లేగతి నే నెఱుగుదు?

9

ఈతం డెవడో, ఎందుకు వచ్చెనో,
ఏమి కార్యమో యెఱుగ నే నెదియు,
దాని నెఱుగ మీరే నేర్తురు, పా
ముల పదములు పాములకే తెలియును.

10

ఇతని చూచి భయ మెత్తెను నాకును,
ఎఱుగను నే నిత డెవరికి చుట్టమొ,
మాయదారియై మసలు పుణ్యజను
డెవడొ వచ్చెనని యెంచితి మదిలో.

11

మైథిలి పలికినమాట లెల్ల విని,
దిక్కులు పట్టిరి రక్కసు లదవద,
కొందఱు పొంతల గొంకిరి, కొందఱు
పరుగెత్తిరి రావణునకు చెప్పగ.

12

దానవేశ్వరుని దగ్గరి బెగ్గిలి
దీనవదనలై దేవురించుచున్,
వికృతరూపియగు భీమ వానరుని
చేష్టితంబులను చెప్పదొడంగిరి.

13

మన అశోకవన మధ్యభాగమున
సీతతోడ భాషించుచు రాజ! మ
హాకపి యొక్కడు భీకరరూపుడు,
తిష్ఠవేసెను బలిష్ఠుడు కదలక.

14

లేడికన్ను వాలికచూపుల మై
థిలిని మేమడిగితిమి పలుతీరుల,
కపి యెవడని, పలుక దతని సంగతి,
ఎంత వేడినను ఇయ్యకొనదు ప్రభు!

15

ఆతడు ఇంద్రునిదూత కావలెను,
లేక కుబేరుని లెంక కావలెను,
కాదే, నడవుల వైదేహిని వెత
కగ వచ్చిన రాఘవుల చారుడగు.

16

అద్భుతకాయుం డయిన వానరుడు
పెక్కుజీవులకు చక్కదనాలకు
పట్టయి, నీ కాప్యాయనమైన, అ
శోకవనంబును శూన్యము చేసెను.

17

ఆ మనోహరోద్యానములో కపి
ధ్వంసము చేయని తావులె కనబడ,
వెచట సీత వసియించు నిచ్చలును
అచ్చట మాత్రము పచ్చగ నున్నది.

18
జానకికోసము చల్లనిప్రాంతము
విడిచెనో! అలసి విడిచెనో ప్రభూ!
ఆ భూతమునకు అలత యెక్కడిది?
జానకి కోసమె చదునుచేయ డది.

19
నిగనిగ లాడెడి చిగురాకులతో
విచ్చిన పువ్వుల కుచ్చులతో, ఏ
మాత్రము చెదరక మంచిగ నున్నది,
సీత వసించెడి శింశుపాతరువు.

20
సీతతోడ భాషించుచు, ఆమె వ
సించు వనంబును ఛేదించిన ఆ
ఉగ్రరూపునకు ఉగ్రదండనము వి
ధింపతగును దైతేయ కులాధిప!

21
మనసారగ నీ వనురక్తుడవై
తెచ్చుకొన్న వైదేహితో ఎవడు
మాటలాడెనా మత్తు డవశ్యము
బ్రదికియుండ కూడదు మహాప్రభూ?

22
ఆ మాటలు విని అసురవల్లభుడు,
నేయిపడ్డ వహ్నివలె మండిపడె,
ప్రళయకోపసంరంభంబున కను
గ్రుడ్లు రెండును విఘూర్ణిలె భయముగ.

23
క్రుద్ధుడైన రక్షోగణనాథుని
వాడి కనుల బాష్పంబులు రాలెను,
వెలుగుచున్న దీపికలనుండి, కా
గిన నూనెలు చినికిన చందంబున.

24

కోపమెక్కి ఆజ్ఞాపించెను, శూ
రులు, తనకు సమానులునగు కింకరు
లను దశకంఠుడు, వన విధ్వంసకు
వానరు పై కొని పట్టికట్టుడని.

25

వెంటనె, యెనుబదివేలు కాల కిం
కరులు, బలిష్ఠులు, గదలు గూటములు
కరముల త్రిప్పుచు కదనకాంక్షతో,
బిట్టుబిఱ్ఱుగా వెడలిరి గృహాములు.

26

బలిసిన పొట్టలు, బరుసు కోరలును,
భీకరములుగా వీగుచు నడచిరి,
మనసులు పోరికి మచ్చరింపగా,
హనుమద్గ్రహాణ వ్యసనాతురులయి.

27

ఆత్రము మీఱ, మదాంధులు దైత్యులు
తోటవాకిటను తోరణంబుపయి
కూరుచున్న కపికుంజరుమీద దు
మికి రగ్నిపయి మిడుతల కైవడి.

28

పసిడి పురులుగల పరిఘలతో, చి
త్రంబులగు పెనుగదలతో, భానుశి
ఖలు పోలిన విశిఖంబులతో, దం
దడి బాదిరి వానర సింహంబును.

29

గుదియలు గదలును కోలకత్తులును
బల్లెము లీటెలు బరిసెలు మున్నగు
ఆయుధములతో అదరి యెడాపెడ
కొట్టిరి హనుమను క్రూరకింకరులు.

30–31
కొండబోలె నెలకొని కదలని కపి,
అపుడు తోక పొడవార నిగిడ్చి, వి
దిర్చి, బిట్టుఅచి, పేర్చి, బొబ్బలిడె,
లంకాపుర మెల్లను దద్దరిలగ.

32
ప్రళయమైన కపిభయదాస్ఫోటన
ఘోషకు కొండలు కోయనె గుహలను,
ఆకాశంబున అరిగెడి పక్షులు
తల్లక్రిందులై డుల్లి నేలబడె.

33
జయము ! భూరి బలశాలి రామునకు,
జయము లక్ష్మణస్వామికి, రాఘవ
పాలితుండయిన వానరపతి సు
గ్రీవునకున్ దిగ్విజయాభ్యుదయము.

34
ధర్మకర్మ పరతంత్ర చరితుడగు,
కోసలేంద్రునకు దాసదాసుడను,
వైరి హంతకుడ, వాయుసంభవుడ,
హనుమంతుడ, విఖ్యాతనాముడను.

35
పదివందల రావణులు రణంబున
మొనకొన్నను పడమొత్తెద మెత్తగ,
పిడుగురాళ్ళతో నుడివడ కొట్టెద,
కండలు చీల్చెద కాళ్ళగోళ్ళతో.

36
లంకగడ్డ మూలము లగల్చి, సీ
తకెఱగి, అభివాదములు సలిపి, రా
క్షసకుల క్షయము సలిపి యేగెదను,
ఇష్టార్థము ఫలియింప సమృద్ధిగ.

37

ఉబ్బి, హనుమ యటు బొబ్బలుపెట్టగ,
కింకర వీరులు గిలికొని శంకితు
లయి చూచిరి, సంధ్యామేఘమువలె
ఉన్నతు డగు కపి యోధాగ్రేసరు.

38

అపుడు రావణుని ఆజ్ఞ తలపుకొన,
కింకర వీరులు శంకలు విడిచి, శ
రసహస్రంబుల ప్రహరించిరి వడి,
శాఖాచర మదశార్దూలంబును.

39

ఆయుధములతో అన్నివైపులను
ముట్టి మార్కొనెడి పోతుమగల గని,
తట్టి పెకల్చెను ద్వారబంధమున
ఇనుపదూలమును హనుమ లీలగా.

40

గరుడి పాములను కసరివిసరు గతి,
ఆ మహాయసాయత పరిఘను, గిర
గిర త్రిప్పుచు కింకర సైన్యములను
మోదెను, చావగబాదెను బలముగ.

41

దానితోనె కపి తారాపథమున
కొంతసేపు తిరుగుచు, కింకరవధ
చవిగొలుప జిఘాంసారతి, క్రమ్మఱ
ద్వారతోరణము నారోహించెను.

42

పవననందనుని బాటింబడి చా
వక మిగిలిన సైనికు లొకకొందఱు,
దశముఖుని దరిసి దాచక చెప్పిరి,
కింకర వాహిని ఇంకిపోయెనని.

43

కింకర బలములు కీడ్వడి కెడసిన
వార్తలు విని రావణుడు కినిసి, క
న్నులు తిరుగుడు పడ, పిలిపించెను రణ
దుర్జయుని ప్రహస్తుని పుత్రుని వెస.

4-6-1967



# సుందరకాండ

## సర్గ ౪౩

1

హనుమ కింకరుల నటు తెగటారిచి,
ధ్యాన స్తిమితుండయి చింతించెను,
మట్టము చేసితి మంగళవనమును
తాకనైతి చైత్యప్రాసాదము.

2

తోటవలెనె యీ మేటి సౌధమును
సైతము సాంతము చదును చేసెదను,
అని తలపోయుచు అనిల సుతుడు తన
బలము చూపు సంభ్రమమున పురికొని.

3–4

మేరుశృంగముల మేరమీఱు ఆ
మెడమీదికి దుమికి కూర్చుండెను
హనుమానుడు, జగతిని ఉదయించిన
రెండవ భగవానుండు సూర్యుడన.

5

కదలింపగ శక్యంబుకాని చై
త్యప్రాసాదము అడుగంట కుదిపి,
జయలక్ష్మీ లాంఛనుడై వెలిగెను;
పారియాత్ర పర్వత సమప్రభల.

6-7

కాయము పెంచి స్వకీయ మహిమచే,
దండ చఱచె హరి, దద్దరిల్లె లం
కాపురి, పతులు గలగల రాలెను,
కావలివారలు కళవళ మందిరి.

8

జయము! రాఘవుని శస్త్రాస్త్రములకు,
జయము! లక్ష్మణస్వామి బాహులకు,
జయము! రామవాత్సల్య లాలితుం
డగు సుగ్రీవ మహానుభావునకు.

9

ధర్మకర్మ పరతంత్ర చరితుడగు
కోసలేంద్రునకు దాసదాసుడను,
వైరి హంతకుడ, మారుతాత్మజుడ,
హనుమంతుడ విఖ్యాతనామకుడ.

10

పదివందల రావణు లెదిర్చినను
మోకరించి పడ మొత్తుదు రణమున
పిడుగురాళ్ళతో సుడివడ కొట్టుదు
కండలు పెరుకుదు కాళ్ళగోళ్ళతో.

11

లంకగడ్డ మూలము లగల్చి, సీ
తకెఱగి, అభివాదములు సలిపి, రా
క్షసలోక సమక్షంబున నేగెద,
ఇష్టార్థము ఫలియింప సమృద్ధిగ.

12

అని యార్చుచు చైత్యప్రాసాదము
మీద నిలిచి సామీరి అసురులకు
భీతిగొలుప నిర్ఘాతపాత ని
స్స్వన ఘోరముగ ఝంకారించెను.

13

ఆ ప్రళయ ధ్వని, కలిగి లేచి ప్రా
సాదరక్షకులు శతసహస్రములు,
బల్లెము, లీశెలు, బరిసెలు బాణము
లూని వాయుసుతు నుద్ధతి మూగిరి.

14

ఇనుపకట్లు బిగియించిన గుదియల,
బెట్టిదంబులగు బిరుసుదండముల,
భానుజ్వాలలు బోని బాణముల,
గట్టిగ కొట్టిరి కపి యూథపమును.

15

నలుగడలను దానవసైన్యంబులు
త్రుళ్ళి కవియ, మారుతితోచె నడుమ;
గంగావాహిని పొంగిన వెల్లువ
నడుమ ఘూర్ణిలెడి సుడిగుండమువలె.

16

అది గని హనుమయు, ఆగ్రహించి, చై
త్యప్రాసాదాంతరమున ఒక బం
గారు దూలము పెకల్చి, త్రిప్పె నూ
అంచుల ధారలు మించ మంటలయి.

17–18

స్తంభము త్రిప్ప, ప్రచండ కర్షణకు
ఎనక మెసంగిన యింగలములతో
తగులబడెను చైత్యప్రాసాదము ;
చూచు రక్కసుల నేచి వధించెను.

19

వీరావేశము వెక్కసింప, ఇం
ద్రుడు తన కులిశముతోబలె, దైత్యుల
తూలగొట్టి తుత్తునియలుగా, ఆ
కాశ మెక్కి, ఆగడముగ నిట్లనె.

20-21

ననుబోలిన వానరులు బలిష్ఠులు,
సుగ్రీవాజ్ఞల చొప్పున పెక్కురు,
ధరణీతల మంతటను తిరిగెదరు;
వారలలో అల్పజ్ఞుడ హనుమను.

22

పదియేనుంగుల బలముగల ఘనులు,
వారికంటె పదివంతు లధికబలి
ష్ఠులు, వేయిగజంబుల బీరముఁగల
వార లనేకులు వానర వీరులు.

23-24

ప్రవహించు నదీరయమును, వాయు బ
లంబును కలిగిన లాంగూలధరులు,
గోళ్ళను కోరలు క్రూరాయుధములు
గా వత్తురు సుగ్రీవుని పనుపున.

25

వారందఱు మిము పట్టిచీల్చి చెం
డాడెద, రిక మీరగపడ, రుండరు,
మీ రావణు డడగారు లంకతో;
కాకుత్థ్సులతో కలహాఫలం బిది.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ४४

1

అచ్చట రావణు డాదేశింపగ,
జంబుమాలి, బలశాలి, ప్రహస్తుని
తనయుడు తన కోదండముగొని, వెడ
లెను, నిడుకోరలు కనకనలాడగ.

2

రణముల గెలువగరాని ప్రచండుడు,
రక్తవస్త్రములు రక్తమాల్యములు
తాల్చి, కర్ణముల ధగధగలాడగ
కుండలములు, తిరుగుళ్ళుపడ కనులు.

3

అందముగా మెఱయగ ఆయుధములు,
ఇంద్రుధనువువలె ఇంపగు తనవి
ల్లెత్తి, నారి బిగియించి, టంకరిం
చెను పిడుగులు కురిసినగతి మ్రోయగ.

4

ఆ కోదండ జ్యాఘోషమునకు
దిక్కులన్నియును దిమ్మరపోయెను,
ఆకాశంబున కేక లెలుగు లిడె,
చలియించె చరాచర చక్రంబును.

5

పోతు గాడిదెలు పూన్చిన రథమును
ఎక్కి ప్రహస్తసుతు డేగుదెంచ, హ
ర్షించెను, గర్జించెను వియద్ఘురీ
వేగశాలి కపివీరు డుత్సుకత.

6

ద్వారము ముందట తోరణంబు పై
కూరుచున్న కపి కుంజరు నంతట,
జంబుమాలి తీక్షణములైన తన
క్రూరశరంబుల కొట్టెను గట్టిగ.

7

కొడవలి వంపుల కోలల శిరసును,
చెవి మడతలు మలచిన నారసముల
ముఖమును, పదియమ్ములతో బుజములు
క్రువ్వ నేసె మారుతిని రాక్షసుడు.

8

వాడిబాణముల గాడి గంట్లుపడి
నెత్తురు చిమ్మ వనేచరు వదనము,
భాసించె శరద్వాసర పద్మము
అరుణుని కిరణము లొరయుచున్నటుల.

9

సహజారుణమగు సామీరి ముఖము
రక్తసిక్త దుర్లలిత మాయె నా
కసమున; ఎఱ్ఱని గంధబిందువులు
పైపడిన మహాపద్మము భాతిని.

10

రాక్షసు శరములు అక్కిన మారుతి
కోపావేశము గుబ్బటిల్లగా,
కలయచూచి చెంగట లక్షించెను,
నల్లని పాషాణపు బండ నొకటి.

11

ఆ పాషాణము లేపియెత్తి, రా
క్షసునిమీద పడవిసరె మహాకపి,
దానవు డాగ్రహమూని దాని ఖం
డించె ననేక కఠినమార్గణముల.

12

జంబుమాలి పాషాణ మగల్చిన
కాంచి హనుమ ప్రగాఢబలంబున
పట్టిపెకల్చి ఉపద్రవముగ త్రి
ప్పి విడిచెను మహావృక్షము నొక్కటి.

13

సాలవృక్షము సమూలము గిరగిర
త్రిప్పుచున్న బలదీప్తుని హనుమను
చూచి నిశాచరశూరుడు తెంపున
గుప్పించె శతక్రూర శరములను.

14

నాల్గుబాణముల నఱికెను చెట్టును,
ఐదుశరంబుల బాదె భుజములను,
ఒక నారసమున ఉత్తమాంగమును
పదియలుంగులను వక్షము నేసెను.

15–16

ఉక్కటమ్ము లటు పెక్కు లొక్కపరి,
తాకిన నొచ్చి ఉదగ్రరోషమున
మ్రోలనున్న పెనుదూల మెత్తి, హరి
జంబు మాలి వక్షంబును మొత్తెను.

17

అంత నసురనాయకు నాకారము
శిరసులేక, కరచరణములు లేక,
ధనువులేక, స్యందనములేక, గు
ఱ్ఱములులేక బాణములులేక పడె.

18

హనుమంతుని తాడనలకు హతమై,
జంబుమాలి బలశాలి నేలబడ,
అతని మేని నానాభరణంబులు,
పొడిపొడియై నలుమూలల చెదరెను.

19

కింకరసైన్యము ఖిలమై పోవుట,
జంబుమాలి బలశాలి కూలుటయు,
తెలియ, రావణుడు తెకతెక నుడుకుచు,
క్రుద్ధు డాయె కనుకోన లెఱ్ఱపడ.

20

రోషముతో గిఱ్ఱున ఘూర్ణిల్లగ
కనులు, ప్రహస్త సుతుని మరణము విని,
అతివిక్రమ వీర్యప్రతిష్ఠులగు,
సచివకుమారుల సందేశించెను.

10-6-1967

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౪౫

1

దానవ రాజాజ్ఞానియుక్తులయి
వహ్నిజ్వాలలవలె దీపించుచు
మంత్రి పుత్రు, లసమాను, లేడుగురు
సదనము వెడలిరి కదనము వేడ్కను.

2

అస్త్రశస్త్రవిదు, లమిత బలిష్ఠులు,
ఖ్యాతిగన్న విలుకాండ్రు, పరస్పర
జయకాంక్షామత్సరు, లపార సే
నాబలాంగ సన్నాహు లందఱును.

3

బంగరు మోకులు బంధించిన స్తం
భాలమీద జెండాలు భ్రమింపగ,
పారసీకములు పన్నిన రథములు
మేఘగర్జనల మించి రటింపగ.

4

దృఢపరాక్రమ ధురీణులు, మంత్రి త
నూజులు కనకధనుస్సులు పొరిపొరి
మ్రోయింపుచు, తనివోయి కనబడిరి;
మెఱుపుల నుఱుముల మేఘంబులవలె.

5

ఆ వీరుల కడుపార కన్నత
ల్లులు, చుట్టము, లిష్టులు నప్పుడు భయ
శంకితులై అలజడిబడి కలగిరి,
కింకరవధ కథ కెలక మనసులను.

6

ఒకరి నొకరు త్రోసికొనుచు మంత్రికు
మారులు వెడలిరి తోరణంబుపై
కూరుచున్న కపికుంజరు మీదికి,
కరగ రాపిడికి కాంచనభూషలు.

7

శరపాతంబులు జలధారలుగా,
రథరటనము గర్జా ఘోషముగా,
బోరున కురిసెడి కారుమేఘముల
మాదిరి ప్రాలిరి మంత్రికుమారులు.

8

తెఱపిలేని బహుశరధారలలో
తెప్పతేలు కపి తీరు కనబడెను,
ప్రళయ మేఘముల వానముసురు లో
పల మునుగుపడిన పర్వతంబువలె.

9

జడిగొని కురిసెడి శరపాతంబును.
దిరదిర తిరిగెడి తేరుల వడియును
వ్యర్థము చేసెను హనుమ, భ్రమింప చే
యుచు నక్కుచు నిక్కుచు వినువీథుల.

10

ధనువులు ధగధగమన పెనగు కుమా
రుల లోపల మారుతి చూపట్టెను,
మెఱయు మబ్బులను చెరగి చెంగనా
ళాడు వాయువు మహాప్రభువువలె.

11
సచివకుమారులు సగ్గిమగ్గి గ
గ్గోలుపడ, కెరలి, కొఱలి, బిట్టఱచి,
విక్రమించె వేవేగ హనుమ దు
ర్వార శత్రుబలవాహిని మీదికి.

12
అఱకాలను కొందఱ తన్నెను, పా
దములతోడ కొందఱిని తాచెను, పి
డికిట కొందఱ పొడిచెను, కొందఱిని
చీల్చె గోళ్ళతో చియ్యలు వ్రయ్యగ.

13
ఊమ్మల కొందఱ గ్రుద్దెను, కొందఱ
తొడల నడుమ పచ్చడిగా మెదిపెను,
కొందఱు కుప్పలు కూలిరి హనుమ ప్ర
చండ ధ్వనులకు గుండెలు పగులగ.

14
సచివపుత్రు లవసానమంద నటు,
చావక మిగిలిన సైన్యము లదవద
బెదరి ఆర్తులయి పదిదిక్కులను ప
లాయితులైరి యథాయథ లగుచును.

15
ఏన్గులు తొండము లెత్తి యేడిచెను,
గుఱ్ఱములు బెగడి గుదిగొని కూలెను,
విఱిగిన ధ్వజములు చిరిగిన ఛత్రప
తాకల తోడ రథాలు బోర్లపడె.

16
నెత్తురు కాల్వలు నిండుగ పాఱెను,
దండుబాట లంతటను గండ్లుపడె,
రూపుమాసి లంకాపురము భయ
క్షోభారవముల కుతకుత ఉడికెను,

17

చండపరాక్రమశాలి మహాకపి,
మంత్రికుమారుల మట్టుపెట్టి, యటు
పునరాహవ సంమోహా కాంక్షతో,
తోరణాంచలము నారోహించెను.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౪౬

1

మంత్రిసుతులు హనుమంతునిచే తెగ
టాఱిన వార్తల నాలకించి, వెత
కప్పిపుచ్చి, దశకంఠుడు వెంటనె
ఉత్తరకార్యము నూహించెను మది.

2

యూపాక్షుండు, విరూపాక్షుడు, ప్రఘ
సుడును, భాసకర్ణుడు, దుర్ధరుడను,
సేనాపతులను చేరబిలిచి, యిటు
లాదేశించెను హనుమద్గ్రహణము.

3

మీరందఱును మహారథులు, నయవి
శారదులు, రణకుశల ధురంధరులు,
హనుమద్గ్రహణ వ్యగ్రకౌతుకులు,
వాయువేగ దుర్వారులు పోరుల.

4

అగ్రనాయకులు అందఱు మీరలు,
రథగజాశ్వ చతురంగబలంబుల
తోడనేగి, బలధూర్వహు వానరు
తిగిచిపట్టి బంధింపుడు వేగమె.

5
యత్నంబున రవ్వంత యేమరక,
అడవి వానరుని అడచిపట్టదగు,
దేశకాలములతీరు లరసి, అవి
రోధముగా పని సాధింపం దగు.

6
స్థితిగతులు వివేచించిన నా కిది
సామాన్యపు కపిగా మది తోచదు,
సర్వజగద్బల శక్తిభూతమని
భావింతును అనుభవపూర్వంబుగ.

7
సృజియింపందగు ఇంద్రుడు మనకై
తన తపమంతయు ధారబోసి, కా
దేని సురాసుర ఋషిపన్నగ య
క్షగణము లోకశ్రై కల్పింపందగు.

8
నాతో మీరందఱు కలసి సహాక
రింప, వారి నెదిరించి జయించితి
మపు, డందు కవశ్య ప్రతికారము
నిపు డీగతి ఘటియింప నోపుదురు.

9
సందేహము లేదిందుకు, మీరలు
చులకనచేయక చుట్టుముట్టి, బలి
మిని మెలకువతో మెలగి పట్టు డీ
ఘాతుక వానరభూతము నెట్టన.

10–12
అతివిక్రమ విశ్రుతుల వాలిసు
గ్రీవుల, బలవరిష్ఠు జాంబవం
తుని, సేనాధిపతిని నీలుని, ద్వివి
దాదుల బీరము నరసితిని మునుపు.

11

వారలలో నెవ్వరియందును పొడ
కట్టవయ్యె నీ కపి శార్దూలుని
బాహుపరాక్రమ బలదీమసములు,
తీక్షణ భీమగతి ప్రహారములు.

12

ఈతని నిశిత మనీషాధారయు,
రూపుమార్చు నేరుపును వారిలో
లే, విది పరిశీలించిన, వానరు
డొక దురంతపు ప్రయోగము కాదగు.

13

మీకు చాలరు త్రిలోకముల సురా
సురనరు లింద్రుడు జోడుకూడినను,
ఈ కపివృషభము నాకట్టుడు, ఎం
తటి మహాప్రయత్నముతోనైనను.

14

జయముకోరు రణనయకోవిదులకు,
ఆద్యవిధాయక మాత్మరక్షణము,
నిశ్చితంబు కానిది చంచలమగు
యుద్ధఫలిత, మది యోధు లెఱుగుదురు.

15

స్వామి పలుకు శాసనముగ గైకొని,
అగ్నులబోలిన అగ్రనాయకులు,
అతివేగంబున అరిగి ముట్టడిం
చిరి హనుమంతుని సింహసంహనుని.

16

మదము జిడ్డుగొను మాతంగంబులు,
కాలూదని మదకంఖాణంబులు,
ఘోర రథంబులు, బహువిధ శస్త్రా
స్త్రంబులు రణసంరంభం బెగసెను.

17

తన తేజోమయ ధామమాలికల
పొడుచుచున్న రవి పోలికను ప్రకా
శించుచున్న కపి శేఖరు, వీరా
కారము చూచిరి గండురక్కసులు.

18

దీర్ఘ బాహువులు, దీప్తోత్సాహము,
అతికాయంబు, మహాబలవేగము,
ఒడలు తాల్చినట్లుండెను మారుతి,
తోరణంబుపయి ధీరస్ఫూర్తిని.

19

హనుమను చూచినయంతనె తడయక
వా రందఱు నలువైపుల వలగొని,
ఒక్కుమ్మడి ఆయుధములతో, పై
బడి ప్రహరించిరి వానరవీరుని.

20

దుర్ధరుడను దైత్యుఁడొకఁడు వచ్చని
వా దరతేఱిన వాఁడి నారసము
లయిదింటిని చయ్యన చాలుగ కపి
నడినెత్తినబడ నాటెను సూటిగ.

21

అయిఁదు బాణముల హనుమ మస్తకము
వ్రయ్యలై పగుల, వానరుడును బ్ర
హ్మాండ మదర బిట్టఱచుచు రయమున
కుప్పించి యెగసె ఉప్పరంబునకు.

22

అది గని దుర్ధరు డరదమెక్కి, వి
ల్లెక్కుపెట్టి, వడి లెక్కలేని వా
లంపఱ కురియుచు ఆభీలముగా,
హనుమమీఁది కెగయగ ఉంకించెను.

 

23

విడుమరలే కురవడి జడిగొను దు
ర్ధరుని శరాసారము నరికట్టెను,
వానరేంద్రుడు, డవసాన వర్షముల
కడమ మబ్బులను సుడిగాడుపువలె.

24

అటు లా దుర్ధరుడనిలసుతుని వా
లంపజతో పీడింపగా, విసిగి, యెగసి,
ముల్లోకములును బొమ్మరపోవగ
బొబ్బలుపెట్టుచు పొంగి పెరిగె దివి.

25

వెంటనె మారుతి మింటను దూరము
మీదు మిక్కిలి క్రమించి, క్రమ్మఱి, ర
యమున దుర్ధరు రథముపై దుమికెను,
కొండమీద పిడుగుల రాశింబలె.

26

గుఱ్ఱము లెనిమిది కూలి క్రిందబడె,
ఇరుసుతునకలుగ విఱిగె రథంబున
కాడి యూడిపడె; కాలము తీరగ
నేలమీద కైవ్రాలె దుర్ధరుడు.

27

దుర్ధరుడాగతి తూలి త్రెళ్ళ, యూ
పాక్షుడును విరూపాక్షుడును కినిసి
అరిమర్దను లిద్దరును మహా రో
షముతో ఆకాశంబున కెగసిరి.

28

నిర్మలంబయిన నింగి నెగడి, త
మ్ముమ్మెభయుల నెదిరిన యోధవానరు మ
హాభుజుని బలీయముగా మొత్తిరి,
గుండెలమీదను పిండిపిండిగా.

29

జంటమఁగల దుస్సహాఘాతల మెయిఁ
కుంచి, కెరలి కుప్పించి, మహాకపి,
గరుడుని పగది, యెకాయెక్రివ్రాలెను
భూతలముఁన విపరీతవేగమున.

30

వ్రాలి, అటసమీపమున నున్న వృ
క్షప్రకాండము పెకల్చి కొట్టె; ఆ
వీరు లిద్దరును పీచమణగి భూ
శయనముఁగా విశ్రాంతిని పొందిరి.

31

మొదట దుర్ధరుడు, పిదపను యూపా
క్ష విరూపాక్షులు చావగ కనఁగొని,
అసహనుండయి, ప్రఘసు డతిరయమున
మారుతాత్మజుని మార్కొనె చలమున.

32

మఱియొకవైపున మసలి క్రుద్ధుడై
భాసకర్ణు, డతిభారమయిన శూ
లముతో తాకె బలంబుగ, కపికుల
వీరు నటుల, ఊపిరి సలుపనిగతి.

33

ప్రఘసు డొకట యెగపార కరిసె, పడ
నయిన కక్కుల ప్రహరణ ధారలను,
భాసకర్ణుడొకవంక శూలముఁను
త్రిప్పి త్రిప్పి కారించి కొట్టె వడి.

34

రాక్షసు లిద్దరు ప్రక్కల నెదుటను
తెరపి యిడగ బాధించిన, నెత్తురు
కాఱు మేనితో కానవచ్చె హరి,
జ్వాలమాలికల బాలభానువలె.

35

అంతట, వీరుడు హనుమంతు డలిగి
పాముల మృగముల పాదపములతో
కొండ శిఖరమును కుదిపి, పెరికి, వడి
రాక్షస యుగ మర్దనకు కడంగెను.

36

ఆ దెబ్బలు తిని హతమై నీల్గిరి
ఏవురు సేనాధీశులు; పిమ్మట
బ్రతికియున్న రావణు సైన్యములను
నాశము చేసె ననాయాసంబుగ.

37

సేనాపతులు నశింపగ, వారి గు
ఱ్ఱాల మీదను గుఱ్ఱాలనూకి, ఏ
నుగుల మీద ఏనుగుల నెట్టి, ర
థాల మీదను రథాలను త్రోసెను.

38

అమరేంద్రుడు మున్నసురులబోలె, మ
హా కపి రక్కసి మూకల గెడపగ,
కూలిన తేరులు, గుఱ్ఱము, లేన్గులు,
రాసులు పడె మార్గముల కడ్డముగ.

39

ఆయుధ బలవాహనములతో నా
యక సేనల తెగటార్చి మహాకపి,
తోరణంబుపయి కూరుచుండె; క
ల్పాంత వాసరకృతాంతుని వంతున.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౪౭

1

వేగశాలి కపివీరుడు సేనా
పతుల నైదుగుర హతమార్చుట విని,
రాక్షసరాజు సమక్షమందె కనె,
ఆహవదోహలు అక్షకుమారుని.

2

తండ్రి చూపులనె తల పెట్టింగి, వి
ల్లంది లేచెను అరిందముడాతడు;
ఋత్విజులు సమర్పింప హవిస్సులు
ప్రజ్వలించు క్రతు పరిషదగ్నివలె.

3

బంగరు గొలుసులు బంధించిన రథ
మెక్కి, బాలరవి చక్కదనముతో
వెడలెను, వానరవృషభుని పోతర
మణచి, పట్టగా అక్షకుమారుడు.

4

మేలిమి గొలుసులు ప్రేలుకాడ, ర
త్నాల పతాకల ధ్వజములెగయ అ
ష్టాశ్వంబుల ఆయత్తమయిన రథ
మతని తపస్సార్జిత మనోరథము.

5–6

తాకీతాకక ఆకాశంబున
పరుగిడు సూర్యప్రభలువోలె; ఎని
మిది ఖడ్గమ్ము లిమిడ్చిన తూణీ
రములతో అది విరాజిలుచుండెను.

?

దానినించుక కదల్చలేరు దే
వాసురులైన, సమస్త యుద్ధ పరి
కరములతో, బంగారు సరులతో,
ఇన శశికాంతుల మినమినలాడును.

7

గజతురంగ రథ ఘట్టన ఘోషల
భూనభోంతరంబుల బోరుకలగ,
చేరగవచ్చె కుమారుడు తోరణ
మాసాదించిన హనుమదాఘులను.

8

ప్రళయకాల పావకునివలె వెలుగు
వానరు దగ్గరి, భ్రమసి కుమారుడు
ఆనతుడై బహుమానించె హరిని;
సాటి వీరు పరిపాటి చూపులను.

9

అరికుల దుర్జయుడయిన వానరుని
వేగంబును రణవిక్రమ సాహస
ములు తలంచి, తన బలము నెంచి, పెరి
గెను యుగాంత భానునివలె అతుడు.

10

రణమున, ఎదుట, తిరంబుగ నిలిచిన
హనుమను కనుగొని అతుకుమారుడు,
అడ్డగింప సాధ్యముకాని కపిని
మున్నూరంబుల ముంచెను వడివడి.

11

అరులనోర్చి, అలయక బెదరక గ
ర్వంబుతోడ మార్మ్రసలు మారుతిని
వీక్షింపుచు ఆయితపడి అక్షుడు,
చేపట్టెను శరచాపముల నొడిసి.

12

పసిడి కడియములు పచ్చల పతకము,
రవ్వల కమ్మలు రంజిల, అక్ష కు
మారుడు పవన కుమారుని తాకెను;
సంభ్రమింప నిర్జర నిశాచరులు.

13

పుడమి మ్రోగె, భానుడు వెలుగ కొదిగె,
కదలక నిలిచెను గాలి, మిన్నఱచె,
ఉదధి యుబికె, గిరులదరెను అక్షకు
మారుడు వాయు కుమారుడు కదియగ.

14

పదును కొసలు గల పసిడియలుగులను,
విసపు పాములట్లెసగొను మూటిని,
వేసెను, కపితల ప్రీలగ అక్షుడు,
అస్త్రప్రచారసంహారపారగుడు.

15

శిరసు చిల్లి పడి చిమ్మునెత్తుటను
తడిసి కనులు తిరుగుడ పడ అగపడె
హనుమంతు డపుడు, అరుణ కిరణ శర
పాళితో పొడుచు భానుమూర్తి వలె.

16

ఎట్టయెదుట విల్లెత్తి యుద్ధమున
మఱలని రాజకుమారు యోధుగని,
సుగ్రీవుని సచివాగ్రణి, మారుతి
ఉల్లసిల్లి యుద్ధోన్ముఖు డాయెను.

17
మందరాద్రిపయి మార్తాండునివలె
రూక్షజ్వాలారుణ దారుణముగ
చూచె హనుమ అక్షుని, వాహన బల
ములతో కాలుచు పోల్కని చురచుర.

18
మించువింట కురిపించెను వాలం
పఱిహరిపై ముమ్మరముగ అక్షుడు;
కులపర్వతమున కుంభవర్షమును
క్రుమ్మరించు మేఘుని చందంబున.

19
అంతకంత కాహవదోహలుడయి,
తెగువయు మగటిమి తీంద్రింపగ, బిగి
వీగు కుమారుని వీక్షించి, కనలి
గర్జించె నుదగ్రముగ మహాకపి.

20
పిల్లితనపు కవ్వింపుల కచ్చెను
అక్ష కుమారుడు అక్షు లెఱ్ఱపడ,
హనుమతోడ కయ్యమునకు తలపడె,
గడ్డిగోతిలో పడ్డ యేన్గువలె.

21
అక్షుని నారాచక్షతి నొవ్వన
గర్జింపుచు భీకరముగ మారుతి,
దీర్ఘ బాహువులు త్రిప్పుచు విసరుచు,
ఎగసెను ఘోరాకృతి వినువీధికి.

22
బలపరాక్రమోద్భట సాహసికుడు
దానవ సూను డుదగ్రవేగమున,
ఎగసిపోవు ప్లవగేంద్రుని కొట్టెను;
పిడుగులతో మేఘుడు కొండంబలె.

23

అక్షుడు పఱచు నిరంతర శరముల
బాటి తప్పుకొని పైరగాలివలె,
సందు గొందులను చలన చాలనము
జరిపెను మింట ప్రచండ విక్రముడు.

24

పోరికి ఉవ్విళ్ళూరుచు, విలుగొని
నిశితాయుధముల నింగినించు, అ
క్షు కుమారుని దక్షతకు, మహాకపి
వేడుకపడుచును వేదనలోబడె.

25

హరకుమార నిభు డక్షకుమారుడు
నడిబుజములలో అడచిన అఱచుచు,
కర్మసుకుశలుడు కపి స్మరియించెను
రణములలోన పరాక్రమక్రమము.

26

బాలదివాకర ప్రభలను చిమ్మచు
బాలుర కోపని పనులను తీర్చుచు
సకలాహవ సాధకుడై శోభిలు,
మనసురాదు చంపగ నీ బాలుని.

27

ఇతడు మహాత్ము డహీనబలీయుడు
యుద్ధభయాపద లోర్వగ శక్తుడు,
కర్మగుణోదయ కలన సుపూజ్యుడు
యక్షనాగ సంయమి గణములకును.

28

తన పరాక్రమోత్సాహము పొంగగ
నన్ను చూచును రణంబున బెదరక
ఇతని ప్రతాపోద్ధత వేగమునకు
దేవాసురులును దేవురించెదరు.

29

ఈతని నిశ్లై యుపేక్షించిన వ
ర్థిలు, పరాక్రమ, మతిక్రమించు నను
కాన, వధించుట కార్య మిపుడు నా;
కగ్నిని విడరా దల్ప కణంబని.

30

ఇటు తర్కింపుచు, ఎదిరి బలోద్వే
గము, స్వకర్మయోగమును పోల్చి; అ
క్ష కుమార మారకమున కీకొనె,
ఆత్మ వేగబల మావహింప హరి.

31

శిక్షితంబులయి చేవతేలి, రథ
భారంబును తడబడక లాగగల
అక్షుని యెనిమిది అశ్వములను, అఱ
-చేతులతో చెచ్చెర చావపొడిచె.

32

ఆ వెంటనె సుగ్రీవ సచివు డగు
హనుమ తన్నులకు హతమై కూలెను
రథము, కొప్పరము శిథిలమై యిరుసు
విరిగి తునిగిపడె విన్నువిడిచి భువి.

33

అక్షకుమారుండంతట, రథమును
విడిచిపెట్టి, తన విల్లుపూని, ఖ
డ్గంబుతోడ ఆకసమున కెగసెను;
యోగమహిమ దివికేగు ఋషిపగిది.

34

సిద్ధసుపర్ణులు సేవించెడి విపు
లాకాశమున నిరంకుశముగ విహ
రించు రాజసుతు రెండుకాళ్ళు బిగ
బట్టె వాయుజవ బలుడు మహాకపి.

35

తండ్రి వేగసత్వము లలమగ హను
మంతుం డతుకుమారుని గిరగిర
త్రిప్పి త్రిప్పి విసరెను; పెనుబామును
పట్టి యూచి పడవైచు గరుడివలె.

36

అనిల నందనుడు హతమూర్ఛగ నటు,
అతు కుమారుడు, హస్తము లూరులు,
కటి కంఠములు వికావికలయి, కీ
ళ్ళు సడలి పడె శిథిలుండయి నేలను.

37

కింకరబలములు కీడ్వడి మడసెను,
పోయిరి సేనానాయకు లేవురు,
అతుకుమారుడు హతమాయెను, కపి
చేత ననుచు పతికాతరు డాయెను.

1

అమల తపోవ్రతులయిన మహర్షులు,
పంచ భూతములు, పన్నగ యతులు,
సుర, లింద్రుడు అచ్చెరువందిరి, అ
తు కుమారు నటు చంపిన కపిగని.

38

నెత్తురు జీఱలు నెఱయు కనులతో
ఇంద్ర కుమారన కీడగు అతుకు
మారుని కూల్చి యథారీతిని, హరి
ద్వార తోరణము నారోహించెను.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ४८

1
మారుతి అక్షకుమారు వధింపగ
దానవేంద్రుడు యథా మనస్సమా
ధాన పరుండయి, తనయు నింద్రజితు
ఇంద్రసముని పిలిపించి యిట్లనెను.
2
అస్త్ర విదుండవు శస్త్ర కుశలుడవు;
సురుల కసురులకు శోకదాతవై
నీ పౌరుషమును చూపి తింద్రునకు,
అజుని కొలిచి బ్రహ్మాస్త్ర మందితివి.
3
నీవు చాపమందిన మాత్ర సురా
సురులు విఱిగిపోయిరి దిక్కుల బడి,
కదనంబున నిన్నెదిరించి ప్రయా
సల గాసిల్లని శత్రువు లెవ్వరు ?
4
భుజబల మహిమయె నిజ రక్షకముగ,
చేసిన తపములె క్షేమ కవచముగ,
కాపాడును నిను, గమనింపగలవు
దేశ కాలముల తీరు తెన్నులను.

5

సమరముల నశక్యములు లేవు, నీ
కలవిగాని దెయ్యదియు లేదు మతి
మంత్రములను, నీ మహితాస్త్రంబుల
వాడిమి నెఱుగని వారు లే రిలను.

6

నను బోలుదు తపమునను బలమునను,
సరివత్తువు అస్త్రప్రయోగముల,
రణముల రిపు మర్దన కీవుండగ
నే సుఖముండుదును నిశ్చితార్థినయి.

7

కింకరసేన నఖిలము వధించెను
తునిమె జంబుమాలిని, సచివసుతుల
అగ్రనాయకుల నందఱ బలిగొనె,
కోతి యొకడు నిరాతంకంబుగ.

8

గుఱ్ఱంబులు ఏన్గులు, రథంబులు స
మృద్ధమైన బలమెల్ల నశించెను,
నీ ప్రియ సోదరు డప్రతిమానుడు
అక్షకుమారుడు హతమైపోయెను.

9

ఇది యంతయు గమనించి, బలంబుల
బరవసము నరసి, వానరుని ప్రభా
వ పరాక్రమములు పాటింపుచు, నీ
దీమసంబు కొలదిని వర్తింపుము.

10

రిపు ఘాతుకుడవు, కపిని దగ్గరిన
యంతనె తడయక అందఱొక్కుమ్మడి
సుడివడ మర్దింపుడు సందీయక,
పోరాడుము మెలపుగ వీరాగ్రణి!

11

బలములు లేవట పాఱదోల, వ
జ్రాయుధంబు లే దతని; కార్చుటకు
వశముగాని పావక నిబోలె, లయ
కాలవాత్యవేగమున వీగు కపి.

12

చెప్పినదంతయు చిత్తగించి, అట
కార్యమందు లక్ష్యంబునిలిపి, ధను
రస్త్రము లేమఱ కారంభింపుము,
పోయిరమ్మ నీ పో కక్షతముగ.

13

నిన్ను పోరిలోనికి పంపించుట
మంచిది కాదనిపించటు లయినను,
సుక్షత్రియులకు శోభనపథమిది,
రాజసుతులకు పరమ ధర్మము నిదె.

14

ఆహవముల వివిధాస్త్ర శస్త్రములు
నెఱపు కౌశలము నేర్చు టవశ్యము,
సంగ్రామంబుల శౌర్యముచూపి, జ
యంబు గొనుట వీరాభీష్టార్థము.

15

జనకుని పలుకుల పనిగొని, దక్ష సు
త ప్రభావుడు ప్రదక్షిణము సలిపె
తండ్రికి వీర విధాయకంబుగ, మన
సువ్విళ్ళూరగ యుద్ధకాంక్షతో.

16

ఇష్టబంధుజనమెల్లను దీవిం
పగ, పొంగి పోరల ఖండన మోహము,
వీరోత్సాహము వెల్లివిరియగా,
యుద్ధమునకు సన్నద్ధుడై నడచె.

17

రాక్షసేంద్రు గారాబుకొడుకు, తెలి
తామరపువ్వుల తళుకు కనుల రూ
పసి, తేజోబలవంతు, డింద్రజితు
పొంగె, సముద్రుడు పున్నమనుంబలె.

18

పవన సుపర్ణుల జవముగలిగి, నా
లుగు తెలికోరల మగయేనుగులను,
కాండ్లకు కట్టిన కంచురథంబును
ఎక్కె నింద్రజితు ఇంద్రసమానుడు.

19

పేరుగొన్న బలువిలుకాడు, మహారథి
కుల లోపల ప్రముఖుండు, శరప్రయో
గము లెఱిగిన మొనగా, డస్త్రవిదుడు,
వెడలె మహాకపి కడకు హుటాహుటి.

20

రథనిర్ఘోషము, రాక్షసుల ధను
ర్జ్యాటంకారము లాలకించి, అం
తంతల, హనుమ సమాహితు డాయెను,
సంతోషముతో సంగరకేళికి.

21

రణపండితు, డింద్రజితు, దీర్ఘమగు
చాపము నెక్కిడి, సారించి, నిశిత
శరపుంఖంబుల సవరించి, మహా
కపివీరు సమక్షంబున నిలచెను.

22

అట్లు, రణకుతూహల దోహలుడై
పాణితలంబున బాణములూని, ఎ
దురు నడువగ, జంతువు లఱచెను వెఱ,
దిక్కుల శోభలు దిగజాఱెను వెత.

23
సములగు వీరుల జంట డీకొనగ,
వేడుక చూడగ విచ్చేసిన ఋషి
నాగయతులు పెనంబడిరి చదల,
ఎలుగులెత్తి పతులు గలగలమనె.

24
రథమునెక్కి అతిరయమున వచ్చెడి
ఇంద్రజిత్తును సమీక్షించి హనుమ,
మితిమీఱగ తన మేను పెంచి గాం
డ్రించి నిగిడి గర్జించెను గట్టిగ.

25
రావణు సుతుడును రథముపై నిలిచి,
చిత్రకార్ముకము చేతపట్టి టం
కారించె, ఘనాఘనములు ఉరిమిన;
కైవడి, మెఱుపులుగా శరము లెగయ.

26
తీక్షణ వేగోద్రిక్త బలిష్ఠులు,
అని మొన వెనుకాడని శూరులు, రా
త్రించర వనచర ధీరులు తల
పడిరి సురాసుర బద్ధ వైరమున.

27
వీరపుత్రుడు మహారథికుడు వి
ఖ్యాతి గన్న విలుకాడు ఇంద్రజితు
పఱపిన శరములు వ్యర్థము చేసెను,
తక్కుచు నిక్కుచు చుక్కల త్రోవను.

28
అరి లోకాంతకుడయిన ఇంద్రజితు
వానరవీరునిపై రువ్వెను బం
గారు కొనల ఱెక్కల నారసములు,
పిడుగుల వడితో మిడిసి మీదపడ.

29
రావణపుత్రుని రథవేగంబును,
బలముల భేరీపటహధ్వానము,
వింటి మ్రోతలను విని హనుమంతుడు
మింటికెగసె మిఱుమిట్లు గొలుప వడి.

30
కుండపోతగా కురియు బాణముల
నడుమనడుమ వడివడి చెరలాడుచు,
పవనసుతుడు దానవసుతుని నిశిత
మయిన లక్ష్యమును వ్యర్థముచేసెను.

31
మఱల ఇంద్రజితు పఱపు శరములకు
ఎదురుగా నిలుచు కదల కొక్కతఱి,
మఱియొకప్పు, డచ్చెరువుగ చేతులు
చాచుచు చివ్వనలేచి పైకెగురు.

32
రణకర్మ విశారదు లిరువురు, వే
గాతి వేగ సంయతబలు లిరువురు,
అఖిల భూత మోహనముగ నయ్యెడ,
సలిపిరి వీరోత్సవముగ సమరము.

33
అసురు డెఱుంగడు హనుమ సత్త్వమును,
హనుమకు తెలియదు అసురుని సారము.
దేవ పరాక్రమ దీప్తు లిద్దరును,
పైకొనిరి పరస్పర జయలాలస.

34
గుఱి తప్పని తీర్పరి యింద్రజితుడు,
సూటిగ తార్చిన సునిశిత శరములు,
పాటు తప్పి పడ, వ్యాకులుడై చిం
తా సమాధి మ్గానసు డాయెను వెత.

35

వానర వీరుని వధియించుట, కపు
డలవి కాదనుచు ఆత్మ నెఱిగి, ఆ
కట్టుట యెట్లీ కపి నని రాక్షస
రాజ సూను డారటపడి యించుక.

36

అస్త్ర విదగ్రణియైన ఇంద్రజితు
అజుడిచ్చిన బ్రహ్మాస్త్రము నంతట,
హనుమంతుని పైకొన సంధించెను
స్వప్రయోగ కౌశల్యము వెలయగ.

37–38

శస్త్రము లీతని చంపలే వనుచు
రాక్షసుడేసిన బ్రహ్మాస్త్రముతో,
కాళ్ళను చేతులు కట్టుబడినగతి
నిశ్చేష్టితుడై నేలవ్రాలె కపి.

39–40

బ్రహ్మ, మంత్రదైవతమగు అస్త్రము
చేత నిబద్ధుడనైతినంచు కపి,
తెలిసినంతనె, ధృతిన్ స్మరియించెను
పరమేష్ఠి మహత్తర వరదానము.

41

బ్రహ్మయిచ్చిన వరప్రదానమున
బంధంబులు విడివడవం చెఱిగియె
అసురుడేసెనిది; అనువర్తించుటె
ప్రస్తుతమగునని భావించె హనుమ.

42

బ్రహ్మాస్త్ర మహాబలమెంచి, పితా
మహుని అనుగ్రహ మహిమ తలచి, బం
ధ విమోచనమును తలపోసియు, తుది
సమ్మతించె విధిసంఘటన కపుడు.

43

బ్రహ్మాస్త్రముచే బద్ధుడనైనను
భయములేదిపు, డభయవిధాతలగు
బ్రహ్మేంద్రానిల భగవంతులు నా
కక్షయ రక్షకులయిన కతంబున.

44–48

రక్కసులకు నే చిక్కుటయు నిపుడు
మంచి కొఱకె సంభవము కాదగును,
రాక్షస రాజు సమక్షమందు సం
వాదము సలిపెడి వలను పొసంగును.

।

అని కృతనిశ్చయుడై యిట్లు, రిపుని
హంతయైన హనుమంతుండు, బలా
త్కార బాధలకు కడగిన అసురులు
భయమందగ ఉద్భటముగ అఱచెను.

।

అరిలోకాంతకు డగు వానరు డటు
చేష్టలుడిగి, వడిచెడుట కనుంగొని,
చేరి బిగించిరి నారచీరలను,
పనసచెట్టు తోళ్ళను నిశాచరులు.

।

తన్ను చూచుటకు దానవపతి తమ
కించుచుండునని యెంచి హనుమయును,
అసురులెంత కక్కసపెట్టినను స
హించె, ఎట్లు బాధించిన నోర్చెను.

49–50

చెట్టు తోళ్ళతో కట్టినంతనె మ
హాస్త్ర బంధము తనంతనె విడబడె;
అన్యబంధముల అంటుసోకినన్
బట్టువదలి విడబడు బ్రహ్మాస్త్రము.

!

కపియోధుని వల్కలముల కట్టుట
చూచి ఇంద్రజితు క్షుభితుండాయెను.
మంత్రోక్తములగు మహితాస్త్రంబులు
పట్టివిడిచినన్ పాఱు వితరములు.

!

చేసిన కార్య మిసీ ! నిరర్థకం
బాయె, ఎఱుగ రీ యసురు లొక్క ది
వ్యాస్త్రము విడిచిన అన్యాస్త్రము ప
ట్టదు; సందేహాస్పదమిక సర్వము.

51

అంత రాక్షసులు హనుమ నీడ్చుకొని
పోసాగిరి రయమున; బంధంబుల
రాపిడి వేదన లోపల తెలియక
పోయె మహాస్త్ర విమోచనము కపికి.

52

పిడి గ్రుద్దులతో పీడించుచు, క
ఱ్ఱలతో బాదుచు రాక్షసు లీడుచు
కొనిపోయి హనూమను నిలబెట్టిరి,
రాక్షసపాలకు రావణు మ్రోలను.

53

అప్పు డింద్రజితు అస్త్రము క్తుడయి,
నార చీరె బంధములతో మసలు
వానరుని మహాబలుని చూపె కొలు
వున నున్న దశాస్యునకు ప్రభువునకు.

54

కదలకుండ బిగకట్టిన మదమా
తంగము బోని ప్లవంగవీరుని స
మర్పించిరి నాయకులును తోడనె,
రాక్షసరాజగు రావణేంద్రునకు.

55

అచ్చట కూడిన అసురు లందఱును
గుసగుసలాడిరి గువ్వకుత్తుకల,
ఎవడు వీ, డిచటి కెందుకు వచ్చెను?
ఎవరు వీని బంధువు లిచ్చటనని.

56

క్రోధముతో మఱికొందఱు దైత్యులు
కాల్చుడు, చీల్చుడు, కడతేర్చుడు, భ
క్షింపుడు వానరునంచు, ఒకరితో
నొకరు చెప్పుకొని రుత్తలపాటున.

57

అచట, మార్గమున కవతల రత్న మ
యమయిన రాజసభాంగణమున కన
వచ్చిరి, రావణుపాదముల కడను
పరిచారిక లెందఱొ సామీరికి.

58

అధిక దీప్తితో, అమిత బలముతో
మండుచున్న మార్తాండు చందమున,
ఓలగమున్న మహోన్నతు రావణు,
రాక్షస రాజును వీక్షించెను కపి.

59

క్రోధముచే కుంకుమ రక్తములయి
ఘూర్ణిలు కన్నుల కోతిని చూచుచు,
ఆదేశించె దశాస్యుడు, వానరు
వృత్త మరయుడని వృద్ధ సచివులకు.

60

వారును క్రమముగ వానరు నడిగిరి,
అసలు మూల కార్యార్థంబేమని ?
వానరేశ్వరుడు పంపవచ్చితిని,
అతని దూతనే నని పలికెను హరి.



# సుందరకాండ

## సర్గ ౪౯

1

భీమ పరాక్రమధాముడు మారుతి
అసురుని చేతల కచ్చెరువందుచు
రోష తామ్ర కల్మాష నేత్రుడయి
పొఱచూచె రావణు నోలగమున.

2

ఆతని మకుటము జ్యోతిర్మయమై
అపరంజిపసిమిని పిసాళించుచు,
ము త్తెపు కుచ్చులు బి త్తరింప దీ
పించుచుండె ఉద్వేలమానముగ.

3

జీవరత్నముల జిగిజిగి మిగులగ
మొలకమణుల పూజెలు చెక్కిన చి
త్రాభరణములు ప్రియములై నవి మెయి
నిండార మెరయు చుండె నందముగ.

4

సన్న పట్టువస్త్రము ధరియించెను,
అరుణ చందనము అలరె నంగముల,
వెఱపు గొలుప విప్పిన రక్తాక్షులు
వ్రాలు పెదవులును వ్రేతుకోరలును.

5-6

పదిశిరములతో భ్రాజమానముగ
అగపడె నాత డుదగ్రదీధితుల;
పడగలెత్తి చూచెడి పాములతో
క్రాలెడి మందర శైలము లీలను.

7

కాటుకరాశికి దీటగు బొమ్మేన
వ్రేలుచుండె ముత్యాల సరంబులు;
నల్లని మబ్బుకు తెల్లని కొంగలు
వాలుగ తీర్చిన వల్లె వాటువలె.

8

గందపుపూతల క్రందుకొన్న, బా
హువు లొప్పెను కేయూరభూషలను,
బలసిన అయిదుతలల పెనుబాములు
దిగజారెడి సోయగము వెలార్చుచు.

9

కసటులేని స్ఫటికముల మర్చి, రత
నాలను సూయగముగా కూర్చిన,
మంచి పట్టుకంబళముపై సుఖా
సీనుడాయెను దశానను డయ్యెడ.

10-12

మంత్ర తంత్ర మర్మము లెఱింగిన, ప్ర
హస్త, దుర్ధర, మహాపార్శ్వ, నికుం
భులు, మంత్రులు నల్వురు బలగముతో
నాల్గు సంద్రముల నడవడి నుండిరి.

13

రాజ కార్య పారగులగు మంత్రులు,
శుభ మనీషు, లిష్టులు పరివేష్టిం
పగ కొలువుండెను పంక్తికంధరుడు,
దేవతల సభను దేవేంద్రుడు వలె.

14

ఆ రాక్షస నాయకుని, మహాతే
జో విరాజితుని, చూచెను మారుతి;
మేరు పర్వతము మీది నెత్తమున,
నిగనిగ లాడెడి నీళ్ళ మబ్బువలె.

15

అక్కసు తీఱగ రక్కసు లటునిటు
తెఱపియిడక బాధింపుచు నున్నను,
విస్మయుడై కపి వీరుడు చూచుచు
నుండె రావణు నఖండ వైభవము.

16

భ్రాజమానమగు రాక్షసప్రభువు
గంభీరాకృతి కని మోహితుడై,
వాయుసుతుడు భావంబులోన చిం
తింపసాగె పలుతీరుల నిట్టుల.

17

ఏమి రూపమహో! ఏమి ధైర్య మిది?
ఏమి బలమహో! ఎట్టి సత్వ మిది?
సర్వసులక్షణ సంపన్నుడు వీ
డకట! విధివిపర్యాసము నేమన!

18

ఆర్జించిన ధర్మార్థముకంటె, అ
ధర్మ సంచితముదారముగ పెరుగ
దేని, సమర్థుం డీత డమరులను
అమరేంద్రుని సైతము పాలింపగ.

19

కుత్సితంబులగు ఘోరకర్మములు
పెక్కులుఁ జేసెను వీడు క్రూరుడయి,
అందుచేత భయమంది తల్లడిలు
సర్వసురాసుర చక్ర లోకములు.

20

రాక్షసరాజు పరాక్రమ తేజము
లరసి హనుమ చింతాకులుడాయెను,
వీడలిగిన ఈ రేడు జగము లే
కార్ణవంబయి లయంబగు నంచును.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౫౨

1

లోకములకు భయ శోక దాతయగు
రావణుండు రోషావశుం డగుచు,
పచ్చిగోఅజము వన్నె కనులతో
ఎదుట నున్న కపి వృషభుని కనుగొని.

2

శంకించెను, వాస్తవ కపి మాత్రుడు
కాడు వీడు, మును కైలాసంబున
తిరుగునపుడు నను తిట్టి శపించిన
సాక్షాన్నందీశ్వరుడు కానగును.

3

కాక, వానరాకారంబున బా
ణాసురు డిటు నే డరుగుదేరగా
బోలు, నటంచును లోలోపల తల
పోసెను ఊహాపోహాలు మిగులగ.

4

మనసులో నిటుల మథనలు పడి పడి,
రోషరక్త నేత్రుడయి, ప్రహస్తుని
చూచి పలికె సమయోచితంబుగా
దశకంఠుడు సార్థక వాక్యంబులు.

5

ఎచటినుండి యిట కేగుదెంచె, కా
రణమే? మెందుకు వనమును చెఱిచెను,
అసురులతో పోరాడె నెందులకు?
అని అడుగుము దుష్టాత్ముని వీనిని.

6

చొరకూడని మా పురమేల ప్రవే
శించె? ఏమి కాంక్షించి యుద్ధమును
చేసె నిచట? ప్రశ్నింపుడు మీ రీ
దుర్బుద్ధిని విధ్యుక్తక్రమమున.

7

రావణుడాడిన ప్రభువాక్యములను
ఆలకించిన ప్రహస్తు డిట్టులనె;
విశ్రమింపుము కపీ! లే విచ్చట
భయకారణములు, భద్రము సర్వము.

8

ఇంద్రుడంప లంకేశ్వరుని నివా
సంబున కిట్టుల చనుదెంచితివో!
నిజము చెప్పుము వనేచరపుంగవ!
భీతిచెందకుము విడిచిపుచ్చెదము.

9

యముని పక్షమున, అథవా ధనపతి
పంపున, లేదా వరుణుని ప్రేరణ,
చార రూపమున తా రాడుచు మా
పట్టణమున చొర బడినాడవొ కపి!

10

విజయ కాంక్షతో విష్ణు దేవుడే
దూతగా మొదట తోలినాడొ నిను!
కోతిది కాదీ భూత బలము, ఆ
కారమాత్రమున కపివీవు సుమీ.

11

నిజమును చెప్పుము నిన్ను విడిచెదము,
కల్లలాడ దక్కదు నీ ప్రాణము,
కాదయేని, లంకాపతి రావణు
ఇల్లు చొచ్చుటకు ఏమి కారణము ?

12–15

సచివోత్తము ప్రశ్నలు విని మారుతి,
బదులు పలికె రావణు నీక్షించుచు,
ఎఱుగ నింద్ర యమ వరుణ కుబేరుల,
విష్ణువు ప్రేరేపింపలేదు నను.

!

వానరజాతుడ, వచ్చితి స్వయముగ
రాక్షసేంద్రు దర్శనమున, కందుకు
అనువేర్పడ మీ వనమును విఱిచితి,
ప్రాణరక్షణార్థము పోరాడితి.

16

అసురుల కమరులకైనను శక్యము
కా, దస్త్రంబుల కట్టివేయ నను,
ఈ వరమును నాకిచ్చెను బ్రహ్మయె,
రాజ దర్శనార్థమె బంది నయితిని.

17

అస్త్రబంధములు అగలి యూడినను
పీడించిరి పగతోడ రాక్షసులు,
ఓర్చితి, వచ్చితి, ఒక్క రాజ కా
ర్యార్థ మిట్లు మీ యంతికంబునకు.

18–19

కల, దమిత పరాక్రముడు రాఘవుడు,
ఆ మహనీయున కాప్తుడ, దూతను,
హితములైన నా యీ వచనంబులు
ఆలకింపుము శుభార్థములు ప్రభూ !



23–6–1967

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౫౧

1

అతి సత్వాఢ్యుం, డమిత పశుబలుడు,
దశకంఠుని స్తిమితముగా చూచుచు,
పలికె నంత తడబడక మహాకపి,
అర్థవంతమయినట్టి వాక్యములు.

2

హరి కులేశ్వరుం డగు సుగ్రీవుని
సందేశంబును అందిచ్చుటకయి
వచ్చితి నీదు నివాసము వెతకుచు,
అడిగెను నీ కుశలార్థము లాతడు.

3

ధర్మార్థాభిమతంబయి, ఇహ పర
భవితవ్యంబగు భ్రాతృనిదేశము
కొని వచ్చితి, ఇదె వినిపించెద, నీ
వవధరింపుము మహాసురనాయక !

4

రాజన్యుడు దశరథుడు రాజిలును
రథ మాతంగ తురంగ బలయుతుడు,
తండ్రి వంటి బాంధవుడు లోకులకు,
దేవేంద్రునకును దీటు ప్రశాస్తిని.

5

అతని పుత్రుడు, ప్రియంకరు, డగ్రజు
డాజాను భుజా భ్రాజితగాత్రుడు,
తండ్రిమాట జవదాటక, గృహమును
వదలి, దండకావనమున కరిగెను.

6

భ్రాతలక్ష్మణుడు, భార్య సీతయును,
తోడనె వచ్చిరి తోడునీడలుగ,
రాముడు ధర్మపరాయణుడు, మహో
తేజోధాముడు ధీరోదాత్తుడు.

7

ఆతని భార్య, ప్రియానువ్రత, సుచ
రిత, విదేహ నృపసుత, సీత, పరమ
పూత, మాయమయిపోయె నడవిలో;
ఆమెను వెతకుచు అన్నాదమ్ములు.

8–9

ఋశ్యమూకగిరి యెడతల వచ్చిరి,
సుగ్రీవుని కపిసోముని కలసిరి,
సీతను వెతకించెదననెను ప్రభువు,
రాముడతనికి స్వరాజ్య మిత్తుననె.

10

ఆవల రాఘవు డని మొన వాలిని
గీటడంచి సుగ్రీవస్వామికి
పట్టము కట్టెను వానరభల్లుక
రాజ్యంబును సర్వము కిష్కింధను.

11

ఇంతకు పూర్వమె యెఱుగుదు వీవది;
వాలిని బహుబలశాలి నాలమున
ఒక్క వాలమున చక్కడంచెనని
రాజకుమారుడు రాముం డొక్కడె.

12

సీతను వెతకగ ఆతురుడై సు
గ్రీవుడు పంపెను కిష్కింధా వి
ఖ్యాతుల, వానరజాత యోధులను,
పలువుర పది దిక్కులకు ఒక్కపటి.

13

శతసహస్ర లక్షల గణములు వా
నరులు, దిగ్దిగంతరము లంతటను,
మీదను క్రిందను మెలకువతో శో
ధింపుచు సీతను తిరుగుదు రెల్లెడ.

14

గరుడ వేగమున గడతురు కొందఱు,
వాయు జవంబున పఱతురు కొందఱు,
నింగి నేల లంటియుంటని వే
గిర పాటున త్రిమ్మరుదు రందఱును.

15

హనుమ పేర విఖ్యాతుడ జగముల,
అనిల దేవునకు ఔరస పుత్రుడ,
సీతను వెతకుచు ఆతురుండనై
నూఱామడ పొడవారు సముద్రము.

16

దాటి వచ్చి, నీ ధామంబున భ్రమి
యించుచు చూచితి, ఇక్ష్వాకుల కో
డలిని, జనకు బిడ్డను, సీతను, నా
రాకయెల్ల సార్థకముయినట్టుల.

17

తపము చేసితివి; ధర్మార్థంబుల
అరసినట్టి పుణ్యాజనేశ్వరుడవు,
పరుల భార్యలను పట్టితెచ్చి ని
ర్బంధించుట, అర్హంబు కానిపని.

18
నిన్నుబోలిన మనీషివరేణ్యులు,
చేయరానివి, అపాయజుష్టములు,
మూల వినాశకంబులు, ధర్మవిరు
ద్ధములు చేయగా తగునె యెపుడయిన.

19
రాముకోపమున రగిలిన లక్ష్మణు
సాయకంబులకు సైచి నిలువగల
వాడెవండు దేవాసురగణముల
లోన నీవె ఆలోచింపందగు.

20
రాముని కపకారము చేసిన వా
డెవడు బ్రతికి సుఖియింపగలిగె, నీ
ధాత్రి మీద, పాతాళములోపల,
స్వర్గలోక వాసమ్ముల యందును.

21
సర్వకాల హితసంగతమై, ధ
ర్మార్థానుగుణంబయిన నా పలుకు
విని సీతాదేవిని పంపించుము,
రాముని దండకు రాక్షస వల్లభ !

22
అగపడ దంచును ఆశలు వదలిన
జానకి ముఖ దర్శనమైనది; ఇక
మిగిలిన దెల్ల నిమిత్త మాత్ర, మది
పూర్ణంబగు రామునిచే స్వయముగ.

23
చూచితి సీతను శోక పరీతను;
పరమ సువ్రతను; బట్టి తెచ్చితివి,
ఎఱుగవయితి వపు డది, ఐదు తలల
కాల సర్పమని, కామాతురమతి.

24

గరళము కలిసిన కలమాన్నంబు నా
కొని తిన జీర్ణించునె ? దేవాసురు
లేని ఈమెను గ్రహించి, భుజింపగ
చాలరు, లంకేశ్వర తెలియందగు.

25

తపముచేసి సంతప్తుండవయి స
మార్జించిన ధర్మార్థ సంగ్రహము
నిను నాశము కానీక నిలిపినది,
ఆత్మ రక్షకంబయి ఇందాకను.

26

అమరులచేతను అసురులచేతను
చావని వరములు సాధించితిని త
పోదీక్షల నని పొంగెదు రావణ !
కలవందును సందులు మృత్యువునకు.

27

భావింపుము సుగ్రీవుండు సురా
సురులను చేరడు, చూడ, యక్ష ప
న్నగ దానవ గంధర్వుల చేరడు,
అతనిచేత నీ ఆయువు తీరును.

28

ధర్మఫలమును అధర్మ సంచితము
ఏకముగా సంహితముకా వెపుడు ;
దేని ఫలితములు దానితోనె చను,
మాసిపోవు ధర్మము నధర్మమును.

29

నిస్సంశయముగ నీ వార్జించిన
ధర్మఫలము నంతయు భుజించితివి,
అనుభవింతు విక నశ్లై, అధర్మ వి
పర్యయఫల పరిపాకము సైతము.

30

దానవుల జనస్థాన మారణము,
వాలి వధంబును, వానర పతితో
రాజకుమారుని ప్రాణస్నేహము,
మతి భావింపుము హిత మాశింపుము.

31

రథమాతంగ తురంగతుములమగు
సేనలతో లంకానగరము నా
శనము చేయ నే చాలుదు నొకడనె;
కాని రాము సంకల్పము కాదది.

32

సీత నపహరించిన ద్రోహిని, తా
నె వధింతు ననుచు నిష్ఠించెను రఘు
నందనుండు వానరుల మ్రోల; ఆ
తడు తన శపథము తప్పడు తథ్యము.

33

రామున కపకారము కావించిన
సాక్షా దమరస్వామి యేనియు సు
ఖింపబోడు, తర్కింప నేల నీ
వంటి నిశాచర పాంసను సంగతి.

34

సీత పేర యే సీమంతిని నీ
వశమై యిచ్చట కృశియించెడి, ఆ
దేవి కాళరాత్రినిగా నెఱుగుము,
లంకాపుర నాశంకరి ఆ సతి.

35

సీతరూపు కయిసేసిన కాలాం
తకుని పాశబంధంబని తెలియక,
పట్టి నీ మెడను చుట్టుకొంటి, విక
ఆలోచింపుము ఆత్మక్షేమము.

36

రాముని కోపాగ్రహతాప నిదా
ఘమున రగిలి, జనకజ తేజస్సున
కమలుచున్న లంకాపురి, తోరణ
మంటపములతో మండి మసియగును.

37

జ్ఞాతులు, విహితులు, భ్రాతలు, సచివులు,
పుత్రమిత్ర సకళత్ర బాంధవులు,
అఖిల భోగభాగ్యములు సమూలము
నాశము చేసికొనకు మనురేశ్వర !

38

రామదాసుడను రాయబారమున
పంపవచ్చితిని, వానరజాతుడ,
సత్యము ! చెప్పితి సామవాక్యమును
మనసిడి వినదగు దనుజ కులాధిప !

39

ఆ మహామహుడు రాముడు, విమల య
శస్వి భూతపంచకముతో చరా
చరలోకములను సంహరించి సృజి
యింప శక్తుడు సుమీ ! యెఱుగందగు.

40–41

అమరులలోపల అసురులలోపల
నరకిన్నర పన్నగులలోన గం
ధర్వ సిద్ధవిద్యాధరులందును,
సర్వభూత సంజాతమునందును.

42

కానరాడు రాఘవుతో రణమున
పోరంగల ప్రతివీరు డొక్కడను,
నాడుగాని యీనాడుగాని ; శ్రీ
విష్ణు పరాక్రమ విక్రము డాతడు.

43

ఏడులోకముల కీశ్వరుడగు రఘు
రామున కిట్టి దురాకృతంబు చే
సేతల చేసిన పాతకుడవు, నీ
జీవిత మిక ముగిసినదని తెలియుము.

44

దైత్యదేవ గంధర్వ యక్ష వి
ద్యాధర పన్నగు లందఱు కూడిన,
ముల్లోకములకు వల్లభుడగు రా
ముని యుద్ధంబున మునుకొన చాలరు.

45

తనయంతన పుట్టిన పరమేష్ఠియు,
త్రిపురంబుల నేర్చిన ఫాలాక్షుడు,
అమరుల కధినాయకుడగు వజ్రియు,
రాముని బలికి శరణ మీ నోపరు.

46

అదరక బెదరక అప్రియంబులను
ఒప్పిదంబుగా చెప్పినట్టి వా
నరుని చూచి గ్రుడ్లురుముచు, వీని వ
ధింపు డనుచు శాసించె రావణుడు.



26-6-1967

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౫౨

1

హనుమ భాషితము లాలకించి, కో
పోద్రేకంబున ఒడలు మఱచి, వడి
నాజ్ఞాపించె మహాకపి వధమును
నిండుకొలువులోనుండి రాక్షసుడు.

2

రావణు డటు లాగ్రహమున వానర
వధ విధింపకని, భావించె విభీ
షణుడు, దౌత్యమును జరుపగవచ్చిన
వానిని చంపుట కాని కార్యమని.

3

క్రుద్ధుడయిన రక్షోవిభు నారసి,
సంఘటిలిన దుస్సంకటము తరచి,
అపుడు తానవశ్యము కార్యార్థము
చేయవలసినది చింతించెను ధృతి.

4

కృతనిశ్చయుడై, కినుకనున్న అ
న్నను, పూజ్యుని, రిపుజన జేతను కని,
పలికె, సార్థకము, భవితవ్యము నగు
పలుకు, మాట నేర్పరి విభీషణుడు.

5

క్షమియింపుము రాక్షస రాజేంద్ర! ప్ర
సన్నుడవై రోషము నడచి వినుము,
మన్నింపుము నా మాటను, దూతను
చంపరాదు రాజన్యసత్తములు.

6

రాజధర్మశాస్త్ర విరుద్ధము, లో
కము గర్హించును; కపివధ వీరుడ
వగు నీ పేరుకు తగినది కాదు, ప
రావరజ్ఞుడవు భావింపుము మది.

7

ధర్మజ్ఞుడవు కృతజ్ఞుడవు, సకల
రాజనీతిపారగుడ, వఖిల భూ
తప్రపంచ తత్వజ్ఞుండవు, పర
మార్థవిదుడ వీ వసదృశుండ విల.

8

నీవంటి నిఖిల నీతివేత్తలును,
సులభరోష వివశులయి తొడిబడిన,
శాస్త్రాభ్యాసశ్రమము కేవలము
బండమోత కావలె నసురేశ్వర !

9

కావున, శత్రుఘ్న ! దురాసదుడవు,
నీవు సుంత శాంతించి, విచారిం
పుము యుక్తాయుక్తములు, విధింపుము
దూతదండన యథోచిత విధమున.

10

రాక్షసేశ్వరుడు రావణుండును వి
భీషణు పలుకులు విని, దుర్భరమగు
రోషవేగమున రుధిరాక్షుండయి
ప్రత్యుత్తరమును పలికె నీ పగిది.

11

శాత్రవ భీషణ! శాస్త్రవిభూషణ!
పాపకర్మలను వధియించుట పా
పముకా, దీతడు పాపియె కావున
వధియించెద నీ వానరు నిప్పుడు.

12

అన్నమాట, లన్యాయపక్షము, ల
నార్యజుష్టములు నయి వినిపింపగ,
పరమార్థంబుల నెఱిగిన బుద్ధి మ
దగ్రణి యిట్టుల ననె విభీషణుడు.

13

శాంతింపుము రాక్షసరాజేశ్వర!
చంపరాదు రాజన్యులు దూతల
ననుచు పలుకుదురు ప్రాజ్ఞులు, కావున
న్యాయమైన వాక్యము నాలింపుము.

14

లేదు సందియం బీ దుష్టుడు శా
త్రవుడు, చేసె నపరాధము లయినను,
చంపరాదు రాజన్యులు దూతల;
పలుదండనములు కలవు దూతలకు.

15

వికలాంగుని కావించుట, కొరడా
చేఱులతో మెయిచిట్లగ కొట్టుట,
శిరసు ముండనముచేయుట, శిక్షలు;
దూతవధం బెందును వినబడ దిల.

16

వెనుకముందుల వివేచనగల ధ
ర్మార్థ వినీతుడ వయిన నీవె కో
పావిష్టుడవయి తక్కుట! సత్త్వవం
తులు ప్రతిరోధింతురు కోపంబును.

17

ధర్మశాస్త్రవాదముల, లోకవృ
త్తముల, తారతమ్యములను తెలిసిన
వారు లేరు నీవలె దేవాసురు
లందు, నీ వొకడ వగ్రగణ్యుడవు.

18

శూరుడవు, మహావీరుడవు, సురా
సుర దుర్జయుడవు, పోరిపోరి నీతో
పోరి యోటుపడిపోయెను మును దే
వాసుర నరనాయక సంఘంబులు.

19

దేవాసురుల నతికరించిన నీ
లా వరయక మును చావుతప్పి బ్రతి
కిన పగవారు తెగించి యిప్పు డిటు
వేసరింత్రు నిను వెకలిచేష్టలను.

20

దూతగ వచ్చిన కోతిని చంపిన
మనకెట్టి ప్రయోజనము కనబడదు,
కుడిచి కూరుచుని కోతిని పంపిన
వారిని శాసింపగ తగు మగటిమి.

21

సుజనుడుకానీ కుజనుడుకానీ,
దూత అస్వతంత్రుడు, పరు లుపదే
శించినదానినె చెప్పెను, కావున
చంపకూడదను శాస్త్రము దూతను

22

ఇతని నిప్పుడిట, హతమొనరించిన
కనరా డెవడును కడలిదాటి లం
కకు రాగల ఆకాశచారి అట,
నిష్ఫలకృత మిది నిందయె మిగులును.

23

కావున నీవీ కపివధ కార్యము -
కట్టిపెట్టు; మీ ఘన సన్నాహము
దేవేంద్రునితో దేవతలను
అరిగొను తఱిచేయగ దగును ప్రభూ!

24

అదిగో, కిటకిట అంతమైన దూ
రమున నున్న ఆ రాజపుత్రులను
యుద్ధప్రియ దుర్బుద్ధుల నిచటికి
దోతెచ్చు సమర్థుడు కానబడడు.

25

శౌర్యవిక్రమోత్సాహ ధుర్యులగు
దేవాసురులకు నీ వజేయుడవు,
ఆపనేల యోధానందన రణ
దీక్షారంభము రాక్షసరంజక!

26

వీరకులీనులు శూరాగ్రేసరు
లస్త్రశస్త్రధరు లయిన యోధు లు
న్నారు నీకు ముందఱనె యెందఱో!
పోరాటమునకు ఆరాటించుచు.

27

కావున భవదగ్రచమూ నాయకు
లందు కొందఱు ప్రయాణమై విడిసి,
మూఢులయిన నృపపుత్రకులకు చూ
పింత్రుగాక నీ వీరవిక్రమము.

28

అమరద్వేషి, మహాబలవంతుడు,
రాత్రించరకుల రాజరాజు, గ్రహి
యించె విభీషణు మంచిమాటలను,
తమ్ముని పై గల నెమ్మి నమ్మికల.

29

మండుక్రోధమును మణచిపెట్టి మది,
శస్త్రశాస్త్రభూషణు విభీషణుని
మేలుపలుకులను  ఆలకించి, బదు
లాడె రావణుడు అనుజునితో నిటు.



30-6-1967

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౫౩

1

అతని వచనముల నవధరించి విని
దశకంఠుండును తమ్ముని చూచుచు
అడిగె దేశకాలావహితంబుగ,
సంశయ విస్పష్టములగు మాటలు.

2

రాజులు చంపగరాదు దూతనని
పలికితి వౌనది; పాతకు డీతడు
చావుకాని యొకశాస్తి కావలెను,
దుష్టదండనము శిష్టమతము కద.

3

కోతుల కెల్లను ప్రీతిభూషణము
లాంగూలము, తదలంకారంబును
కాల్చివేయు డీక్షణమె, వానరుడు
మొండితోకతో పోవును పానుపడి.

4

ఈ శాస్తివలన ఈతం డంగ వి
రూపవేదనకు క్రుస్సి, బిడియపడ,
నాలుగువీథుల నగరిని త్రిప్పుడు,
చూతురు దాయలు చుట్టపక్కములు.

5–6

ఆ శాసనమును ఆలకించి, రా
క్షసులు క్రోధలాలసులై, చిరిగిన
బట్టలతో పెనబెట్టి చుట్టి క
ట్టిరి గట్టిగ వానరుని వాలమును.

7

తోకను పాతలతో చుట్టగ హరి
అంతకంత కాయతముగ పెరిగెను;
అడవి నెండి బెండ్లయిన కట్టెలను
తగిలి రగిలి పొడ వగు అగ్నింబలె.

8

తడిపి నూనెతో తరువాతను జ్వా
లను తగిలించిరి లాంగూలమునకు ;
వెలుగువాలమును విసరె, నసురు లెడ
బడ, బాలార్కముఖుడయి మహాకపి.

9

అంతట, హనుమ మహావాలంబున
జ్వాల లెగయగా సంతోషముతో,
చూచు చేగిరి నిశాచరు లిండ్లకు,
స్త్రీలును శిశువులు వృద్ధులు విసవిస.

10

పోయిన దైత్యులు పురికొని క్రమ్మరి
తిరిగివచ్చి బంధించిరి వానరు,
తత్కాలానుగతంబుగ హనుమయు
తలపోసెను చిత్తమున నీ పగిది.

11

బద్ధుడనైనను బలపాటవములు
కల వీ పాశంబులను త్రెంచి, పై
కెగసి, రాక్షసుల నింతలంతలుగ
చించి, చెండి, చెచ్చెర వేటాడగ.

12
స్వామిహితార్థము వచ్చితినే, నిట
పట్టిరి నను తమ స్వామి యానతని
వీరును; దీనిని వైరిదౌష్ట్యమని
తలపోయుట యుక్తముకా దనిపించును.

13
సమరము వచ్చిన చాలుదు దైత్యుల
చక్కాడగ నేనొక్కడనే యిట,
అయినను రాముని ప్రియము కోరి నే
సహియించెద ఈషత్ క్లేశంబును.

14–15
కోటలోపల దిగునపుడు, నడినిసి
చూడలేనయితి వీడు సర్వమును,
పరికించెద నీ పగటివేళలను;
తిరుగక తప్పదు మఱల నాకు పురి.

16–19
నా కిట్టుల బంధములు వేసి నా
తోకను తైలముతోడ తడిపి, ని
ప్పంటించినను రవంతేని మనః
క్లేశము తోచుటలేదు నా కిపుడు.

?

చిన్నకోతివలె ఉన్న నన్నచట,
బలవద్వానరు పట్టికట్టితి మ
టంచు కేరి చాటింపుచు త్రిప్పిరి,
లంకాపురి నలువంకల నసురులు.

20
మిగుల విచిత్రములగు విమానములు,
చాటు మాటయున సందులు మలుపులు,
వీధులు కలసిన వెడద చదరములు,
పరికింపుచుతో నరిగెను హనుమయు.

21

గృహపంక్తులు క్రిక్కిరిసిన బాటలు,
రథములు తిరిగెడి రాజ మార్గములు,
పెడదారులు, తిరుగుడు త్రోవలబడి,
ఊరేగించిరి చారుడు వీడని.

22

మేఘము లంటెడు మేడల మిద్దెల,
రాజపథంబుల, రచ్చల హనుమను
చారుడు వీడని చాటింపుచు ఊ
రేగించిరి రాత్రించరు లెసకొని.

23

భగ భగ మండెడి బారు తోకతో
ఊరేగెడి కపియోధుని చూడగ,
వేడుకపడి త్రోసిళ్ళాడుచు వడి
వచ్చిరి స్త్రీలును బాలురు వృద్ధులు.

24

వారలలోపల వంకర కన్నుల
అసురులు కొందఱు కసమస పరుగిడి,
సీతాదేవికి చెప్పిరి వేగమె,
హనుమద్వాల దహన దుర్వార్తను.

25

సీతా ! నాడిట నీతో ముచ్చట
సాగించిన ఆరాగిమూతి కో
తిని పట్టిరి, తోకను నిప్పంటిం
చిరి, త్రిప్పెద రదె పుర వీథులలో.

26

అతిఘోరములగు ఆ పలుకులు విని
అయిదు ప్రాణములు అవిసిపోయి న
ట్లాయి, భగవంతుని హవ్యవాహనుని,
ఆశ్రయించె శోకార్తిని జానకి.

27

అతి విపద్భయద మగు నా వేళను
హనుమకు క్షేమము నావహింప, ని
శ్చల మతియై మంగళముఖి జానకి,
ప్రార్థించె మహోజ్వలుని పావకుని.

28

పతి పరిచర్యల పడసిన పుణ్యము,
చిర తపముల ఆర్జించిన సుకృతము,
ఏకపత్నీత్వ మిచ్చిన సత్వము,
అర్పించెద చల్లారుము పావక !

29

ధీమతియగు శ్రీరాముని కరుణయు
వర బలమును నా పట్లనున్న, సౌ
భాగ్య శేష మేపాటి మిగిలినను,
ధారపోతు చల్లారుము పావక !

30

పరమ శీల సంపన్నురాల నని,
భర్తృ సమాగమ బద్ధ వ్రత నని,
నను ధర్మాత్ముడు నాథుడు నమ్మిన
ప్రార్థింతును చల్లారుము పావక !

31

సూనృత వ్రతుడు సుగ్రీవుడు నను
కష్ట సముద్రము గట్టెక్కింపగ
సమకట్టిన యత్నము కొనసాగగ
చల్లపడుము వైశ్వానర! హరియెడ.

32

జానకి అటు ప్రాంజలి పట్టగ, కపి
వాలజ్వాలలు వాల్చెను శిఖలు, ప్ర
దక్షిణించి సీతకు హనుమత్కుశ
లార్థము చెప్పగ అరుగుచున్నటుల.

33

హనుమ తండ్రియును తనయుని వాలము
ఎడలిపోవు వహ్నికి అనుగలముగ
విసరె, దేవి మానసము స్తిమిత పడ,
మంచున తడిసిన మాద్రి చల్లగా.

34

అపుడు మహాకపి అచ్చెరువందెను,
వాలంబున పావకుడు జ్వలించును,
కాని, తపన తాకదు నన్నెందును,
ఘటము కాల కాగవె ఉదకంబులు !

35

వెలుగు తీవ్రముగ వీతిహోత్రు, డా
వంతబాధ నా కగుపించదు మెయి,
హాయిగ నున్నది ఆయత వాలము,
చల్లని జలములు చల్లిన చాయను.

36

పారములేని గభీర సాగరము
దాటుచున్నపుడు దర్శన మిచ్చెను
మైనాకుడు; రామ ప్రభావమది,
సాగరమందున శైలము లేచుట.

37

అట్లు, సముద్రుడు, నచలేంద్రుండును
రాముని కార్యార్థము తత్పరులై
సంభ్రమించి, రిక స్వాహావల్లభు
డేమి చేయడీ యిష్టకార్యమున.

38

సీతాసుకృత విశేషబలంబును,
రాముని నిజతేజోమహిమయు, నా
జనకుని స్నేహంబును యోగింపగ,
నను దహింపపూనడు హుతాశనుడు.

39-40

అని భావించి మహాకపి, ఆర్చుచు
వడినెగసె పురద్వారము మీదికి
ముసముస మసలెడి అసురులతో, బహు
గృహాములతో క్రిక్కిరిసి యున్నయెడ.

41

అచట నిలిచి కొండంతయి, వెంటనె
చిన్నపిట్టవలె సన్నగిల్లి, రా
క్షసులు బిగించినకట్లు తమంతట
సళ్ళి జాఱిపడ సాగెను హనుమను.

42

బందంబులు విడివడి దిగజాఱిన
వెంటనె మారుతి పెద్దకొండవలె
పైకిపెరిగి, ఆ ద్వారబంధ మం
దడ్డ దూలమును అటునిటు చూచెను.

43

ఇనుము పోతపోసిన ఆ నల్లని
పెద్ద దూలమును పెల్లగించి, నగ
రద్వార మహోరాత్రంబులు కా
వలి కాచెడి దైత్యుల పడమొత్తెను.

44

రణచండ పరాక్రమశాలి హనుమ,
అసురుల నటు హతమార్చి, మండువా
లముతో కనబడె లంకను చూచుచు,
కిరణ హారియగు తరణి కరణి యట.

౮-7-1967

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౫౪

1

లంకనట్లు మఱలన్ పరికించుచు,
చేసిన పనికిన్ చిత్తముల్లసిల,
ఉత్సాహముతో ఊహించె మహా
కపి వీరు డపుడు కార్య శేషమును.

2

ఉక్కటి, బెగ్గిలి, పిక్కబలము చూ
పిన యీ రక్కసి పిండము, లంకను
ఉలికి యుడికి గాసిలి తపించుటకు
ఏమి చేయదగు ఇక నాకిచ్చట.

3

పచ్చని తోటలు పాడు చేసితిని,
మేటి రక్కసుల గీటడగించితి,
సేనలో సగము చెదరగొట్టితిని,
కొదవ యున్న దిక కోటను కూల్చుటె.

4

కాలుపెట్ట శక్యంబుకాని ఈ
దుర్గంబును పడద్రోయుట కష్టము,
ఇంచుకంత యత్నించి చూతు నా
శ్రమ సర్వంబును సఫలంబగుటకు.

5

నన్ను దహింపక నా లాంగూలము
చివరనె మండెడి చిత్రభానునకు,
ఆహుతి యిచ్చుట న్యాయము నా కిపు
డత్యుత్తమమగు దైత్యుని దుర్గము.

6

అని యోచించి మహాకపి తడయక,
మెఱుపుల పాయల మేఘపాళివలె,
జ్వాలామాలల క్రాలు వాలమును
కలయత్రిప్పె లంకా గృహములపయి.

7

వాస గృహంబులు, ప్రాసాదంబులు,
ఉద్యానవనము లొక్క టొక్కటిగ
పరికించుచు నిబ్బరముగ తిరిగెను,
లంకలోన మేడల వెన్నులపయి.

8

అతివేగమున ప్రహస్తుని సౌధము
కొప్పుపై కెగిరి నిప్పంటించెను,
అగ్నిహోత్రునకు ఆహుతిగా, కా
లాంతక సన్నిభు డనిలనందనుడు.

9–15

పార్శ్వమున మహాపార్శ్వుని మేడను,
వజ్రదంష్ట్రుని నివాసము, శుకుని ని
శాంతము, సారణు సౌధ, మింద్రజితు
ఆయతనంబును, అంటించెను శిఖి

1

రశ్మికేతునిలు, హ్రస్వకర్ణదం
ష్ట్రుల మందిరములు, రోమశ విద్యు
జ్జిహ్వా, మత్త, హస్తిముఖ, దశగ్రీ
వుల, భవనములను తలకొలిపె దహను.

కుంభనికుంభుల, కుంభకర్ణ మక
రాక్షుల యిండ్లు, కరాళ, శోణితా
క్షుల ప్రాసాదంబులు నంటించెను,
బ్రహ్మశత్రు హర్మ్య సమేతంబుగ.

16

వైరియోధుల నివాస భవనములు
క్రమము తప్ప కటు కాలపెట్టుచున్,
లంకా నగరి కలంకారముగా
విడిచి పెట్టెను విభీషణు సదనము.

17-18

సర్వ సమృద్ధ సుసంపన్నములగు,
రాజమార్గ హర్మ్యములను వరుసగ,
కాల్చుచు, అన్నిటి గడచి దరిసె ర
మ్య మయిన రావణు మణిమయ సౌధము.

19

నానా మణిరత్న విభూషితమయి
సుందరమ్మగుచు, మందర మేరు స
మ సమున్నతమయి, మంగళ శోభా
స్పదమగు నా ప్రాసాద తల్లజము.

20

ఆ మహారాజ ధామ శిఖరమున
జ్వాల లెగయు తన వాలమును విసరి
నిప్పుపెట్టి, గాండ్రించి అఱచె హరి,
ప్రళయకాల ధారాధరంబువలె.

21–22

హనుమ ప్రతిష్ఠించిన హుతాశనుడు,
గంధవహుడు సహకారము నెఱపగ,
రగిలి, మండి, యెఱ్ఱనినాల్క లెగయ
కమియసాగె సాంతముగ సౌధమును.

23

కనకంబున చెక్కిన కిటికీలును,
పాలవన్నె ముత్యాల కుచ్చులను,
ఒప్పెడి మేడలు కప్పులు కాలగ
కుప్ప తిప్పలుగ కూలెను నేలను.

24

ఎక్కడి వక్కడ ముక్క చెక్కలయి
కేళీ గృహములు కాలి కూలి పడె,
పుణ్యము క్షయమైపోయిన సిద్ధుల
స్వర్గ వాసములు సడలిపడ్డ గతి.

25

కాపురపిండ్లను కాపాడుట కు
త్సాహము లేక, వితావిత పరుగిడు
లంకావాసుల సంకుల రవములు
మిక్కుటమై దెసలెక్కి పిక్కటిలె.

26

కపిరూపముతో కాలాగ్నియె, యిటు
వచ్చె నయోయని వాపోవుచు క్రిం
దపడిరి బాలెంతలు పసిబిడ్డల
ప్రాణంబులు కడపట్ట బిమ్మిటిని.

27

మేడల మంటలు మెండుకొన, మఱిగి,
కొప్పులువిడ, గగ్గోలుగ దుమికెడి,
అసురలేమ లపు డగపడిరి, మొగులు
తెగి, రాలిపడు మెఱుగు తీగెలవలె.

28

కాలుచున్న గృహజాలమునందలి
కనకరజత ముక్తావిద్రుమవై
దూర్యముల్ కరగి తొరగి, రంగుల ప్ర
వాహములై చూపట్టెను హనుమకు.

29

తృణకాష్ఠంబుల తృప్తిని చెందని
అగ్నిచందమున హనుమంతుండును,
తనివోడాయెను దహనుని బలిగా
వ్రేల్చిన రాక్షసవీరుల సమిధల.

30

అగ్నిహోత్రమున ఆహుతియైపో
యిన అసురులతో నేని, మహాకపి
కసిమసగిన రాక్షసులతో నేని
ఆపోదాయెను అచలవసుంధర.

31

ఎగయుచున్న వహ్నిజ్వాల లగపడె
మోదుగు చిగురుల మాదిరి కొన్నియు,
శాల్మలీ కుసుమ సరణిని కొన్నియు,
కుంకుమ పువ్వుల వంకను కొన్నియు.

32

వేగశాలి కపి వీరుండు, తపో
మహితుడు మారుతి, దహియించెను లం
కాపురమును సాంగముగా; రుద్రుడు
త్రిపురములను పూర్తిగ కాల్చినటుల.

33

హనుమ యట్లు చాలన చేసిన వై
శ్వానరుండు లంకానగరినగ
శిఖరంబులపై చిందులు త్రొక్కుచు
మండ సాగెను ప్రచండ దీప్తులను.

34

లయ కాలానల రయమున ఎగయుచు,
గాలి తోడుపడ కీలలు నింగికి,
కూలిన దైత్యుల క్రొవ్వు కరగి, పొగ
లేని మంటలయి లేచె తీండ్రముగ.

35

కోటిసూర్యు లొడగూడిన కైవడి,
మండు హుతాశను మంటలు మ్రోగెను
పెళపెళ నార్చుచు, పిడుగులుపడ బ్ర
హ్మాండ భాండములు అగలిన చాడ్పున.

36

ఆకసమంటెడి అగ్నిజ్వాలలు
మోదుగు పువ్వుల మాదిరి విలసిల,
నల్లకలువ కొండలుపోలె పొగలు,
కాలమేఘముల మాలికలాయెను.

37

అపుడందఱు భయమందిరి; కపి కా
డీతడు, యముఁడో, ఇంద్రుడో, వరుణుడో,
రుద్రుండో, అర్కుడొ, కుబేరుడో,
సాక్షాత్కాలుఁడొ, సర్వనాశకుడొ !

38

తాతపాదు డీ జాతజగత్తుకు,
ప్రాణిలోక నిర్మాణవిధాత ఆ
బ్రహ్మ; అతనికోపమె రాక్షస సం
హారమునకు కపి ఆకారముగొనె.

39

అవ్యయ, మేక, మనంత, మచింత్యము,
అయిన వైష్ణవ మహో తేజము, రా
క్షస కుల లయమునకై యిటు స్వయముగ
మాయా వానరమై యిటు వచ్చెను.

40

ప్రాణి సంఘములు వాస గృహంబులు,
వృక్ష వాటికలు విధ్వంసములై
కాలిన లంకను కనుగొను, చసురులు
వాపోయిరి వెత లోపలే కెదల.

41
రథమాతంగ తురంగంబులతో,
వివిధ పక్షి మృగ వృక్షంబులతో,
కాలాగ్నింబడి కాలిన లంకా
పురి దీనముగా మూల్గుచు ఏడ్చెను.

42
అకటా! తండ్రీ, అయ్యో కొడుకా!
హా కళత్రమా! హా సుమిత్రమా!
పుణ్యార్జితమగు భోగ జీవితమ!
అని యేడ్చుచు, అల్లాడిరి అసురులు.

43
హనుమంతుని కోపాహతి హతమై,
అగ్నిజ్వాలల కాహుతిగా, చా
వగవీరులు వాలగ యోధులు, శా
పము కొట్టినగతి పాడఱె లంకయు.

44
దుర్విపాద భయధూతులయిన రా
క్షసులతో హుతాశనుడు దహింపగ,
ఉన్న లంక వాయుసుతు డీక్షించెను;
బ్రహ్మ కోపమున పడిన ధాత్రివలె.

45
పచ్చనితోటను పాడుచేసి, రా
క్షసయోధుల నని చక్కడించి, లం
కను కాల్చి, తనివికొనిన చందమున,
ఊరకుండె వాయుతనూజు డపుడు.

46
మూడుశిఖరములు మురిపించు త్రికూ
టాద్రిమీద సింహామువలె నున్న మ
హాకపి కనబడె అంశుమాలివలె,
జ్వాల లెగయు తన వాలము కదుపుచు.

47

అసురనాయకుల హతముచేసి, వా
రిగృహాంగణములు తగులపెట్టి, పూ
దోటలబడి చెడత్రొక్కి, చేరె శ్రీ
రఘుపతిని మనోరథ యానంబున.

48

అంత, దేవగణ మంతయు మిక్కిలి
తుష్టిచెంది ప్రస్తుతు లొనరించెను,
వానర వీరప్రవరుని, వాయు సు
తుని, మహాబలిష్ఠుని, హనుమంతుని.

49

చక్కని తోటను చదునుచేసి, ర
క్కసులను రణమున ఉక్కడించి, సుం
దరమగు లంకను దగ్ధముచేసి ప్ర
కాశించె మహాకపి గజరాజము.

50

అప్పుడు సిద్ధులు, అమరులు, గంధ
ర్వులు మహర్షు, లటు బూడిదయై పో
యిన లంకానగరిని వీక్షించుచు,
విస్మయ మందిరి విధిచోద్యంబని.

51

ఆ మహానగర హోమము సలిపిన
వానరసత్తము వాయుసుతోత్తము
కాంచి భూతములు కాలానలుడని
విభ్రాంతింబడి విస్మయమందెను.

52

సురలును, విద్యాధరులును, ముని పుం
గవులు, కిన్నరులు, గంధర్వు, లఖిల
భూతకోటియు, అపూర్వధీరమగు
హనుమ రూపు కను చానందించిరి.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౫౫

1

లంక సాల్గు మూలలు దహించి, చ
ల్లార్చి సముద్ర జలంబుల తోకను;
కాలగ సర్వము, కాతరులై దా
నవులున్న మహా నగర రాజమును.

2–3

చూచెను, తోడనె క్షోభలెత్త, అను
తాప తప్తుడయి తన్ను తాను నిం
దించు కొనుచు భీతిల్లె మహా కపి,
ఏల చేసితిని ఇది అకార్యమని.

4

రెప రెపలాడుచు రేగిన నిప్పును
చల్లని నీటను చల్లార్చు పగిది,
పొడిచిన కోపము బుద్ధి కోశమున
అణచి పెట్టెడి మహాత్ములు ధన్యులు.

5

కోపి చేయడే క్రూర కర్మమును?
గురువు నైన వెనుకొనక వధించును,
తూలనాడు క్రుద్ధుడు దుర్భాషల
సాధు జనములను నైతము తడయక.

6

ఇది అన వచ్చును ఇది అనరా దని
అంజాయింపదు ఆగ్రహ వివశుడు;
అదుపు మీఱి చేయని అకార్యమును,
పలుక కూడని అవాచ్యము నుండదు.

7

ఎడద సుడింబడ మిడిసిన క్రోధము,
ముదిసిన కుబుసంబును సర్పమువలె;
సహనముతోడ విసర్జించు నెవడు
ఆతడె పురుషుం డని చెప్పందగు.

8

సీతయున్నదని చింతింపక లం
కను సాంతముగా కాల్చితి నిస్సీ!
స్వామి ద్రోహము సలిపితి, పాపిని,
దుర్బుద్ధిని, ఎందుకు నా బ్రతు కిక!

9

ఎపుడు లంకను దహించితి సర్వము
అపుడె జానకి లయంబయి యుండును.
స్వామి కార్యమును భగ్నము చేసితి
దూర మరయ, కవిచార బుద్ధినయి.

10

ఎందుకోసమయి ఈ ప్రయాస కొడి
గట్టితి, అది విఘ్నంబయి పోయెను;
కాల్చినాడ లంకను పూర్తిగ సీ
తా రక్షణమును తలచక పోతిని.

11

సాధించిన పని స్వల్పం బయినది
అందుకు సందేహము లే దింతయు,
రావణు మీది దురంత రోషమున,
చేసితి మూలచ్ఛేదము తడయక.

12

జానకి దగ్ధంబై నశియించెను,
నిజమది ; కాలక నిలిచిన ప్రాంతమె
కానరాదు లంకాపురమున, భ
స్మమయి పోయినది సర్వ దేశమును.

13

నా విపరీత మనః ప్రమాదమున
సీతాదేవి నశించియున్న, నా
ప్రాణత్యాగమె పరిహారం బా
పాతకమున కని భావింతును మది.

14

బడబానలమున పడుదునో, వార్ధిని
దుమికి మునిగి పోదునో నేనిప్పుడె,
సాగర జలచర జంతు సంతతుల
కన్నముగా దేహము నర్పింతునో ?

15

బ్రతికి యుండి, ఏ భ్రష్టముఖముతో
వానరేశ్వరుని వదనము చూతును ?
పులులఁబోని నృప పుత్రుల నెటు దా
శరథుల చూతును సర్వఘాతుకుడ.

16

రోష దోషమున రోయక అనవ
స్థిత చిత్తుడనయి చేసితి నీ పని,
ముల్లోకములకు వెల్లడించితిని,
చాపల్యము కపి జాతి నైజమని.

17

రాజసభావ, మరాజక, మవశము,
ఇస్సీ ! ఇది గర్హితమౌ గావుత !
చాలియుండియును జనకర్షి సుతను
సీత నరసి రక్షింపలే నయితి.

18

జనకజ గతియించినదని విన్నన్
ప్రాణము విడుతురు రామలక్ష్మణులు,
వారిరువురు చన బంధుసహితముగ
సుగ్రీవుండు అసువులు త్యజించును.

19–20

భ్రాతృవత్సలుడు భరతుం డది విని,
శత్రుఘ్నునితో సమయును తోడనె,
ధర్మమార్గ తత్పరు లిక్ష్వాకులు
అస్తమింప ప్రజ లలమటింత్రు వెత.

21

ధర్మార్థములు యథాయథలై చెడు,
అటుమీదట నే హతభాగ్యుడనయి,
రోషమున జగద్ద్రోహము చేసిన
దోషపరీతాత్ముడనై నిలుతును.

22

అనుచు హనుమ బహుళానుతాపమున
దురపిలుచుండగ, తోచెను క్రమ్మఱ,
పూర్వ నిదర్శనములు, శుభ శకునము
లగపడె ఎడనెడ ఆస లిగుర్పక.

23

అదియుగాక, సర్వాంగ సుందరికి
జనక సుతకు రక్షకముగ కల దా
సాధ్వీతపస్తేజము; కళ్యాణి న
శింపదు, వహ్ని గ్రసించునె వహ్నిని ?

24

ధర్మాత్ముం, డనుత్తమతేజోనిధి
యగు రాముని జాయామణి, అనవ
ద్య చరిత, తపస్వ్యవ్రతకవచను,
సీతాదేవిని స్పృశియించునె శిఖి ?

25

దహన కర్మమె స్వధర్మ మయిన వ
హ్నియు, నాతోక దహింపక విడిచెను.
అందుకు రాము మహో ప్రభావమును
జనకజ సుకృతంబును కారణములు.

26

భరతుం డాదిగ భ్రాతృత్రయమున
కధిదేవత, ఏకైకపత్ని శ్రీ
రామునకు, జనకరాజ ఋషితనయ,
ఆమె నశించునె అగ్నిహుతంబయి ?

27

సర్వదహన సంస్కారంబులకును
అవ్యయుడగు ప్రభు వగ్నిహోత్రుు; డత
డార్యను, జానకి నంటు నెట్లు ? నా
తోకనె కాల్చడు తాకి మండుచును.

28

అనుచు ఇట్టు లూహలను తెలు హను
మంతున కప్పుడు స్మరణకు వచ్చెను,
జలధినడుమ దర్శనమిచ్చిన మై
నాకు, హిరణ్మయనాభుని విషయము.

29

తపసుచేత, సత్యంబుచేత, ఏ
కైక భర్తృ చరణార్పిత మతిచే,
పూత చరితయగు సీతయె వహ్నిని
కాల్చు, నాయమను కాల్చలేదు శిఖి.

30

ఇట్లు, పావని అనేక విధంబుల
దేవి మహత్త్వము భావింపుచు నుం
డగ, విన వచ్చెను, గగన మార్గమున
చారణు లాడెడి సంభాషణములు.

31

అద్భుతం బహో ! హనుమ యిపుడు కా
వించిన దుష్కర భీషణ కృత్యము,
ఆర్పరాని దావాగ్నిని రాక్షస
గృహ మాలికల తగిల్చె ఘోరముగ.

32

ఆ భీకర దృశ్యమున కదరిపడి
రక్కసు లేడ్చుచు దిక్కులు పట్టిరి
స్త్రీలును శిశువులు; కోలాహలములు
కొండ గుహల మూల్గుల వలె వినబడు.

33

కాలిపోయె లంక సమస్తము ప్రా
కారాట్టాలక తోరణములతో;
కాలలేదు, రాఘవ సతి జానకి;
ఆశ్చర్యం బిది అద్భుతాద్భుతము.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౫౬

1

జొంపమయిన శింశుప క్రిందనె కూ
ర్చున్న మైథిలికి చుట్టును తిరిగి, న
మస్కరించి కపి 'మాతరో ! కనుకం
దక నిలిచితి విది నాసుకృతంబగు.'

2

తిరుగు ప్రయాణపు త్వరలోనున్న, హ
రీంద్రుని పారిపారి వీక్షింపుచు వై
దేహీపలికె భర్తృస్నేహము తొల
కాడుచున్న హృదయముతో తిన్నగ.

3

పరవీరాంతక ! ప్రారంభించిన
కార్య, మవిఘ్నముగా తీర్చిన శూ
రుండవు నీవొక్కండవె, మారుతి!
నీ బలము పురాణించు యశముతో.

4

శరఘాతలతో సంకులముగ రిపు
రాక్షస బలమర్దనము సలిపి, నను
కొనిపోవుట కాకుత్థ్సున కొప్పును,
అది రాముని శౌర్యమునకున్ తగును.

5

ఆహవ శూరుం డయిన మహాత్మునీ
రఘురాముని విక్రమ విఖ్యాతికి
తగిన కార్యసాధక విధానమును
ఉపదేశింపుము కపి కంఠీరవ !

6

సీత యట్టుల సహేతుకంబుగా
పలికిన సార్థక వచనము లన్నియు,
అవధానముతో ఆకళించి బదు
లాడెను వానరచూడామణి యిటు.

7

దేవి ! యేమిటికి దిగులున పొగిలెదు,
వానర భల్లుక సేనలతో శీ
ఘ్రమె వచ్చును రాఘవుడు, రాక్షసుల
చెండాడును నీ చెఱలను తీర్చును.

8

ఇట్టుల వైదేహి మనోవేదన
లుపశమింపగా ఊరటలాడి, మ
హా కపి తిరుగు ప్రయాణ బుద్ధితో,
ప్రణతుడై ప్రదక్షిణ మొనరించెను.

9

స్వామి దర్శనోత్సాహదోహదము
వేగిరింప కపివీరాగ్రేసరి,
ఒక్క ఊపున మహోన్నతమైన అ
రిష్ట పర్వతము శృంగము నెక్కెను.

10

తుంగ పద్మక ద్రుమ వనరాజీ
రంజితమై పర్వతము కనంబడె,
శిఖరంబుల అంచెల మేఘంబులు
వల్లె వాటువలె వాలుచునుండగ.

11

సూర్యుని శుభకర చుంబన సుఖమున
కనబడె గిరి మేల్కొనుచున్నట్టుల,
పగులువాటిన మెఱుగురాళ్ళును ఱె
ప్పలు తెఱచెడి కన్నులవలె శోభిల.

12

ఏటవాలయిన యేటినీళ్ళ చ
ప్పుడు వేదము చదివెడి శ్రుతి నెనయగ,
కొండసోనలు గునగున ప్రవహించెను
బాలగీతములు పాడుచున్నటుల.

13

దివి కెగ ప్రాకిన దేవ దారువులు,
ఊర్ధ్వ బాహు ముఖ యోగము నెఱపగ,
ఘూర్ణిలిపడు వాగుల రొద వినబడె,
దేవనగము వాపోవు చున్నటుల.

14

ఱీళ్ళను నల్లని ఱెల్లు పొద లులికి
ఊగులాడె, వాతోద్ధూతాగ్రము
లయిన వెదురు పొదలన్నివైపులను,
కుసులుచున్నగతి కుయికుయిలాడెను.

15

అలిగి కలగి పుట్టలు వెడలిన పా
ముల బుసబుస లూర్పులవలె నెగసెను.
మంచు పేరి కుంభించిన గుహలును
ధ్యాన స్తిమితము లయి నట్లుండెను.

16

కాళ్ళు దిగిన మేఘముల బోని గు
ట్టల తోడ గిరి నడచిపోవు గతి
అగపడు చుండగ, నగశిఖరంబులు
వినువీధిని జృంభించున ట్లెసగె.

17

అంతరంతరము లందొప్పెను కం
దరము లనేకము గిరిసానువులను;
సాలసాలములు తాళతరులు, ప
చ్చని వేణు నికుంజములు పుంజుకొన.

18

పూచిన తీగెల పొదల నందమయి,
పలుజాతుల మృగముల మందల సుం
దరమయి, నానా ధాతు రాగములు
చిందు శిలలతో కందళించె గిరి.

19

త్రుళ్ళి పాఱు సెలయేళ్ళ చాళ్ళతో,
తళుకుటూళ్ళ పడకలతో సొంపయి,
యక్షకిన్నర మహర్షి నాగ గం
ధర్వ గణములు సదాసేవింపగ.

20

కందమూలఫల కామవృక్షములు,
క్రిక్కిరిసిన తీగెల పొదరిండ్లును,
మృగరాజులు విహరించు వాటములు,
చాఱల మెకములు తారు చదరములు.

21

బహుశోభలతో భాసిలుచున్న అ
రిష్ట పర్వతవరేణ్యము నెక్కెను,
రాఘవ దర్శన రాగ లాలసుడు,
పవనసుతుండు, ప్లవంగవతంసుడు.

22

రమ్యములగు పర్వతము లోయలను
పగిలి తున్కలయి పాషాణంబులు
అగలి, పెకలి, నలినలిగా, నలిగి,
చూర్ణములాయెను సున్నిపిండివలె.

23

ఉత్తరతీరము నుజ్జగించి, ద
క్షిణపారంబును చేరుటకయి, పెం
చెను దేహమునంతన హనుమంతుడు,
లవణార్ణవమును లంఘించెడు త్వర.

24

ఆ పర్వత శిఖరాగ్రమున నిలిచి,
అవలోకించె మహాకపి క్రమ్మఱ,
పాములతో చేపలతో త్రుళ్ళుచు
అతిభయంకరంబయిన సాగరము.

25–26

అంతన ఎగసెను హనుమ దక్షిణపు
దిక్కువిడిచి, ఉదీచిని దిగుటకు,
కాళ్ళత్రొక్కిడికి కెళ్ళగిల్లె గిరి,
భీతిలి మూల్గెను భూతగణంబులు.

27

హనుమ తొడల యూపునకు తల్లడిలి
రాలిన పువ్వుల సాలంబులతో,
కంపించిన శృంగంబులతో, వ
జ్రాయుధ హతమైనట్లు వడకె గిరి,

28

కందరములలో కంఠీరవములు
కలగి కినిసి దిగ్గ్రభము గర్జింపగ,
విన వచ్చె త దాభీలధ్వని, ఆ
కాశము బ్రద్దలుగా పగిలిన గతి.

29

చీరలు జాఱగ, హార భూషణము
లల్లాడగ, విద్యాధరాంగనలు,
భీతి చెంది పృథ్వీతలము విడిచి
గగన వీధులకు ఎగసిరి బిరబిర.

30

బలసిన పాములు బిలముల లోపల
మెడలు తలలు త్రొక్కుడులకు నలిగిన
కసరి విసపు నాల్కలు క్రోయుచు వెస
చుట్టలు విప్పుచు చురచుర వెడలెను.

31

హనుమ పాదపీడన కరిష్ట గిరి
కంపించి కదల, గంధర్వులు, వి
ద్యాధర పన్నగ యక్షకిన్నరులు,
నేలవిడిచి వడి నింగికి తరలిరి.

32

చూడ సొంపుగా శోభిలుచున్న అ
రిష్టశైలము హరిబలిష్ఠ చరణ
ఘాతకు పాదులు కదల, చెట్లతో
సడలి క్రుంగెను రసాతలంబునకు.

33

పొడవున పదియామడ, లెత్తున ము
ప్పదియామడ లొప్పగ, విఖ్యాతం
బయిన అరిష్ట మహామహీధరము,
నేలమట్టమై నిలువున దిగబడె,

34

పోటుపాటులకు పొంగుచు క్రుంగుచు,
కల్లోలంబులు గట్టుతన్న, ఘూ
ర్ణిల్లు వార్ధిని తరించు పూన్కి, కు
ప్పించి యెగసె వినువీధికంత కపి.



# సుందరకాండ

## సర్గ ౪౭

1

తెల్ల కలువ భాతిని శశి, సూర్యుడు
కన్నె లేడివలె, కలహంసలవలె
పుష్య శ్రవణంబులును, పచ్చినా
చువలెన్ మబ్బులు శోభిలు చుండగ.

2

తార పునర్వసు భూరి మీనమయి,
అంగ్గారకుడు మహాగ్రహంబుగాన్,
ఐరావతము ప్రియద్వీపంబయి,
స్వాతి హంసవలె సంచరింపగా.

3

గాలియలలు కల్లోల కులముగా,
చంద్ర కిరణములు చల్లని నీళ్ళుగ,
నాగ యక్ష గంధర్వులు పూచిన
కలువలు కమలంబులుగా విలసిల.

4

అంతు కనబడని ఆకాశంబను
పారావారము పాటున దాటెను,
ఓడవోలె వాయుతనూజు, డనా
యాసనుగా, అలయక సొలయ కపుడు.

5

మింటిని ముద్దగ మ్రింగుచున్నటుల
చుక్కలరాయని మెక్కుచున్నటుల,
ఆకసమును తారార్క సహితముగ
ఆహారింపుచున్నటు లద్భుతముగ.

6

కాలమేఘముల తూలగొట్టుచున్
పోవుచుండెను నభోమార్గంబున,
కపికులోత్తముడు, గంధవహుని త
నూజుడు, హనుమంతుండు సరాసరి.

7

తెలుపులు, కెంపులు, నలుపులు, పసుపులు
వన్నెలు మెరయుచు వారిధరములు ప్ర
కాశించెను ఆకాశమం దపుడు,
గాలిలో మహాకపి ధావింపగ.

8

మాటికి మబ్బులచాటుకు పోవును,
మాటికి తెరలనుదాటి బయల్పడు,
ఒక తటి మెరయక, ఒక పటి మెరయుచు
చిందులాడె హరి చందమామవలె.

9

మెలచిన తెల్లని తలపాగాతో
ముంచి తేల్చు మబ్బుల లోపల, హరి,
కనబడి కనబడక, భ్రమించెను వా
నాకాలపు చంద్రముని చందమున.

10

ఆకాశంబున ప్రాకు మేఘముల
చిందర వందర చేసి చీల్చుకొని
బయటికి దుమికెడి పక్షిరాజువలె,
భ్రమలు కొలిపె చూపఱకు మహాకపి.

11-12
కాల్చి లంక, రక్కసుల యుక్కడచి,
ఘోర బలములను కూల్చి, ప్రశంసల
కెక్కి, మైథిలికి మ్రొక్కి, సముద్రము
దాటుచు సింహధ్వానము చేసెను.

13
మైనాకుని అభిమర్శించి, తరలి
శరవేగంబున చనిచని ముంగల
మేఘ రూపమున మించు మహేంద్రా
చలమును పొడగని సంతోషించెను.

14
మఱికొంచెము ముందరిగి, కుఱంగట
కన్నులారగనె కపి జీమూతము
పోలిన పర్వతమును మహేంద్రమును,
గర్జించె మహోత్కట మోదంబున.

15
కపికులవర్ధను డపు డుత్కంఠను
గర్జింపగ మేఘమువలె, ఆ ధ్వని
దెసలు నిండి వెక్కసమై మిక్కిలి
మాఱుమ్రోగె విడ్డూరపు టెలుగుల.

16
అంతకు పూర్వమె అచ్చట మూగిన
సుహృదుల నాప్తుల చూచి, వేడ్కను కి
లారించెను వాలము నాడించుచు,
వానర కేసరి వాయునందనుడు.

17
గగనమార్గమున గండ మీఱి, హను
మంతుండు గరుత్మంతుని భాతిని
వచ్చుచున్న ఆర్భటమునకు పగిలె
నభము సూర్యమండలముతో నగలి.

18

హనుమను చూచుట కంతకుముందే
వానర వీరులు వచ్చి సముద్రము
ఉత్తర తీరము నోరల గుంపులు
కూడిరి ముచ్చటలాడుచు కేరుచు.

19

అంతన వినబడె అల్లనల్ల కపి
బలిమి తొడల ఊపుల చప్పుళ్ళను,
ఉప్పెనరేగిన హోరు గాలిలో
కసరి మేఘములు ఘర్షించిన గతి.

20

హనుమకోస మనుదినము ఎదురు చూ
చుచు తరితీపుల స్రుక్కిన వానరు
లెల్ల మహాకపి యెలు గాలించిరి,
పర్జన్యుని నిజగర్జనంబువలె.

21

ఆ కంఠ స్వరమాలకించి, నలు
వైపుల నుండియు వచ్చిరి వానరు
లందఱు, మిత్రుని హనుమను చూడగ,
సంబరమున ముచ్చటలు పిచ్చటిలె.

22

వానర సత్తముడైన జాంబవం
తు డపుడు సంప్రీతుడయి, అనుచరుల
నందఱిని పిలిచి అంతికంబునకు
అనునయింపుచు ప్రియంబుగ నిట్లనె.

23

సర్వవిధంబుల సాఫల్యము కా
వించె కార్యము కపిప్రవరుడు; కా
కున్న హనుమ యిటు లుత్సాహ జయ
ధ్వానంబులు సలుపదు తథ్యంబిది.

24

ఆతని మాటల నవధరించి, కపి
వీరు తొడలరాపిళ్ళ మ్రోతవిని,
ఎల్ల వానరులు ఉల్లాసముతో
అంతలనంతల గంతులు వేసిరి.

25

ఏఱు దాటిపోయి తిరిగి వచ్చు హ
నుమను ముందుగ కనుంగొను వేడ్కను,
ఎగిరి దుమికి రెల్లెడల వానరులు
కొండల కొమ్మలనుండి యథేచ్ఛగ.

26

పట్టరాని సంబర ముప్పొంగగ,
చెట్ల చెంతలకుచేరి అందఱును
పూల కొమ్మల నుయ్యాలలగ ఊచిరి;
చేల చెఱగులూచెడి చందంబున.

27

కొండ గుహాలలో గుబ్బటిలుచు కుం
భించిన వాయువు వెలికెక్కిన గతి;
ఉబ్బి యార్చె కపి యోధాగ్రణి బ్ర
హ్మాండము నిండగ మాఱుమ్రోతలను.

28

గగనము నుండి దిగబడుచున్న ధా
రాధరంబువలె వ్రాలు హనుమ పయి,
చూపు లన్నియును మోపి, తిరంబుగ
ప్రాంజలులై నిలబడిరి వానరులు.

29

బహుళ వేగ సంభ్రమ బలియగు సా
మీరి యపుడు, గిరి మీదను వేఱొక
గిరి వ్రాలిన భంగిని దిగె నిలువున
పచ్చని పాదప పంక్తుల ప్రక్కను.

30

హర్ష పూర్ణుడయి హరివీరుడపుడు
తేటలారు సెలయేటినీట ది
గ్గన దుమికెను, ఱెక్కలు తెగ, మిన్నుల
నుండి దొరలిపడు కొండచందమున.

31-32

తోడులేక బహుదూరపు భూములు
వెతుకపోయిన కపిప్రవరుడు క్ర
మ్మఱి కుశలముగా అరుదెంచె ననుచు
ముదిత సుముఖులయి మూగిరి హరికడ.

33

మహనీయుండగు మారుతసూతి, కు
పాయనములుగా పచ్చిదుంపలును,
తీయని పండ్లును తెచ్చి సమర్పిం
చిరి, పూజించిరి, సేవించి రెలమి.

34

అపుడు మహాకపి, అనిలసుతుడు కుల
గురువుల పెద్దలకొలిచి, జాంబవం
తుని దగ్గరి వందనముచేసి, అం
గద కుమారునకు గౌరవము నెఱపె.

35

పూజ్యుడు హనుమను పూజించిరి పె
ద్దలు, భజియించి రితరవానరులును,
అపు డందఱుపిన అతిసంగ్రహముగ
పలికె హనుమ 'చూచితి సీత' ననుచు.

36

అంతట హనుమ ప్రియంబున, వాలి కు
మారు నంగదకుమారుని కయి కయి
చేరిచి, చని చని కూరుచుండి రి
ద్దరు నొక్క మనోహర వనతలమున.

37

అచ్చట కూడిన అనుచరు లందఱు
ఆకర్ణింపగ అమితాతురులయి,
వినయముగా పలికెను హనుమంతుడు,
'చూచితి సీత' నశోక వనిక నని.

38–39

ఉపవాసంబుల ఒడలు సన్నగిలె,
ఏక వేణిగా ఇమిడిచె కురులను,
మేనుమాసె, రామధ్యానంబున
కనబడె సతి రక్కసుల కాపుగడ.

40

కనబడ్డది జనకజ యను మాటలు
అమృతమువలె ప్రాణములను తేర్పగ,
అచట కూడిన వనచరు లందఱును
సంతోషించిరి స్వాంతము లందున.

41

సింహనాదములు చేసిరి కొందఱు,
కిలకిలార్భటుల కేరిరి కొందఱు,
అఱచిరి గర్జించిరి మఱికొందఱు,
మాఱు కూయుచును మసలిరి కొందఱు.

42

కొందఱు వానరకుంజరు లుత్సా
హముతో తోకల నాడించిరి, మఱి
కొందఱు తమ లాంగూలములను జా
డించి నేల తాడించుచు తనిసిరి.

43

మఱికొందఱు వానరులు శైలముల
నుండి గభీలున ఊగిదూకి, బల
పాటము తీరక భద్రగజమువలె
ఉన్న హనుమ మెయి తిన్నగ ముట్టిరి.

44

సీతను దర్శించితినని మారుతి
విశదముగా చెప్పినపిమ్మట, అం
గదుడు పలికెను సగౌరవముగ హరి
వీరులందఱును వినగా ఇట్టుల.

45

అతి విస్తారంబయిన సముద్రము
దాటి, క్రమ్మఱి యథా విధి వచ్చిన
నీకు సాటి కన్పించరు సాహస
బల కౌశలముల వానరాగ్రణీ !

46

జీవిత దాతవు నీవు మాకు, సి
ద్ధార్థుల మైతిమి హరికుల నాయక !
నీ ప్రసాదమున నేడిక రాముని
చూడ గల్గుదుము సుమి ! మో మోడక.

47–48

ఏ మందుము నీ స్వామి భక్తి, నీ
ధృతి వీర్యంబు; అదృష్టము పండగ
రామ పత్ని నారసితివి, ఇక ఇ
క్ష్వాకుని శోకము చల్లారును హరి !

49

అంతట వానరు, లంగద జాంబవ
దాదు లందఱును, హనుమ సముద్రము
దాటిన కథనంతయు విను వేడ్కను,
కూర్చుండిరి గిరికూట శిలలపయి.

50

లంకను చొచ్చుట, లంకలోన రా
వణు నీక్షించుట, వైదేహిని ద
ర్శించుట వినవలచిన కపులును, దో
సిళ్ళుపట్టి నిలిచిరి హనుమ యెదుట.

51

కీర్తనీయుడు, సుకృతి, యశస్వి, హను
మయును అంగదకుమారుండును బా
హువులు కలుపుకొనియుండ, మహేంద్రము
రాణించె నపూర్వ ప్రాభవమున.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౩౮

1–2

ఆ మహేంద్రమున హనుమత్ప్రముఖులు
ప్రీతి భరితులయి వేడుక నుండగ,
అడిగె జాంబవంతుడు హనుమంతుని,
వినుపింపుము జరిగిన వృత్తాంతము.

3

దేవి నే పగిది తిలకించితి వీ,
వెట్టులున్న దయ్యెడ రఘునందిని,
క్రూరుడు ఖలకర్ముడు దశకంఠుడు
ఎట్లు జనకసుతపట్ల మెలంగును ?

4

వెతకితి వేయే వెలిపొలముల? గు
ర్తించితివెట్లు విదేహ రాజసుత?
నేమియేమి నీతో మాట్లాడెను?
వినిపింపుము జరిగినది మాకిపుడు.

5

గతమునువిని, కాగలది నిశ్చయిం
తుము; రఘురామునితో, మన మచ్చట
ఏమి చెప్పతగు, ఏమి చెప్పరా
దెఱిగింపుము మా కిపుడు మహాకపి !

6

జాంబవంతు డటు శాసింపగ, ఆ
లించి మేను పులకింప హనుమ, తల
వంచి, దేవి క భివాదములు సలిపి,
చెప్పదొడగె నిటు సీతాన్వేషణ.

7

నాడు మీరలందఱును చూచు చుం
డగ మహేంద్రమును దిగవిడిచి యెగసి,
వారిధి దక్షిణతీరము చేరగ
దీక్షించి మహా తీవ్రవేగమున.

8-9

పోవుచుండ పారావారము నడు
మను ఎదురాయెను కనకశిఖరముల
నొప్పారుచు నగమొక్కటి ; మార్గము
కట్టిన, అది విఘ్నముగా తోచెను.

10-11

ఆ కనకాచల మల్లనల్ల నను
దగ్గరుచుండగ, దానిని భేదిం
పగ తగునని నా వాలము నీడిచి
కొట్టితి ముక్కలగుచు పగిలె నదియు.

12

దెబ్బతిని గిరి మదీయ యత్నమును
పోల్చినట్లు నను పుత్రాయంచును
పిలిచెను తీయని యెలుగున నపుడు,
మనసు మెత్తగిలె మరులు కొన్నటుల.

13

అనుజుడ నీ జనకున కని యెఱుగుము,
వాయుదేవునకు ప్రాణసఖుండను,
నా నామము మైనాకుడు; నివసిం
తును గుప్తముగా తోయధి లోపల.

14
కొడుకా ! పూర్వము కొండల కెల్లను
ఱెక్కలుండె, అవి ఉక్కు మిగిలి భూ
తలి కంతయు బాధకముగ నిచ్చలు
ఇచ్చవచ్చిన క్లెగురుచు నుండెను.

15
తిరిగెడి కొండల చరితంబును విని,
పాకశాసనుడు వాని ఱెక్కలను
ఖండించెను ముక్కలుగా తన
వజ్రాయుధమున భయ మెడల భువిని.

16
అప్పుడు నన్ను మహాత్ముడు, పవమా
నుడు, నీ పితృదేవుడు సముద్రమున
పడ నెట్టెను, అప్పటినుండియు నీ
సాగరంబులో దాగియుందు సుత !

17
ఏను రామునకు హితవరినై సా
యము చేయు టవశ్యము విధాయకము.
ఆతడు ధర్మపరాయణుడు, మహేం
ద్ర సమాన పరాక్రముడు కుమారా !

18
మహితాత్ముండగు మైనాకుం డటు
బంధుభావమున భాషింప, అతని
నాశ్వాసించి, ప్రయాణ కారణము
తెలిపి, కార్యవిధేయమతి నయితి.

19
మైనాకుండును మామక గమనము
అనుమతించి పోయె నదృశ్యుండయి.
నగరూపము మానవ దేహంబును
మునిగె కనబడక మున్నీటంబడి.

20-21

అంత నేను వియదంతరాళమున
మిగిలిన త్రోవ గమించు వేగమున
ఏగుచు చూచితి నాగమాతను, సు
రసను మహోవారాశి మధ్యమున.

22

ఆమె యిట్టులనె, హరివృషభమ ! ని
న్నంపిరి దేవత లశనార్థంబుగ,
చిరకాలమునకు దొరికితి విప్పుడు
భక్షింతును నా కుక్షి నిండగా.

23

సురస యట్లు నిష్ఠురముగ పలికిన
విన్నబోయి, దేవికి వినయమున న
మస్కరించి, తగు మాటలాడితిని
చేతులు రెండును శిరసున చేరిచి.

24

దశరథ పుత్రుడు ధర్మచరిత్రుడు,
రాముడు భార్యాభ్రాతలు తోడయి,
వెంబడింపగ ప్రవేశించె మహో
ద్దండ కాననము దండకావనము.

25

రాముని స్వకళత్రంబును సీతను
అపహరించెను దురాత్ముడు రావణు;
డామె దగ్గరకు అరిగెద దూతగ,
రాముని పనుపున రాష్ట్రివాసినీ !

26-27

చేయగ నోపిన సాయము చేయుము,
కాదయేని, జనకజను కనుంగొని,
రఘురాముని దర్శనము చేసి, వ
చ్చెద నమ్మమ్ము చొచ్చెద నీ వక్త్రము.

28

నామాటలు విని నాగమాత, జె
ట్టిదముగ బదులాడెను బింకముగా
నను తప్పించుక చనరా దెవరును,
బ్రహ్మ యిచ్చిన వరము నా కిది కపి !

29

సురస యట్టుల పదరులాడగ, పది
యామడ పొడ వయిదామడ వెడలుపు
నామెయి పెంచితి, నాగమాతయును
అంత కధికముగ ఆస్యము విచ్చెను.

30

నాకంతెను అదనముగ పెరిగి క్రూ
రముగా నోరు తెఱచిన పిశాచిని,
కాంచి, క్షణములో పెంచిన దేహము
కుంచితి నొక అంగుష్ఠమాత్రముగ.

31–32

తడయక వెంటనె దాని నోటిలో
చొచ్చి, తత్క్షణమె, వచ్చితి బయటికి,
నిజరూపముతో నిలిచి సురస యనె,
కార్యంబగును, సుఖముగ పొమ్మ్మ హరీ!

33

శ్రీరామునితో చేర్చుము వైదే
హిని, శీఘ్రము, శోభనమగు, సంతో
షించితి నేను, సుఖించు మార్తజన
భయ నివారకుడవయి మహాకపీ !

34

అప్పుడు భూతములన్నియు మిన్నుల
బాగుబాగనుచు పాటలు పాడెను,
అంత, గభీరమగు అంతరిక్షమున
కెగసితి మఱల, ఖగేంద్రుసికై వడి.

35

కొంత దవ్వరిగినంత, నా గతి గ
మక వేగంబులు మందగించె, నా
నీడను పట్టిన జాడతోప, నలు
గడ పరికించితి, కనబడ దేమియు.

36–37

ఛాయా గ్రాహి నిశాచరి యుదె కా
బోలు నటంచును బుద్ధితోచ, అె
ప్పలు వాల్చక చూపులు నిల్పి, పరీ
క్షించితి నప్పుడు క్రిందిభాగమున.

38

అచట భయంకరమగు రూపముతో
నీళ్ళలోన శయనించి లేచు రా
క్షసి కనబడె, అది కటికి నవ్వుతో
అరచుచు అశుభము లాడసాగె నిటు.

39

ఓ యతికాయుడ! పోయెద వెచటికి?
బహుకాలం బిటు ప్రాశనంబు లే
కున్న నాకు నే డోదనమై నీ
తను మారసంబుల తనుపుము వేగమె.

40

అట్లు బొబ్బలిడు అసురి జరకెనల
కూకొట్టుచు తలయూచితి, తోడ్తో
మేను పెంచితిని మితిమిక్కిలి, సిం
హిక గ్రసింపజాలక శోభితగతి.

41

నన్ను మ్రింగ ఆకొన్న రాక్షసియు
తెఱచుచుండె తీవ్రముగ నోటిని
చూడదాయె నాజాడ తత్క్షణమున,
ఎఱుగదాయె నేపాటిది తంత్రము.

42

తడయక, అపుడప్పుడె పెంచిన నా
యొడలు కుంచి, చొరబడి, లోలో
నాళ్ళు నరంబులు గోళ్ళతో పెరికి,
పళ్ళతో కొఱికి, బయలెక్కితి వడి.

43

గుండె గండిపడ, కోల్పడి ఉసురులు
కాళ్ళుచేతులును కీళ్ళను సళ్ళగ,
ఉప్పుటేటిలో బరిగి త్రెళ్ళను పి
శాచి కొండవలె జలములలోపడి.

44

వినువీధులలో విహరించెడి సుర
సిద్ధ చారణులు చెప్పుకొనిరి, హిం
సికను సింహికను సంహరించె హను
మంతు డంచు; ఆ మాటలు వింటిని.

45–46

దాని చంపి, కర్తవ్య శేషమును
స్మరియింపుచు అంబర వీథింబడి,
పోయిపోయి మునుముందు కంటి, ద
క్షిణ తీరంబున గిరిపై లంకను,

47

సూర్యు డస్తమించుమనుండగ, కా
వలి కాచెడి దైత్యుల్రలకు కనబడక,
వారిధి దక్షిణతీరమున వెలయు
లంక చొచ్చువేళను; లేచి యొకతె.

48

ప్రళయకాల ధారాధరము పగిది,
జ్వాలలవలె సిగజడలు వ్రేలబడ
సాగి మీదబడి చంపవచ్చి నను
కట్టెదుట నిలిచె; అప్పుడు దానిని.

49–55

పిడికిట పొడిచితి సడలగుండె, లం
తట, రక్కసి కాతరయై యిట్లనె,
"నేను లంకను, జయించితివి, నను, జ
యింతు విక అసురసంతతి నంతయు."

।

అంత నేను రేయంతయు లంకను
తిరిగి తిరిగి, మైథిలిని గానక, ద
శాస్యుని సౌధము నందును వెతకి, క
నబడక, శోకమున మునిగి సుడిసితి.

।

చింతతో తపించెడి నాకపు డగ
పడె, బంగారపు ప్రాకారంబులు
చుట్టును కట్టిన సుందర కుసుమో
ద్యాన వనము నందనమును పోలుచు.

।

ఆ ప్రాకారము నట్టె దాటి చూ
చితి, నానా తరులతలు వర్ధిలు అ
శోక వనంబును, సుభగ శింశుపను,
పసిడి యనంటుల పచ్చని మళ్ళను.

56

శింశుప వృక్షము చేరుగడను చూ
చితిని మొదట, సితశతపత్రాక్షిని,
వర్ణవర్ణిని, ఉపవాస కృశాస్యను
నడివయసు నెలంతను సుమంగలిని.

57

ఒంటిచీర మెయినంట చుట్టుకొనె,
ధూసరంబులయి మాసె కేశములు,
శోకతాపమున సోలి కనబడెను
దేవతవలెను పతివ్రత మైథిలి.

58

చుట్టును రాకాసులు, ఊాగలు, వికృ
త స్వరూపిణులు, తర్జింపగ; మద
మాంస రక్తములు మరగిన పెద్దపు
లులలో చిక్కిన యెలలేడివలెన్.

59

ఏకవేణిగా ఎగయచుట్టి తల
కురులను, శోకకుకూలము రగులగ,
దీనదీనముగ మ్లాన వదనయై
భర్తృచింతతో పరితపించు సతి.

60

వట్టి నేలపయి పవళింపగ తను
కాంతి తఱిగె హేమంత నళినివలె,
రాక్షస బంధవిమోక్షము గానక
నిశ్చయించె మరణింప మనస్విని.

61

కన్నె లేడి వాల్గన్నులతో, అటు
నిటును చూచుచున్నటు లగపడె సతి
నేనును రఘుపత్నిని చూచుచు, శిం
శుపశాఖల కూర్చుంటిని కదలక.

62

ఆ తరుణంబున హాలహాల మంచును
కాసెల యందెల గాజుల చప్పుడు
రావణు నంతిపురంబుల నుండి వి
నంబడె గంభీరంబుగ ఎడనెడ.

63

అలజడితో నే నప్పుడు నాదు స్వ
రూపము మార్చి, తరుప్రకాండ శా
ఖలలో నొదిగితి: గగనము లోపల
పక్షిచందమున నిక్షేపంబుగ.

64

రావణేశ్వరుడు రాణివాసముబు
సహచరింప, ప్రాసాదము వెలువడి,
చేరగ వచ్చెను సీత ప్రవాసం
బున్న అశోక వనోపాంతమునకు.

65

రావణాసురుని రాకడ గని, త
త్తరము తోడ సీతామతల్లికయు,
కలవరపడి, మోకాళ్ళతో తొడలు,
కరములతో వక్షమును మూసికొని.

66

గాఢ భయంబున గడగడ లాడుచు,
కంపింపగ, అంగంబు లనదవలె
రక్షణంబు కనరాక, పొగిలి వెడ
వెడ చూచు తపస్విని రఘునందిని.

67

చూచి రావణాసురుడు, దూరమున
నిల్చి శిరంబును వాల్చి, పలికె నిటు,
భామినిరో! నను బహుమానింపుము,
ప్రేయసివై యెడబాయని ప్రీతిని.

68

ఇంతదాక సహియించితి, నన్నభి
మానింపని ఉన్మాద దర్పమును,
నీకు గడువు రెణ్ణెల లిచ్చితి, అది
దాటిన నీ రక్తము రుచిచూతును.

69

ఆ దురాత్ము ధూర్తాలాపంబులు
వీనుల శూలములై నొప్పింపగ,
కోపము రేగి విఘూర్ణమాన మా
నసయై, కసరి జనకజ యిట్లాడెను.

70–71
రాక్షసాధమ ! పరంతపు డగు శ్రీ
రాముని భార్యను, రఘుకుల వీరుల
యింటి కోడలి, ననిష్టము లాడితి,
చీలిపడదు నీ నాలుక యేలనో !

72
ఇదియొక వీరమె ? హీనుడ ! నా వ
ల్లభుడు లేనివేళ కనిపెట్టి, వం
చించి, అపహరించి, నను తెచ్చితివి
అతని కంట బడవయి తప్పుడచ్చుట.

73
ఎటు సరివచ్చెదవీవు రామున క
జేయుడు, సత్యపరాయణుడు, రణ
శ్లాఘనీయు, డకలంకుం, డాతని
దాస్యంబునకును తగవు, తథ్యమిది.

74
పరుషముగానటు, వైదేహి ఉదా
సీనములాడ, దశాననుం, డలిగి
మండుచులేచె ప్రచండకోపమున;
కాటిలోని యింగాలము భంగిని.

75
కనకన మండెడి కనులు రెండు గిర
గిర త్రిప్పుచు, పిడికిలి బిగించి, చే
యెత్తెను వైదేహిని హింసింపగ,
అయ్యోయంచును కుయ్యిడి రబలలు.

76
దశకంఠుని నిజదార దయావతి,
మందోదరి, అపు డంతఃపురిలోపల
నుండి వచ్చి, దైత్యుని వారించెను.
చేయి పట్టుకొని చేయరా దనుచు.

77

మదనాతురయగు మండోదరి, తీ
యని యెలుగుల నాతని లాలించెను,
ఇంద్ర సమానుడ, వెందుకు నీ కీ
మానవ సతి సురమానిను లుండగ.

78

సురకన్యలు, యక్షులకన్యలు, గం
ధర్వ కన్యలును తగిలి మిగుల కా
మింతురు నీ చెలిమిని, క్రీడింపుము;
ఎందుకు నీ కీ యెబ్బెరాసి ప్రభు !

79

అనుచు దానవాంగన లందఱు, బల
వంతముగా రావణుని పట్టుకొని
ఇచ్చకము లభినయింపుచు, తోడ్కొ
కొనిపోయిరి రాజనివాసమునకు.

80

రావణేశ్వరుడు రాణివాసమును
వెడలిపోవ, అతివికృత ముఖులు రా
వణుని దూతికలు వచ్చి జానకిని
బాధించిరి దుర్భాషల దురుసుగ.

81

వారి భాషలను వైదేహి తృణ
ప్రాయంబులుగా పాటింపమిచే
రాకాసుల తర్జన భర్జనములు
అడవి రోదనంబయి కడముట్టెను.

82

బెదరించియు, వెఱపించియు, భూ
షించియు దూషించియు, హతాశలై
విసిగిపోయి, రాక్షస రక్షికలును
చెప్పిరి ప్రభువుకు సీత నిశ్చితము.

83

యత్నము లన్నియు వ్యర్థము కాగా
మానివేసి, ప్రాల్మాలి, మైథిలిని
విడిచిపెట్టి, ఎక్కడివారక్కడ,
పడి నిదురించిరి బడలి యందఱును,

84

సీతయు భర్తను చింతించుచు; గా
సిల్లి వేసటల, చెప్పరాని శో
కముతో ఎడతెగని కడగండ్లకు
విల విల లాడుచు వలవల యేడ్చెను.

85

అపుడు త్రిజటయను ఆసురి యొకతె లే
చి పలికె నిట్టుల 'సీతను తినకుడు,
నను తిను డాయమ నశియింప డిపుడు,
జనకు కూతురు, దశరథుని కోడలు.

86

నే డొక కలగంటిని దారుణముగ,
నిక్కపొడిచె మెయినిండ రోమములు,
నాశమాయె దానవకులంబు, జయ
మాయె జానకీ నాయకున కిచట.

87

రాముచే పడక బ్రదుకుటకు మనము
సీత నిపుడు యాచించుటవశ్యం
బనితోచును నా, కామె రాక్షస
స్త్రీ కులమును రక్షింపగ జాలును.

88

దుఃఖసముద్రమున దొప్పదోగు ప
సాధ్వి విషయముగ స్వప్నంబాయెనో,
ఆయమ కష్టము లంతము నొందెను.
అతిశయముగ సౌఖ్యము సిద్ధించును."

89-90

భర్త దిగ్జయ శుభశ్రుతి విని ప్రీ
మతియై బాల సమాశ్వసించె రా
క్షసకాంతలనిటు, శరణమిత్తు నీ
కల నిజమగునేని తథ్యముగ.

91

అతిదారుణ దురతిని కృశించి త
పించుచున్న దేవినికని, అప్పుడె
విక్రమింప తలపెట్టితి కనుకని,
కాని, మది సమాధానమికొనదు.

92

మైథిలితో నే మాటలాడుటకు,
ఉచితమైన వెరవూహించి, తుదకు
నిశ్చయించుకొంటిని, ఇక్ష్వాకుల
ప్రస్తావనతో ప్రారంభింపగ.

93

రాజఋషులకును పూజనీయమగు
ఇనకుల కీర్తనమును మనసారగ
వినుచు పల్కరించెను నను జానకి,
కన్నీళ్ళు కటాక్షములను కప్పగ.

94

వానరోత్తమ ! ఎవండవు ? నీ వె
వ్వారు పంపించగ వచ్చితి విచటికి ?
రామునిపై నీ ప్రేమకు కారణ
మెట్టిదో, నాదియెల్ల వచింపుము.

95

అట్టు లార్య నన్నడిగినంత చె
ప్పితి నిట్టుల దేవీ ! నీ విభుడగు
రాఘవునకు మిత్రము కలం డొకడు,
భీమపరాక్రమ విశ్రుతు డాతడు.

96

సుగ్రీవుండను శుభనామాంకుడు,
బహుబలశాలి, ప్లవంగ పాలకుడు,
ఆతని భృత్యుడ హనుమంతుడ, నే
నొక్కడ వచ్చితి నిక్కడి కిప్పుడు.

97

సదమల కర్మ యశస్వి, శూరు, దభ
యవ్రతి, నీపతి, అంపె నన్నిటకు,
ఆనవాలుగ నిజాంగుళీయకము
ఇచ్చినాడు నీకిమ్మని దేవీ !

98

ఏమిచేయవలె నికమీదట, నా
కానతిమ్మ, తడయక తపస్వినీ!
పుణ్యామువలె కొనిపోయి నిన్ను శ్రీ
రామలక్ష్మణుల ప్రక్కన దించెద.

99

నా చెప్పినదంతయు విని, విషయము
ఆకళించి యిట్లనెను మనస్విని,
'రావణ సంహారంబుచేసి రఘు
కుల వీరుడు నను కొని పోవలయును.'

100

సీత వచనములు స్వీకరించి, తల
వంచి, వందనార్పణముసలిపి, ఏ
దయిన రాఘవున కాహ్లాదకమగు
ఇష్టలాంఛనము ఇమ్మనికోరితి.

101

అన విని భగవతి ఆదరం బొలయ,
ఇచ్చెద నీ కొక యిష్టరత్నమును,
దానిని గని బహుమానించును నిను
ప్రాణవల్లభుడు పరమమోదమున.

102

అనుచు, జనకనందన, అద్భుతమగు
చూడామణి నచ్చుగ నా కిచ్చుచు,
ఉపదేశించెను యుక్తమయిన సం
దేశము పరమోద్విగ్న చిత్తయై.

103

వెంటనె నేనును వేడుక మీఱగ,
రాజపుత్రికి పరమపవిత్రకు, ప్ర
దక్షిణాభివాదములు నెఱపి, ప్ర
యాణత్వర తారాడుచు నుండగ.

104

ఇంచుకంత యోచించి, స్తిమితపడి,
మఱల, నిట్లనియె మైథిలి నాతో,
చెప్పవయ్య కపిశేఖర ! రఘువీ
రునితో నా యాతనలు సమస్తము.

105

నీ చెప్పినది వినిన వెంటనె సు
గ్రీవునితో, కిష్కింధా బల వా
రముతో లంకకు రామలక్ష్మణులు
లగ్గపట్టు జాడను వర్తింపుము.

106

ఇది శీఘ్రము ఘటియింపనిచో, రా
ముడు ననుకనజాలడు, మరణింతును,
నే ననాథవలె, నెలలు రెండె మిగి
లెను రాక్షసుడిచ్చిన గడువున నిక.

107

జాలి వెల్లిగొను జానకి మాటలు
వినినంతనె భగ్గనెనా క్రోధము;
తలపోసితి నావల కావలసిన
కార్య శేషమును గట్టి మనసుతో.

108
పెరిగెను కాయము పెద్ద పర్వతం
బట్టుల ఉన్నతమగుచు, రణావే
శా వేశము మిట్టాడ, అశోకో
ద్యాన ధ్వంసము నారంభించితి.

109
తోటలో తరులు తునిగి విఱిగిపడ,
పతు లెగిరిపోవగ, మృగములు చె
ల్లాచెదరై తరలన్, కలవరమున
అసురులు మేల్కొని రాకస్మికముగ.

110
వనములోన పలువాడలనుండి ని
శాచరాంగనలు చాళ్ళుచాళ్ళుగా
వచ్చి నన్నుగని, వడివడి పరుగిడి
రెఱిగింపగ అసురేంద్రున కందఱు.

111
రజనీచరకుల రాజేశ్వర ! నీ
బలపరాక్రమంబులు తెలియని వా
నరు డొక్కడు, కండబలమున అశో
కవనమును కలచి కా డొనరించెను.

112
సుందరమయిన అశోకవనంబును
చెఱచి పాడుచేసిన దుర్బుద్ధిని
చంపివేయ నాజ్ఞాపింపుము, హాత
మైపోవును, నీ కప్రియుడాతడు.

113
ఆ మాటలువిని అసురపాలకుడు
దుర్జయులగు యోధులు కింకరులను
వచ్చిన వారిని చెచ్చెర పంపెను,
బలములతో నను పట్టి కట్టుటకు.

114

బల్లెము, లీశెలు, బరిసెలు, గుదియలు
బిరబిర త్రిప్పుచు దురుసుగ వచ్చిన
ఎనుబదివేలను ఇనుపదూలమున
చితుకకొట్టి విఛ్ఛిన్నము చేసితి.

115

వారిలోన చావక బ్రదికిన కొం
డఱు పరుగిడి దానవేంద్రునకు
చాలవఱకు మనసైన్యము హతమై
పోయెనంచు పురపుర ఎఱిగించిరి.

116

అపుడు నాకు మనసయిన ఒక సౌ
ధము తలమీదికి దుమికితి, నచ్చట
ఉన్న నూరుగురు యోధుల పైబడి,
స్తంభమును పెరికి చావగొట్టితిని.

117

లంకానగరి కలంకారమయిన
ప్రాసాదంబును పడద్రోయ, కినిసి
దుర్జయులగు యోధులతో పంపెను,
జంబుమాలి, నతి సాహసశాలిని.

118–119

రణకోవిదుడగు రాక్షసవీరుడు
ఉద్దండమయిన పెద్దదండుతో
కూలి నేలబడకొట్టితి, దూలము
త్రిప్పిత్రిప్పి బాదితి నలినలిగా.

120

అది విని రావణు డాగ్రహోగ్రుడయి,
మంత్రిసుతుల దుర్మద బలధుర్యుల,
నంపెను, వారల నందఱిని ఇనుప
దూలము తోడనె తునకలు చేసితి.

121–123

మంత్రి కుమారుల మారణం బెటిగి
అగ్రసైన్య నాయకుల నైదుగుర
పంపెను, వారిని చంపితి, పిమ్మట
అక్షకుమారుని అంపె రావణుడు.

124

మందోదరి ప్రియనందను, డక్షకు
మారుడు, సమరవిశారదు, డాకా
శమున కెగసిరాన్ సంరంభంబున,
అతని రెండుకా ళ్ళంటపట్టితిని.

125

అట్టె కూలిపడె అక్షకుమారుడు,
విఱుగపొడిచి పొడిపిండి చేసితిని;
పిదప పిలిచి పంపించె, రెండవ కు
మారు, నింద్రజితు శూరాగ్రేసరు.

126–127

యుద్ధసమర్థుడు, యోధు డింద్రజితు,
నాతని సైన్యము నడచి సడించితి,
మొగములు త్రిప్పిన పగఱ దండుగని
పరమహర్షమున పొరలె నా మనసు.

128

మహితశస్త్ర ధూర్వహు, డరిందముడు,
ఇంద్రజిత్తనుచు ఎడదనమ్మి పం
పించె తండ్రి, అఖిల పరాక్రమ
దుస్సహులగు యోధుల యూధముతో.

129

శస్త్రాస్త్ర రహస్య విశారదుడును
సైపలేక నా చావుదెబ్బలకు,
దురముల యెత్తుల నెఱిగిన ఆతడు
బ్రహ్మాస్త్రంబున బంధించెను తుది.

130-131

అంతట రాక్షసు లంటగట్టి నను
ఈడుచుకొనిపోయిరి రావణు కడ,
కడిగి రచట లంకాగమనమునకు,
రణకర్మకు కారణము లేమనుచు.

132

అది యంతయు సీతార్థం బంటిని,
నీ సౌధములోనికి చొరబడితిని
నీ సమక్షమున నే తెచ్చిన సం
దేశంబును విన్పించుట కంటిని.

133

మారుతదేవున కౌరసపుత్రుడ,
వానరుడను, హనుమాను డంద్రు నను,
రాముని దూతను, రాక్షసేంద్ర! యెఱు
గుము సుగ్రీవు సఖుడనుగా ప్రభూ!

134

రామదౌత్యము నెఱపగ వచ్చితిని;
అడిగెను సుగ్రీవుడు నీ క్షేమము,
నీకయి పంపెను నిత్యధర్మకా
మార్థ సమాహిత మగు సందేశము.

135

బహుపాదపముల పచ్చలారు నా
ఋశ్యమూక గిరి నేనుండగ, రణ
విక్రాంతుడు రఘువీరుడు కలిసెను,
అది మొదలుగ స్నేహము వర్ధిల్లెను.

136

కానలోన రాక్షసు డెవ్వడో తన
భార్యను పట్టి అపహరించె ననుచు
చెప్పి, నన్నును యాచించెను సాయము,
సీతను అన్వేషించు కార్యమున.

137

అడిగితి నే నప్పుడు, వాలిని వధి
యించి నా ప్రభువు నిష్టపత్నితో
కలుపుమనుచు రాఘవుని, అందులకు
ధీరు డతడు ప్రతిజ్ఞ చేసె నట.

138

వాలివృత్తమును వారికిచెప్పి వ
ధించు విషయము ప్రతిజ్ఞ చేయుమని
అడిగితి నేనప్పుడు; తులతూగగ
ఉపకార ప్రత్యుపకారంబులు.

139

రాజ్యము పోయిన ప్రభువు వానరుడు,
భార్య కోల్పడిన ఆర్యుడు నృపసుతు,
డగ్ని సాక్షిగా అన్యోన్య స్నే
హ ప్రమాణముల నాడి రాగిలిరి.

140

అంతరాఘవుడు, అరుదుగ వాలిని
ఒక్క బాణమున చక్కడంచి, సు
గ్రీవుని అభిషేకించె, సర్వ వా
నరకుల చక్రమున మహారాజుగ.

141

అట్టి మహా ధర్మాత్ముడు రామున
కన్ని విధముల సహాయము చేయగ,
ఒట్టు తింటిమి ప్రభూ! నన్నంపె, న
తండు దూతగా ధర్మ పద్ధతిని.

142

సుగ్రీవాజ్ఞల శూరులు వీరులు
దండు విడిసి నీదానవ సేనల
చెండకమునుపే, సీతాదేవిని
రామునకు సమర్పణ కావింపుము.

143
వానరుల ప్రతాప ప్రభావములు
ఎవరికి తెలియవు ! ఇంద్రలోకమున
కామతింపగా అరుగుచుండు, రది
నీతో చెప్పు మనెను సుగ్రీవుడు.

144
రాక్షసుడును రౌద్రముగ క్రుద్ధుడై
కనుచూపుల నను కాల్చుచు, వీనిని
చంపు డనుచు ఆజ్ఞాపించెను క్రూ
రముగ నా ప్రభావము లవ మెఱుగక.

145
అపుడు విభీషణు డను మహామహుడు,
రాజసోదరుడు, రాక్షసేశ్వరుని
వైపు తిరిగి నిర్భయముగ పలికెను,
న్యాయబుద్ధి నట నా పక్షంబున.

146
తగదీ పూనికి త్యజియింపుము రా
క్షసశార్దూలమ ! కాని కృత్య మిది,
రాజనీతి శాస్త్రమ్ము లొప్పని అ
నిష్టమార్గ మీ వేల త్రొక్కె దిటు ?

147
దూతల వధ మెందును కనబడదు
రాజనీతిశాస్త్రములలోన; దూ
తలవలనన్ విహిత మగు యథార్థము
తెలియవలయు సందిగ్ధ తరుణముల.

148
అతుల విక్రముడ వవధరింపు, మే
యపరాధములు సలిపినను దూతల
చంపకూడదను శాస్త్రములు, విరూ
పులను చేసి పంపుటె విధ్యుక్తము.

149-150

అట్లు విభీషణు డఖిల రాజకుల
సంప్రదాయములు చాటిన, రావణు
డియ్యకొన్నటుల 'ఈతని వాలము
దహియింపుండ'ని తడయక పలికెను.

151

ఆ మాటలు విని అసురులు చుట్టిరి
నారలు చీరెలు నా వాలమునకు,
బలముకొలది దుడ్డుల ధట్టించిరి,
పట్టి ఇంగలము పెట్టిరి చివరకు.

152

పిడిబందంబుల బిగియగట్టినను,
ముళ్ళుపెట్టి త్రిప్పుళ్ళు పెనచినను,
నొప్పిపుట్ట లే; దెప్పటివలె, లం
కను పట్టపగలు కనుగొనుచుంటిని.

153

కాళ్ళను చేతులు కదియగట్టి, వా
లమ్మున కీలలు చిమ్మిరేగ, న
న్నూరేగించుచు చేరిరి నగర
ద్వారము చెంతకు పౌరులుచూడగ.

154-155

అక్కడ అంగము లక్కళించితిని,
బంధములూడెను, ద్వారపు దూలము
దూసి, రక్కసుల తూలగొట్టితి, చి
వాలున భవనాట్టాలక మెక్కితి.

156

మంటలు చిమ్మెడి మామకవాలము
చాచి, త్రిప్పి, పురశాలాట్టాలక
గోపురములను తగులపెట్టితిని, యు
గాంతానలము ప్రజాళి నేర్పుగతి.

157–159

లంక నపుడు నలువంకలు చూచితి,
కాలని తావులు కనబడ వాయెను,
సీతయు కాలి నశించి యుండునని
శోకము సైపగ లేక తపించితి.

160

అప్పుడు వింటిని అమృతాక్షరములు
చారణులాడెడి సంభాషణములు;
కాలిపోయె లంకాపురి సాంతము
కాలలేదు జనకజ విచిత్రమని.

161

సిద్ధ చారణులు చెప్పుకొనెడి శుభ
సూక్తులు విని, మునుచూచిన శకు
నములు తలచి, జానకి నష్టము కా
లేదని యూరడిలితి మానసమున.

162

మండుచు నున్నది మామకవాలము,
కాకసుంత తాకదు నా మేనికి,
కమ్మని వాసన చిమ్మె తెమ్మెరలు,
తహతహలాడక తనివోయెను హృది.

163

ఇష్టార్థములుగ ఎడనెడ తోచిన
దృష్టాంతములు స్మరింపుచు, ఫలకా
రణములైన ఋషిగణముల వాక్కులు
సంభావింపుచు సంతోషించితి.

164

క్రమ్మఱ సీతను కన్నులార గని,
ఆమె యనుజ్ఞను ఆశీస్సులు గొని,
మిమ్ముల చూచు తమిన్ ప్రయాణమై
ఎగసి, అరిష్ట గిరీంద్రము నెక్కితి.

165

సూర్యచంద్రులు, ఋషులు, సిద్ధులు, గం
ధర్వులు, మరుతులు, తారాడెడి తా
రాపథమున ధారాళముగా వ
చ్చితి మీవద్దకు కృతకృత్యుడనై.

166

రాముని గంభీర ప్రభావమున,
మీ స్నేహము బలిమిని, సుగ్రీవుని
పుణ్యంబున, నే పోయిన కార్యము
నిర్వహించితిని నిర్విఘ్నంబుగ.

167

అచట నేను చేయవలసినది, చే
సిన దంతయు చెప్పితి, నిపు, డే
చేయక మిగిలిన చెయిదము నంతయు
సాంతము చేయ సమర్థులు మీరలు.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౫౯

1

అట్లు, హనుమ తన యాతా యాత
ప్రస్తావన పూర్ణము చేసి, మఱల
చెప్ప నుత్సహించెను తన చిత్తము
లోన మెదలు ఆలోచన లిట్టుల.

2

రాముని ఇష్టార్థము సిద్ధించును,
శమియించు కపి స్వామి సంభ్రమము,
సీతను కని, ఆ మాత శీల శు
ద్ధోన్నతి కేను ప్రపన్నుడ నైతిని.

3

కావగలడు లోకములు తపస్సున,
కాల్చి వేయగా గలడు క్రోధమున,
సర్వోన్నతుడు దశముఖు, డందుచే
జానకి నంటియు చావక బ్రతికెను.

4

మండుచున్న హోమశిఖా జ్వాలను
అంటవచ్చు నొక్కపుడు; కాని క్రో
ధమున నున్న సీతను చేతులతో
ముట్టి బ్రదుకుట, అభూత మనూహ్యము.

5-6

ఆర్యులు, జాంబవదాదుల కిది విని
పించి, అనుమతిని వీరుల గొనిపో
వచ్చితి, సీతను తెచ్చి, రాఘవుని
దర్శించుట యుక్తము, న్యాయము నదె.

7

రాకాసుల బలుమూకలతో, లం
కాసహితము దశకంఠుని హతమా
ర్పగ చాలుదును దురమున నే నొకడ,
ఇదివఱకే దహియించితి నగరము.

8

ఏమి కావలయు నిక, మీరందఱు
అస్త్రశస్త్రవిదు, లసహాయ సమర
శూరకులవతంసులు, జయకాములు,
నాకు తోడుగా నడచిన లంకకు.

9

నే నొకడనె, రజనీచరనాథుని,
రావణుని, సపుత్ర సహోదర సఖ
సాంగబలంబుగ చావగొట్టగల,
నాహవముఖ దోహల సాహసమున.

10

బ్రాహ్మమొ, ఐంద్రమొ, రౌద్రమొ, వారుణ
వాయవ్యాస్త్రములో, యుద్ధంబున,
ప్రతిరోధింపగ రాని యే మహా
దివ్యాస్త్రములో, యెదిర్చి యేర్చినను.

11

వాని నన్నిటిని వమ్ముచేసి, రా
త్రించరబలము మథించి వధింతును,
అనుమతింపు, డసహాయ సాహసము
తోడ విక్రమింతును రావణువధ.

12

రణమున నేను తెఅపిలేని పిడుగు
రాళ్ళ వాన విసరన్ నలుగడలను,
అమృతాంధసులే హతమైపోదురు,
ఈ పిశితాశను లేమి చెప్ప నిక.

13

చెలియలికట్టను చెఅపవచ్చు సా
గరము, మందరము కదలవచ్చు పా
దులను, జాంబవంతుని పాదము కద
పగ చాలవు, రిపువాహిని వఱదలు.

14

వీరుడు వాలి కుమారు డంగదుడు
ఒక్కడు చాలును రక్కసి మూకను,
వారి తాతలను వరుసపెట్టి తెగ
టార్ప, నిర్భయ నిరంకుశముగ నట.

15

పవనుడు, నీలుడు, ఖండనంబునకు
తొడిబడి దూకిన తొడల రాపిడికి,
మందరాచలము మడగి బ్రద్దలగు
ఏమి చెప్ప నిక ఈ లంకగతిని.

16

ద్వివిద మైందవులు తీంట్రించిన, దే
వాసురు, లురగులు యక్షులు దక్షులు
గంధర్వులును వికావిక లగుదురు,
ఎదిరి నిలువగల రెవ్వరు వీరిని.

17

ఈ మహాభాగు, లిరువు రశ్వినీ
దేవతల సుతులు, దీటువచ్చువా
రెవ్వరు వీరికి; చివ్వల లోపల
మోకరింపగల పోటరులు కలరె ?

18

బ్రహ్మయిచ్చిన వరంబుల మహిమను,
అమృతము త్రాగిన అక్షయ శక్తిని,
వెలుగు చుందురీ వీరు లిద్దరును,
హరి వంశంబున అగ్రగణ్యులయి.

19

అశ్విని దేవత లం దాదరమున,
ఇచ్చె మునుపె పరమేష్ఠి వరములను.
వీరి నిద్దరిని పోరుల నెవరును,
ఏ శరములును వధింప నోపవని.

20

బ్రహ్మదేవుని వరప్రభావమున,
మత్తిల్లిన ఈ మగ లిద్దరు, మును
దేవ గణము నతిక్రమించి, మన
సారగ త్రాగిరి వారి అమృతమును.

21

ఉండ నిండు కపియోధుల, వీరి
ద్దరును చాలు మాతంగ తురంగ ర
థాంగంబులతో అసురుల లంకను
సర్వనాశనము సలిపి జయముగొన.

22

ఇదివఱకే దనుజేశుని లంకను
ధ్వంసముచేసి, భవనములు కాల్చితి,
రాజమార్గముల రచ్చల నెల్లెడ
వినిపించితి నా పేరుమ్రోయగా.

23–24

అనఘాత్ములకు, మహాబలిష్ఠులకు
జయము, రామలక్ష్మణ సుగ్రీవుల;
కనిలదేవునకు ఔరసపుత్రుడ,
హనుమాఖ్యాతుడ నంచు చాటితిని.

25

దుష్టుడు దురితాత్ముడు రావణుని అ
శోకవనంబున శోకముతో క్రో
ఖిలుచున్నది మైథిలి, నిశాచరులు
చెఱలుపెట్టగా శింశుపనీడను.

26

క్రూరరాక్షసుల గుట్టల నడుమను
శోకతాపముల సొగసి పొగలుచు
న్నది జానకి; వానమొగులు కప్పిన
శుభ్ర చంద్రకళ చొప్పున చెన్నఱి.

27

బలదర్పితు రావణుని మాటయిన
తలపెట్టదు సీతాసువాసిని, ప
రమ పతివ్రతారత్నము, రామ
ధ్యాన పరాయణ తన్మయమతియై.

28

మంగళముఖియగు మైథిలి, రాముని
ఎడం దనన్యబద్ధానురాగయై,
భావించును సర్వావస్థలలో,
దేవేంద్రు శచీదేవి చందమున.

29

ఏకవస్త్రము మెయిన్ బిగచుట్టి, దు
రంత తపన మాయగ లావణ్యము,
కసుగందిన అంగములతోడ, వై
దేహి పతినె చింతించు రేల్బవలు.

30

వికృతరూపలగు పిశితాశినులు, ది
వారాత్రంబులు భయపెట్టుచు బా
ధింప, దురపిలుచు దీనయైన సీ
తను చూచితి ప్రమదావనమందున.

31

గంపెడు కురు లెగగట్టి యొంటిజడ,
నేలమీద శయనింపుచు, పతిపయి
ప్రాణములుంచి, వివర్ణయై వనరు,
వడగం డ్లడచిన పద్మిని పగిదిని.

32

రావణాసురుని ఱాతిగుండె ద్రవి
యింప దనుచు మరణింప నిశ్చయిం
చిన మృగశాబాక్షికి, నేనెటులో
విశ్వాసము కల్పింప తలచితిని.

33

మాటల వరుసన మైథిలితో యా
వద్వృత్తాంతము వల్లె చెప్పితిని,
సంతోషించెను జానకి, రాఘవ
సుగ్రీవుల ప్రస్తుతమైత్రిని విని.

34

సముదాచారము, సాధ్వీవృత్తము,
విభుని యందె నిలిపి తపస్విని; రా
వణు బలిగొన దాయెను రఘురాముని
వల్లనె రావణు వధ కావలెనని.

35

సహజసిద్ధముగ సన్నది జానకి,
దుఃఖవేదనల తూలి మఱింత కృ
శించి, కమలి, కనిపించెను; పాడ్యమి
నాటి చదువు చందమున మందగిలి.

36

శోకసముద్రమున సుడిగుండంబుల
చిక్కి క్షోభిలెడి సీత కష్టకథ
చెప్పితి సర్వము, చేయతగిన, దిక
చింతించి వివేచింపుడు మీరలు.



# సుందరకాండ

## సర్గ ౬౦

1

హనుమ కథనమును విని వాలిసుతుడు
అంగదు డిట్లనె, ఆర్యాను లక్షిం
చియు తోడ్కొనిరాక, యిపుడూరకిటు
లిక్ష్వాకుల కడకేగుట యుక్తమె.

2

సీతనుకని భాషించితి, మామెను
కొని తేలేదనుచు నివేదించుట,
పై తెయుక్తమని నాకుతోచెడిని,
ఆలోచింపుడు ఖ్యాతవిక్రములు.

3

సోదర వానరశూరులార! మన
కీడు కానరా రెవ్వ రెందును, ప్ర
తాప పరాక్రమ దర్పధైర్యముల
దైత్య దేవకుల ధామములందును.

4

అదిగా కట, హతమార్చి వచ్చె మన
హనుమ దైత్యనాయకుల నెందఱినో,
ఇకనేమున్నది యేగి జానకిని
కొనివత్తము సంకోచము లెందుకు?

5–6

మన మటుపోయి, సమస్త రాక్షస బ
లములను నిర్మూలముచేసి, మఱలి
వచ్చి, చూడబోవచ్చు రామ ల
క్ష్మణ సుగ్రీవుల కడకు సీతతో.

7

కృతనిశ్చయుడై యిట్టు లంగదుడు
పలుకగ విని, హరివంశ వర్ధనుడు,
జాంబవంతు డుచితంబుగ అర్థా
నర్థ వివేచన నరసి పల్కె నిటు.

8–9

ప్రాజ్ఞుడ ! ఇది మన పనికా, దంపిరి
దక్షిణ సీమలు తడవగ నంతియె;
సీతను తెమ్మని చెప్పలేదు, కపి
రాజుగాని రఘురాముడే నపుడు.

10

ఎటులో పోయి జయించి రాక్షసుల,
సీతను కొనివచ్చిన, రామున కది
ఇష్టార్థము కాదేని; క్లిష్టమగు,
స్వాభిజాత్యరక్షకు లిక్ష్వాకులు.

11

అదియటుండ, మన యందఱి ముందు ప్ర
తిజ్ఞచేసె రఘుతిలకుడు సీతా
విజయంబును కావించెద స్వయముగ
ననుచు; కల్ల చేయునె తన శపథము.

12

వ్యర్థ కార్య నిర్వాహం బగునిది,
తుష్టియు కలుగ దనిష్ట కార్యమున,
ఊరక యేటికి వీర విజృంభణ ?
పరిశీలింపుడు వానరోత్తములు.

13

కావున శీఘ్రముగా పోదము, మన
ప్రభువర్యునితో రామలక్ష్మణులు
ఉన్నచోటి, కథలోదంతమును స
విస్తరంబుగ నివేదింత మచట.

14

రాజపుత్ర! నీ యోజన మిప్పుడు,
సముచితముగ తోచదు నాబుద్ధికి,
రాము డేప్రకారము నియమించునో
అట్లు నడచి విజయము సాధింపుము.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౧

1

అంతట అంగద హనుమత్ప్రముఖులు
జాంబవంతుని ప్రసంగ వైఖరికి
ప్రీతులగుచు, కపివీరులతోడ, మ
హేంద్రగిరి విడిచి యెగసిరి మింటికి.

2–3

హనుమ దారితీయ, మహాకాయులు
కపికుల వీరు లెగసిపో నగపడె,
మదపు టేనుగుల మందలు మందర
మేరు గిరులను భ్రమించుచున్నటుల.

4

పంచభూతముల ప్రస్తుతులందిన
హనుమ, ననఘుని, మహాజవసత్త్వుని,
వానరులందఱు వాచినట్లు చూ
పులతో మోసిరి పూజ్యభావమున.

5–6

రామకార్య నిర్వాహకుల మనుచు
ఖ్యాతి కెక్కు కాంక్షలను వానరులు,
పగతీర్చెదమని ఎగబడిరందఱు,
యుద్ధమునకు సన్నద్ధులై కెరలి.

7

అట్టుల ఉత్సాహముతో వనచరు
లెగురుచు దుముకుచు ఎగదిగ పరుగిడి,
చేరిరి పచ్చని చెట్లతోడ నం
దనము వంటి సుందర మధువనమును.

8

మధువనమను నామమున ప్రసిద్ధము,
పంచభూతములు బాధింపవు, సు
గ్రీవుడె సంరక్షించును ప్రీతిని,
ఎల్ల ప్రాణులకు ఇష్టధామ మది.

9

వానరేశ్వరుని మేనమామ, దధి
ముఖుడను హరికుల ముఖ్యుడు దానిని,
కంటికి రెప్పగ కాపాడును, వన
పాలకు లెపుడును పరిచరింపగా.

10

పోవుచున్న కపిపుంగవు లందఱు
కాంచిరి మనసుల కాంక్షలు కదలగ,
ఫలపుష్పంబులు పరిమళింపగా,
తేనె లూఱు కపిదేవుని తోటను.

11

జిడ్డు తేనియలు చిప్పిల్లెడి మధు
వనమును దరిసిన వానరవీరులు,
నోరూఱంగ, కుమారు వేడుకొని
రింత మధువు పోయింపుము మాకని.

12-13

యువరా జంగదు డుల్లాసముతో
తల యూచెను; కిలకిలలాడుచు కపు
లాతని మెచ్చుచు, చేతులు తట్టుచు,
పాటలు పాడుచు పాతర లాడిరి.

14

పాడిరి కొందఱు, వేడిరి కొందఱు,
ఆడిరి కొందఱు హాస్యము లాడుచు,
గిరగిర తిరిగిరి, బిరబిర పఱచిరి,
ఈలలు వేయుచు ఎగిరిరి కొందఱు.

15–17

ఒకని హస్తముల నొక్కఁడు పట్టుకొను,
ఒకని బుజముల మఱొక్కఁడు తట్టుచు,
ఒకని చెవిని వేఱొక్కఁడు నలుపుచు,
ఒకరి నొకరు పలుకక పెడపోదురు.

।

ప్రణుతించుచు, మఱి ప్రణమించుచు తమి
ఒకరినొకరు త్రోయుచు, ఎడబాయుచు,
క్రిందుమీదులయి చిందులు త్రొక్కుచు,
ప్రలపించుచు పరిపరి విలపించుచు.

।

చెట్టునుండి కడచెట్టుకు దుముకుచు,
కొండనుండి అడుగుకు దిగజాఱుచు,
అతివేగమున మహావృక్షంబుల
సిగలమీది, కెదురెగసి యెక్కుచును.

।

ఒకడు పాడ, మఱియొక్కఁడు నవ్వును,
ఒకడు నవ్వ వేఱొక్కఁ డేడ్చును,
ఒక డేడ్వగ ఇంకొక్కఁ డఱచును,
ఒక డఱచిన పరు డొక్క డూరకొను.

18

పానము చేసిన వానరులు తెలివి
మాలిపోన్, కనులు తేలగిల్లిపోన్
బడలిపడిరి; కనబడడు మత్తిలని
వాడును, తనియనివాడును వారల.

19

తేనె త్రాగి తలతిరుగ వానరులు
పచ్చని తోటను పాడుచేసి, రది
కని దధిముఖు డాగ్రహమున వచ్చి, ని
వారింప తొడగె భయభర్త్సనముల.

20

వనపాలకుడు, ప్లవగకులమాన్యు, డ
తని మాటలకు బెదరక మూర్మ్సల,
కొఱకొఱలాడుచు కోతుల తోలెద,
వన వినాశమును వారించెద నని.

21

దర్పముతో కొందఱిని తిట్టి, కొం
దఱిచేతుల అఱకాళ్ళను తా
డించె బలిమి, లాలించె చెలిమి, హరి
నయభయముల తంత్రంబులు మెఱయగ.

22

త్రాగిన కైపున రేగి వానరులు,
ప్రతిరోధంబును పాటింపక, జం
కక, అటునిటు లాగదొడంగిరి దధి
ముఖు, నేదోషంబును లేకున్నను.

23

గోళ్ళను గిచ్చుచు, కోరల కొఱుకుచు,
కరముల క్రుమ్ముచు, కాళ్ళను తన్నుచు,
పానమదంబున వానరు లెగబడి
మధువనమును ధ్వంసము కావించిరి.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౬౨

1
అంతన హనుమ దయామతి, వానర
వీరులతో ననె, బెదరక చెదరక
త్రాగుడు మనసారగ మధుసారము
నే వారింతును మీ విరోధులను.

2
హనువద్వచనము లాలకించి, మం
చి దనుచు హరికులశేఖరు డంగదు,
డఖిల సహచరుల కనుమతి నిచ్చెను:
కడుపునిండ త్రాగుడు మధువంచును.

3
కృతకృత్యుండయి యేతెంచిన హను
మంతుని పలుకు ప్రమాణంబు మనకు,
ఆతని అభిమత మాదరణీయ, మ
కార్యంబైనను కరణీయంబగు.

4-6
అంగదు డాడిన అభిమతోక్తులకు,
వానరు లందఱు బాగుబాగనుచు
భూషించుచు వనమును చొచ్చి రపుడు
వఱద పొర్లిన ప్రవాహవేగమున.

7-8
సీతజాడ తెలిసినదను పొంగున,
అంగదు మాటల ఆదరువున, వన
పాలకుల నడచి, పండ్లు తినిరి, తే
నెలు త్రాగిరి, మత్తిలగ వానరులు.

9
బారులు తీరిచి కూరుచుండి, ఆ
కుల దొప్పలు చేతులను పట్టుకొని,
తేనె పోసికొని పానము చేసిరి,
చించి పారవేసిరి తుద కన్నియు.

10
తేనె తిక్క యెత్తిన కపులొక కొం
దఱు కయ్యాలకు తారసిలిరి; కొం
దఱు తేనె పెఱలు విఱిచి కొట్టుకొన
సాగిరి తెగబడి త్రాగిన మత్తున.

11
కొందఱు మ్రాకుల క్రింద పాదులను,
కొందఱు కొమ్మల సందుల, కొందఱు
రాలిన ఆకుల రాసులపై, ఒడ
లెఱుగక వ్రాలి శయించిరి తూగుచు.

12
కుత్తుకబంటిగ క్రోలి మధువు, ఉ
న్మత్తు లగుచు కై పెత్తి కాఱుకూ
తలకు దిగిరి, మాటలు మితిమీఱగ,
కొట్టుకొనిరి ఒక్కొకరు కలియబడి.

13
సింహానాదములు చేసిరి కొందఱు,
అఱచిరి కొందఱు ఆపరాని తమి,
మధువు త్రాగి మైమఱచిన కొందఱు,
నేలమీదబడి నిద్దురపోయిరి.

14

ఒక డొకపని చేయుచు నవ్వగ, వే
ఱొకడు మఱొకదానికి తలపడు వెస;
చేసిన కార్యము చెప్పుచుండగా,
ఒక్క డడ్డపడు వెక్కసి చేష్టల.

15

మధురక్షకులగు దధిముఖు భృత్యుల
నతిభీమముగా అడచి కపులు ప్రహా
రించిన, వారును అంచెలంచెల ప
లాయితులైరి యథాయథ లగుచును.

16

కొంద, ఱొఱగి పడ కొట్టి, పొడిచి మో
కాళ్ళ దేవమార్గమునకు త్రిప్పిరి,
కావలికాం డ్రది కని వెఱచిపఱచి
దధిముఖుతో కొందలమున పలికిరి.

17

హనుమ యొసంగిన అభయబలంబున
ఉద్యానవనము ఉత్సాదించిరి,
వానరు; లదలింపగ మము పడమొ
త్తి ముడిచి చూపిరి దేవమార్గమును.

18

మధువన విధ్వంసమునకు దధిముఖు
డలిగి, కపుల దూఱాడి, సేవకుల
నోదార్చుచు, ఇదె, పోద మందఱము
దండింతము ఆ త్రాగుపోతులను.

19

రం డిటు, మధువన రక్షకు లందఱు,
మనము పోయి దుర్మదులయి తేనెలు
త్రాగుచున్న కపితండములను వా
రింతము, పొగ రడగింతము బలిమిని.

20

అనుచు స్వామి పలికిన పలుకులు విని
మధురక్షకులును 'మంచి' దను చపుడు,
మళ్ళిరి తోటకు క్రేళ్ళుఱుకుచు, అం
దఱు నేకంబుగ దధిముఖు వెంబడి.

21

దారి మధ్యమున దధిముఖు డొక వృ
క్షము పెకలించి, బుజాన పెట్టుకొని
బిరబిర పరుగిడె, భృత్యు లందఱును
అల్లై చేసి వెనకాడక నడచిరి.

22–23

మఱికొందఱు సంభ్రమమున మధ్యే
మార్గమం, దలవిమాలిన తాళ్ళను
ఊళ్ళ నీడ్చుకొని త్రుళ్ళుచు పెల్లుగ
పరుగులెత్తి రురవడి బరవసమున.

24

వేలకొలది వనపాలకు లట్టుల
[illegible] తోటలో అలసి నేలపయి
పడియున్న కపుల పైబడి తడయక
బిట్టుగ కొట్టిరి పెడమోఱకమున.

25

అది గని, దధిముఖు డాగ్రహించి వ
చ్చెనని మేలుకొని, హనుమత్ప్రముఖులు
పటువేగంబున పరుగిడి చేరిరి
వనరక్షకులను వాలాయించపగ.

26

పూజ్యుడైన దధిముఖుడు క్రుద్ధుడై
చేవ చెట్టొకటి చేతపట్టుకొని
వచ్చుచుండగని, వాలిసుతుడు ప్రహ
రించె నతని తన రెండు చేతులను.

27

మధుపానంబున మత్తిలి అంధుం
డయిన అంగదుడు, ఆర్యాకు డతడను
తెలివి రాక, మర్దించి మెత్తగా
నలిపి నేలపయినన్ పడద్రోసెను.

28–31

గాటపు దెబ్బలు గాయములై నె
త్తురు చిప్పిల్లగ, తొడలు సడల, చే
తులును బుజాలును తునుకలై విఱుగ,
స్మృతి తప్పి, తలతిరిగి, నేలం బడె.

:

వానర విభునకు మేనమామయగు
దధిముఖు డెటులో ప్రాణగొలుప, స్పృహ
వచ్చి, పిలిచి సేవకుల నందఱిని,
ఏకాంతంబున వాకొనె మెల్లన.

:

ఈ త్రాగిన కపు లిచటనె గుట్టలు
పడియుండనిం డొడలెఱుగక; మన
మేగి సైనికుల ఆగడములు సు
గ్రీవ రాఘవులకే యెఱిగింతము.

32

తప్పిదమంతయు ఇప్ప డంగదుని
దనుచు నివేదింతును హరీంద్రునకు,
ఆగ్రహశీలుడు సుగ్రీవుడు శి
క్షించును మదమెక్కిన ధిక్కారుల.

33

ఈ మధువనమును ప్రేమించు మహా
త్ముడు సుగ్రీవు డెపుడును, పితృపితా
మహు లార్జించిన మాన్యము, దేవత
లకు నలభ్య మీ లలితారామము.

34

మధువుమీది దుర్మమత నవశులై
ఆయుష్యము కోల్పోయి రీకపులు,
సుగ్రీవుడు నిష్ఠురముగ దండిం
చును మదాంధులను సుహృదుల తోడుత.

35

రాజాజ్ఞలను తిరస్కరించిన దు
రాత్మ లెవరయిన హంతవ్యులు, వీ
ర స్తమించిన కృతార్థమగును మన
క్రోధభూతమగు రోషజాతమును.

36

అట్లు దధిముఖుడు అనునయోక్తులను
ఓదారిచి, ఇక పోదము రండని,
తోటకాపరులతో శీఘ్రముగ ఎ
గిరిపోయెను సుగ్రీవు సన్నిధికి.

37

అట్టు లందఱు చద లంటుచుపోయి, ని
మేషములోన సమీపించి దిగిరి,
సూర్యసుతుండగు సుగ్రీవుండు వ
సించు వనాలయ సీమాంచలమున.

38

రఘుకులీనులగు రామలక్ష్మణులు,
సుగ్రీవునితో సుఖమున్న సమం
చిత భూమిని వీక్షించి, ఆకసము
నుండి దిగె దధిముఖుండు బలగమును.

39

ప్రథిత బలాఢ్యుడు, వనరక్షకులకు
అధిపతియు నయిన దధిముఖు డంతట,
వానర పరమేశ్వరుని అంతికము
చేరవచ్చె పరివార సమేతము.

40

శిరమున చేతులు చేర్చి, ఆత డట
దీనముఖముతో వానరదేవుని
శుభచరణంబులు సోకగ వ్రాలెను,
రాజలోకమర్యాదల క్రమమున.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౬౩

1

తన పాదంబుల తలవాల్చి పడిన,
వానర వృషభుని మేనమామ గని,
సుగ్రీవుడు మనసున నొచ్చుకొనుచు,
వ్యాకులుడై యిట్లనె ఆదరమున.

2

లెమ్ము లెమ్ము, అభయమ్మిచ్చితి నీ
వేల పాదముల వ్రాలితి విట్టుల ?
వానరాగ్రణి ! భయకారణమును అం
తయు ఎఱిగించుము నాకు వివరముగ.

3

ప్రభువు పలుకు విశ్వాసము నింపగ,
లేచి, వానర కులీనుడు దధిముఖు,
డచ్చట జరిగిన ఆగడమంతయు
వక్కాణింపగ ప్రారంభించెను.

4

రాజేంద్ర ! ఇదివఱకు, నీ తండ్రియు
నీవును, వాలియు నీయలేదు మధు
వన మెవ్వరికిని తిని త్రాగుటకయి,
పిటి బుచ్చి రాతోట వానరులు.

5

కావలివారలు కాదని తోలగ
కిచకిచలాడుచు కేరించి, ప్రతా
పించి, కొట్టి త్రావిరి తేనెలు, ఫల
ములు భక్షించిరి పుక్కిటిబంటిగ.

6

పండ్ల గుత్తులను భక్షించుచు, కుతి
కెల బంటిగ తేనెలు త్రాగుచు, మే
మడ్డగింప, మాఱొడ్డి, కనుబొమలు
ఎగరవేయుచును ఇగిలించిరి మము.

7

బెదిరింపులతో కదలకున్న, వన
పాలకు లెసకొని వారింపతొడర,
అలిగికలగి క్రుద్ధులయి వానరులు
తారుమారుగా తరిమిరి వారిని.

8

అంతన ఆగక హరివీరులు తమ
కంగదనాయకు లాదరింప, కను
లెఱ్ఱచేసి, భయమెత్తగ మొత్తిరి,
మధురక్షకులను మన సేవకులను.

9

అఱచేతులతో అడచిరి కొందఱ,
మోకాళ్ళ విఱుగపొడిచి, ముడిచి కొం
దఱికి అపానద్వారము చూపిరి,
త్రాగి రేగి, మత్తప్రమత్తులయి.

10

ఏలికవయి నీ విచట నుండగనె,
ఇష్టమైనటుల హింసించిరి మము,
మధుపాలకులను మర్దించిరి, ని
శ్శేషముగా భక్షించిరి మధువును.

11

ప్రభువుతో నటుల వానరు డేమో
చెప్పుచుండ వీక్షించి, యథోచిత
ముగ సుగ్రీవు నడిగె కుమార ల
క్ష్మణుడు, వైరికులమారకు డిట్టుల.

12

వానరేశ్వర ! ఏవం డిత డిప్పుడు
ఏల వచ్చె నీ పాలికి ? ఏమి ని
వేదించుకొను ? విషాదవముఖుండయి,
వినదగు నే నది వివరింపుము ప్రభు !

13–14

లక్ష్మణు ప్రశ్నములకు సుగ్రీవుడు
ఇట్లనె, మిత్రమ ! ఇతడు దధిముఖుడు,
అంగద ప్రముఖులైన వానరులు
తేనె త్రాగిరని తెలుపగ వచ్చెను.

15

దక్షిణదిశ నంతయును వెతకి రట,
[redacted]చ్చి వానరు లందఱు, మధు
వనము చొచ్చిరట ; వారు కృతార్థులు
కాకున్న ఇటు లకార్యము చేయరు.

16

వచ్చిరాక యె వనమును చొచ్చిరి,
కావలివాండ్రను చావమోది, త్రా
గిరి మస్తుగ మాగిన మధువును; ఇవి
యెల్ల తలచి ఊహింపగ తోచును.

17

పోయిన పని సంపూర్ణముగా సా
ధించిరి వీరలు, దేవిని సీతను
చూచియుందు రెచ్చోటనో ? తథ్యము,
సందేహము లే దిందుకు లక్ష్మణ !

18

ఈ కార్యమునకు ఇతరులు చాలరు,
హనుమ యొక్కడె సమర్థుడు, దక్షుడు,
కార్యసాధనకు కావలసిన, దీ
క్షయు, బుద్ధియు, బలిమియు, కలవతనికి.

19

బలమును, కార్యోపాయ, మనుభవము,
కలవతనికి, అంగదుడు జాంబవం
తుడును నేతలుగ తోడై నడపగ,
ఇట్టి అకార్యము లెన్నడు జరుగవు.

20

తిఱిగివచ్చెనట పఱచిన బలములు,
అంగదాదు లుద్యానవనము హత
మార్చిరట, వలదన్న రక్షకుల
మోకాళ్ళ విఱుగపొడిచి తన్నిరట.

21

ఇది యంతయు మా కెఱిగించుట కై
విచ్చేసె నితడు, పేరు దధిముఖుడు,
మధువనాధిపతి, మధురభాషి, వి
ఖ్యాతుడు కపిలోకమునం దెల్లను.

22–23

సీతను సందర్శింపకున్న ఈ
పరమోత్సాహము పొరలదు వారికి,
అదియుగాక, మా ముదితోద్యానము
ఆక్రమించి చేయరు దుండగములు.

24

సీతను దర్శించిరి వానరు లను
సుగ్రీవుని ముఖ సుఖవాక్కులు, విని
వీనుల విందుగ, మానసముల ఆ
నందించిరి రఘునందను లిరువురు.

25-26

రామలక్ష్మణులు రాగిల్లుట కని
వానర రాజేశ్వరుడును మిక్కిలి
ఉత్సహించి, పూజ్యుడు వనాధిపతి
కానతిచ్చె నిటు లనునయార్థముగ.

27

ప్రీతులమైతిమి సీతాన్వేషకు
లంగదాదులు కృతార్థులై తిరిగి
వచ్చినందులకు, పని సాధించిన
వారు త్రాగినను సైరింపగ తగు.

28

కార్యసిద్ధిగొని, క్రమ్మఱి వచ్చిన
వీరుల కపికంఠీరవులను గని
దేవిని శీఘ్రము తెచ్చు ప్రయత్నము
వినవలతుము, పంపించుము వారిని.

29

ప్రీతితో కనులు విప్పారిన రా
ఘవుల ప్రమోదము కని సుగ్రీవుడు,
గగురొత్తగమెయి, కార్యసిద్ధి చే
తుల కందినవంతున పొంగెనపుడు.



# సుందరకాండ

## సర్గ ౬౪

1–2

సుగ్రీవుని ప్రియసూక్తుల కలరుచు
దధిముఖు డంతట, దాశరథులకును,
ప్రభువునకును అభివాదములు సలిపి,
చదలంట నెగసె సపరివారముగ.

3

వచ్చిన త్రోవనె చెచ్చెర నాతడు
తన బలగముతో తారాపథమున
పోయి, దిగె యథాపూర్వముగా ఆ
కాశమునుండి ఎకాయకి భూమికి.

4

అచ్చట వానరు లతిపానముచే
తలకెక్కిన మాంద్యము దిగజాఱగ,
ఒడలు విఱుచుచు, మధూదక మూత్రము
విడుచుచుండి రెక్కడివా రక్కడ.

5

అపుడు దధిముఖుడు హర్షముఖుండయి
వారిని దగ్గరి, బద్ధాంజలియై
భాషించెను మృదుఫణితి అంగద కు
మారునితో నిమ్మళముగ నిట్టుల.

6

పాన పిపాసను వచ్చిన వీరుల
నడ్డగించిరని ఆగ్రహింపకుము,
సౌమ్యుడ ! మధురక్షకు లజ్ఞానులు,
తెలియక మిమ్ము అధిక్షేపించిరి.

7

బలశాలివి, హరివాల్లభ్యమునకు
యువరాజువు, సౌమ్యుడ ! వనపాలకు
లజ్ఞానులు, మౌఢ్యమునన్ చేసిన
తప్పు క్షమింపన్ తగు ఉదారముగ.

8

వానర చక్రము పాలించెను నీ
తండ్రి వాలి మును, దానికి తగుదురు
నీ పినతండ్రియు నీవును, రాజకు
మార ! సమర్థులు లేరిపు డితరులు.

9

పోయి నీ పితృవ్యునకు చెప్పితిని
ఇచ్చట మీరలు వచ్చి విడిసిరని,
విని, సంతోషించెను కినియక, ర
మ్మని పిలిచెను మిమ్మందఱి నచటికి.

10–11

మీ రాకకు సంప్రీతి చెందె, తన
కధిక ప్రియమగు మధువనంబులో
విచ్చల విడిగా చొచ్చి, త్రాగి, మ
ల్లాడి రన్న విని ఆనందించెను.

12

దధిముఖు డటు సాంత్వనముగ తెలిపిన
ప్రభువు ప్రియామంత్రణమును విని, అం
గదు డుల్లాసము పొదల, వానరుల
యందఱితో ఇట్లనె వినీతముగ.

13

పని ముగిసిన తరువాత తోటలో
తారాడుట ఉచితంబుకాదు, వా
నర వరులార ! మనకు; శంకింతును
రాఘవుండు మన రాకను వినెనని.

14

మనసారగ త్రాగిన కపి వీరులు,
సొమ్మలు పాయ సుఖమ్మొగ లేచిరి,
వానర పరమేశ్వరుడగు సుగ్రీ
వుని సన్నిధి కిక పోవలె శీఘ్రమె.

15

హరికుల నాయకు లందఱు మీరలు
చెప్పినట్లు నడచెద జవదాటక,
నిర్వాహకులే నిర్ణాయకులని
నమ్మెదు నేను మనః ప్రమాణముగ.

16

రఘురాముని కార్యము సాధించిన
యోధవరుల నే యువరాజు ననుచు
ఆజ్ఞలు పెట్టుట అపచార, మయుక్తము
మీ యెడ నట్టుల మెలగ నెన్నడును.

17

అటు, లంగదు డిష్టార్థము తెలుపగ,
విని, వానరకుల వీరులందఱును,
మానసములు సమ్మోదమున పొంగగ
బాగుబాగనుచు పలికి రొక్కసుతి.

18

రాజకుమారక ! ప్రభువువయ్యు, ఇటు
వాకొనె నీవలె పాలకు డెవ్వడు ?
సర్వము నేనని సందడింత్రు నృపు
లైశ్వర్య మదం బావేశింపగ.

19

నీ విపు డాడిన నిజ ఋజువాక్యము
తగియున్నది తథ్యము నీ కొకనికె,
రానున్న శుభార్థమున కీ వొకడ
వర్హుడవని వినయము రూపించెను.

20

మే మందఱమును నీ మాటనె పా
లింతుము, హరికులీన కోటికి ప్ర
భువయిన సుగ్రీవుని పాలికి తత్
క్షణమె యేగ సిద్ధముగా నుంటిమి.

21

నీ యానతి లేనిది మే మెవ్వర
మడుగుదీసి ముందడుగు పెట్ట మిక,
మున్మాటికి సత్యమ్మని నమ్మము,
తిరుగులేని వానరుల శపథ మిది.

22–23

ఆ మాటల కపు డంగదు డీకొని,
ఇపుడె పోదమని యెగసెను మింటికి,
ఆతని వెంటనె హరిగణ మెగసెను,
యంత్రము చిమ్మిన అచలము రీతిని.

24

అధికవేగ వారిధులవలె కపుల
సంఘము లప్పుడు సందడించె, సుడి
గాలి కొట్టగా కంపించి ఘనా
ఘనములు గర్జించిన చందంబున.

25

ఇంకను రాడాయెను యువరాజని
వేగిరించు రఘు వీరుని తహ తహ
పోలిచి, సుగ్రీవుం డతని మన
స్తాపమాఱ నోదార్చె తానిటుల.

26
ఊరడిల్లుము రఘూత్తమ ! శుభమగు,
సీత దర్శనము సిద్ధించిన, దటు
కాకున్న, గడువు గడచి నా కడకు,
రాజాలరు వారలు తథ్యంబిది.

27
బాహు విక్రమ ప్రథితుడు, యువ రా
జంగదుడు కపికులాగ్రణి, కార్యము
విఫలమైనచో విచ్చేయడు సుమి,
నా యెదటికి ఎన్నండును రఘువర !

28
చేపట్టిన పని చెడిపోయినచో
వారలిట్లు మధుపానమునకు తల
పడరు; దీనులయి వాడిన ముఖముల,
ముందు వెనకలై మందటిల్లుదురు.

29
తరతరముల తాతలు తండ్రులును, ప్ర
తిష్ఠించి, మనసుతీర పెంచి, యి
చ్చిన మా మధువనమును యువరా జిటు
చొచ్చి చూఱగొని శూన్యము చేయడు.

30
కాఱియపడకుము కౌసల్యాసుత !
ఊరడిల్లుము, విచారము మానుము,
సీతను దర్శించెను హనుమంతుడు,
సందేహము లేదిందుకు సువ్రత !

31
హనుమ యొకడె కార్యము సాధింపగ
లా, డితరులకు అలవికానిది యిది;
దక్షతయును, సాధన సంపత్తులు
కల, వాతని కొక్కనికె సమృద్ధిగ.

32
కృషియు, ధృతియు, శక్తియుగల హనుమయు,
అంగద జాంబవదాదులు అధినే
తలయి నడిపిన జతనములు, విఘ్నము
లగుటెట్లు? రఘుకులాన్వయ రత్నమ !

33–34
చింతింపకు రఘుశేఖర ! వినబడు
హనుమజ్జయ దర్పాతిశయంబున
ఈ తల్రమోతల నేగుదెంచు కపి
కులవీరుల కిలకిల మన కింతనె.

35
కార్యసిద్ధి సంగతులు తెలుప కి
ష్కింధకు వచ్చెడి కింకిర సంకుల
మంతలోన విని, అలరి హరీశుడు,
లోశించెను తన వాలాభరణము.

36–37
హర్షముతో హృదయములు తొణక, కపు
లందఱును హనుమ ముందుండగ, అం
గదునితోడ, రాఘవ దర్శన కు
తుక మొరయ, హరీంద్రుని పొంత దిగిరి.

38
తోడనె, హనుమంతుడు, మహాభుజుడు,
వినయ వినీతుడు వేడుకతో, తల
వాల్చి మ్రొక్కి, రఘువరుతో ననె, ఉ
న్నది, దేవి నియతి నక్షతయై అట.

39
సుగ్రీవుండును సుస్తిమితుండా
యెను, సాధించెను హనుమంతుడె కా
ర్యంబని; లక్ష్మణు డాత్మప్రీతి, క
టాక్షించె బహుమతాక్షుల హనుమను.

40

శత్రుసూదనస్వామి రాఘవుడు
పరమప్రీతిని పొరలి సుఖించుచు,
హనుమంతుని ప్రేమాదర మసృణా
లోకనముల అభిషేకించె నపుడు.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౬౫

1

నింగినిబడి పయనించి వానరులు
రమ్యమైన ప్రస్రవణ గిరిని దిగి,
రామునకు సుమిత్రాసుతునకు శి
రస్సులు వంచి నమస్సులు సలిపిరి.

2

యువరాజును ముందుంచుకొని, హరీ
శ్వరునిచేరి అభివాదములు సలిపి,
సీతావృత్తము చెప్పుట కారం
భించిరి వేడుక వెల్లివిరియగా.

3

రావణు నంతిపురమున బందెపడి,
రాకాసుల తర్జనలను తెరలుచు,
రామునితోడ సమానముగా అను
రాగవ్యథలన్ కాగుచు నున్నది.

4

వారలట్లు తమ వార్తలు తెలుపుచు,
'సీత కుశలమని' చెప్పిన మాటలు
విన్నంతనె రఘువీరు డాతురత
అడిగె వానరుల కభిముఖుడై యిటు.

5

సీత యెచ్చట వసించుచున్నది ?
దినములు గడుపును దేవి తానెటుల ?
నన్ను తలచి ఏమన్నది ? వైదే
హీ వృత్తాంతము నెల్లను చెప్పుడు.

6

రాఘవు డడిగిన ప్రశ్నలకు సమా
ధానము చెప్పగ వానరవరు ల
ర్థించి రపుడు, వైదేహీకథా కో
విదుడగు హనుమను వేయినోళ్ళతో.

7

తనవా రర్థించిన మంచిదనుచు,
అనిల తనూజుడు హనుమంతుండును
శిరసువంచి దక్షిణముఖుడై సీ
తను స్మరించుచు కథనము మొదలిడెను.

8–9

సీతను అన్వేషింపగ దాటితి
నూఱామడల పయోరాశిని, ద
క్షిణ తటమున రావణుని నివాసము
లంకాపురము కలదు దుర్గమముగ.

10

అచట రావణుని అంతఃపురమున
తిలకించితి వైదేహిని రాఘవ !
తావక బద్ధ ధ్యానరతిని త
పించు నీ పయి అపేక్షలను నిలిపి.

11

రక్కసి మూకలు కక్కసపెట్టగ,
క్షోభిలు దేవిని చూచితి వనమున,
పగలు రేలు కావలియుందురు, వికృ
తాకారిణులగు రాకాసు లచట.

12

ఎట్టి కష్టముల నెఱుగక, సుఖముగ
ఉండదగిన నీ యోషారత్నము,
దుఃఖించును దైత్యుని యింట, నిశా
చరుల బందెలో నరకయాతనల.

13–14

ఏకవేణి బిగియించి, నీ పయిన
పంచప్రాణము లుంచి, కటిక ఱా
నేలమీద శయనించుచు రూపఱె,
మంచుపడ్డ కోమల కమలమువలె.

15

అన్నియు మఱచి, అనాశ్వాసిత మా
నసయై పడియున్నను; నే నిక్ష్వా
కుల సంకీర్తన సలిపినంతటనె
పునరాశలతో పులకలు మొలవగ.

16

దేవి తేటి నాతో విశ్వాసము
చిగురొత్తగ భాషించె కుతుకమున,
తెలిపితి యావద్వృత్తాంతము, సు
గ్రీవుని మైత్రి నెఱింగి సంతసిలె.

17

సముదాచారము సహజం బామెకు,
అట్టులె నీయెడ అనురాగంబును
నిత్య నిష్ఠతో నిలిచియున్న; దీ
ఘోర సత్యమును గుర్తించితి నట.

18

చిత్రకూటమున చేరినపుడు నీ
సముఖంబందున జరిగిన వాయస
దుశ్చరితము నాతో చెప్పెను, నీ
కప్పగించుమని ఆనవాలుగా.

19

మఱియు దేవి నన్నరసి యిట్టులనె,
వాయుసుతా ! నీ వీయెడ చూచిన
నా దుర్దశనంతయు వినిపింపుము
నా మాటలుగా రాముని కిట్టుల.

20

జ్ఞప్తియుండు రఘునాథ ! నా నుదుట
చెరిగిన తిలకము నరసి నీ వపుడు
చెంతనున్న మణిశిల చాది స్వయము
బొట్టుపెట్టితివి, పోలు స్మరింపగ.

21–22

ప్రాణపదముగా పరిరక్షించిన
ఈ చూడామణి నిమ్ము రామునకు,
సుగ్రీవుడు వినుచున్ కనుచుండగ
తెలుపుము నా పరిదేవన మంతయు.

23–24

నీటపుట్టిన మణి యిది, పంపితిని,
దీని గని ప్రమోదింతువు నీవని;
ఒక్కనెల బ్రతికియుందును రాక్షసు
చెఱలో, ఆవల జీవింపను ప్రభు !

25

అనుచు దేవి చెప్పెను నా కంతయు;
చిక్కి చెన్నుమాసినది మేను, రా
వణుని యింట చెఱబడి అల్లాడును,
కనులు తెఱచుకొని కన్నె లేడివలె.

26

తేటతెల్లముగ తెలిపితి నఖిలము,
రఘుకులేంద్ర ! వారాశిజలంబులు
దాటు తగిన సాధన సన్నాహము
సర్వవిధంబుల సలుపు టవశ్యము.

27

రాజపుత్రు లూఅడిలి ప్రీతులై
నల్లైటింగి; మణి ఆనవాలుగా
రామునకిచ్చి హానూమయు విరమిం
చెను సీతాభాషిత కలాపమున్ను.



# సుందరకాండ

## సర్గ ౬౬

1

అట్లు హనుమ సీతాన్వేషణ కథ
చెప్పిన విని, ఇచ్చిన చూడామణి
ఉరమున మాటికి ఒత్తుకొనుచు, రా
ఘవు డేడ్చెను, లక్ష్మణు డడలుకొనెను.

2

మైథిలి చూడామణి నీక్షించుచు,
శోకము నాపగలేక రాఘవుడు,
నిండి కారు కన్నీళ్ళు వెల్లిగొన
సుగ్రీవుని చూచుచు విలపించెను.

3

లేగమీది బాలెంత సళుపుచే
ఆవు పొదుగున పయస్సు చేపు గతి
ఈ మణిరత్నము నీక్షింపగ నా
మనసు కరగి చెమ్మగిలి స్రవించెను.

4

జానకి పరిణయ సమయంబున, ఈ
మణి చదివించిరి మా పితృపాదులు,
పెండ్లికూతురికి పెట్టిరి పాపట
బొట్టుగ, శోభిలె ముంగురులందున.

5

ఉద్భవించినది ఉదకంబులలో,
సజ్జనముల పూజలను పొందినది,
ధీమంతుండగు దేవేంద్రుండు ప్ర
సాదించెను యజ్ఞమున కానుకగ.

6

నేడియ్యెడ ఈ చూడామణి గని,
తండ్రి, రాజసత్తముని దశరథుని,
దాత, విదేహ విధాతను జనకుని,
చూచిన తీరున సుఖియించును హృది.

7

ఈ మణి ప్రేయసి సీమంతంబున
భాసిలుచుండిన పరమాభరణము,
దీని దర్శనోత్సవ సుఖమున నా
ప్రేయసి వచ్చినరీతి రాగిలుదు.

8

తీవ్రదాహమున తెరలు త్రోవరికి
చల్లని జలము లొసంగిన భంగిని,
ఇవతాళించెడి భవదమృతోక్తుల
సీత యేమనెనొ చెప్పుము మఱిమఱి.

9

వైదేహి మఱలిరాదు చూచుటకు,
తిరిగివచ్చె వైదేహి శిరోమణి,
దీని చూతు వెతలూన; ఇంత కం
టెను దుఃఖంబుండునె సుహృన్మణీ !

10

జానకి ఈ మాసము జీవించిన
బ్రతుక గలదు చిరరాత్రము మిత్రమ !
కాటుక కన్నుల కళ్యాణిని, ఎడ
బాసి నే క్షణము బ్రదుకజాల నిక.

11

నా ప్రియసఖి జానకి, ఎచ్చట కన
బడె నన్నచటి కవశ్యము చేర్చుడు;
సీత జాడ తెలిసిన పిమ్మట, క్షణ
మాలసింపగాజాల నే నిచట.

12

పిరికిది, మిక్కిలి బేల, కృశోదరి,
నా ప్రాణేశ్వరి ఏ ప్రకార మా
భీకర ముఖులగు రాకాసులలో
ఆపద్భయమున అంగలార్చునో !

13

చిమ్మచీకటుల చిక్కు తప్పుకొని
కడపటి మబ్బుల తొడుగుల ఇరికిన
శారద చంద్రుని చాయ ఛన్నమై,
మాయబోలు నా ప్రేయసి వదనము.

14

ఏమనె ? వైదేహి మహాకపి ! అం
తయును చెప్పుము యథాతథముగ, రో
గార్తు డనువయిన ఔషధమునువలె
త్రావి బ్రతుకుదును నీ వాగమృతము.

15

మధురభాషిణి సుమంగళ వేషిణి
నా ప్రేయసి జానకి ఏమనియెనో
నా వియోగతపనలలో ఉడుకుచు,
చెప్పుము హరికులశేఖర ! నాతో.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౬౭

1–2

అట్లు రాముడు మహాత్ముడు కోరిన;
ఆరంభించెను హనుమయు; రఘువర!
సీత నీకిటుల చెప్పుమన్న దొక
జరిగిన కార్యము జ్ఞాపకార్థముగ.

3

చిత్రకూటమున చేరియున్నతఱి,
ఇద్దరు సుఖముగ నిద్దురపోతిరి,
సీత ముందు లేచెను, కాకి యొకటి
ఆయమ వక్షము నంటి గీఱెనట !

4

దేవి అంకమున నీవు శయించితి,
వంత, పాపవాయసమును వదలక
తిరిగివచ్చి బాధించెను దేవి స్త
నాంతరమును గాయములుగా పొడిచి.

5–6

మఱలమఱల నటు మాటిమసలి, కా
కము వేధింపగ, కారుచున్న నె
త్తురుతో నిను నిద్దుర లేపెను సతి,
కాకపీడనకు గాసిలి వేసరి.

7

నెత్తురు జొత్తిలు నెలత వక్షమును
చూచి, ఆగ్రహా క్షుభితుడ వగుచును
త్రాచుపాముపలె లేచి, జానకిని
అడిగితి వట అప్పుడె భరతాగ్రజ!

8

భయశాలిని! నీ వక్షస్థలమును
గిచ్చి గోళ్ళతో గీటి చీల్చె నెవ?
డక్కసు క్రక్కెడి అయిదు తలల నా
గినితో వెఱవక క్రీడలకు దిగెను?

9

ఇటు నటు కలయ పరీక్షించితి; వగ
పడె నది పొంతనె, వాడి గోళ్ళ నె
త్తురు తడియారు, కెదురు చూచుచు అ
చ్చలమున నున్న పిశాచిని కాకిని.

10

తెలిసె నీ కతీంద్రియ దృష్టి, నపుడు,
గాడుపు వడితో మూడు లోకములు
చరియింపంగల వర మందిన ఆ
దుష్టకాక, మింద్రునికి సుతుండని.

11

అంతట నీవు మహాబాహూ! కో
పాకుల నేత్రుడవయి, కాకమునెడ
హింసాహింసల ఎడమడుపు లరసి,
జాలిమాలి కాకోలము చంపగ.

12

నిశ్చితమతివై నీ వపు డచ్చట
పఱచియున్న దర్భలలో నొక పో
చనుగొని, బ్రహ్మాస్త్రముగా అభిమం
త్రించితి, వది తీంద్రించెను కరకరి.

13

కాలాగ్నింబలె జ్వాలలు చిమ్మెడి
బ్రహ్మాస్త్రముగొని వాయసంబు పయి
విడిచితి, వది వెంబడిపడి వేటా
డెను కాకోలంబును ప్రళయంబుగ.

14

కాతరమతి కాకము త్రిలోకములు
తిరిగెను రక్షణకొఱకై ; తండ్రి మ
హేంద్రుడు పొమ్మన, ఋషులును కాదన,
దేవగణంబులు కావలే మనగ.

15

రక్షణ దొరకక, పక్షియు క్రమ్మరి,
ప్రాణభీతి నీపాలికి వచ్చి, శ
రణని సాగిపడ, రక్షించితి వీ
వనుకంపను వధ్యునైత మపుడు.

16–17

బ్రహ్మాస్త్రమ్ము మరల్పరాని దన,
కాకము తన కుడికంటిని బలియిడి,
నీకును నీ తండ్రికిని మ్రొక్కి, సెల
వీయ వనాంతము చాయన పోయెను.

18

అగ్రగణ్యుడు మహాస్త్రధరులలో,
సత్యసంధుడు, యశస్వి, సుశీలుడు,
రాము డస్త్ర శస్త్రముల నేల ఈ
రాక్షసకుల మారణమున కెత్తడు ?

19

నాగు లేని, గంధర్వు లేని, సుర
లేని, మరుద్గణ మేని, రాఘవుని
కదనముఖంబున కాలూది నిలిచి,
ఎదిరింపగ లే, రది జగ మెఱుగును.

20

రాముం డెద నను ప్రేమించిన, నా
కట్టిడి చెఱ విని కరగిన, తన కో
దండము నెక్కిడి దారుణ శరముల
చంపుగాక రాక్షసులను శీఘ్రమె.

21

అరికులాంతకుం డయిన లక్ష్మణుడు,
అన్న అనుజ్ఞల నడిగి, ఏల ? తా
నైన రోషమున దానవులను చం
పక ఉపేక్షించెడి ? మా సెనె మగటిమి !

22

పురుష శార్దూలములు, పవన హుతా
శన సమ తేజులు, చండ విక్రములు,
దేవతలును సాధింపలేని రఘు
వీర సోదరు లుపేక్షింతురె యిటు ?

23

నా దుష్కృతఫల మేదో బలముగ
కలదు నిశ్చయము; కాదేని యిటుల
ఏమఱి యుందురె రామలక్ష్మణులు
నాయెడ, శత్రువినాశ సమర్థులు.

24

దీనముగా వైదేహి కనుల బా
ష్పములు పొరలగా పలికిన, కరగెను
నా హృదయము కొందలమున, జానకి
తో నిట్లంటిని దుఃఖ మడచుకొని.

25

దేవి! రాముడు నీ వియోగ దు
ర్వ్యథతో విముఖుండాయె నన్నిటను,
లక్ష్మణు డార్తి విలాపించును, నే
నొట్టు తిందు నిది గట్టి సత్యమని.

26
కనబడి తీవతి కష్టముమీదను,
ఇది దుఃఖించుట కదను కాదుసుమి,
నీ కష్టములన్నియు గట్టెక్కును.
నిమిషములోన అనింద్యాయశస్విని !

27
రాజపుత్రులు, పరంతపు, లిరువురు,
ఉత్సాహాముతో ఉన్నారలు, నిను
చూడగ వత్తురు, తోడనె లంకను
వాడి శరంబుల బూడిదె చేతురు.

28
రణ రంగంబున రౌద్రాత్మకుడగు
రావణుని, సుమిత్ర సుపుత్రముగ వ
ధించి అయోధ్యకు దేవీ! నిను గొని
పోవును రఘురాముం డిది తథ్యము.

29
అనుచును వైదేహిని యాచించితి;
దేనిని తా గుర్తించును రాముడు,
ఏది చూడ సమ్మోదం బొదవును,
అట్టి స్వీయ చిహ్నము నా కిమ్మని.

30
అంతట దేవి దిగంతము అరయుచు,
జడనిడుకొను పచ్చల పతకము నీ
సిగమాణిక్యము చీర ముడి విడిచి
నా కిచ్చెను నీ నమ్మకమున కయి.

31
అట్లు, శిరోమణి నంది పుచ్చుకొని,
తిరిగివచ్చు తొందరలో, దేవికి
తల వాలిచి వందనముచేసి; ఇటు
బయలుదేఱితిని పార్థివసత్తమ!

32

మఱలివచ్చు సంభ్రమమున కాంతయము
పెంచుచున్న ననుకాంచి, తా మఱల
పలుకసాగె వరవర్ణిని జానకి,
తేటమొగము కన్నీటను తడియగ.

33

కంఠము పెకలక గదగదమనుచున్
శ్రుతులు సన్నగిల శోకాహతయై
ఎగసిపోవు నన్నీక్షించుచు వి
భ్రాంతిని పొరలుచు పలికెను నాతో.

34

సింహ సంహాను లజేయులు నగు శ్రీ
రామలక్ష్మణుల, ప్రాణమిత్రుడగు
సుగ్రీవుని, సచివాగ్రణు లందఱు,
క్షేమము నేనడిగితి నని చెప్పుము.

35–36

నీ భాగ్యము మంచిది మహాకపీ!
సేవింతువు రాజీవాక్షుని నా
విభుని రాఘవుని, విక్రమశాలిని
మరది లక్ష్మణ కుమారుని నిత్యము.

37–38

అంతనె నే నిట్లంటిని దేవి!
నా బుజముల పయినన్ వేంచేయుము,
చూపెద నిప్పుడె సుగ్రీవుని, ల
క్ష్మణ కుమారు, నీ స్వామిని రాముని.

39

నా మాటలు విని రామచంద్ర! బదు
లాడెను దేవి "మహాకపి! ధర్మము
కానేరదు, స్వాధీననై యిపుడు
నీ వీపునబడి నేను గమించుట."

40

మున్ను రావణుడు నన్ను పట్టుకొ
న్నపుడు నాకు గత్యంతర మొదవమి,
కాలదుర్గతికి కట్టుబడితి; రా
క్షసగాత్ర స్పర్శనము పాలయితి.

41

పొమ్ము నీవిక సుఖమ్ముగ, నృపసుతు
లున్నవాడ కనుచున్, నను గని, క్ర
మ్మఱ జానకి సంభాషింపదొడగె,
తన సందేహార్థములు తెల్లముగ.

42

జాహో బలధూర్వహుడు రాఘవుడు
ఏగతి గట్టెక్కించునో, ఆ
సన్నాహంబులు సాగింపు మచట;
నీ వొక్కండవె నేర్తు వందులకు.

43

రాక్షస భయతర్జనల సొమ్మగొన,
సుళ్ళుపెట్టు నా శోకయాతనలు,
చెప్పు మీవు చూచినది రామునకు,
వెళ్ళిరమ్ము హరివీర ! శుభంబగు.

44

నృపకంఠీరవ! నీ ప్రియపత్ని వి
షాదభాషితము సర్వము చెప్పితి,
చెప్పిన మాటలు చిత్తగించి, న
మ్ముము జానకి కుశలముగా ఉన్నది.

శ్రీ

# సుందరకాండ

## సర్గ ౬౮

1

అంత తనివిఁగొన కార్యాతిలకము

నీ ప్రసన్నమతి, నా ప్రపన్నరతి,

భావించినటుల, భాషించెను సం

భ్రమమున మఱి మఱి పరిపరి విధముల.

2

దశరథ పుత్ర వతంసుడు రాముడు

వచ్చి యిచ్చటికి, వచ్చి రావణుని,

నను కొని పోవుట కనువగు నెటు, లా

వీలుచాళ్ళ వినిపింపుము విభునకు.

3

నీ వించుక ఇట నిలువ తలంచిన

చాటు మాటయిన చోట ఎందయిన,

ఒక్క దినము శ్రమ తక్కి విరామము

పొంది, రేపకడ పోవచ్చును హరి!

4

అల్పభాగ్యనయి, అగచాట్లం బడు

నా కే పుణ్య విపాకమొ కలిగెను

శోక విరామము సుంత నీ వలన,

అదియు సమాప్తం బగుచున్న దిపుడు.

5

నీవు పోయి మీ తావుచేరి క్ర
మ్మెఱుదాకను నే మనియుందునో, మర
ణింతునో! అది సందేహము పావని!
దినగండము నా మనుగడ ఇచ్చట.

6

దుఃఖము వెంబడి దుఃఖము విడువక
ఈడ్చుచున్న నే నింత సుఖించితి
నీరాకను, ఇక నీవు కనబడని
చింతలవంతలచే హతమగుదును.

7–8

తీఱని దొక సందియము హనుమ! నా
కట్టెదుటను గ్రక్కదలదు, మీ వా
నర భల్లుక సైన్యములుగాని, రా
ఘవులుగాని ఎటుగడతురు వార్ధిని?

9

సాగర మీదగ శక్తిమంతు లీ
భూతగణములో మువ్గురుమాత్రమె,
నీవును, నీ తండ్రియు, సుపర్ణుడును;
అన్యుల కెవరికి నలవికాదుగద.

10

కార్య నియోగము గట్టెక్కుట కీ
దాటరాని ఆతంక మే యుపా
యంబున తీర్తువు హరికుల సత్తమ!
నాకు సమాధానము కావింపుము.

11

కార్య దక్షుడవు, గణ్యుడవు, వీవొ
క్కడవె చాలు దీ గండము గడపగ,
నీ దాక్షిణ్య బలోదయము, మిలలో
ఆలవాలమగు అక్షయ కీర్తికి.

12

సాంగబలముతో సాగివచ్చి, రా
వణుని రణంబున వధియించి, జయము
పొంది, నన్ను కొనిపోవుట, వీరుడు
రామునకు యశోరాజమార్గమగు.

13

రామ భయముచే రావణుడు మునుపు
వంచనచేసి అపహరించెను నను,
అట్లు, రాము డిపు డధమ మార్గమున
నను కొనిపో వలదని నచ్చింపుము.

14

సేనలతో విచ్చేసి, లంక సం
కులముచేసి పడగొట్టి, విజయుడై
నను తోడ్కొని పోయిన యుక్తంబగు,
రఘువీరుని గోత్రజాత్రములకు.

15

రాము వీర విక్రాంతి ఖ్యాతికి,
అనురూపంబగు ఆహవదోహల
శూరపథంబును చూపుము విభునకు,
ధీరచరితములు తెలిసిన యోధవు.

16

సార్థకమై, హితమయి, సహేతుకం
బయిన భాషణము లాలకించి, ఆ
యమ, ఆశయశేషము పూరింపుచు
చెప్పితి నేనిటు లప్పుడు రాఘవ!

17

వానర భల్లూక సేనల కధిపతి,
ప్లవగలోకపాలక పరమేశుడు,
సుగ్రీవుడు నిల్చును, దేవీ! నీ
కార్యార్థము కంకణము కట్టుకొనె.

18

జవ సత్వంబులు, శౌర్య సాహసము,
లిచ్చ వచ్చి నట్లెగయు ప్రభావము,
కలిగిన గండర గండలు లక్షలు
కోట్లు, అతని అడుగులబడి నడతురు.

19

ఆకాశంబున, అంతరిక్షమున,
పాతాళము లోపలను భ్రమింతురు
అడ్డ మాక లే కలవోక, మహో
వానర వీరు లపారవేగమున.

20

బల దర్పితులయి వాయువేగమున
భూచక్రంబును పూర్తిగా తిరిగి
వచ్చిరి పలుమరు, వార లసంఖ్యలు
శాహా బల మనోబల భూయిష్ఠులు.

21

నాకంటెను చండప్రచండు లు
న్నార లనేకులు; లేరెవరును నా
కంటె కనిష్ఠులు, కపినాథుని స
న్నిధిలోన పురంధ్రీ మతల్లిరో!

22

నను సామాన్యు నొకని పంపిరి యీ
స్వల్పకార్యమున కధికు లెందుకని,
దూతలుగ ఉదాత్తుల నంపరు భూ
మీశు లరసి మాదృశుల పంపుదురు.

23

కావున నీవిక దేవీ! దైన్యము
త్యజియింపుము, పరితాపము మానుము,
ఒక్కదూకులో యోధవానరులు
లంకపై బడి కలంత్రు పునాదులు.

24

పొడుచుచున్న సంపూర్ణ సూర్యచం
ద్రులవలె నా మూపులపై వెలుగుచు
వేంచేతురు నీ పంచకు దేవీ!
రాజసింహములు రామలక్ష్మణులు.

25

దర్శింపగలవు ధర్మశాలినీ!
అరిగజకేసరియగు రాము, ధను
ష్పాణియైన లక్ష్మణు, నీ లంకా
ద్వార కవాటము దగ్గర శీఘ్రమె.

26

గోళ్ళును కోరలు క్రూర విశిఖులుగ,
శత్రు భయానక సాహసాంకులయి,
పోతు టేనుగుల బోని వానరుల
వీర సంభ్రమము విందువు వేగమె.

27

లంకా ద్వీప మలయగిరి లోయల
నడ కొండలవలె, సుడిమబ్బులవలె,
వ్రాలి, పిచ్చటిలు వానర సేనల
సంఘర్షణ ధర్షణములు విందువు.

28

వనవాసంబు నివర్తించి, నిశా
చర వీరుల పీచం బడంచి, నీ
తో నయోధ్యయందు అభిషిక్తుడగు
శ్రీరాముని చూచెదవు సవిత్రీ!

29

అనుచు దైన్య మంటని భాషణముల
మనసు కిష్టమగు మంగళార్థములు
పలికితి, విని మైథిలి శాంతించెను
తావక విరహ నిదాఘతాపమున.

# రాయప్రోలు రచనలు

లలిత (1909)
తృణకంకణం (1913)
కష్టకమల
స్నేహలత (1914)
తెనుగుతోట
స్వప్నకుమారం
ఆంధ్రావళి (1916)
జడకుచ్చులు
మధుకలశం (1932)
రమ్యాలోకం
వనమాల (1947)
మాధురీ దర్శనం (1949)
కన్నెపాటలు
రూపనవనీతం (1953)
దూతమత్తేభం (1957)
ఉత్తరరామచరిత (1958)
రవీంద్ర వ్యాసావళి
రామకృష్ణ - వివేకానంద
మిశ్రమంజరి (1963)
శకుంతల (1965)
సుందరకాండ (1973)
శ్రీరాసపంచాధ్యాయి (1973)

# స్ఖలితములు

| పేజి | పద్యము | | |
|---|---|---|---|
| 12 | 9 | పడత్రొక్కిన | త్రొక్కిన |
| 15 | 34 | దిగ | దిగి |
| 19 | 60 | సంజ | సంధ్యా |
| 24 | 93 | పరాక్రము | పరాక్రమము |
| 29 | 122 | కలదందు | కలదందుల |
| 35 | 158 | హనుమంతుని | హనుమంతు నిజ |
| 40 | 193 | సిద్ధచారణులు | చారణసిద్ధులు |
| 43 | 209 | గిరితలం | గిరీంద్రతలమున దిగె |
| 48 | 27 | మహోదధి | మహోదధి |
| 51 | 44 | లంక | లంకా |
| 51 | 45 | అర్ధాంతర | కర్థాంతర |
| 53 | 58 | కలహంస | కలహంసము |
| 54 | 1 | తితితను | తితీతను |
| ,, | 3 | వలె | వలెన్ |
| 55 | 8 | స్ఫటిక చందన | పటికకుందనము |
| 56 | 15 | గలదీని | గలదేని |
| 57 | 23 | ఎందు | ఎందుకు . |
| 60 | 38 | యంకరంబుగ | భయంకరంబుగా |
| ,, | ,, | అఱచుచున్ | అఱచుచు |
| 64 | 6 | డితివలె | దివివలె |
| 90 | 27 | లేగలను | లేగవలె |
| 94 | 52 | మేనులకు | మేనులను |
| 96 | 59 | చేతములు | చేలములు |
| 99 | 4 | నా మేలిమి | నొక మేలిమి |
| 107 | 47 | తలంబిల | తలంబుల |

| పేజి | పద్యము | | |
|---|---|---|---|
| | 52 | నాయిక | నాయకి |
| 109 | 2 | జాకిన | జానకి |
| 114 | 35 | చాలు | చానలు |
| 117 | 49 | కళకళ | కళవళ |
| 131 | 51 | సెలవెత్త | సెలలెత్త |
| 133 | 62 | పాదప్రప | పాదప |
| ? | 64 | ఉపద్ర | ఉపద్రవ |
| 180 | 23 | నాకై వసమయిన | నాకు వశంబయిన |
| 185 | 14 | డరిష్టమును | డరిష్టము |
| 187 | 27-28 | లక్ష్మని | లక్ష్మ గొని |
| ,, | ,, | హరించిన | అరిగిన |
| 206 | 34 | త్యజియించి | త్యజియించుము |
| 218 | 33 | కట్టినదై నమా | గిట్టినదై నను |
| 237 | 2 | యిటు | యట |
| 264 | 28 | సచివుండను | ప్రియసచివుడ |
| 267 | 14 | నియమ | నియామ |
| 269 | 29 | విచారింపుము | విచారించుము |
| ?77 | 75 | కొకడనే | కొకడనె |
| ?79 | 39 | సముడను | సముడ |
| ?81 | 10-11 | వాతడరసి | వాతండరసి |
| ,, | ,, | పక | చక |
| 283 | 23 | అలియడు | అలయడు |
| 284 | 26 | సోముడు | సోముండు |
| 297 | 56 | వెక్కసమున | వెక్కసముగా |
| 302 | 14 | వసింపుచున్న | వసించుచున్న |
| ,, | ,, | నీయొడిలో | విభు నొడిలో |
| 303 | 24 | స్తనములు | స్తనముల |
| 304 | 26 | ఎవడు తెగించి | ఎవ్వడు తెగి |
| ,, | 30 | జ్వలింపుచు | జ్వలించుచు |

| పేజి | పద్యము | | |
|---|---|---|---|
| 308 | 51 | బూబూడిద | బూడిద |
| 326 | 1 | మానసమును | తనస్వాంతము |
| 328 | 12 | పనులను | పన్గుల |
| 329 | 18 | పోయెనను | పోయెను |
| 333 | 18 | విడిచెనొ | విడిచెనో |
| 334 | 27 | రగ్నిపయి | రగ్నిపయిన్ |
| 338 | 3-4 | మెడమీదికి | మేడమీదికి |
| 369 | 32 | వీరోత్సవముగ | వీరోత్సవమగు |
| 374 | 4 | అలరె | అలదె |
| 380 | 12-15 | వీక్షింపుచు | వీక్షించుచు |
| ,, | 16 | నయితిని | నయితి |
| 383 | 13 | ధింపుచు | ధించుచు |
| 384 | 18 | వినాశకంబులు | వినాశకములు |
| 385 | 24 | కలమాన్నంబు | కలమాన్నము |
| 391 | 16 | తక్కట | తకట |
| 426 | 26 | నుయాలల | నుయాలలు |
| 437 | 42 | లోలో | లోలోపల |
| 440 | 69 | యిట్లాడెను | యిట్లనెను |
| 442 | 79 | అభినయింపుచు | అభినయించుచు |
| 444 | 89 | నీకల | మీ, కి కల నిజమగు |
| ,, | 94 | నాదియెల్ల | నాకదియెల్ల |
| 448 | 115 | పరుగిడి | వడి పరుగుడి |
| ,, | 116 | ఒక | ఒక్క |
| 449 | 129 | అతడు | ఆతడు |
| ,, | ,, | తుది | తమి |
| 450 | 132 | నీసమక్షమున | సీతనువెతకగ; |
| ,, | ,, | కంటిని | కంతయు |
| 452 | 147 | కనబడదు | కనంబడదు |
| 454 | 163 | స్మరింపుచు | స్మరించుచు |

| పేజి | పద్యము | | |
|---|---|---|---|
| 461 | 31 | శయనింపుచు | శయనించుచు |
| 467 | 15 | నొక్కడు | నొకడు |
| 473 | 28-31 | యుండనిండొడడ | యుండగనిండొడ లెఱుగక |
| 474 | 34 | దుర్మ్రమతనవశులై | దుర్మ్రమత కవశులై |
| 477 | 8 | కంగదనాయకు | నంగదనాయకు |
| 478 | 13-14 | తేనెత్రాగి | తీపిత్రాగి |